# అవధాన విద్య

PRESENTED
BY
Prof. KORLAPATI
SRIRAMAMURTHY, D.Litt.


రచన :

డాక్టర్ సి.వి. సుబ్బన్న శతావధాని






తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవన్, సైఫాబాదు
హైదరాబాదు – 500 004

AVADHĀNA VIDYA : by Dr. C. V. Subbanna Satavadhani

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 500 004.

ప్రథమ ముద్రణ : 1987

ప్రతులు : 2000

**వెల : రూ. 16-00**

అక్షరాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

ప్రతులకు :
తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవనం, సైఫాబాద్,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
షైదర్‌గూడ, హైదరాబాదు-500 029.

# ప్రకాశక విజ్ఞప్తి

అపారమైన చరిత్ర కలిగిన తెలుగు జాతికి సుసంపన్నమైన సాహిత్యం ఉంది. జాతి గర్వించదగిన ఈ సాహిత్యంలో విశిష్టమైన ప్రక్రియలెన్నో ఉన్నాయి. అటువంటి వాటిలో 'అవధానం' అన్నది ఒక విలక్షణమైన సాహితీ ప్రక్రియ. బహుశః ఈ ప్రక్రియ సంస్కృతంలో వినా- మరే ప్రపంచ సాహిత్య శాఖలలోనూ లేదేమో!

అవధాన విద్య అష్టావధానం, శతావధానం అనే పేర్లతో వ్యవహారంలో ఉంది. ఇది ప్రధానంగా కవి ధార, ధారణాశక్తి, సర్వంకషమైన పాండిత్యం, సద్యః స్ఫురణ, లోకజ్ఞతనుబట్టి రక్తి కడుతుంది. క్రీ. శ. 13, 14 వ శతాబ్ది నుంచి తెలుగుదేశంలో ఈ అవధాన విద్య ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తోంది.

ఆధునిక యుగంలో అవధానం అనగానే స్ఫురించేవారు తిరుపతి వేంకట కవులు. వీరు ఈ ప్రక్రియను బహుళ ప్రచారంలోకి తీసుకొని వచ్చారు. జన సామాన్యానికి సైతం మనోరంజకంగా ఉండేలా వీరు దీనిని నిర్వహించేవారు. అటువంటి విశిష్టమైన సాహితీ రూపం పూర్వాపరాలను, దానిలోని విశేషాంశాలను వివరించే గ్రంథమే ఈ 'అవధాన విద్య.'

చమత్కారచారువైన ఏ తద్విద్యావిశిష్టతలను పాఠకలోకానికి అందించాలనే ఆశయంతో తెలుగు విశ్వవిద్యాలయం ఈ 'అవధాన విద్య' గ్రంథాన్ని వెలువరిస్తున్నది. ఇది సహృదయులకు విజ్ఞానంతోపాటు రసానందాన్ని కలిగిస్తుందని ఆశిస్తున్నాం.

అవధాన విద్యా విశేషాలను సమగ్రంగా, సప్రమాణంగా, సోదాహరణంగా ఈ గ్రంథంలో రూపించిన డాక్టర్ సి. వి. సుబ్బన్న శతావధాని గారికి మా ధన్యవాదాలు.

హైదరాబాదు,
తేది :-10-3-1987.

ప్రకాశకులు
తెలుగు విశ్వవిద్యాలయం

# ధన్యవాదము

'అవధాన విద్య' నా అభిమాన గ్రంథము.

గ్రంథ రచనకు శ్రీకారము చుట్టుటకు ముందు, ఆచార్య తూమాటి దొణప్ప గారికి నా సంకల్పము వ్రాసితిని. పదేండ్ల క్రితము వారు వ్రాసిన ప్రత్యుత్తర మిది—

'ఇది చక్కటి విషయం. సమర్థత, సామగ్రి కల మీ వంటివారి చేతిలో పడితే సర్వాంగ సుందరంగా మూర్తి కట్టుతుందని నా భావన. విజయీ భవ.'

(సం) తూమాటి దొణప్ప. 23-9-1976.

వారి ఆశీర్వచనముతో పూర్తి చేసి మైసూరు విశ్వ విద్యాలయము నుండి డాక్టరేటు పట్టము పొందగలిగితిని.

ఈనాడు తెలుగు విశ్వవిద్యాలయము వెలసి, కులపతి స్థాన మలంకరించిన ఆచార్య తూమాటి దొణప్ప మహోదయుల చేతి మీదుగా ఈ గ్రంథము ప్రాకట్య మందుట విశేషము.

తెలుగుదేశమునకు గర్వకారణమైన 'అవధాన విద్య' అనెడు ఈ గ్రంథ మును చేపట్టి ప్రకటించిన 'తెలుగు విశ్వవిద్యాలయము' శ్లాఘాపాత్రము. తత్ప్రష్టా పయిత, ముఖ్యమంత్రి మాన్య శ్రీ నందమూరి తారక రామారావుగారికి, తత్కుల పతి ఆచార్య తూమాటి దొణప్పగారికిని కృతజ్ఞతా పూర్వక నమస్కారము లర్పించుచున్నాను.

నన్ను పుత్రవాత్సల్యముతో మన్నించి, మనసార దీవించి కృతార్థుని గావించిన మద్గురుపాదులు కీ. శే. డా॥ గడియారము వేంకటశేషశాస్త్రిగారి పాద పద్మములు స్మరించుచున్నాను.

మార్గదర్శకులు, మధురహృదయులు కీ. శే. ఆచార్య కె. సుబ్బరామప్ప (మైసూరు) గారికి జోహారులు నివేదించుచున్నాను.

'కవిజన రాజకీర సహకారము', భ్రాతృనిర్విశేష ప్రియమిత్రము శ్రీ జూటూరు రమణయ్య (ప్రొద్దుటూరు) గారి సౌహార్దము ప్రశంసించుచున్నాను.

హైదరాబాదు, 2-12-1986.

సుధీవిధేయుడు,
సి. వి. సుబ్బన్న శతావధాని.

# ప రి చ య ం

చతుష్షష్టి కళా ప్రపంచానికి చెంది చమత్కార చారుత్వలైన సాహితీ వినోదాలలో అవధాన విద్య ఒకటి. ఇతర భాషా సమాజాలలో అంతగా కానరాని ఈ విద్య తెలుగు వారి విశిష్టత. సంస్కృతంలో దృశ్యాదృశ్యంగా కన్పించినా ఇది చాలవరకు తెలుగువారి భిక్ష. ఘటికా శత గ్రంథ కల్పనులూ, శత లేఖినీ పద్య సంధాన ధౌరేయులూ, 'గడియకు నూరు పద్యములు గంటము లేక రచించు' ఆశు కవులూ చాల మంది కిందటి దినాలలో కూడ తెలుగు నాట వెలసినట్లు చరిత్ర సాక్ష్యమిస్తున్నది ఆధునిక యుగంలో దీనికి ఆద్య ప్రవర్తకులు మాడభూషివారనీ, ముఖ్య ప్రవర్తకులు తిరుపతి వేంకట కవులనీ వివేచన కుశలుల నిష్కర్ష. శిష్ట జనరంజనంగా అవధాన విద్య తెలుగు నాట మూడు పువ్వు లారుకాయలుగా వర్ధిల్లుతున్నది.

అవధాన శబ్దానికి ఎచ్చరిక, చిత్తైకాగ్రత అని మామూలు అర్థాలు. సావధానం అంటే విషయాంతర సంచార రహిత మనఃస్థితి. ఐహ్వాంశాలలో, ఏకకాలంలోని ఏకాగ్రత మనచర్చలోని అవధానానికి విశేషార్థ ప్రసక్తి. అష్టావధానం, శతావధానం, సహస్రావధానం, నేత్రావధానం, నాట్యావధానం- వగైరాలు మనకు సుపరిచితాలు క్రమఘనాజటాది వేద పాఠ పఠనా విధానాలు ప్రధానాధారంగా ఓం ప్రథమంగా అవధాన విద్యకు అంకురార్పణ జరిగిందనీ, ఈ తీరు వేద పఠనంలో ఆరితేరిన వ్యక్తిని మౌలికంగా అవధాని అని వ్యవహరించే వారనీ విచారణ నిపుణుల నిర్ధారణం. ఏ విధమైన అవధానాలు చేయకపోయిననూ పుట్టుకను బట్టి కొందరవధానులుగా వ్యవహృతులు. ఇట్టి వారి కిది వట్టి పట్టపు పేరు.

పంచాశత్పద పరిమితి (యాభై పదాలు) గల వేద భాగాన్ని తెలుగులో 'పనస' అంటారు. దీనికి సంస్కృత 'పంచాశత్' శబ్దం మూలమాతృక; ప్రాకృతంలోని 'పణ్ణాసా' సమీపమాతృక. ఇది వేదభాగాలలో అత్యల్ప పరిచ్ఛేదమైన ప్రశ్నాంశం. ప్రశ్నమునే 'పన్నం' ( <ప్రా. పణ్హ- <సం ప్రశ్న-) అనీ ఎనిమిది పన్నాలుగల వేదభాగాన్ని 'అట్ట' ( <ప్రా. అట్ఠ - <సం. అష్ట-) మనీ, కొన్ని పనసల కూర్పునకు 'అజ్ఝ' ( <ప్రా. అజ్ఝాయ- <సం. అధ్యాయ-) మనీ తెలుగునాటి వైదిక పండితుల వాడుక. జటాఘనాక్రమాదుల్లు

వేదపాఠ పఠనంలోని భిన్నరీతులు. జటాపద్ధతి వేదపాఠ పఠనంలో ప్రావీణ్యం గల వేదాధ్యయనపరుణ్ణి జటాంత స్వాధ్యాయి అనీ, ఘనారీతి పఠనంలో నిష్ణాతుడైన వాచకుణ్ణి ఘనాపాఠి అనీ, క్రమపాఠ పఠన కుశలులను క్రమకులనీ వ్యవహరించడం కద్దు. పనసల యందలి నిర్ణీతక్రమంలోని పదాల ఎంపికా, నిర్దిష్ట క్రమంలోని వాటి పర్యాయానువృత్తీ పైన పేర్కొన్న జటాది పఠనరీతులకు మూల భూమికలు. ఈ అన్నింటినీ కలిపి పనస చెప్పడమని వ్యవహరిస్తారు వేదపఠన సమయంలో కొంత సామ్యంవల్ల ఒకొక్కసారి ఏదో ఒకటి విడివడి ఆ తావులో మరొకటి వచ్చి నడమంతరంగా కలియడాన్ని కపలు పోయిందని వాడుక చేస్తుంటారు. ధృతిమంతులూ, శ్రద్ధావంతులూ ఐన సాధకులు పది పన్నెండేళ్ళు గురుచరణలను శుశ్రూషించి, ఎన్నో రువ్వలు (ఆవృత్తులు) ససిగా సంత చెప్పుకున్నగాని అంకెకురాని అతిక్లిష్టమైన విద్య ఈ వైదికావధానం. ఇలా వైదిక పరిభాషలో ఒక నిర్దిష్టార్థంలో ప్రయుక్తమైన అవధాన శబ్దం తెలుగులో విశేషార్థస్ఫూర్తి కలిగిన ఒకానొక సాహిత్యవిద్యకు పారిభాషిక పదంగా ప్రవర్తిల్లుతున్నది.

శతానందంగా శతావధానాలు నిర్వహించిన నేటి అవధానులలో శ్రీ సి. వి సుబ్బన్న శతావధానిగారు తల పువ్వు. ఈ పూబాళ కమ్మతావి గుబాళింపులు ఆంధ్రావళికి అమితామోదం కలిగించాయని వేరుగా చెప్పనక్కరలేదు. అవధానులు చాల మంది కేవల పద్య సంధాతలు; సరస కవితా విధాతలు కారు. కానీ గురుకుల క్లిష్టులైన సుబ్బన్నగారి అవధాన విధానంలోనూ, ఏతద్విధానానుశీలనంలోనూ దృఢవ్యుత్పత్తితోపాటు రమణీయ రసప్రవృత్తి పదే పదే గోచరిస్తుంది.

శ్రీ సుబ్బన్నగారి జీవితరేఖా చిత్రణ మొకింత. కడప జిల్లా ప్రొద్దుటూరు పట్టణపు సివారు ఊరైన రామేశ్వరం శ్రీ సుబ్బన్న శతావధానిగారి అభిజనం. పెన్నగట్టున వెలసిన పల్లెటూరిది శ్రీరామ ప్రతిష్ఠితమన్న ప్రతీతిగల రామేశ్వర స్వామి దేవళం నడిబొడ్డుగా, సూర్యచంద్ర వీధులుగా సూత్రపట్టినట్లు నిర్మితమైన ఈ జనపదానికి రామేశ్వరమన్న పేరు సార్థకం తొలిసారిగా తెలుగును రాజభాషగా గుర్తించిన స్థానిక ప్రభువులు రేనాటి చోడ వంశీయుల (క్రీ. శ. ఆరేడు శతాబ్దుల) రాచరికంలో గడిసీమగా పేరు గడించిన రేనాటి సీమలో నాటికీ నేటికీ ప్రొద్దుటూరు పట్టణం రాణకెక్కిన రాచప్రోలు. ఇది అంచెలంచెలుగా బహుముఖాల విస్తరించినందున పినాకినీ నదీ తీరంలోని రామేశ్వరం ప్రొద్దుటూరు పురపాలక పరిధిలో విలీనమై ఒక పేటగా కొత్త రూపెత్తింది.

శ్రీ సుబ్బన్నగారి ఇంటిపేరు 'కడప' వారు. వీరి కూటస్థులు మొదట కడప పట్టణంలో కాపురముండి ఆ దరిమిలా ఒకానొక తరంలో సదరు రామేశ్వరం వలసవచ్చి చుట్టుపక్కాల కలిమివల్లనో, వృత్తిపరమైన వనరుల బలిమివల్లనో కొత్త నెలవున స్థిరపడినందున మునుపటి కాణాచి పేరు నేటి వీరి గృహనామంగా వాడుకకెక్కి ఉండవచ్చు. తెలుగువారి ఇంటిపేర్లు ముక్కాలుం ముప్వీసంపాలు ఇలా ఏర్పడ్డవే. ఇంగ్లీషు కుంఫిణీ సర్కారువారి తొలి లేఖనాలలో కడప పట్టణంపేరు రోమాలిపిలో CUDDAPAH అని రేఖాంకితం కావడంవల్ల ఆ గుణింతపు కూర్పుతీరు ననుసరించి అందలి తొలి లిపిసంకేతం శ్రీ సుబ్బన్న గారి గృహనామానికి సంక్షిప్త సంకేతంగా సంక్రమించింది. స్థానిక చరిత్రల సేకరణకూ, తెలుగు సాహిత్యచరిత్ర రచనకూ శ్రీకారం చుట్టిన కావలి సోదర త్రయం ఇంటిపేరూ, సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారి ఇంటిపేరూ కవర్ణాదు లైనప్పటికీ పైన పేర్కొన్న లేఖన సంప్రదాయం మేరకు కావలి(CAUVALY), కట్టమంచి (CATTAMANCHI)గా లిపిబద్ధమైనట్లు మనకు తెలుసు. కకారాదు లైన కాకినాడ, (COCANADA), కొచ్చిన్ (COCHIN), కోయంబుత్తూరు (COIMBATORE) వంటి స్థలవాచకాలలోనూ, ఈ రీతి లేఖన సంప్రదాయం కనిపిస్తుంది.

శ్రీ సుబ్బన్నగారి ఇరువంకల తాతముత్తాతలు ఉత్తమ గృహస్థులు, పరమ భాగవతులు, తీర్థయాత్రాచణశీలురు, కులవృత్తిని నమ్ముకున్న గుణశాలులు, నేతవృత్తిలో నేతలు, నూలు వ్యాపారంలో నూరార్లు గడించినవారు. తమిళభాషలో 'నూల్' అంటే దారపుపోగు అనీ, శాస్త్రపరంగా సంక్షిప్త విధివాక్యమనీ అర్థాలు. తెలుగులో మొదటి అర్థం మాత్రం ప్రచురం సుబ్బన్నగారి పూర్వులు ఒకరకంగా సూత్రోపజీవులు. రెండందాలా సుబ్బన్నగారూ అంతే వర్ణలేపనంలో నిష్ణాతులువారు; వర్ణనానిపుణులు వీరు. అది వారి కులవృత్తి; ఇది వీరి కవి కులవృత్తి. ఉభయ కుల వ్రతాలను సదృశ ప్రతిభతో సాగించిన సాహిత్య సత్యవ్రతులు సుబ్బన్నగారు. రంగమ్మ, చెన్నప్ప దంపతులు వీరి తల్లిదండ్రులు. సుబ్బన్నగారి తోబుట్టువులు, ఐదుగురు, తమ్ములిద్దరు; చెల్లెళ్ళు ముగ్గురు. సుబ్బన్నగారు ఈ అందరకు పెద్ద దిక్కు. చిన్ననాటనే తండ్రి చెన్నప్పగారు కథావశేషులైనందున తోబుట్టువుల చదువు సంధ్యలూ. పెండ్లి పేరంటాలూ.... అన్నీ సుబ్బన్నగారి చేతిమీదుగా జరగవలసివచ్చింది మరి, 'పితృసమో జ్యేష్ఠః' అని ఊరికే అన్నారా! పల్లె పట్టులలో పుట్టి పెరిగిన సుబ్బన్న సోదరులు ముగ్గురూ డాక్టరేటు పట్టాలు పొందడం చాల అరుదైన సంఘటన. పెద్ద తమ్ముడు డాక్టరు సుబ్బరాయడు నాగార్జున విశ్వ

విద్యాలయంలో ఆర్థికశాస్త్ర విభాగాధిపతి. చిన్నతమ్ముడు డాక్టరు చిన్న సుబ్బరాయడు శస్త్రవైద్య విధానంలో (ఎం. ఎస్) సుశ్రుతులు, వృత్తిరీత్యా అమెరికాలో నివాసం. సుబ్బన్నగారిది కూడ పదస్థుల సిఫారసుల చలవవల్ల సిద్ధించిన గౌరవ పట్టం (Hon. Doctorate) కాదు. స్వయంగా శ్రమించి, అన్ని లాంఛనాలూ పూర్తిచేసి సుబ్బన్నగారు ఎం ఏ, పిఎచ్ డి. పట్టాలు సంపాదించారు.

సుబ్బన్నగారి పూర్తి పేరు వెంకట సుబ్బన్న హరిహరాత్మక తత్త్వాన్ని సూచించే పేరిది. తిరుమల తిరుపతి వాసుని నివాస వాచకం వెంగడం (<వెళ్= తెల్లటి, కడం = తావు). బొలికొండ (శ్వేతాద్రి) నిలయంగాగల దేవరకు ఆ నివాసం పేరే మూర్తి సూచకమైందని సారవిచారపరుల తీర్పు. రామసుబ్బయ్య, వెంకట సుబ్బయ్య, సుబ్బన్న, సుబ్బనారాయణ, సుబ్బరత్నం, సుబ్బరాజు, సుబ్బరామయ్య, సుబ్బరాయడు, సుబ్బలక్ష్మి, సుబ్బానాయుడు, సుబ్బాయి, సుబ్బావధాని, సుబ్బిరెడ్డి మొదలైన తెలుగువారి వ్యక్తివాచకాలలోని 'సుబ్బ'–ను మూడు రకాలుగా నిష్పన్నం చేస్తున్నారు. సంస్కృత సుబ్రహ్మణ్య శబ్దానికి వికృతిగా రూపించడం మొదటి రీతి. బ్రహ్మ పదార్థ తత్త్వం బాగా ఎరిగిన వ్యక్తి బ్రహ్మణ్యుడు. వారిలో శ్రేష్ఠుడు సుబ్రహ్మణ్యుడు. కుమార కార్తికేయ స్వామికిది సార్థకనామంగా వ్యవహృతం. రెండోది: వ్యాపించు అనే అర్థం గల 'సుబ్బు' క్రియావాచకం నుంచి సుబ్బన్న వగైరాలు ఏర్పడ్డాయనీ, సంస్కృతీకరించగా ఇదే సుబ్రహ్మణ్య-గా తయారైందనీ మరొక వ్యుత్పత్తి విశ్వమంతటా వ్యాపించిన దైవమని ఈ చూపుగల వారి తాత్పర్యం మూడోది: నిష్కలంకమూర్తి అనే అర్థంలోని 'శుభ్రమణి' సుబ్రహ్మణ్య-కు మూలమూర్తియని వేరొక రూపనిష్పాదన విధానం. ఈ మూడింటిలో మొదటి మతమే పదుగురకు సమ్మతం; అదే మా కభిమతం. కాగా, వెంకట- వైష్ణవానికి, సుబ్బ- శైవానికి స్థూల సంకేతాలుగా చెప్పుకోవచ్చు.

నాగారాధనం తెలుగునాటి విశిష్టత. నాగప్రతిష్ఠ, నాగుల చవితి, సుబ్బరాయ షష్ఠి ఇందుకు కొన్ని తార్కాణలు. దంపతులకో, వారి పితరులకో కలలో నాగుమయ్య దర్శన మిస్తేనో, చూలాలికి నాగుబాము కనిపిస్తేనో పుట్టిన బిడ్డకు నాగ-, నాగేంద్ర-, నాగేశ్వర-, పాములు, ఫణికుమార్, ఫణిరాజు-, శేష-, సుబ్బ-, సుబ్రహ్మణ్య- వంటి పేర్లు పెట్టడం ఆనవాయితీ. తరతరాలుగా సుబ్బన్నగారి తాత ముత్తాతలకు ఏడుకొండలస్వామి ఇలవేల్పు. వీరి ప్రపితామహుడు ఎర్రన్న. పితామహుడు చెన్నయ్య, తండ్రి చెన్నప్ప, తల్లి రంగమ్మ. చెన్న- చెన్నకేశవస్వామికి సంక్షేప రూపం సత్యం, శివం, సుందరం - అన్న అర్థాలు గల కన్నడ భాషా పదం 'చన్న-' దీనికి తొలి రూపం ఇలా పూర్వుల

పరంపర సర్వమూ వైష్ణవ వాసనా వాసితం. కానీ, సుబ్బన్న సోదరులు మువ్వురి పేర్లూ సుబ్బరాయాంకితాలు కావడం విశేషం. ఏదో ఒక మొక్కుబడి చెల్లింపునకు స్మృత్యంకంగా ఈ నామకరణ రీతిని సమన్వయించుకోవాలి

సాహిత్య వ్యాసంగంలోనే కాక, లౌకిక వ్యాపార రంగంలోనూ సుబ్బన్న గారి వ్యవహార ప్రౌఢత సుప్రతిష్ఠితం. విద్వత్కవులు సర్వశ్రీ దుర్భాక రాజశేఖర శతావధాని, గడియారం వెంకటశేషశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, విశ్వనాథ సత్యనారాయణ, పుట్టపర్తి నారాయణాచార్యులు - ఈ ఐదుగురూ తనకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రాతః స్మరణీయులైన విద్యాదేశికులనీ, ఈ విద్వరిష్ఠుల అమోఘాశిషాల మూలంగానే తానీ స్థాయికి ఎదిగాననీ సుబ్బన్న గారి మదింపు

చిరంతన గురుజన శుశ్రూషణం, నిరంతర శాస్త్రానుశీలనం, నిరవధిక కావ్యపురాణేతిహాస సేవనం అవధానవిద్యా నిర్వహణంలో నేపథ్యం సవదరించే ప్రధాన సాధన సామగ్రి దీనికితోడు నిత్యసాధనా, నిర్ఛిద్రసాహితీ సమారాధనా తప్పనిసరి. సద్యః స్ఫూర్తీ, సమాహిత చిత్తమూ, చమత్కార భాషణమూ సరేసరి. చక్కటి రూపూ, తియ్యటి గొంతూ అవధానికి అదనపు శక్తులు. అందుకే, ప్రయోగకుశలుని గూర్చి 'రూపవాన్ మధురభాషీ ...' అన్నారు పెద్దలు. ఒకపాటి సంగీత పరిజ్ఞానం వీటికి తోడైతే అవధానికి పట్టపగ్గాలుండవు. అప్పుడతనికి అంతా నల్లేరుపై బండినడక. ఈ లక్షణ సంపుటి చాలమట్టుకు అమరిన శ్రీ సుబ్బన్న శతావధానిగారి విద్యాపాటవం పండిత పామరుల ప్రశంసకు పాత్రమయింది.

తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణగా గ్రంథ రూపాన వెలుగును చూస్తున్న ఏతత్కృతి 'అవధాన విద్య' డాక్టర్ సుబ్బన్నగారి రచన. మైసూరు విశ్వవిద్యాలయం నుంచి తెలుగులో పిఎచ్.డి. పట్టం పొందిన సిద్ధాంత ప్రబంధం. మైసూరు విశ్వవిద్యాలయంలో ఆనాటి తెలుగు విభాగం అధ్యక్షులు స్వర్గీయులు ఆచార్య కె. సుబ్బరామప్పగారి పర్యవేక్షణలో సుబ్బన్న గారి వైదుష్యానికి మహాభాష్యంగా ఆకృతి దాల్చిన 'సుబ్రహ్మణ్య భారతి' ఇది.

'పుట్టం బుట్ట శరంబునన్ మొలవ నంభోయాన పాత్రంబునం దెట్టెం గల్గను గాశిఁ గొల్వను బురాణింపం దొరంకొంటి ...' నని పోతన్న పేర్కొన్న గీర్వాణగిరాంధురంధరుల పట్టికలోని శరవణభవుడు సుబ్రహ్మణ్యస్వామి భారతీ వరివస్య స్వరూపస్వభావాల చరిత్ర అవిజ్ఞాతం సువిజ్ఞాతమైన ఈ 'సుబ్రహ్మణ్య భారతి'ని అవలోకించండి

**తూమాటి దోణప్ప**

28-3-87

శ్రీ రాయల సాహిత్య పరిష దధ్యక్షుఁడు

## శ్రీ జూటూరు రమణయ్య గారికి

# ప్రణయోపహారము

అన్న గలట్టి తమ్మునకు నభ్యుదయమ్ము ఘటిల్లు, జ్యేష్ఠతా
భ్యున్నతి నందయై పితృసముండగు అన్న వహింప భారమున్
ఖిన్నగ నాకు 'అన్న' గల భాగ్యము లేదనకుండ దైవమే
అన్న ననుగ్రహించె, రమణయ్య యనందగు సాహితీప్రియున్.

కవులను సత్కరించు, గుణగణ్యుల పెద్దల గౌరవించు, వ
క్తృవరుల నాదరించు, శ్రుతి తీర్థుల గాణల నామతించు, భా
గవతుల మానసించు, నభిగమ్యుల భక్తుల సంభజించు, ఇ
ట్టి వణిజతల్లజుండు గలఁడే? నలుదిక్కుల సుప్రసిద్ధుఁడై.

సరసుం డుత్తమభావుకుం డతిథిపూజానమ్రచిత్తుండు ధూ
ర్ధరుఁడౌ రాయల సాహితీపరిష దధ్యక్షుండు జూటూరు వం
శ రమానాయకరత్న మార్ద్రసుమన స్సంభావ్య మేతత్కృతి
స్ఫుర దుద్యానవనమ్మునందు విహరించుంగాక! సానందుఁడై.

-డాక్టర్ సి.వి. సుబ్బన్న శతావధాని

# అవధాన విద్య

సూక్ష్మాయ శుచయే తస్మై నమో వాక్తత్త్వతంతవే
విచిత్రో యస్య విన్యాసో విదధాతి జగత్పటమ్

విద్యలలోపల ఉత్తమ విద్య కవిత్వము.
కవిత్వము - గృహ కవిత్వము, సభాకవిత్వము అని ద్వివిధము.

ఇంట గూర్చుండి యే కథ రచింపదలచునో ఆ కథకు సంబంధించిన గ్రంథములు దగ్గర పెట్టికొని, పౌర్వాపర్యములు పరికించి, నిఘంటువులు ద్రిప్పుచు, సావకాశముగా నాలోచించుచు పద్యములు గూర్చువాడు గృహకవి. అతని కూర్పు గృహ కవిత్వము.

సభారంగమున నిర్భయముగా నిల్చి, యెవ్వ రేమడిగినను, అడిగినదే తడవుగా అశువుగా పద్యబంధమున నుడివెడివాడు సభాకవి అతని కూర్పు సభా కవిత్వము.

వ్యుత్పన్నులైన కవులు నూఱుగురున్న వారిలో తొంబది తొమ్మండుగురు గృహ కవులుందురు సభాకవి యొక్కడు తేలును.

సభా కవులు వంద మందిలో తొంబదితొమ్మిది మంది ధారావాహినిగా పద్యములు చెప్పెడివారే పూర్వోక్త పద్యములు తిరిగి అప్పజెప్పలేరు. ఎవ్వరి కేపద్యము జెప్పెనో పేరు జెప్పి ఆ పద్యము తిరిగి వారికి అప్పజెప్పగలవా డొక్కడుండును. వాడే అవధాని.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు - 'చదివినవారు లక్షలు గల్గినను నందు పండితుండొక్కడు బయలుదేరు అట్టి పండితులలో నరయ వేయికి నొక్కరుండు కవీశ్వరుండుండునేమొ, అట్టి కవీశ్వరులందు నూటికి నొక్కరుండవధానియై యుండునేమొ,' అన్నారు. అవధాను లింత యరుదుగా బుట్టుదురు.

ధార యున్నది. పద్యము జెప్పివేయును. ధారణాశక్తి యున్నది. తిరిగి దాని నప్పగించును. ఇంతేకదా ! యనుకొనరాదు. ఒక్కసారి దోసిలినిండ దీసికొని, యెవరు కోరినదాని వాని యొడిలో వేసి పొమ్మనుటలేదు. పదశః పాదశః ఇంచుకించుక వడ్డించుచుబోయి, మఱల మఱల దిరుగుచు వాని యొడి నింపు చున్నాడు. ఖండశః ప్రోక్తమైన వివిధపదార్థప్రపంచము క్రమపఱచికొని, తత్తత్పద్య ములు దీర్చికొని, సభాంతమున నప్పగించుచున్నాడు ఇదెంత క్లిష్టమైన పనియో విచారకైకవేద్యము.

పద్యనిర్మితి యొకెత్తు : తదుపస్థితి యొకెత్తు. మఱియు జూచినచో ఈ రెండు నొకెత్తు : సభను రక్తి కట్టించు చాతుర్య మొకెత్తు సభారంజనవిద్య ఒకొక్క మహాత్ముని చేతిలో ఒకొక్క విలాసము తులకించుచుండును.

అవధానవిద్య కేవల మొకవిద్య కాదు బహువిద్యలయొక్క సమాహారమైన మహావిద్య.

దేశభాషలందు తెలుగు లెస్స.

తెలుగుభాషయందు అవధానవిద్య లెస్స

భారతదేశీయభాషలలో నిట్టి విద్య నాన్యతోదర్శనీయము

పరిశోధక పరమేశ్వరు లెందరో యీ విషయము ఘంటాఘోషముగా జాటిరి. వారి మాట లవిచాల్యప్రమాణములు (భారతి సెప్టెంబరు 1966)

మఱియు కళాప్రపూర్ణ శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి 23-10-1977 తేదిగల లేఖ ఉదాహరింపదగినది.

'తోడి ద్రావిడభాషలగు తమిళ కన్నడ మళయాళ భాషలలో ఈ యష్టావ ధాన ప్రక్రియ లేదు. శతావధాన ప్రక్రియ అంతకంటె లేదు. ఈ విషయము ఆయా శాఖాధ్యక్షులే (మదరాసు విశ్వవిద్యాలయము) అంగీకరించిరి.'

సంస్కృతభాషయం దవధానము కలదని చెప్పినచో అది తెలుగువారి భిక్ష. మల్లినాథసూరి, వత్యం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రి, పరవస్తు రంగాచార్యులు, మండయం కృష్ణయాచార్యులు, మానవల్లి గంగాధరశాస్త్రి, వేమూరి శ్రీరామశాస్త్రి, పిశుపాటి చిదంబరశాస్త్రి ప్రభృతులు తిరువాన్కూరు, కాశి, కాశ్మీరము మధ్యగల సర్వభారతదేశమున శతావధానములు ప్రదర్శించిన తెలుగువారు. సంస్కృతము సర్వజనీనభాష కదా !

అడయారులో శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల అవధానప్రదర్శనము చూచిన అనిబిసెంటు విదుషీమణి, పాశ్చాత్యదేశములందును ఇట్టి విద్యలేదని ప్రశంసించెను.
(జాతకచర్య పూర్వభాగము. 347, 348 పద్యములు)

అవధానవిద్య ఆంధ్రుల ఉపజ్ఞోపనతవిద్య.

అవధానవిద్య అనన్యాదృష్టవిద్య.

అవధానవిద్య తత్త్వాదృష్టవిద్య.

—సి. వి. సుబ్బన్న శతావధాని.

# విషయానుక్రమణిక

—: o :—

# కవీశ్వర పీఠములు

ప్రభువు శస్త్రముచే బహీరాజ్యమును శాసింపగ డు. కవి శాస్త్రముచే అంతారాజ్యమునే శాసింపగలడు. ‘పశువుకు దెబ్బ. మానిసికి మాట’. కాపరి కనుచాటయ్యేనేని పశువు పంటపొలము ద్రొక్కి పాడుచేయును అప్రత్యక్ష విషయమున మానిసులందును దండనీతియొక్క వైయర్థ్య మింతే. భయముతో దారికి వచ్చినవాని నడవడి నమ్మదగినది కాదు. నయముతో దారికి వచ్చినవాని నడవడి మేలైనది. ఈ రహస్య మెఱిగిన రాజులు కవుల నండ జేర్చుకొని, తత్కావ్యామృత పూతమైన రాజ్యమున తమ యాజ్ఞ సూత్రాణముగా చెల్లించుకొనుచు పేరు గడించిరి.

ఆస్థానకవి విద్యాధికారి. పరీక్షించి, సత్కృతిప్రబంధతతికి సత్కృతి చేయించుటయు, విద్యాభ్యుదయమునకు వలయు దోహదక్రియలు సూచించుటయు నతని వంతు. ఇట్లు వాఙ్మయవైచిత్రిచే పితృభక్తి, భ్రాతృరక్తి, పతిభక్తి, సత్యరక్తి, శౌర్యౌదార్యాది సద్గుణములు ఉగ్గుతో బెట్టి ప్రజను దీర్చు నాస్థానకవికి కర్పూర తాంబూల జాంబూనదాంబరాగ్రహారాదు లర్పించి, మహారాజులు తదాశీః కవచ రక్షితులైరి కవులును అట్టి రాజసేవ ప్రజాసేవ యనియే భావించిరి. కడుపు కక్కుఱితికై రాజుల బొగడి పొట్ట పోసికొనుట మహాకవు లెఱుగని విద్య.

ధూర్జటికవి శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యమున ‘శంఖఫలక’ పీఠము ప్రస్తావించెను నత్కీరాదికవులు పన్నిద్దరు పాండ్యరాజు నాస్థానమున శంఖఫలకము నధిష్ఠించి కవితాపరీక్ష సలుపుచుండెడివారట.

ఒకనాడు తత్పురమూలస్థాన హరద్విజుడు దారిద్ర్యఖిన్నుడై యుండగా, పరమేశ్వరుడు ప్రసన్నుడై, యొకపద్యము వ్రాసి యిచ్చి. “యిది చదివిన మెచ్చి ఱేడు వేయి మాడల ముడుపిచ్చు బో”మ్మనెను. అతడు రాజసమ్ముఖమునకు బోయి, చదివెను. ఉమాపతిప్రణీతమైన ఆ పద్యమునందు “సింధురరాజగమనా ధమ్మిల్లబంధము సహజగంధ” మనెడి అర్థచమత్కృతి చూచి నవ్వి, నత్కీరు

డనెడు ప్రాడ్వివాకుడు, తర్జించుచు, "వేణికి సహజగంధ ముండునా? తప్పిది. చెప్పరాదు కవితాసమయంబున కొప్పు గాదు" పొమ్మనెను. హరద్విజుడు తల వంచికొని, తిరిగిపోయి, ఆ పద్యము ముక్కంటి యెదుట బెట్టి యంగలార్చెను రుద్రునకు గోపము వచ్చి, పదమని పద్యపు టాకు తీసికొని, తానే సభకు వచ్చి వాదించెను. నత్కీరుడు తప్పు తప్పే యనెను. అపుడు నీలగ్రీవుడు నిటలనేత్రము జూపినను వాడొప్పుకొనలేదు. విద్యా పరీక్షణ విషయమున ఆస్థానకవులు అంత నిష్పక్షపాతముగ వ్యవహరించెడివారు. దేవునైన లెక్కపెట్టెడివారు కారు.

సాహసాంక విక్రమార్కు నాస్థానమున నవరత్నకవు లుండిరని ప్రతీతి కలదు. జ్యోతిర్విదాభరణమున ఆ తొమ్మండ్రు కవుల పేళ్లను గల్పింపబడినవి.

'ధన్వంతరి క్షపణ కామరసింహ శంకు
వేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతే స్సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవ విక్రమస్య.'

విక్రమార్కుని తరువాత భోజుడు అంతటి ప్రసిద్ధివహించిన మహారాజు. సింహాసనద్వాత్రింశిక యందు భోజుడు సాహసాంకుని సింహాసన మధిరోహింప జూచుటయు, సాలభంజికలు విక్రమార్కు గుణగణములు కీర్తించుటయు వర్ణింప బడెను. భోజకాళిదాసులు శరీరప్రాణములవలె అన్యోన్యస్నిగ్ధులై యుండిరని చాల కథ లున్నవి. వీని కన్నిటికి చారిత్రకసాక్ష్యములు కానరావు. కాని, మహారాజులు కవితాచమత్కృతి కలరి కవుల కక్షరలక్ష లిచ్చుటయు, కూతునిచ్చి అర్ధరాజ్య మిచ్చుటయు, కథలుగా చెప్పికొని లోకము మురిసిపోవుచున్నది. పై కథలలో అంతయు గాకపోయినను గొంతయైన సత్యముండకపోదు.

సరస్వతీకంఠాభరణాదిగ్రంథకర్త, ధారానగరాధీశ్వరుడు, కవిపండిత పోషకుడైన భోజుడు పదునొకండవ శతాబ్దియందుండినవాడు. అతని నగరము విద్వన్మయము. అత డిట్లనుచుండెడివాడట:

'చండాలోఽపి భవే ద్విద్వాన్ యః స తిష్ఠతు మే పురి
విప్రోఽపి యో భవే న్మూర్ఖః స పురా ద్బహి రస్తు మే.'

(విద్వాంసుడు నా ఊరిలో ఉండవలెను- వాడు చండాలుడైనను సరే. విద్యాహీనుడు ఊరి వెలుపల ఉండవలెను- వాడు బ్రాహ్మణుడైనను సరే.)

ఆంధ్ర ప్రబంధకవులు తమ ప్రభువులను భోజునితో బోల్చి ప్రశంసించిన వారును గలరు.

పై కథలను బట్టి రాజాస్థానములందు కవీశ్వరపీఠములు అనాదిగా నుండె నని యూహించుట కవకాశము కలదు.

తెనుగున నాదికావ్యమునకు శ్రీకారము చుట్టిన నన్నయ భట్టారకుడు రాజరాజనరేంద్రు నాస్థానకవి.

రాజు, 'అత్యకళంకచరిత్రసంపదన్ ఆదిరాజనిభుడు ...'

కవి, 'విపులశబ్దశాసనుడు, బ్రహ్మాండాది నానా పురాణవిజ్ఞాన నిరతుడు, లోకజ్ఞుడు, ఉభయభాషాకావ్యరచనాభిశోభితుడు. సత్ప్రతిభాభియోగ్యుడు, నిత్య సత్యవచనుడు, మత్యమరాధిపాచార్యుడు.'

తిక్కన సోమయాజి మనుమసిద్ధి నృపాలు నాస్థానకవి 'అనితరగమ్య వాఙ్మయమహార్ణవ వర్తన కర్ణధారుడు', 'తెనుగున సంస్కృతమున జతురుండై తా నుభయకవిమిత్ర నామము దాల్చినవాడు', 'కవిజన రాజకీర సహకారము.'

విద్యానాథుడు కాకతీయ ప్రతాపరుద్రు నాస్థానకవి. కాకతీయ ప్రభువులు కవి పండిత పోషకులు.

ఎఱ్ఱా ప్రెగ్గడ ప్రోలయ వేమభూపాలు నాస్థానకవి. 'సకల భాషా కవిత్వ విశారదుడు' మల్లరధినీనాథుండు ఈ భవ్య నాతత శ్రీతోడన్ సముపేతు జేసి, యెలమిన్ జేపట్టి అన్న కిచ్చెనట. ఆ యన్న యెఱ్ఱన్ననే చేతోమోద మెలర్ప రామకథ జెప్పించి అత్యుత్తమ ఖ్యాతిన్ పొందెనట.

శ్రీనాథుడు వేమభూపాలు నాస్థానకవి. కవిసార్వభౌముడు విద్యాధికారి.

అష్టదిగ్గజకవులు శ్రీకృష్ణదేవరాయల భువన విజయ సంసద్భవన మలంక రించిన మహనీయులు అల్లసాని పెద్దన శ్రీకృష్ణదేవరాయలను 'విద్యా భోజ భోజు' డనెను.

దాక్షిణాత్యకవులు శ్రీరఘునాథరాయల పేరోలగమును కవయితలే కాదు, కవయిత్రులును అలంకరించిరి. చేమకూర వెంకన్న శ్రీరఘునాథ రాయలను 'అభినవ భోజరాజ బిరుదాంకు'డనెను. రఘునాథరాయల పుత్రుడు విజయరాఘవ రాయలును దండ్రివంటి వాడే. వీరి యాస్థానరంగములు నిత్య సాహిత్య గోష్ఠు లతో కలకలలాడుచుండెడివి.

చక్రవర్తులు, సామంతులు, పాళెగాండ్రు వారివారి యోగ్యతకు దగిన మట్టుకు ఆస్థాన పీఠము లేర్పఱచి, తదుపదేశ ప్రభావముచే తమ ప్రజ నుత్తమ మార్గమున దిద్దుటకు బ్రయత్నించిరి భోగలాలసులగు భూపతులు కేవలము తమ మీద దండకములు వ్రాయించికొని ముచ్చటపడుటకే కవులను దమ కొలువున నిలిపికొని పోషించెడివారని తలచుట న్యాయము కాదు. ఎక్కడనో ఒకరిద్దరట్టి వారుండిన నుండవచ్చును. రాజుల నాశ్రయించి, వారు కసరుకొని పొమ్మనగా నాగ్రహించి,

"వేములవాడ భీమకవి వేగమె చూచి, కళింగ గంగు తా
సామము మాని కోపమున సందడి దీఱిన రమ్ము పొమ్మనెన్
మోమును జూడ దోష మిక ముప్పదిరెండు దినంబు లావలన్
జామున కర్థమందతని సంపద శత్రులపాలు గావుతన్!"

అని శపించెడి కవులును ఉండిరి. కనుక నయ్యభయులు గణేయులు గారు.

ఆస్థాన కవులు జేని మోచేతిక్రింది నీళ్ళు ద్రావు నుపజీవులుకారు. పనిపడి నపుడు జేండ్లకే యభయమిచ్చి, రాజ్యము లుద్ధరించువారు ఖడ్గసాధ్యము కాని కార్యము వాక్కుచే సాధించిపెట్టిన వారును గలరు అట్టివారిలో తిక్కన సోమ యాజియు, శ్రీనాథ కవిసార్వభౌముడును ప్రథమగణ్యులు.

తన యేలికయగు మనుమసిద్ధి రాజ్యభ్రష్టుడుకాగా, తిక్కన సోమయాజి కాకతి గణపతిదేవ మహారాజును దర్శించి నిజ వాగ్వైశారద్యముచే నతని మెప్పించి, తత్సాహాయ్యమున శత్రువుల దోలి, మనుమసిద్ధికి రాజ్యము తిరుగ నిప్పించి, 'మనుమసిద్ధి మహీవల్లభ స్థాపనాచార్య' రూఢి గాంచెను.

(తిక్కన సోమయాజి విజయము-శ్రీ వేదము వెంకటరాయశాస్త్రి.)

శ్రీనాథుని నిర్వాహకత్వమును గురించి ప్రతీతమైన యైతిహ్యము మఱియు జిత్రమైనది.

రెడ్డి రాజులకును, రాచకొండ దేవరకొండలు పాలించు వెలుగోటి వెలమ రాజులకును తరతరములనుండి గజ కచ్ఛప వైరము సాగుచుండెను. దేవరకొండ ప్రభువు మాదయలింగమనేడు వేమారెడ్డి నోడించి 'సందికంత పోతరా'జనెడు కటారిని కైవసము చేసికొనెను ఆ కటారి రెడ్ల పరాక్రమరేఖకు చిహ్నమై చిర కాలముగా రెడ్లయింట పూజింపబడుచుండెడిదట. దాని పోకతో తమ తల కొట్టినట్లై రెడ్డిరాజులలు ఖిన్నులై శ్రీనాథుని ప్రాధేయపడిరట. శ్రీనాథుడు రెడ్లయాస్థాన కవి యైనను, వెలమదొరలకడ చనువు కలవాడు. ప్రభుకార్యార్థియై దేవరకొండకు బోయి స్వకవితా చమత్కృతిచే వెలమదొరల హృదయము గరగించి, "నీవేమి కోరుదు?"వన, "నా కేమియు వలదు. మా రెడ్ల కటారు దయచేయుడు, చాలు" నని, కటారు నిప్పించుకొనివచ్చి, రెడ్ల చిరకాల మనశ్శల్యము బుచ్చి, ప్రశంసితు డయ్యెను. (శ్రీనాథ మహాకవి-బండారు తమ్మయ్య.)

## ఆంధ్ర సంస్థానములు

సాహిత్యమును బోషించిన ఆంధ్ర సంస్థానములు 'లెక్కకు నూఱునొక్కటి' యని ఆచార్య తూమాటి దొణప్పగారు ప్రకటించిరి.

చిన్న చిన్న సంస్థానములును విద్యాధికారి పీఠములేర్పఱచి, చేసిన కృషి యెంతయో దొడ్డది ఉర్లాము సంస్థానమును గురించి శ్రీ చెళ్ళపిళ్ళ వారిట్లు వ్రాసిరి: 'ఉర్లాం పేరుకు చిన్న జమీయే అయినా పండిత సత్కారం పరీక్షించి చేసేది కావటంచేత మన దేశంలో దాని ప్రతిష్ఠలు చాలా వ్యాపించాయి ఏ యూని వర్సిటీకిగూడ దానికున్నంత అధికారం లేదు.

(కథలు - గాథలు )

రాజ ప్రతిష్ఠిత కవీశ్వర పీఠములు విశ్వశ్రేయోమూలమైన విద్యాభ్యుదయ మునకు సర్వదా పాటుపడెను.

'ఇద మంధం తమఃకృత్స్నం జాయేత భువనత్రయమ్
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే '

—: ○ :—

# వసంతోత్సవములు

అనవేమ భూపాలుడు 'వసంతరాయ' బిరుదాంకుడు.

నడుపూరి శాసనమున 'సోయం వసంతరాయాంకః కస్తూరీచంద్ర చందనైః న కేవలాం భువం ద్యాంచ క్షిప్రాం గంధవతీం వ్యధాత్' అని యున్నది ఇత డాకసమును గంధవతిని జేసెనట. అనగా శబ్ద గుణకమైన ఆకాశమున కవితా పరిమళము నింపెనన్నమాట ఈ బిరుదమునకు మఱింత వాసిని గూర్చినవాడు కుమారగిరి భూపాలుడు.

కుమారగిరికి రాజనీతి బలము భుజహేతిబలము రెండును సున్న. కార్య ఖడ్గ భారమంతయు బావయగు కాటయవేముడే వహించెను కాటయ వేముడు కావ్య హృదయ మెఱిగిన యంతర్వాణి. ఇతడు కాళిదాసుని మాళవికాగ్నిమిత్ర నాటకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు, తన బావమఱది భాగ్య విశేషము నిట్లభి వర్ణించెను:

'భాగ్యం నామ సమగ్ర మీదృశ మతిస్నేహైకపాత్రం యతో
వీరం కాటయవేమ ముద్ధతరిపుధ్వంసే నియుజ్య స్వయమ్
నిత్యం నందతి నర్తనై రభినవైః కాంతై వసంతోత్సవైః
సంతానాభ్యుదయైః కుమారగిరి భూపాలో నృపాలోత్తమః'
వసంతోత్సవములు సంతానాభ్యుదయ హేతువులు.

'సప్త సంతానములను ప్రశస్తిగాంచి ఖిలము గాకుండునది ధాత్రి గృతి' కృతినిర్మితిప్రౌఢులైన కవులకు వసంతోత్సవ సందర్భమున సత్కారము జరుగు చుండెను.

వసంతోత్సవములు- చలువ పందిళ్ళలో కొలువై, కవులు స్తోత్ర పాఠ ములు వ్రాసుకొనివచ్చి చదువుచుండగా, బోగమువారిపై నట్టువకత్తెలపై కప్పు రము గుప్పించుచు, చంకలు గొట్టుకొనుచు నెగుర్లాడు వినోదములు కావు. పర

మేశ్వర ప్రీతికరములయిన పూజా విశేషములు, నూతన కవితారచనావిష్కరణ రంగస్థలములు.

కాటయవేముని దానశాసన శ్లోకమున అనవేమ భూపాలుని వసంతోత్సవ వైభవము వర్ణింపబడినది. అది-

'యస్మిన్ కిరతి వసంతే దిశి దిశి కామోత్సవేషు కర్పూరమ్
అధివాసిత పరిధానానభవజ్ఞోఽభూ చ్చిరాయ గిరిశోఽపి'
(శ్రీనాథ కవితాసమీక్ష.)

కాశీఖండ కృతిపతి వీరభద్రేశ్వరునకు 'కర్పూర వసంతరాయ' బిరుదము కలదు.

(కాశీఖండము - 1 ఆశ్వాసము, 15 పద్యము.)

వసంతోత్సవములు జరిపించు నాచారము విజయనగర ప్రభువులకును గలదని ముక్కు తిమ్మనకవి పద్యము సూచించుచున్నది:

కం. ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవినికర గుంఫిత కావ్య
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంతఃపుర వధూప్రసాదన రసికా!
(పారిజాతాపహరణము- 1 ఆశ్వాసము, 139 పద్యము.)

శ్రీ దూసి రామమూర్తిగారు తమ సురభి వ్యాఖ్యానమున, 'రాజులకాలముననే కాక ప్రాచీన కాలము నుండియు వసంతోత్సవములు జరుపు వాడుక యున్నట్లు సంస్కృత కావ్యాదుల వలన దెలియవచ్చెడు' అని వ్రాసిరి

వీనినిబట్టి వసంతోత్సవములు అనాదిగా జరుపబడు చుండెనని, రాచ వందిళ్ళలో నానాప్రదేశాగతులు, 'ఎవ్వ దేయవధాన మెరుగు' నయ్యవధానము ప్రదర్శించి, సత్కృతులగుట జరుగుచుండెనని భావింపవచ్చును.

—: o :—

# జిగీష

పూర్వకాలపు బండితులు జిగీషాప్రధానమైన జీవనము గడిపినవారు. చతుష్షష్టికళలు నేర్చుటలో దృప్తిపడక, ఆయా కళలయందు తమ పాండిత్యము పరిగణింపబడవలయుననెడి పట్టుదల చూపినవారు.

శ్రీ మదహోబలశాస్త్రిగారు - ఆంధ్రులు-శ్రీచింతామణ్యుపాసకులట. వీరు కాశీ మహానగరమున నెల్లపండితుల జయించి, "కాశ్యా మేకః కాశీనాథోఽవశిష్టః" అన్నవారట. ఈ బ్రాహ్మణుడు చెప్పులు కుట్టుటయందు గూడ దిట్టతనము సంపాదించి మాదిగలచే సర్టిఫికెటు పొందిరట.

(కృష్ణాపత్రిక-సెప్టెంబరు 1937)

ప్రాచీనుల పట్టుదలకు నిదర్శనముగా వేంకటశాస్త్రిగా రొకగాథ నుదాహరించినారు. ముంగండవాసియైన శ్రీ పుల్లెల దక్షిణామూర్తి శాస్త్రులుగారు కాశిలో శ్రీ జాగేశ పండితజీయొద్ద చిరకాల విద్యాభ్యాసము చేసి, గృహస్థాశ్రమాభిముఖులై వచ్చుచు, త్రోవలో కొన్ని సంస్థానములలో పాండిత్యము ప్రదర్శించుచు, మాడుగుల సంస్థానమునకు వచ్చిరట. అక్కడ భాష్యమంతా సంధ్యావందన ప్రాయముగా కంఠపాఠముగానుండిన ఇంద్రగంటి గోపాలశాస్త్రిగారితో వాదము చేసి, ఓడిపోయిరట. ఓడి, స్వగ్రామమునకు బోలేదు వెనుకకు దిరిగి. మఱల కాశికిబోయి పదిపండ్రెండేండ్లు, కృషిచేసి, గోపాలశాస్త్రిగారి నోడింపవలెనని, మాడుగుల సంస్థానమునకు బోయిరట. పాపము, గోపాలశాస్త్రిగారు లేరు. స్వర్గస్థులైయుండిరి. దానితో పుల్లవడి 'అయ్యో! నా కోరిక తీరకపోయెనే' యని వగచిరట.

అహోబలశాస్త్రిగారివలె సర్వకర్మిణులై రాణింపవలెనను దీక్షతో కచ్చగట్టిన పండితులలో శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు వాకొనదగినవారు పిఠాపుర భూవర సన్నిధానమున వీరు చెప్పిన యుత్పలమాలిక బరికింపుడు:

'ఏరికి నెట్టివిద్య రుచియించునొ వారల కట్టి విద్యలో
నే రసమొప్ప జేసి ముద మీవలెనంచు దలంచి కొంత నే
నేరిచినాడ దర్కమును, నేరిచినాడ నొకింత వ్యాకృతిన్
నేరిచినాడ సత్కవిత, నేరిచినా డవధానతంత్రమున్
నేరిచినాడ వాఙ్మఖము, నేరిచినాడ పురాణవక్తృతన్
నేరిచినాడ గానకళ, నేరిచినాడను వాద్యభేదముల్
నేరిచినాడ వైద్యమును, నేరిచినాడ కథాసుధారలన్
నేరిచినాడ హూణకళ, నే దగురీతి, సమస్త విద్యాధా
ధార! శ్రమం బదంతయు వృథాయగుచుండు గదే, స్వదేశరా
డ్గౌరవమున్ వినా ........' (అవధాన యాత్ర)

పేండ్ల ప్రాపున మడుగులో మొసలివలె, నిగిడి కూర్చుండి, యెంతటి పండితదంతినైన దమ సంస్థానమున నడుగు పెట్టనీయకుండ ప్రతిష్ఠ నిలుపుకొన్న వారును గొందఱుండిరి. అట్టివారు పాండిత్యముచేగాక, మంత్రతంత్ర ప్రయోగములచే ప్రత్యర్థి నోడించుచుండిరి.

పిఠాపుర ప్రభువు శ్రీ గంగాధర రామారావుగారి సమక్షమున జరిగిన యొక విశేషము శ్రీ చెళ్ళపిళ్ళవా రుటంకించిరి.

అలనాడు నవద్వీపమున జదివి వచ్చిన తర్కపండితు లసాధ్యులు మువ్వురుండిరట వారికి 'సుబ్బత్రయ' మని ప్రసిద్ధి కలిగెనట. ఆ మూగురిలో శ్రీ తణికెళ్ల సుబ్బన్నశాస్త్రిగారొకరు. ఆ కాలమున శ్రీ కొవ్వూరి గోపాలశాస్త్రి గారు షట్ఛాస్త్రిపండితులు. విశేషించి తర్కములో నిష్ణాతులు మంత్రవేత్తలట. వీరిద్దరికి తర్కవాదము పెట్టించి తమాషా చూడవలెనని రాజుగారి కభిలాష గాఢముగా నుండెనట సుబ్బన్న శాస్త్రిగారు కేలుమోడ్చి, 'మహాప్రభూ! నాతో తర్కములో పూర్వపక్ష సిద్ధాంతము చేయగలవారు, మా త్రయములో తప్ప ఈ దేశములో లేరు. ఈ మంత్రశాస్త్ర వ్యాసంగులతో వాదించగూడదు. ఓడినచో వీరు ప్రయోగము చేయుదురు' అని విస్పష్టముగా జెప్పినను రాజుగారు వినలేదు. పైగా-అటువంటి అనర్థమేదియు మా సన్నిధిలో జరుగదని, జరిగినచో తరతరాలుగా మీ కుటుంబ పోషణ భారము మేము వహింతుమని హామీ యిచ్చి,

రంగమున దింపిరి. సుబ్బన్నశాస్త్రిగా రుపపాదించిన పూర్వపక్షము దిక్కుంపము గలిగింపగా, గోపాలశాస్త్రిగారు గ్రుడ్లెఱ్ఱచేసి చూచిరట. అంతే 'అదిగో బాబూ! ప్రయోగించారు దేన్నో' అనుచు సుబ్బన్నశాస్త్రిగారు నిర్వాక్కుగా పడిపోయి రట పదినాళ్లట్లే యయోమయస్థితిలో నుండి పంచత్వము బొందిరట.

దీనినిబట్టి రాజాస్థానములో గెలువవలెనను పట్టుదల యే యంతస్తులో నుండెనో యూహించికొనవచ్చును.

(కృష్ణాపత్రిక-జూన్ 1986)

ఏకచ్ఛత్రాధిపత్యము నిర్వహించిన చక్రవర్తివలె జీవితము గడిపిన మహాకవు లుద్దండులుండిరి. వీరు చచ్చినను, పరాధిక్యము కాదు, సామ్యము నంగీకరింపరు. కళింగకవి సన్న్యసించుచు-

'హే గోదావరి! దేవి! తావక తటోద్దేశే కళింగః కవిః
వాగ్దేవ్యా బహుదేశదర్శన సఖీం త్యక్త్వా విరక్తిం గతః
ఏనా మర్ణవమధ్యసుప్త మురజి న్నాభీసరోజాసనం
బ్రహ్మాణం గమయ క్షితౌ కథ మసా వేకాకినీ స్థాస్యతి'
అన్నాడట.

ఈ సన్యాసి తాత్పర్యమేమి? తాను దప్ప మఱియొక కవి లేడు. ఉన్నచో సరోజాసనుడైన బ్రహ్మ యొక్కడే తన తరువాతివాడుగా నున్నాడు అని.

దిగ్విజయధుర్యుడైన శ్రీనాథుడు 'ఈక్షోణిన్ నినుబోలు సత్కవులు లేరీ నేటి కాలంబునన్' అనిపించుకొని. 'దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ' నమరపురి కరిగెను. తెనాలి రామకృష్ణకవి 'ఉదయం బస్తనగంబు సేతువు హిమప్రావంబునుం జుట్టిరా విదితంబైన మహిన్ మహాంధ్ర కవితావిద్యాబలప్రౌఢి నీ కెనరేరీ?' యని కొనియాడబడెను.

ఇట్టి మహాపురుషుల జిగీష విశ్వశ్రేయోభూష.

—: ౦ :—

# కవిసార్వభౌముడు

ఆంధ్ర వాఙ్మయ ప్రపంచము నోజస్వంతముగా నీర్చిన అసమాన విద్యా సనాథుడు శ్రీనాథుడు.

'మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్ గుండలీంద్రుండు తన్మహనీయస్థితి మూలమై నిలువ, శ్రీనాథుండు ప్రోవన్....' అని వసు చరిత్రకారుడు వాగ్వైచిత్రిలో శ్రీనాథుని ప్రోఢత్వమును శ్లాఘించెను.

దగ్గుపల్లి దుగ్గన శ్రీనాథుని మఱది, శిష్యుడును. ఇతడు తన నాచికేతూపాఖ్యానావతారికలో—

'సంస్కృత ప్రాకృత శౌరసేనీముఖ్య
భాషా పరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌమ భాషిత మహా
భాష్యవిద్యా సమభ్యాస బలము,
అక్షపాద కణాద పక్షిలోదీరిత
న్యాయకళా కౌశలాతిశయము,
శ్రుతి పురాణాగమ స్మృతి సాంఖ్య సిద్ధాంత
కబళన వ్యుత్పత్తి గౌరవంబు
పూర్వకవిముఖ్య విరచితాపూర్వ కావ్య
భావరస సుధాచర్వణ ప్రౌఢతయును
గందళింపగ.... ........'

(నాచికేతూపాఖ్యానము. ఆ. 18. ప.)

తేజరిల్లు శ్రీనాథమూర్తిని సాక్షాత్కరింపజేసెను.

ఇట్టి శ్రీనాథుని విద్యాధికారి పీఠమున నిలిపి, కోమటి వేమభూపతి గౌరవించెను. విద్యాధికారికి రెండు పనులుండెను. 'విద్యా పరీక్షణ వేళలందు బహు

దేశ బుధులతో భాషించుటయు,' దానశాసనములు రచించుటయు, తండోప తండములుగా నెడతెగక, కొండవీటికి వచ్చెడి పండితుల పూర్వపక్ష సిద్ధాంత వాదోపవాద కోలాహలములు వినివిని రాటుదేలిన శ్రీనాథుని మతికి సకల శాస్త్రార్థ ములు సంధ్యావందనప్రాయముగ నుండెను.

కొండవీటి రాజ్య మస్తమించిన పిదప రాజమహేంద్రవరమున కరిగి, వీర భద్రారెడ్డి విద్వాంసుడయ్యెను. ఆ కర్పూర వసంతరాయల ఆస్థాన రంగము పండితాఖండల వాఙ్నృత్య నిత్యమంగళోత్సవముగా నలంకరించెను

ఇట్లుండగా కర్ణాట ప్రభువు కొలువున బీటవెట్టికొని అష్టదిగ్జయ యశోఽ వష్టంభుడై కవిసార్వభౌమ బిరుదమూని మిట్టిపడు గౌడ డిండిమభట్టారకుని కాంస్య డిండిమధ్వని శ్రీనాథుని చెవిని బడెను. గౌడీయ వాగ్డంబర మిట్లుండెను:

'అగ్రే డిండిమతాడనం తత ఇతో వందివ్రజోద్ఘోషణం
ద్విత్రా శ్చిత్రపదాః కియంతి బిరుదప్రోతాని పద్యాని నః
అస్తాం తావ దిదం మహేశమకుటీ కోటీర కల్లోలినీ
కల్లోలప్రతిమల్ల సూక్తివిభవై ర్ద్వేష్యా న్విజేష్యామహే.'

(ముందర డిండిమ వాద్యము, ప్రక్కల బట్టుల పొగడ్తలు, టెక్కెములు, లెక్కలేనన్ని బిరుదావళీపద్యములు - మా వైభవ మింతటిది. కాని, దానితో నేమి ? గంగాతరంగముల మచ్చరికించు వచోవిభముతో మేము ప్రత్యర్థుల నిర్జింతుము.)

చెప్పెనుగదా బాణభట్టరకుడు 'గౌడే ష్వక్షర డంబరః' అని.

శ్రీనాథుని ప్రకృతి 'కంటకుడైన శాత్రవు డొకండు తనంతటివాడు గల్గినన్ కంటికి నిద్రరాని' ప్రకృతి. రాజమహేంద్రవరము నుండి కర్ణాట విజయ నగరమునకు బోయి, పూటకూటింట విడిసి, రాజదర్శన మపేక్షించి, అక్కడి కవులనుబట్టికొని తంటాలుపడి, సిర్నిమిత్తముగానగు జాగు సహింపజాలక-

'కుల్లాపెట్టితి గోక జుట్టితి మహాకూర్పాసముం దొడ్గితిన్
జల్లానంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచు బోనాడితిన్

వెల్లుల్లిన్ దిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపగా
తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుడన్.
అని వాపోయెను. తాను సరస్వతీనాథు డట.
(శ్రీః వాణీ లక్ష్మీ లవంగేషు....)

రాజాశ్రయమున నుండి సుఖము మరగిన భోగి ప్రవాసదైన్యమున కోర్వజాలక యంగలార్చుట వింతకాదు. కాని, విధవ చేతి కూడు గుడువవలసి వచ్చెనని వగచుట వింత 'లాలిత పాదనూపుర ఝుళంఝుళ నాదము ల్లుల్లసిల్ల, బైచేల చెఱంగు దూలగ' (భీమేశ్వర పురాణము: 2-144 ప.) వడ్డించు వారిజాక్షు లుండిననే అతనికి దృప్తి.

ముమ్మకవి తోడ్పాటుతో ప్రౌఢదేవరాయల సందర్శించి, చంద్రభూష క్రియాశక్తి యొడయరు తీర్పరిగా, డిండిమ కవిసార్వభౌమునితో నుద్భట వివాదమునకు దలపడి, గెలిచి, రాజాస్థానముననే యతని కంచు ఢక్క పగుల గొట్టించి, 'కవిసార్వభౌమ' బిరుదము నొడిచికొనెను. ఇట్లు పౌరుషోపలబ్ధమైన కవిసార్వభౌమ బిరుదము వహించి, తెలుగు నేల నాలుగు చెఱగులు ఆసివాలుగ దిరిగి, దిగ్విజయ ధన్యు డయ్యెను.

'త్రైలోక్య విజయసౌధ' చంద్ర శాలికయందు కొలువుదీరిన పంటకుల సార్వభౌముడు 'కర్ణాటక్షితిపాల మౌక్తిక సభాగారాంతరావర్తిత స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవితా' తద్వచస్స్వాదము పంచ నొకించుక తావు గోరి, 'ఈ క్షోణిన్ నినుబోలు సత్కవులు లేరీనేటి కాలంబునన్' అని కైవారము చేసిరి.
(కాశీఖండము: పీఠిక: 14 ప.)

కొండవీటి కోమటి వేముని కొలువున నుండినపుడుగాని, రాజమహేంద్రవరపు టల్లయవేముని యాస్థానమున నుండినపుడుగాని, శ్రీనాథుడు తద్విరోధులగు నితర రాజుల జూడక మానినవాడు కాడు.

హేమశబ్దవికారమే వేమశబ్దము. నిరక్షరాస్యుల నోళ్ళలో హేమారెడ్డి 'యేమారెడ్డి'యై, తిరిగి చదువరుల చేతిలో 'వేమారెడ్డి'యై గ్రంథములకెక్కి యుండుమ బంగారయ్య వంటిదే హేమయ్య నామము.

హేమారెడ్ల ప్రాపుననున్న శ్రీనాథునకు కస్తూరి దొరకదా? సాంపరాయని తెలుంగాధీశుని సన్నిధి కేగి చెప్పిన పద్యము చూడుడు:

'అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ ! కస్తూరికా
భిక్షాదానము సేయురా! సుకవిరా డ్బృందారకశ్రేణికిన్
దాక్షారామ చళుక్యభీమవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించు దద్వాసనల్.'
ఎంత ధీరముగా జెప్పెను! తనకెంత పలుకుబడి ప్రాబల్యముండెనో!

కర్ణాటాధీశ్వరు నాస్థానమున 'కనకాభిషేకము చేయించినగాని నిన్ను బొగడ' నని కూర్చున్నాడు. ఆ పద్య మిది:

'జననాథోత్తమ! దేవరాయ నృపతీ! చక్రేశ! శ్రీవత్స లాం
ఛన సంకాశ! హరిప్రభావ! భువిరక్షాదక్ష! నాబోటికిన్
గు నృపస్తోత్ర సముద్భవంబయిన వాగ్దోషంబు శాంతంబుగన్
గనకస్నానము జేసి గాక, పొగడంగా శక్యమే? దేవరన్!
(మహాకవి శ్రీనాథుడు )

పై పద్యమునందు ప్రథమ చరణమున 'జగతీచక్రేశ' అనియు, ద్వితీయ చరణమున 'కవిరక్షాదక్ష' అనియు నుండియుండును.

సింగభూపాలుడు రెడ్ల గొంగ. అయినను శ్రీనాథు డతని దర్శించెను. కవుల కందరును కావాలసినవారే కదా !
సింగభూపాలు నాశీర్వదించి, కొలువు కూటమున-

కం. సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగ జనపాలునకే
యుర్విం జెల్లును దక్కొరు
సర్వజ్ఞుం డనుట కుక్క సామజ మనుటే.

అని గొంసెక్క నాడెను. రాజమహేంద్రవరపు రెడ్లకది వెక్కసముగ దోచి శ్రీనాథుని జూచి, 'నీ విచ్చకాలమారివి. సమయోచితముగా నెవరినయిన, నెట్లయిన

బొగడుదు'వని మొగము చిట్లించుకొనిరట. అప్పుడు శ్రీనాథు డాపద్యము నిట్లు పెఱిచి చదివెనట: సర్వజ్ఞ నామధేయము శర్వునకే. (అన్యులకు లేదు. తాను తగిలించికొన్నాడు గాని) రావుసింగజనపాలునకు నేయుర్వి న్జెల్లును? (ఉర్వి యనగా తన రాజ్యపు పొలిమేరలలోనిదే కాదు కదా!) తక్కొరు సర్వజ్ఞుండనుట (శర్వునికంటె అన్యుడగువాని సర్వజ్ఞుండనుట) కుక్కు సామజ మనుటే.

ఇట్టి యొడుపు లెఱిగినవాడే సభాముఖమున రాణించును.

శ్రీనాథుడు రెడ్ల యాస్థాన కవియని వెలమతేండ్లెప్పుడును కంటగించికొన్న వారు కారు. మీదుమిక్కిలి వారి కితనిపై నుదారమైన ప్రేమ యుండెను. ఎంత లేనిదే తాను వచ్చి యడిగినంతనే, రాజకీయ వ్యవహారముల జోలి నీకెందు కనక, కటారి యిచ్చి పంపుదురా? తమ యేలికల యుబ్బుజగించి కటారి గొనిపోయిన వెలుగోటి మాదయ లింగమనేని శ్లాఘించిన పద్య మెంత యుదులుగా నున్నదో చూడుడు:

జగనొబ్బ గండాంక సంగ్రామ నిశ్శంక
  జగదీశ రాయవేశ్యాభుజంగ
అఖిలకోటల గొంగ యరిరాయ మదభంగ
  మేలందు ధరణీశ మీన జాల
మూరురాయరగండ మఱియు రాయల మిండ
  యభివృద్ధి మీఱు చౌహత్తమల్ల
ఘనరాయ గోవాళ కామినీ పాంచాల
  బ్రహ్మయు శశివంశ పరశురామ
దండి బిరుదుల సురతాణి గుండె దిగుల
బళిర యల్లయ వేముని పగర మిండ
రమణ మించిన వేటిని రావు బిరుద
సంగరాటోప మాదయ లింగభూప.

ఈ పద్యము విని 'అల్లయవేముని పగరమిండ' గుండె కరగి, కటారి తిరిగి యిచ్చెను. ఏ ఖ్యాతి గోరి రెడ్ల పౌరుషలాంఛనమైన కటారి గొనివచ్చెనో, ఆ ఖ్యాతి

సిద్ధించి, శ్రీనాథ ప్రోక్త పద్యబంధమున రూఢమగుట కంటె లింగమనేని కింక చారితార్థ్య మేమి కావలెను ?

శ్రీనాథు డల్లయ వేముని మీద నొక విచిత్రమైన సీసము జెప్పెను. అది విప్పి చెప్పినగాని అర్థము కాదు. శ్రీనాథున కిట్టి రచనపట్ల మోజు లెదు. కుక్క మొగాన వట్టి యెముక వేసినచో కొఱుకుచు, చొంగ కార్చికొనుచు. దానిని భేదించిన రససిద్ధి యగునని యదెట్లు త్రొక్కటపడువో, శుష్క శ్లేషకఠోర పునరుక్తి స్ఫూర్తిమత్పద్యము గుప్పినచో, అరసిక పండితులట్లు సంభ్ర మానందముల దేలుచు, నేకాక్షర్యాది నిఘంటువుల బట్టికొని దానితో సతమతమగు దురని యెఱిగియే ప్రయోగించెను. ఆ పద్యమిది:

సీ. రాజనందన రాజ రాజాత్మజులు సాటి
తలప నల్లయవేమ ధరణిపతికి
.... (తక్కిన మూడు చరణములు నింతే.)

తే. గీ. భావభవ భోగ సత్కళాభావములను
.... (తక్కిన మూడు చరణములు నింతే.)

ఈ పద్యమున రాజు యొక్క 'భావభవభోగ సత్కళాభావములు' మఱుగుపడి, కవి యొక్క 'భావభవభోగ సత్కళాభావములు' వన్నెకు వచ్చు చున్నవి.

శ్రీనాథు డాశుకవి ఒక్క గ్రుక్కలో పద్యమంతయు ధారాళముగా జెప్పగలవాడు. విషయమేమియు లేకున్నను గూర్పు యొక్క బిగింపుతో పద్యము రమ్యముగ నుండును పండిత సభలయందు ఆరభటీ వృత్తితో పద్యము దూకించు ప్రౌఢి వర్ణనాతీతము.

జోటీ! భారతి! ఆర్భటిన్ మొఱయుమా! చోద్యంబుగా నేడు క
ర్ణాటాధీశ్వరు దేవరాయ నృపతిన్ నాసీర ధాటీ చమూ
కోటీ ఘోటక ధట్టికా ఖురపుటీ కుట్టాక సంఘట్టన
స్ఫోటీభూత ధరా రజశ్చ్ఛురికితాంభోటిన్ బ్రశంసించెదన్.

కనకాభిషేక సందర్భమున కర్ణాట ప్రభుసభలో కవిసార్వభౌము డెన్నియో కమనీయ పద్యములు చెప్పెను నాయికాత్రయము వర్ణింపుమని రాయలు కోరగా మూడు సీసములు చెప్పెనందురు.

బాలా వర్ణన పద్యము. సీసము.

కమనీయ కరపల్లవము మేను గదియంగ
 నొయ్యక జూచిన నులికిపడును
ఆలింగనమునకు నక్కున జేర్చిన
 జేదోయి నురముపై జేర్చికొనును
చుంబనంబున కోష్ఠబింబంబు గమకింప
 వదన మొయ్య నొకింత వంచికొనును
గిలిగింత సేతకు గినుకయు సిగ్గును
 మొలవంగ గన్నులు మోడ్చికొనును
అట్టి బాల తోడను గేళి ననువుపఱుప
నేర్పు గలుగునె పరులకు నీకె కాక
రాజ పరమేశ రాజాధిరాజవిభవ
లక్షణోపేంద్ర ప్రౌఢరాయక్షితీంద్ర.

(మహాకవి శ్రీనాథుడు.)

బాల ముగ్ధ. 'అట్టి బాలతోడను' అనుచో నడక భేదించుచున్నది. మీది తృతీయ పాదమున 'వదన మొయ్య నొకింత వంచికొనును' అనుచో సైత మిట్టి గతిలోప మగపడును. ఒయ్యన శబ్దము తొలి పాదమునను గలదు. పైగా 'కమనీయ కరపల్లవ' మెవరిదైనది స్పష్టముగ లేదు. కమనుడు = కాముకుడు, ప్రియుడు. కమనీయ కరపల్లవము = కమన సంబంధి, తదీయ కరపల్లవమని భావింప వలెనా? అది చాల క్లిష్టము. ఒట్టు మొత్తము మీద పద్య బంధమునందు శ్రీనాథునిదని చెప్పదగినంత జిగియు బిగియు కానరాదు. అత్యాశుధార యేమో యందురా? కాదు. అత్యాశువుగా గుంపించెడు పద్యమున తత్సమశబ్ద బాహుళ్య ముండును. దీనిలో అది లేదు. శయ్య యందును నించుక శైథిలి కనిపించును. ఒకొక్క కవి ఒకొక్క శబ్దమును ప్రయోగించెడి వైఖరియే విలక్షణముగా నుండును శ్రీనాథుడు తఱచుగా 'కళా' శబ్దమును సరిగా యతిస్థానస్థిత శబ్ద

ముతో జేయి కలిపి, దాని కూతగా నిలుచునట్లు ప్రయోగించుట కలదు. దీని వలన నర్థ సౌకర్యముకన్న శయ్యా సౌకర్యము మిన్న. శ్రీనాథు డీమెలకువ తిక్కయజ్వనుంచి గ్రహించెను. 'కాలస్వైర విహార భంజన కళా కౌతూహల స్రవ్య' (భారత మౌసల పర్వము: 224 పద్యము.) వంటివి ఆ 'రసాభ్యుచిత బంధ మనస్కుని' ప్రబంధములందు అంత కొట్టవచ్చినట్టు లగుపడవు. కాని, శ్రీనాథుని ప్రబంధములందు 'ఈశ్వరార్చన కళాశీలుండు, విభ్రమ కళాగర్వంబు, చటుల విక్రమ కళా సాహసంబొనరించు కుటిలాత్ములకు గాడు కొండవీడు' వంటివి కొల్లలుగా వీనుల విందొనరించుచుండును. ఇట్టి కొన్ని గుర్తులు, తెలుగు పలుకుబళ్ళు పొసగించుటలోని ప్రౌఢతనము, నాలుగు పాదములు 'సమతూకము' సంతరించుటలోని యొప్పిదము, కర్తృత్వమును గుర్తించుటకు తోడ్పడును. ప్రకృతోదాహృత బాలా వర్ణనాత్మక సీస పద్యము శ్రీనాథునిది కాకపోయినను నష్టము లేదు. కమనీయ కవితాశ్రీ ప్రదర్శించి సభను రంజించియే తాను 'కర్ణాటదేశ కటక పద్మ వనహేళి' యయ్యెననుట యథార్థము.

ధీవిశాలుడైన రావు సింగభూపాలుని సిందుకొలువున శ్రీనాథుడు కొన్ని సమస్యలు పూరించెనందురు. 'కుక్కవా నక్కవో ఫణివా క్రోతివా పిల్లివా భూత పిల్లివో' అను సమస్య బహుళ ప్రచారము పొందినది

తక్కక రావుసింగ వసుధావరు డర్థుల కర్థ మిచ్చుచో
దిక్కుల లేని కర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమ్రాను బెం
పెక్కిన కామధేనువు శిబీంద్రుని నెన్నెదు భట్ట! దిట్టపై
కుక్కవో నక్కవా ఫణివా క్రోతివా పిల్లివా భూతపిల్లివో.

పద్యములు రాజస్థానములందే కాదు, పల్లెటూళ్ల రచ్చలయందును జాటువుగా బలికిన మేటి శ్రీనాథుడు.

పలనాటి పల్లెటూళ్ల గురించి పలికిన యాటవెలది యొయ్యారము శబ్దచిత్ర మనోహరము.

అ. వె. చిన్నచిన్న రాళ్ల చిల్లర దేవుళ్ల
నాగులేటి నీళ్ల నాపరాళ్ల

సజ్జ జొన్న కూళ్లు సర్పంబులును దేళ్లు
పల్లెనాటి సీమ పల్లెటూళ్లు.
వట్టి చేతులతో దిరిగివచ్చి పలనాటి పరిస్థితి వివరించిన వైఖరి:

ఉ. అంగడి యూరలేదు, వరియన్నము లేదు, శుచిత్వమేమిలే
దంగన లింపులేరు, ప్రియమైన వనంబులు లేవు, నీటికై
భంగ పడంగ బాల్పడు కృపాపరు లెవ్వరు లేరు దాత లె
న్నంగను సున్న గాన పలనాటికి మాటికి బోవ నేటికిన్.

'రసికుడు పోవడు పల్నాడు.'

'ద్రాక్షాపానక ఖండశర్కరలతో రంభాఫల శ్రేణితో గోక్షీరంబులతోద మండెగలతో గ్రొన్నేతితో పప్పుతోనక్షయ్యంబగు నేరు బాలకలమాహారంబు' సేవించు భోగికి సజ్జజొన్నకూళ్లు చవి యగునా? కస్తూరి లేక పూట గడచునా? 'అంగన లింపులే'రనుట వస్త్రభూషణ గంధానులేపన మాల్యాది నాగరకవిలాసము దూర మగుటచే మగువలందింపు గనిపింపదని యనుట గాదు. బాహిరములైన తళుకు బెళుకులకంటె నాంతరమైన శృంగారము శ్రీనాథుని దృష్టిలో విలువగల పదార్థము.

కడిదిపురపు బోగమువారి గురించి చెప్పిన పద్యము పరికించిన నీ విష యము తేటపడును.

ఉ. చీరయు ముక్కుముంగరయు జెంపల గంధము చుక్కబొట్టు మం
జీర ఝుణంఝుణారవము జేతుల కంకణ నిక్వణంబు నొ
య్యారపు జాలు కొప్పును గయాళితనంబును గాని, లోన శృం
గార మొకింత లేదనుట గంటిని ఈ పురి వారకాంతలన్.
నీటి కెద్దడి యేర్పడినపుడు చెప్పిన కందము :

కం. సిరిగలవానికి జెల్లును
దరుణుల బదియారువేల దగ బెండ్లాడన్
దిరిపమున కిద్ద రాండ్రా?
పరమేశా! గంగ విడువు పార్వతి చాలున్.

కట్టికొన్న పెండ్లమును విడువు మనుట ధర్మమా? శివునకు గంగ 'తగ' బెండ్లాడిన తరుణి కాదు కనుక విడువ వచ్చును.

తములపాకుల బేరములాడబోయి చెప్పిన చంపకము :

చం. తొలకరి మించుదీవగతి దోప దుకాణము మీదనున్న య
యయ్యాళికులవేణితో తమల పాకుల బేరము లాడబోయి నే
వలచుట కేమి, శంకరుని వంటి మహాత్ముడు లింగరూపియై
కులికెడు దాని గబ్బి చనుగుబ్బలసందున నాట్యమాడగన్

మఱియొక ముద్దులొలుకు సీసము :

పొగసుకీల్జడదాన సోగకన్నులదాన
వజ్రాలవంటి పల్వరుసదాన
బంగారు జిగిదాన బటువుగుబ్బలదాన
నయమైన యొయ్యారి నడలదాన
తోరంపు గటిదాన తొడల సిగ్గులదాన
పిడికిట నడగు నెన్నడుము దాన
తళుకుజెక్కులదాన బెళుకుముక్కరదాన
సింగాణి కనుబొమ చెలువుదాన
మేలిమి పసిండి రవ కడియాలదాన
మించి పోనేల రత్నాల మించుదాన
తిరిగి చూడవె ముత్యాల సరులదాన
చేరి మాటాడు చెంగావి చీరదాన.

ఈ రీతిగా పద్య రత్నములు వెదచల్లుచు లోకము నలరించుచుండిన శ్రీనాథుడు తాను చూచుచుండగనే యెందరో రాజులు, ఎన్నో రాజ్యములు పోయి, తన బ్రదుకు దుర్భరమై అసువులు బాయుచు జెప్పిన సీసము —

కాశికావిశ్వేశు గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయడిచ్చు,

రంభ గూడె తెలుంగురాయరాహుత్తుండు
కస్తూరి కేరాజు బ్రస్తుతింతు,
స్వర్గస్థుడయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తి గలదు,
కైలాసగిరి బండె మైలారు విభుదేగి
దినవెచ్చ మేరాజు దీర్పగలడు,
భాస్కరుడు మున్నె దేవుని పాలి కరిగె
కలియుగంబున నికనుండ కష్టమనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ
నరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి.

దాదాపు తొంబదియేండ్లవాడు అవసాన కాలమున జెప్పిన పద్యము కదా, ధార చెడలేదు. రీతి చెడలేదు. ఏమి రాజసము! తాను స్వర్గమునకే పోవునా? పోయి వాచస్పతి పీఠ మాక్రమించునా? కర్ణాట దేశమునకు బయనము కట్టి, డిండిమ కవిసార్వభౌమునితో దలపడబోవు నపు డెట్టి ఆత్మ ప్రత్యయముండెనో, నిర్యాణ వేళ యందును అట్టి ఆత్మ ప్రత్యయముండుట ఆశ్చర్య జనకము. దేవ సభయం దష్టదిక్పాలకుల నభివర్ణించుచు సీసములు గుంఫించునో! రంభాద్యప్సరో భామినుల నృత్యాది కళావిశేషములు ఆరభటీ వృత్తి మత్తేభవిక్రీడిత వృత్తముల శ్లాఘించునో! మహర్షుల జ్ఞానోపదేశ సూత్రము లనువదించునో!

శ్రీనాథుడు కవిసార్వభౌముడు.
అవధానులకు ఆదర్శమూర్తి.

—:o:—

# చతుష్షష్టి కళలు

కళలు అఱువది నాలుగని ప్రసిద్ధి కలదు. వాత్స్యాయన ముని పేర్కొనిన కళలు-

1. గీతం, 2. వాద్యం, 3. నృత్యం, 4. నాట్యం, 5. ఆలేఖ్యం, 6. విశేషకచ్ఛేద్యం, 7. తండులకుసుమవళివికారాః, 8. పుష్పాస్తరణం 9. దశనవసనాంగరాగః, 10. మణిభూమికాకర్మ, 11. శయనరచనం, 12 ఉదకవాద్యం, 13. ఉదకాఘాతః, 14. చిత్రాశ్చయోగాః, 15. మాల్యగ్రథనవికల్పాః 16. శేఖరాపీడయోజనం, 17. నేపథ్యప్రయోగాః, 18. కర్ణపత్రభంగాః, 19. గంధయుక్తిః, 20. భూషణయోజనం, 21. ఐంద్రజాలాః, 22 కౌచుమారాశ్చయోగాః, 23. హస్తలాఘవం, 24. విచిత్రశాకయూషభక్ష్యవికారక్రియాః, 25. పానకరసరాగాసవయోజనం, 26. సూచీవానకర్మాణి 27 సూత్రక్రీడా, 28. వీణాడమరుకవాద్యాని, 29. ప్రహేళికా, 30. ప్రతిమాలా, 31. దుర్వాచకయోగాః, 32. పుస్తకవాచనం, 33. నాటకాఖ్యాయికాదర్శనం, 34 కావ్యసమస్యాపూరణం, 35. పట్టికావేత్రవానవికల్పాః, 36. తర్కుకర్మాణి, 37. తక్షణం, 38. వాస్తువిద్యా, 39. రూప్యరత్నపరీక్షా, 40. ధాతువాదః, 41. మణిరాగాకరజ్ఞానం, 42. వృక్షాయుర్వేదయోగాః. 43 మేషకుక్కుటలావకయుద్ధవిధిః, 44 శుకశారికాప్రలాపనం. 45. ఉత్సాదనే సంవాహనే కేశమర్దనే చ కౌశలం, 46. అక్షరముష్టికాకథనం, 47. మ్లేచ్ఛితవికల్పాః, 48 దేశభాషావిజ్ఞానం, 49. పుష్పశకటికా, 50. నిమిత్తజ్ఞానం, 51. యంత్రమాతృకా, 52. ధారణమాతృకా. 53. సంపాఠ్యం. 54. మానసీ 55 కావ్యక్రియా. 56 అభిధానకోశః. 57. ఛందోజ్ఞానం, 58. క్రియాకల్పః, 59 ఛలితకయోగాః, 60. వస్త్రగోపనాని, 61. ద్యూతవిశేషాః, 62. ఆకర్షక్రీడా, 63 బాలక్రీడనకాని, 64 వైనయికీనాం వైజయికీనాం వ్యాయామికీనాంచ విద్యానాం జ్ఞానమ్.

(వాత్స్యాయన కామసూత్రగ్రంథ సాధారణాధికరణ తృతీయాధ్యాయ స్థము.)

వాత్స్యాయనోక్త కళావిశేషములు రసికజనసామాన్యములు వీనిలో ప్రహేళికా ప్రతిమాలా దుర్వాచకయోగ పుస్తకవాచన నాటకాఖ్యాయికాదర్శన కావ్యసమస్యాపూరణ అక్షరముష్టికాకథన మ్లేచ్ఛితవికల్ప దేశభాషావిజ్ఞాన ధారణ మాతృకా సంపాఠ్యమానసీ కావ్యక్రియాభిధానకోశ ఛందోజ్ఞాన క్రియాకల్పాదులు వాఙ్మయశాఖలో నాదిగెడి కళలు.

శ్రీ వెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు, రఘువంశవ్యాఖ్య ననుసరించి వ్రాసి ప్రకటించిన చతుష్షష్టికళలు:

1. గీతం, 2. వాదిత్రం, 3. నృత్తం, 4. నాట్యం, 5. చిత్రం, 6. పుస్తకకర్మ, 7. పత్రచ్ఛేద్యం, 8. లిపిజ్ఞానం, 9. వచనకౌశలం, 10. వైలక్షణ్యం, 11. మాల్యవిధి, 12. గ్రంథయుక్తి, 13. ఆస్వాద్యవిధానం, 14. అనురంజనజ్ఞానం, 15. రత్నపరీక్ష, 16. సీవ్యం, 17. ఉపకరణక్రియ, 18. అజీవజ్ఞానం, 19. తిర్యగ్యోనిచికిత్సితం, 20. మాయాకృతం, 21. పాషండసమయజ్ఞానం, 22. క్రీడాకౌశలం, 23. సంవాహనం, 24 శరీరసంస్కార కౌశలం, 25. అయప్రాప్తి, 26. రక్షావిధానం, 27. రూపసంఖ్య, 28. క్రియామార్గం, 29. జీవగ్రహణం, 30. నయజ్ఞానం, 31. చిత్రవిధి, 32. గూఢరాశి, 33 తులానిధి, 34 క్షిప్రగ్రహణం, 35. అనుప్రాప్తి, 36 లేఖ, 37. స్మృత్యనుక్రమం, 38. లీలావ్యాపారమోహనం, 39 గ్రహణాదానం. 40. ఉపస్థాననిధి, 41. యుద్ధం, 42. తతం, 43. గతం, 44 స్త్రీ పురుష భావగ్రహణం, 45. స్వరాగప్రకాశనం, 46. ప్రత్యంగదానం, 47. నఖవిచారం, 48. దంతవిచారం, 49. నీవీస్రంసనం, 50. గుహ్యాస్పర్శనలోమ్యం, 51. పరమార్థకౌశలం, 52. భూషణం, 53. సమానార్థత, 54. ప్రోత్సాహనం, 55. మృదుక్రోధప్రవర్తనం, 56. క్రుద్ధప్రసాదనం, 57. సుప్తాపరిత్యాగం, 58. పరమస్వాపవిధి, 59. గుహ్యగ్రహం, 60 సాస్రుపాతనం, 61. రమణవీక్షణం, 62. స్వయంశపథక్రియ, 63. ప్రస్థితానుగమనం 64 పునర్నిరీక్షణమ్.

(కళలు: గృహలక్ష్మి: మే 1939)

ఇందు లిపిజ్ఞాన వచనకౌశలములు వాఙ్మయ విషయములు. పుస్తక కర్మ కావ్యనిర్మాణవ్యాపారమా ? తాటియాకులతో పుస్తకములు తయారు చేసెడి

పనియా? కడపట శృంగారాత్మకములు కనబడును. అజమహారాజునకు స్వయం వరలబ్ధయైన యిందుమతి "ప్రియశిష్యా లలితే కళావిధౌ" అని కాళిదాసు వ్రాసెను. (రఘువంశము: 8-67) ఆ సుందరి కఱచిన కళలు లలితకళలు.

కొరవి గోపరాజు 'సింహాసన ద్వాత్రింశిక' యందు చతుష్షష్టికళలు ప్రస్తావించెను.

'నాలుగు వేదంబులును శిక్షాది షడంగంబులును స్మృతులును బురాణంబులును బూర్వోత్తర మీమాంసలును న్యాయవిస్తారంబులును నితిహాసంబులును జాస్తుశాస్త్రంబును శ్రౌతతంత్రంబును నాయుర్వేదంబును ధనుర్వేదంబును విష ప్రతీకారంబును మంత్రప్రతీకారంబును గణితంబును మాంత్రికత్వంబును 'జల సూత్రంబును సంగీతంబును సాహిత్యంబును నుచితకృత్యంబును నాటకంబులు కావ్యంబులు నలంకారంబులు నానాదేశభాషలును సకలలిపి పరిచయంబును దూర గమనంబును దూరశ్రవణంబును ధురంధరత్వంబును వశ్యాకర్షణాది షట్కర్మంబులును వాహనారోహణచాతురియు జలస్తంభన శిలాస్తంభన రసస్తంభన శుక్లస్తంభన అగ్నిస్తంభన ఖడ్గస్తంభన వాయుస్తంభన స్థలస్తంభన రక్తస్తంభనాదులును మహేంద్రజాలంబును నష్టవస్తుసముద్ధరణంబును చింతితార్థదానముష్టికరణంబును ప్రియభాషణంబును నదృశ్యకరణంబును నదృశ్యాకర్షణంబును గృషివాణిజ్యాదులును శక్తిత్రయంబును రత్నగవ్యాది పరీక్షణంబును మనుష్యాది జీవపరిరక్షణంబును ద్యూతాంఖేలనంబును యమనియమాద్యష్టాంగయోగంబును అష్టావధానంబును వైదికంబును లోకాచారంబును రతిరహస్యంబును వాద్యకౌశలంబును నాట్యంబును బరకాయప్రవేశంబును బరపంచనంబును ఉపాయాపాయ వివేకంబును వీరత్వంబును వాచకంబును గంధుక కుక్కుటాండ జలపూర్ణభాండ చక్రభ్రమణంబును బహురూప నటనత్వంబును వేణు దండభ్రమణంబును రాజముఖ మృగముఖ స్త్రీముఖ చోరముఖ దిఙ్ముఖబంధనంబును హాలికప్రయోగంబు నాకారగుప్తియు భావజ్ఞానంబును గ్రామణికత్వంబును లేఖకత్వంబును బరిహాసంబును వాచాలకత్వంబును నిష్కంప వృత్తియు సర్వజాతి శిల్ప పరిశీలనంబును నా నీచతుష్షష్టికళలు '

(ఏకాదశాశ్వాసము. 168 వచనము)

ఇందలి కావ్యనాటకాలంకార సాహిత్య నానా దేశభాషా సకల లిపి పరిచయ ప్రియభాషణ పరిహాస వాచాలత్వములు సరస్వతీస్తనములు. ఇవి వాత్స్యాయ

నోక్త కళావిశేషములకంటె క్రొత్తవి కావు క్రొత్తగా దోచునది 'అష్టావధానము.' దాని స్వరూపము వివరింపబడలేదు. అష్టావధానమనెడి మాట తద్గ్రంథకర్తృ కాలమున వివృతి సాపేక్షము కాని మాట. ఆ కళకు అంతటి రూఢి యుండెను.

ఇందు 'నిష్కంపవృత్తి'యు నొక కళగా జెప్పబడెను. నిష్కంపవృత్తి యొక కళ యనుటకంటె, కళ యనెడి తీగ ప్రాకుటకు ఆధారభూతమగు పందిరి యనుట బాగు.

మఱి యెందఱో చతుష్షష్టికళల పట్టికలు ప్రకటించిరి. ఎవరిదారి వారిది. అందరిలో వాత్స్యాయన మునియే ప్రాచీనుడు. అవధాన విద్యకు పనికి వచ్చెడి సామగ్రి అమ్మహర్షి కళాగుచ్ఛమునందే కలదు.

విద్యాసముద్దేశ ప్రకరణమున-
'అభి రభ్యుచ్ఛ్రితా వేశ్యా శీలరూప గుణాన్వితా
లభతే గణికాశబ్దం స్థానం చ జనసంసది.'
(వాత్స్యాయన కామసూత్రములు: అ 1 శ్లో 20)

చతుష్షష్టికళలయందు ప్రాగల్భ్యము గన్న శీలరూపగుణాన్వితయైన వేశ్య 'గణిక' యనబడునని, జనసంసత్తునందు స్థానము బొందునని మహర్షి వక్కాణించెను.

నాయకరాజుల కాలమున గణికలు సభ నలంకరించి, తమ కళాకౌశలము ప్రదర్శించి, మెప్పుగనిరి.

వాఙ్మయశాఖలో నొదిగెడి వాత్స్యాయనీయ కతిపయ కళావిశేషముల స్వరూపము తన జయమంగళటీకయందు, యశోధర పండితుడిట్లు వివరించెను:

1. ప్రహేళికా లోకప్రతీతా క్రీడార్థా వాదార్థా చ

2. ప్రతిమాలా యస్యా అన్త్యాక్షరికేతి ప్రతీతిః. సా క్రీడార్థా వాదార్థా చ. యథోక్తమ్. 'ప్రతిశ్లోకం క్రమాద్యత్ర సంధాయాక్షర మంతియమ్ పఠేతాం శ్లోక మన్యోన్యం ప్రతిమాలేతి సోచ్యత' ఇతి.

ఒకడొక శ్లోకము నేయక్షరముతో ముగించునో తరువాతివా డా యక్షరము నెత్తికొని శ్లోక మారంభించుట.

3. దుర్వాచకయోగా ఇతి.

శబ్దతోఽర్థతశ్చ దుఃఖేనోచ్యత ఇతి దుర్వాచకం తస్య ప్రయోగాః క్రీడార్థావా వాదార్థాశ్చ యథా కావ్యాదర్శే -

'దంష్ట్రాగ్రిగ్ర్యర్ధ్యా ప్రాగ్యో ద్రాక్ష్మా మమ్భ్వన్తస్త్నా ముచ్చిక్షేప
దేవధృట్ క్షిద్ధృత్విక్త్సుత్యో యుష్మాన్నోఽవ్యాత్సర్వాత్కేతుః'.
నోరుతిరుగని క్లిష్టమైన కూర్పు.

4. పుస్తకవాచకమ్.

5. నాటకాఖ్యాయికాదర్శనమ్.

6. కావ్యసమస్యాపూరణమ్. కావ్యస్య శ్లోకస్య సమస్యాపాద ఇత్యర్థః తస్యాః పూరణమ్.

7. అక్షరముష్టికా కథనమ్. ఇతి. అక్షరాణాం ముష్టిరివ ముష్టికా గుప్తిరితి. సా సాభాసా నిరాభాసా చ. (నేత్రావధానము)

8. మ్లేచ్ఛిత వికల్పా ఇతి.

యత్సాధుశబ్దోపనిబద్ధ మప్యక్షరవ్యత్యాసా దస్పష్టార్థం తన్మ్లేచ్ఛితం. గూఢవస్తుమంత్రార్థం తస్య వికల్పా బహవః పూర్వాచార్యోక్తాః

9. ధారణ మాతృకా. శ్రుతస్య గ్రంథస్య ధారణార్థం శాస్త్రం యథోక్తమ్
'వస్తు కోశ స్తథా ద్రవ్యం లక్షణం హేతు రేవ చ
ఇత్యేతే ధారణాదేవ్యాః పంచాంగరుచిరం వపుః' ఇతి.

10. సంపాఠ్యమ్. సంభూయ పఠనమ్. క్రీడార్థం వాదార్థం చ. తత్ర పూర్వధారిత మేకో గ్రంథం పఠతి. ద్వితీయ స్తమేవ అశ్రుతపూర్వం తేన సహైవ పఠతి.

11. మానసీ.

మనసి భవా చింతా. దృశ్యాదృశ్య విషయభేదాత్ ద్విధా.

తత్ర కశ్చిద్వ్యంజనాక్షరైః పద్మోత్పలాద్యాకృతిభి ర్యథాస్థితానుస్వార విసర్జనీయ యుతైః శ్లోక మనుక్రార్థం లిఖతి అన్యశ్చ మాత్రాసంధిసంయోగా సంయోగచ్ఛందోఽవ్యాసాఽభి రక్ష్యాసా దుస్నితాక్షరం పఠతి ఇది దృశ్యవిషయా. యదాతు తథైవ తాని యథాక్రమ మాఖ్యాతాని శ్రుత్వా పూర్వ పదుస్నియ పఠతి తదా దృశ్యవిషయా నభవతి. సా చాకాశ మానసీత్యుచ్యతే.

బొమ్మల సంకేతములను గ్రహించి శ్లోకము నుద్ధరించుట.

12. కావ్యక్రియేతి.

సంస్కృతప్రాకృత అపభ్రంశకావ్యస్య కరణం ప్రతీతి ప్రయోజనమ్.

13. అభిధానకోశః ఉత్పలమాలాది.

14. ఛందోజ్ఞానమ్. పింగళాది ప్రణీతస్య ఛందసో జ్ఞానమ్.

15. క్రియాకల్పః.

కావ్యకరణవిధిః కావ్యాలంకార ఇత్యర్థః త్రితయ మపి కావ్యక్రియాంగం పరకావ్యబోధార్థం చ. (కల్పః రచనే)

క్రియాకల్ప ఛ్ఛందోజ్ఞాన అభిధానకోశ కావ్యక్రియా ధారణమాతృకా సామగ్రీసమాహారమే అవధానవిద్యావ్యాపారము

కనుక వీని నెఱిగిన కృతముఖుడు శతావధాన విద్యాధురీణుడగుచున్నాడు. అష్టావధానికి అక్కఱపడు కవిత్వేతర చమత్కారసామగ్రియు వాత్స్యాయన ప్రోక్తతత్కళాకలాపమునందే కలదు.

క్రీడార్థమో వాదార్థమో యీదృగ్విద్యాప్రదర్శనములు సరస్వతి పుట్టిన నాటినుండి ప్రచారమున నున్నవి.

—: o :—

# చతుర్విధ కవిత్వములు

నన్నయభట్టారకుని కాలమున 'మృదుమధుర చిత్రవిస్తర నవరస భావ భాసుర కవితారచనా విశారదులైన మహాకవులు'

(శ్రీమదాంధ్ర మహాభారతము. ఆదిపర్వము 1-8)

శ్రీనాథుని కాలమున 'మృదుమధురచిత్రవిస్తర కవితా విలాస వాగీశ్వరు లగు కవీశ్వరులు'

(శృంగార నైషధము. 1-11)

వెన్నెలకంటి అన్నయ కాలమున 'అష్టభాషల మధురాశువిస్తర చిత్ర కవితలు చెప్పు' వారు,

(షోడశ కుమార చరిత్ర. 6-13)

పింగళి సూరన్న కాలమున 'ఆశు మధుర చిత్ర విస్తారకవితా విజృంభణ స్తంభిత బాణ భవభూతి కాళిదాసముఖ్య విఖ్యాతి గౌరవులగు కవులు'

(కళాపూర్ణోదయము. 1-11)

గణపవరపు వేంకటకవి కాలమున 'అమితాశువు మధురము చిత్రము విస్తారము' అనబడు చతుర్విధ కవితలు ఘటించు కవులు వన్నె కెక్కిరి.

(ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము. 1-43)

నన్నయ 'మృదుమధురచిత్ర విస్తరకవిత' లనెను

జక్కన తాత పెద్దయ 'ఘటికలో నొక శతకంబు చెప్పనేర్చిన' యాశు కవితా విశారదుడు. అతడు పై నాలుగింటిని వింగడించి చెప్పలేదు కాని, అతని సీసమాలికలోని విశేషణములు 'ఆశుమధురచిత్రవిస్తర' కవితల వంకకే ముల్లు సూపుచున్నవి. శ్రీనాథుడు 'మృదుమధురచిత్రవిస్తర' భట్టారకసమాస స్తబకము నంగీకరించెను. అక్షర రమ్యత నాదరించు స్వభావము గల నన్నయ శ్రీనాథు

లిరువురును ఆశుశబ్ద పర్యాయ శబ్దముగనే మృదు శబ్దము ప్రయోగించియుందు రనిపించును. 'మృదు స్యాత్కోమలేఽతీక్ష్ణే' అని మేదినీ నిఘంటువు

అవిలంబితముగా జెప్పబడు పద్యమునందు భావముల కుదింపు, శబ్దముల బిగింపు అంతగా నుండుటకు వీలులేదు కనుక రచనలో తైక్ష్ణ్యముండదు. అందు చేత అది మృదురచన. అట్టిది అప్రయత్నోదీరిత మగుటచే దాని 'నాశుకవిత' యనుటయు బొసగును.

సంస్కృత కవు లెవ్వరును ప్రస్తావింపని, ఆలంకారికులు చెప్పని. యీ చతుర్విధ కవితాభేదములు తెలుగు కవులే బహుళముగా ప్రచారము చేసినట్లు కనబడుచున్నది. తమిళమున క్రీ. శ. 12 వ శతాబ్దమునుండి ప్రసిద్ధిగాంచిన 'పాట్టి యల్' అను గ్రంథమున 'ఆశు మధుర చిత్తర విస్తరె' అని యీ విభాగము తెలుపబడియున్నదని తమ 'ఉదాహరణ వాఙ్మయ చరిత్రము'నందు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు తెలిపిరి. అగుచో ఈ చతుర్విధకవితాపద్ధతి దశమశతాబ్ది నాటికే రూఢి కెక్కియుండిన దేశిపద్ధతికి జెందిన దాక్షిణాత్య శిల్పవిశేషమని భావించ వచ్చును.

ఈ రీతిగా నెలకొన్న ఆశు మధుర చిత్ర విస్తర కవితలనెడి రూఢి త్రోసి రాజని ఆశు బంధ గర్భ చిత్ర కవిత లనెడి రూఢి గల్పింపజూచినవారు కొందరు పదునేడవ శతాబ్దమున గన్పింతురు. కాని వారి మతము రసవిరోధి యగుటచే పైకిరాలేదనుట వాస్తవము బంధ కవిత్వము చెప్పుట అదొక చిత్రము. గర్భ కవిత్వము చెప్పుట అదొక చిత్రము ఈ చిత్రములు రెండు చాలక మఱొక చిత్రమా? బంధ గర్భ కవిత్వములు చిత్రకవిత్వమునందే యంతర్భవించును. బంధకవితలకు పీఠము గల్పించి మధుర విస్తర కవితలను దొలగించుట-రమణీయ కావ్యకళనే త్రోసిపుచ్చుట యగును గదా! అప్పకవి తరువాతివాడైన శేషము వేంకటపతి 'చిత్రవిస్తరమధురాశులీల గవితల్ రచియింపగ నేర్చె' అని ప్రాచీన సంప్రదాయమునే పాటించెను. (తారాశశాంక విజయము. 2—54) ఇదియే సరి యైన పద్ధతి.

ఈ చతుర్విధకవితల సమగ్రస్వరూపము తెలిసికొనుటకు లక్షణగ్రంథములు లేవు ఒక్క వారణాసి రామయ్య వ్రాసిన 'లక్షణ దీపిక' మాత్రము కలదు.

లక్షణ దీపిక చతుర్విధ కవితల నిట్లు వివరించెను:

'ఆశు మధుర చిత్ర విస్తార కవిత్వంబుల నివి విలసిల్లె, అందు-

ఆశు కవిత్వంబన్నది : ఏకపాద త్రిపాద కరిన ప్రాస విషమ సమస్యా పూర్తులు, వ్యస్తాక్షరీ సంఘటిత పద్యంబులు, ఇష్టార్థ దేవతావర ప్రతిపాది నిషేధాక్షర రచనా చమత్కృతియు అష్టావధానంబులు, ఘటికాశత గ్రంథ కల్పనయు, ఆకాశ పురాణంబులని తత్కాలోచిత త్వరితగతిని రచియింపబడునవి యాశు కవిత్వంబును,

మధుర కవిత్వంబన్నది : నాటకాలంకారములు, కళికోత్కళికలు, విభక్త్యధిదేవతోదాహరణములు. సప్తతాళ నటనలు, నట్లాట్లు, గీత ప్రబంధములు, చతుర్భద్రిక, అష్టభద్రికలు. బిరుదావళి నామావళి భోగావళి రంగఘోష చతురుత్తర సంఘటనలు, యక్షగానంబుల వెలయు పదంబులు దరువులు, లీలలు, ధవళంబులు, మంగళ హారతులు, శోభనంబులు, ఉయ్యాలజోలలు, జక్కుల రేకు పదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద, చతుష్పద, షట్పదాష్టపదులు, నివి యాదిగా నన్నియు లయ ప్రమాణంబుల నొప్పి మృదు మధుర వచన రచనల బ్రసిద్ధంబైనవి మధుర కవిత్వంబులు.

చిత్ర కవిత్వం బన్నది:- పాదగోపనంబును, పద్యభ్రమకంబును, పాద భ్రమకంబును, నామగోపనంబును, అనులోమవిలోమగతిపద్యంబులును, కంద గీతగర్భిత వృత్తంబును, కందద్వయగర్భిత మణిగణనికరంబును, క్రౌంచపద గర్భిత కందద్వయంబును, ద్విపద, చౌపద, లాలి, సువ్వాల, మంగళహారతి. ధవళంబులు, శోభనార్ధచంద్రికాది పద దర్వులాది లయగర్భితసీసంబును, కటక పటహ మండూక తురంగ నట భేరీనినాద నాళుక రంపవృత్తంబులును, రగడ భేదంబులును, తాళగతులును, దండకవృత్తంబులును, అష్టదళ షోడశదళ ద్వాత్రింశద్దళ పద్మబంధంబులును, నవావరణ ద్వాదశావరణ చక్రబంధంబులును, రథ నాగ ద్వినాగ కులాలచక్ర ఆందోళికా ఛత్రబంధంబులును, గోమూత్రికా పుష్పమాలికా పుష్పగుచ్ఛ మృదంగ డమరు ఖడ్గ త్రిశూల కంకణ సర్వతోభద్ర కవికల్పిత కల్పవల్లరి నివి యాదిగాగల్గు బహువిధ చమత్కారంబుల చిత్రంబులు రచియించుటం జేసిన నది చిత్రకవిత్వము.

విస్తరకవిత్వం బన్నది:- ఇష్టదేవతా ప్రార్థనయు, కృతికర్త వంశావళియు, పురగిరి మృగయా యాత్రా వన జలనిధివర్ణన ద్యూతవినోద రాయబార వివాహోత్సవ సురతక్రీడా పుత్రోత్సవ సూర్యోదయ సూర్యాస్తమయ చంద్రోదయ చంద్రోపాలంభన విరహ వర్ణనలు, జలక్రీడలు.షడృతువర్ణనలు, మధుపాన దండయాత్రా రణక్రీడా దిగ్విజయంబులు నివి యాదిగా గలుగు నష్టాదశవర్ణనలు, అలంకారములు రీతులు శయ్యలు వృత్తులు పాకంబు లుత్ప్రేక్షలు శ్లేషోల్లేఖలు ధ్వనులు వ్యంగ్యములు నివి యాదిగా గలుగు కావ్య లక్షణంబులు గలిగి పంచలక్షణ దశలక్షణంబుల నొప్పి కథాసరణి వర్తిల్లుటంజేసి యది విస్తరకవిత్వం బన్నది మహాప్రబంధంబు."
(వార్తాక రాఘవకవి లక్షణ దీపిక)

ఇట్టి చతుర్విధ కవితలు నిర్వహింపగల సమర్థులు పూర్వకాలమున బలువురుండిరి.

'చతుర్విధ కవితామతల్లి కాల్లసాని పెద్దనామాత్యుడు' ఆపవున నందెవేసిన చేయి. (స్వారోచిష మనుసంభవ గద్య.)

'చతుర్విధ ప్రధిత ధారాశుద్ధి ద్రాప... . చభిద్వద్గికిరాజసోదరత యెచ్చన్ మించు పుంభావ శారద' (ఘటికాచల మాహాత్మ్యము. 1-17) తెనాలి రామకృష్ణకవి 'నలు దెఱంగుల నెన్నగల కావ్యధారల ఘనుత వాణివునందు గరము మేటి' అనిపించుకొన్నాడు. (పాండురంగ మాహాత్మ్యము. 1-23)

రామరాజభూషణుడు 'చతుర్విధకవితానిర్వాహకుడు' (వసుచరిత్ర గద్య.)
మధురవాణి - 'చాతుర్య మేతి కవితాసు చతుర్విధాసు'.
(శ్రీరామాయణ సార కావ్యము.)

విజయరాఘవ నాయకుడు 'చతుర్విధ కవితా నిర్వాహక సార్వభౌముడు
(పూతనాపహరణ నాటకము.)

కంకంటి పాపరాజు 'చతుర్విధానపద్యకవిత్వ విద్యావధానాధునాతన భోజ రాజు.'
(శ్రీమదుత్తర రామాయణము.)

3)

తంజాపురి నేలిన మహారాష్ట్ర ప్రభువు శహజీ - 'సర్వగుణభరిత సకల భాషా చతుర్విధ సాహితీ నిర్వాహకుండు.'

(పంచరత్న ప్రబంధ నాటకము. సూత్రధార ప్రస్తావన)

లక్షణ దీపికోదాహృత లక్షణముబట్టి చతుర్విధ కవితానిర్వాహకు లందరు నాశుకవులని, ఆశుకవులందరు విషమ సమస్యాపూర్తులు, వ్యస్తాక్షరీ సంఘటిత పద్యములు, నిషేధాక్షర రచనాచమత్కృతి, అష్టావధానంబులు, ఘటికాశతగ్రంథ కల్పన, ఆకాశపురాణము.............. తత్కాలోచిత త్వరితగతిని రచియింపగల వారని తెలియుచున్నది.

చతుర్విధకవితా నిర్వాహకులే కాలక్రమమున వెలసిన యష్టావధాన శతావధాన మహా సౌధ మూలస్తంభమూర్తులు.

—: ం :—

# ఆశుకవిత

శ్రీకృష్ణదేవరాయ లోకనాథు పసిడి పళ్ళెరమున కవిగండపెండారము గొనివచ్చి సంస్కృతాంధ్రము లందు సమాన ప్రౌఢితో నెవరు కవిత్వము చెప్ప గలరో వారి కిత్తునని లేచి నిలబడెనట. మహాసభలో దానిని బరిగ్రహించుట కొక్కరును లేచి మొగదలకు రాలేదు. అప్పుడు రాయలీ పద్య మెత్తుకొనెనట :

'ముద్దుగ గండపెండియరమున్ గొనుడంచు బహూకరింపగా
నొద్దిక నాకొసంగుమని యొక్కరు గోరగ రారు, లేరొకో!'

ప్రభువు ముద్దుగా బిలువగా నొద్దికతో సమీపించగల హితుడు కవితా పితామహుడొకడే. ప్రభు హృదయమున పెద్దన పీఠము పెట్టుకొని యున్నాడని దకార ద్విత్వఘటిత పద్యప్రాసమే బహిరంగముగ జాటజాలి యున్నది. అందు చేత తక్కిన వారెవ్వరును జిహ్మృక్ష చూపలేదు. తన్ను గాదని గండపెండార మెక్కడకు బోగలదని పెద్దన కూర్చుండి యుండెను. అపుడు ప్రభువు పెద్దన దెస చూచినాడు. పెద్దన లేచి పద్యమందుకున్నాడు:

'పెద్దనబోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే
పెద్దన కీదలంచినను బేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా!'

ఈ పద్యమునకు రెండర్థములు చెప్పవచ్చును. పెద్దనతో సరితూగు పండితులు పృథ్విని లేరు. పృథుత్వాత్ పృథివీ. ఈ విశాల ప్రపంచమున లేరు-అని మొదటి యర్థము. పెద్ద అనన్ బోలు పండితులు లేరు. కనుక, తారతమ్య పరీక్ష చేయక, పెద్ద అనక. పేరిమి- గౌరవముతో ఈదలంచినను నాకిమ్ము. అని రెండవ యర్థము. 'పెద్దనకీదలంచినను పెద్దనకిమ్ము' అనక 'నాకిడు' మనెను. ఇక్కడ తాను పెద్దనకంటే భిన్నుడా? పద్యము చెప్పినవాడు పెద్దన. పద్యమున పెద్దన పేరు లేదు. కనబడుచున్నదే అనిన అది ముద్రాలంకారము.

ఆ చతుర్విధ కవితా చతురాస్యుడు రాయలు ముద్దుగా నెత్తికొన్న పద్దియ మును పూరించుటతో నాగక, కవితా స్వరూప మెట్లుండవలెనో నిరూపించుచు,

త్రింశచ్చరణవిస్తరమైన యుత్పలమాలిక, పూర్వార్ధ మచ్చతెలుగుగా, నుత్తరార్ధ మచ్చసంస్కృతముగా సమపాళముగాసంతరించి. యొక్కొక్కొలో ఝరీశై్ఘ్య మున సభలో వెల్లివిరియ బలికి, యెక్కడివారక్కడ మ్రాన్పడి చిత్రప్రతిమల వలెనుండగా ముందునకు వచ్చి నిలిచెను అప్పుడు శ్రీకృష్ణదేవరాయలు 'బిరుదైన కవి గండపెండారమున కీవ తగుదని తాన పాదమున దొడిగె'. ఆశు కవిత్వ మనగా అది దానితో అల్లసాని పెద్దన కీర్తిప్రభ దిక్కులకు నెకదొట్టెను.

'కావ్యం సద్యః కవీనాంచ భ్రమత్యహ్నా దిశోదశ' అన్నారు కదా!

అల్లసాని పెద్దన్న సద్యః కవి. సద్యఃకవితయే ఆశు కవిత. లేడికి లేచినదే ప్రయాణమన్నట్లు ఆశు కవికి అడిగినదే ముహూర్తము - పద్యములు గుంఫించును.

మఱొకప్పుడేదో రాయ లాశువుగా వచింపుమని కోరగా-

చం. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినగాక యూరక కృతుల్ రచియింపుమనంగ శక్యమే?

అని పెద్దనయే నిరాకరించెనని చెప్పుదురు.

కాని, యీ పద్యమునకు మాతృక యనదగిన కన్నడ పద్యము, తత్పూర్వమే 'సూక్తి సుధార్ణవము' నందు వెలసియుండెనని పరిశోధకులీ కర్ణాట భాషా పద్యము నుదాహరించుచున్నారు:

చం. నిరుపహతిస్థలం మృదుతరాసన మెళ్లణినింపుదంబులం
నరవిద పుస్తకప్రతతి లేఖకవాచక సంగ్రహం నిరం
తర గృహస్థితస్థితి విచారకసంతతి సత్కళత్ర సా
దరత యినుళ్ల సత్కవియు మీసువదాగదె కావ్యవార్ధియుం.

చతుర్విధ కవితామతల్లిక యని పేరు పెట్టుకొన్న పెద్దన్న తన ప్రభువు ముద్దు చెల్లించుటకు పెడమొగము పెట్టినాడనుట నమ్మదగిన మాట కాదు. 'నిరుప

హతిస్థల' పద్యమును జెప్పినమాట నిజమైనచో అది కన్నడమున ప్రసిద్ధమై యుండిన పద్యము కనుక నవ్వులాటకు దాని ననువదించి చెప్పి యుండును. అట్లైనను అది ఆశూక్తమే కదా! నిరాకరించెననుమాట యెట్లు పొసగును? 'ఊరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే?' అని పద్యము. కృతి యనగా కావ్యము కన్నడ పద్యమున కావ్యశబ్దమే కలదు. కావ్యము సావకాశముగా జెప్పదగినది. 'కృతిః వింశతిపర్ణ చ్ఛందసి' అని యుండుటచే కృతి యనగా పద్యమనియు నర్థము చెప్పవచ్చును. కాని, మీది పద్యమునందలి కృతిశబ్దము కావ్యపర్యాయ శబ్దమే. 'ఏమయ్యా! ఏదైన కృతి రచింపగూడదా? ఊరకున్నా వేమి?' అని రాయ లనియుండును. 'అన్ని హంగులు నమరిన గాని మనసు స్వస్థముగ నుండదు. స్వాస్థ్యము లేనిదే కవిత రాదు' అను నభిప్రాయము స్ఫురించు లాగున పెద్దన ఆ పద్యము జెప్పియుండును. ఆ తరువాతనే ఆ రసిక ప్రభువు 'కోకట గ్రామాద్యనే కాగ్రహారము లడిగిన సీమలయం దొసంగి' యుండును. అట్టి 'నాయంకరపు' టధికార ముద్రచే పెద్దన పెద్దిరా జనబరగెను.

పెద్దన 'నిరుపహతిస్థల' పద్యమునకు కన్నడ పద్యము మూలమైనచో, దానికి సంస్కృతమునందలి రాజశేఖరుని కావ్య మీమాంసా సూత్ర వచనములు మూలము. చూడుడు. 'ఆజ్ఞా మూక పరిజనం విజనం వా తస్య స్థానమ్ .... సడోలా ప్రేంఖంచ స్యాత్. సమాగధ భాషాభినివేశిన్యః పరిచారికాః ఇంగితా కారవేదీ ... లాక్షణికశ్చ లేఖకః స్యాత్.' (కావ్య మీమాంస. 10 అధ్యాయము.)

ఇట్టి వెన్నియో రాజభోగములు కవి కవసరమని రాజశేఖరుడు రచించెను.

ఇవి కావ్యము నిర్మించు కవికే కాని, ఆశుపద్యములు రచించు కవికి కాదు. కనుక, పెద్దన ఆశు పద్యములు చెప్ప నిరాకరించెననుట విశ్వసనీయము కాదు.

ఆశుకవు లర్ధరాత్రమున లేపి యడిగినను అడిగినదే తడవుగా పద్యములు చెప్పగలరు. ప్రబోధించినవాడు కవియో పండితుడో రసజ్ఞుడో యయినచో నడుగక మునుపే కనులు విప్పుచు, "నను మేల్కొల్పగ వచ్చినారు విబుధుల్ నా భాగ్య మేమందు, పావనమయ్యెన్ గృహసీమ ... " అని పద్య మెత్తికొనును.

ఆశుకవు లందరు 'ఘటికాశతగ్రంథకల్పనుడ' నని చెప్పుకొనగా, మధుర వాణి 'ఘటికార్ధ నిర్మిత శతశ్లోకి' నని చెప్పికొనెను.

రఘునాథరాయలు రెండుజాములలో పారిజాతాపహరణప్రబంధము నాశువుగా జెప్పి, తన తండ్రియగు నచ్యుతరాయలచే కొలువుకూటమున కనకాభిషేక సత్కారము పొందెనట.

'శుద్ధాంధ్రకవి' అడిదము సూరన 'గడియకు నూఱుపద్యములు గంటము లేక రచింతు' నని వాకొనెను.

ఆశుకవి గడియకు నూటికి దగ్గకుండ పద్యములు చెప్పవలెను. తన కాలమున తెనాలి రామకృష్ణకవి 'ఆశువునందు కరము మేటి' యనిపించుకొన్నవాడు. గడియకు నూటికి పైగా పద్యములు చెప్పియుండును.

ప్రభువులు ఆశుకవితయొక్క శైఘ్ర్యమునే పరీక్షించెడివారు. మోచర్ల వెంకన్న యాచమనాయని దర్శించినపు డాప్రభువు 'గంట కెన్ని పద్యములు చెప్పగల'వని ప్రశ్నించెనట. వట్టి పద్యములే కాదు, సమస్యలుగూడ ఆశువుగా పూరింపగలనని, వెంకన్న తన రచనావేగమును ప్రదర్శించి సత్కృతుడయ్యెనట.

ఈ రీతిగా గంట కెన్ని వందలని తఱుముకొనిపోయినచో రచన యేమి కావలెనని ప్రశ్న పుట్టును.

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్రాసిన వ్యాసపంక్తులిచ్చో నుదాహరింపదగును.

'నాకు తొంటినుండియు నాశుకవిత్వ మందభ్యాసము కలదు. ఆ యభ్యాసమును గ్రమక్రమముగా తగ్గించుటకు చాల ప్రయత్నము చేసి, శ్రమపడి కొంతవరకు కృతకృత్యుడ నయితినని విన్నవించుచున్నాడను. ఈ వదరుబోతుకవిత్వమభ్యాసము చేయవలయునని ప్రయత్నించువారు కనుపడిన దాని నెల్ల-

పుల్లియాకు.

ఆ.వె. పుల్లియాకు జూడ పిల్లలు తినివేయ
రోడ్డయందు దిరుగ నడ్డు పడుచు
బాటసారి గమికి బాటు గూర్చెడు గాన
జక్కబెట్టవలయు జనవరేణ్య!

వెంద్రుక.

కం. వెంద్రుక బీకిన మేనికి
వేంద్రమ్మును గలుగజేసి పెన నెత్తురులున్
గుంద్రముగ బుట్ట జేయుచు
నాంద్రకు మగలకును సుఖము నతుకు నరేంద్రా!

ఇత్యాదులు సర్వదా చెప్పుచు నభ్యాసము చేయవలయును. ఇట్లు చేసినచో గంటకు 4, 5. 6 నూఱుల వరకు పద్దెములు చెప్పు మహాశక్తి 2, 3 నెలలలో పరిపూర్ణముగా కుదురునని దృఢముగా జెప్పగలను. (ఆంధ్ర భారతి)

ఇట్లు సాధింపబడు కవిత్వము కవిత్వము కాదు. ఇట్టి కవిత్వమును మనసులో బెట్టుకొనియే శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు "అపధాన కవిత్వమునకు కేవలాశుధారా కవిత్వమునకును జక్కెరకును నిసుకకును గల భేదము కలదు" అని వ్రాసిరి (అవధానసారము. ఉపోద్ఘాతము)

ఆశుకవితా ప్రబంధకవితలకు గల విశేషము జెప్పగోరగా, శ్రీ చిదంబర శాస్త్రిగారు శతావధానమున జెప్పిన పద్య మీయభిప్రాయమును సమర్థించుచున్నది.

చ. విరసము శబ్దపూరితము వృత్తివిశేష వివర్జితంబు, భా
స్వర గుణభావదూరమయి చప్పగ నాశుకవిత్వ మొప్పు సం
బరమును గొల్పుచుండును ప్రబంధనిబంధన మెంతయేని మా
ధురి రసపాకశయ్యలను దోచను సత్కవులెల్ల మెచ్చగన్.

'ఆశుధారాకవిత్వంబునందు శయ్య
లుపమ లుత్ప్రేక్షలును లేకయుండు.... .........' అన్న అప్పకవి తీర్పు శ్రీపాదవారు ప్రదర్శించిన పుల్లియాకు పద్యమునకు వెంద్రుక పద్యమునకు నన్వయించును.

ఒకపాటి యురవడితో నాశుకవిత్వము పరమ రమణీయముగా జెప్పగల వారు పలువురున్నారు. వారిది సహజసిద్ధి.

శ్రీ తిరుపతిశాస్త్రిగారి ప్రభావతీప్రద్యుమ్న నాటకమున ఆశుకవిత్వ ప్రస్తావన కలదు.

సీ. అర్థగంభీరములైన శబ్దముల పొం
దిక ముత్తెముల కోవ తీరుగాగ
తత్తద్ర సోచిత తాత్పర్య పర్యాప్తి
సురుచిరాలంకార శోభమాన
గణపాటవంబు దూషణ శూన్యతయు ప్రౌఢ
శయ్యా చమత్కార చతురిమంబు
వ్యంగ్య మర్యాదయు ప్రతిభా విభావిత
కల్పనా కౌశల్య గౌరవంబు

వెలయునట్లుగ నాశు కవిత్వమల్లు
టభ్యసించితి వాణీదయావిశేష
వైభవంబున.... అని హంసముచే జెప్పించిరి.

(ప్రభావతీ ప్రద్యుమ్న నాటకము. ప్రథమాంకము)

ఈ సీసము పింగళి సూరన్నగారి 'పొసగ ముత్తెపు సరుల్ పోహళించిన లీల' అనెడి సీసమునకు ప్రతిసీసముగా పైకి గనబడును. కాని సూక్ష్మముగా విచారించినచో తిరుపతి శాస్త్రిగారి రచనకే విస్తృతి యని తేటపడును. వాస్తవమున కాశుకవిత్వము నందు తిరుపతిశాస్త్రిగారి అభ్యాస మటువంటిది.

ఒకనాడు తిరుపతి శాస్త్రిగారు కాకినాడనుండి పిఠాపురమునకు బండిలో బోవుచుండిరి. దారిలో నొక తుమ్మచెట్టు తగిలెను దానిని వర్ణింపుమని సరదాకు పసివాడైన కుమారు డడిగెను. నవ్వుచు శాస్త్రిగారు తుమ్మచెట్టుపై మత్తేభము చెప్పిరి.

'అమలంబై రసవత్తరంబగు ఫలంబా? లేదు, నీ నీడ చెం
త మనుష్యుల్ నిలువంగ నోపరు, భవత్పర్ణంబు లింతింత లే
సి, మెయిన్ గుంటకరాశి, నిన్నెటు సృజించెన్ బ్రహ్మ, నీ వెందు కో
సము జీవించుట? తుమ్మచెట్ట! నిను వృక్షంబంటయే తప్పగున్.'

(తిరుపతి జీవిత సంగ్రహము .)

తుమ్మచెట్టు పద్యమెంత కమ్మగా నున్నది!

'శబ్దముల పొందిక ముత్తెముల కోవ తీరుగాగ' తీర్చెడి ఆశూక్తి చాతురికి మరియొక తారకాణ. తమ శిష్యుడైన శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారి ఆశు కవితా ప్రదర్శన నైపుణ్యమును జూచి ఆనంద తుందిల హృదయారవిందులై తిరుపతి శాస్త్రిగారు పలికిన అభినందన పద్యము-

'ప్రకటతరాశుధారను సభాసదులందఱు మెచ్చుచుండ, నా
యకమణి సంతసింపగ నయారె! రచించిన వాడనీవు వా
రక యరవింద సుందర మరంద ఝరంబు స్రవించుచుండు నీ
సుకవిత గాచుకోగదవె సుబ్బనశాస్త్రి! జగద్ధితంబుగన్.'

సహృదయరసజ్ఞ కవి పండిత మండిత సభామండపము పద్మములతో, తుమ్మెదలతో, హంసలతో, బెగ్గురులతో, నిండి కలకలలాడు మహాతటాకము వలె శోభిలుచుండినపుడు ఆశుకవికి ఱెక్కలు వచ్చును ఆ సమయమున నత డమృతము వర్షించును ఆ ధారకు విలువ కట్టజాలము.

అవసానదశయందు తిరుపతిశాస్త్రిగారి మానసజిహ్వ యీ పద్యము నాలా పించినది. తరువాత వారు మాటాడ లేదు కన్ను మూసిరి.

మ. దయ యేమూలను దాగెనో, భవదుదాత్తంబైన మంత్రం బనా
మయదంబేమయిపోయెనో, యమలనామ ప్రాభవంబెందులో
వ్యయమైపోయెనొ దేవ! భక్తునకు సంప్రాప్తించునే మేహవా
ర్మయమీయామయ మెంతమోసమిది యౌరా! సూర్యనారాయణా!
(తిరుపతికవి జీవిత సంగ్రహము.)

ఆశుకవులలో, శాస్త్రిగారు ఉత్తమ శ్రేణికి జెందిన ఆశుకవి.
ఇక, కవితా లక్షణము గుఱించి ఆశుకవులు చెప్పిన మాలికలు చూతము.
అల్లసాని పెద్దన్న చెప్పిన మాలిక మొదటిది.
పూతమెఱుంగులుం బసరుపూపబెడంగులు చూపునట్టివా
తైతలు? జగ్గునిగ్గు నెనగావలె, గమ్మన గమ్మనన్వలెన్

రాతిరియుంబవల్ మఱపురానిహొయల్ చెలియారజంపు ని
ద్రా తరితీపులోయనగ దారసిలన్వలె లో దలంచినన్
బ్రాతిగ బైకొనన్వలెను బైదలి కుత్తుకలోని పల్లటీ
కూత లనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్
జేతికొలంది కౌగిటను జేర్చిన కన్నియ చిన్నిపొన్ని మే
ల్మూతల చన్నుదోయివలె ముచ్చట గావలె బట్టిచూచినన్
డాతొడనున్న మిన్నుల మిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ
వాతెఱ దొండపండువలె వాచవి గావలె బంట నూదినన్
గాతల తమ్మిచూలి దొరకై వసపుం జవరాలి సిబ్బెపు
న్మేతెలి యబ్బురంపు జిగి నిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బ పొం
బూతల నున్నకాయ సరిపోడిమి కిన్నెరమెట్టుబంతి సం
గాతపు సన్నతంతి బయకారపు గన్నడ గౌళ పంతుకా
సాతత తానతానల పసన్ దివుటాడెకు గోట మీటు బల్
మ్రోతఁ జనుంబలెన్ హరువు మొల్లము గావలె నచ్చతెన్గు లీ
రీతిగ సంస్కృతంబు పచరించెడు పట్టున భారతీ వధూ
టీ తపనీయగర్భ నికటీభవ దాననపర్వ సాహితీ
భౌతిక నాటకప్రకర భారత భారతసమ్మితప్రభా
శీతనగాత్మజాగిరిశ శేఖర శీతమయూఖరేఖికా
పాత సుధాప్రపూర బహుభంగ ఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతక తాళయుగ్మ లయసంగతిచుంచు విపంచికా మృదం
గాతత తేహిత త్తహిత హోధిత ధంధణు ధాణు దింధిమి
వ్రాత లయానుకూల పదవార కుహూద్వహ హారికింకిణీ
నూతన ఘల్లులాచరణనూపుర ఝూంకరఝుళీమరంద సం
ఘాత వియద్ధునీ చరచకద్విక చోత్పల సారసంగ్రహా
యాత కుమారగంధవహ హారి సుగంధవిలాసయుక్తమై
చేతము చల్లజేయవలె జిల్లన జల్లవలెన్ మనోహర
ద్యోతక గోస్తనీ ఫల మధుద్రవ గోఘృత పాయసప్రసా
రాతిరసప్రసార రుచిరప్రసరంబుగ సారెసారెకున్.

(చాటుపద్య మణిమంజరి)

తరువాతి ఆశుకవులు చాలమంది యీ మాలిక నొరవడిగాగొని తాము ను మాలిక జెప్పిరి.

గురువుగారి మనుచరిత్రలోని మంచి మంచి పద్యాలకు తన వసుచరిత్రలో ప్రతిపద్యాలు వ్రాసికొన్న భట్టుమూర్తి శిష్యత్వము నకు వన్నె పెట్టవలెనని కాబోలు-

లొట్టు యిదేటిమాట పెనులోభులతో మొగమోట మేల? తా
గుట్టకయున్న వృశ్చికము కుమ్మరిపుర్వని యందురే కదా
పట్టపురాజుపట్టి సరిపల్లె సరాసరి యీయకున్న నే
దిట్టకమాన ....
కట్టితి ముల్లె లేఖదియు గాగల నూటపదాఱు లెయ్యెడన్
రట్టకి భట్టుమూర్తి కవిరాయని మార్గ మెఱుంగ జెప్పితిన్.

అని యొకమాలిక భట్టుమూర్తి పేర నెవరో యాధునికులు వ్రాసి పెట్టిరి. ఇది భట్టుమూర్తిది కాదని శబ్దముల కూర్పునుబట్టి గుర్తింపవచ్చు. పైగా 'నూట పదాఱుల ముల్లెలు ఏఱకి కట్టితి' ననుమాట దొంగను పట్టి యిచ్చుచున్నది విద్వాం సులకు నూటపదాఱు లిచ్చు నాచారము బ్రిటిషు కరెన్సి వచ్చిన తరువాత నిజాము రాజ్యమున మొలకెత్తిన మరియాద. మన రూపాయలు నూటికి నైజాము రూపా యలు నూట పదునాఱు చెల్లింపవలసియుండెను.

పదునెనిమిదవ శతాబ్దమున శ్రీ శిష్టు కృష్ణమూర్తి - అభినవ భట్టుమూర్తి బిరుదము వహించిన కవి - యొక యుత్పలమాలిక చెప్పెను.

పైపయి రంగులం గదిసి పన్నుగ బోగపుటన్న వన్నె పెం
పై పెనుపడ్డ కబ్బముల కబ్బురమా? పెరమాను మేలువాల్
చూపుల ప్రోవులన్ వలపు జూపుచు నీటగు మాటతేట బల్
దీపులు పుట్ట నెట్టన బదింబడిగా నెద జిక్కి చొక్కపుం
బూపచనుంగవం గలిపి పోడిమి వేడి మిటారపుం గటా
రీ పసమీఱి యారు బిగిరించెడి మించదరం గడంగి మే
లీ పనియంచు నెంచు మది హెచ్చుగ మెచ్చుగ నిచ్చవచ్చిన
ట్లోపినయంతపట్టు బిగి యూతగ వాతెర మార్పు నేర్పులన్
దాపగు ముద్దు గుమ్మరసి తద్దయు గద్దరి పైడి ప్రోది మేల్
గోపు లెఱుంగజేయు నలకోయిల కూతల చాయనింపు తీ

రై పొసగన్ వలెన్ జవులనందిన దంటతనాన విచ్చి క
న్నొప్పిన పేరు బామని గనుంగొనవై కనునీటు తేటలన్
దూపెదలించి పెంచదగు తోపగు గొజ్జగి పూలబారు తీ
రై పొసగన్‌వలెన్ జవులనందిన నమ్మరుతేరు దారు లొ
ప్పొ పవళింపుమేడగది పందిరి నొప్పెడు పట్టెమంచమం
దా పనిముందు నూడిగపు టందము చిందగ నందగత్తెచే
సాపి యొసంగు వీడెము పసన్ పలపున్ మొలిపింపగావలెన్
దేపకు దేప కిప్పగిది దెన్గొనరించెడుపట్ల, సంస్కృతా
టోపము జూపుచో, నళికుటుంబక ఝాంకరణాంకకల్పవ
ల్లీ పరివేల్లనోల్లస దలీవనలీన సదానపాయ సూ
నోపరి సత్ప్రభూత పురుహూత వనీభవ నిర్ఝరావనీ
జోపరి పుష్పనిష్పత దనూన మరందఝరీపరీత సం
తాపహరాంబుపూర పరితస్సరణోత్థ ఘలంఘల ధ్వని
వ్యాపి సురాపగాంతర సమగ్ర తనుగ్రహ నాయికావ్యపే
క్షా పరిహీణ చారుతర సౌరభసార భరాతిభాసురా
ష్టాపద కుంజపుంజ నివసత్కనకచ్ఛద హంసనంప దా
లాపకలాపసమ్మిళిత లాస్యకళావలమూవ కాంచికా
నూపుర కింకిణీగణ వినూత్న తరద్యుతి రత్న కంకణ
ప్రాపి ఝణంఝణక్వణన రంజిత మంజుల రూప రేఖ పై
కి పరిగీత తారతర గీత వినూతన జాత మాధురీ
రూప నిరూపతీయమయి రూఢికి నెక్కవలెన్ గవిత్వ వి
ద్యా పటిమంబు .. ..... (చాటుపద్య రత్నాకరము)

ఈ యభినవ భట్టుమూర్తికవి పలికిన మాలిక కవితామతల్లికా మాలిక కనుకృతి. అచ్చతెనుగునుండి యచ్చు, సంస్కృతపదముల కచ్చు అటునిటు సమానముగా తక్కెడలో నిలిపినట్లున్నవి. పెద్దన నుడి బింకముగాని, భట్టుమూర్తి నుడి పొంకముగాని యిందు మందునకైన గనరావు. ప్రాసస్థానమున 'పొసగన్' అనుమాట యినుమాఱు దొరలినది. ఉపరిపద మినుమాఱు, పరిపదము ముమ్మాఱు దొరలినవి. 'ఒప్పొ పవళింపుమేడ గది పందిరి' అనుచో ప్రాసము, యతి రెండును దేలిపోయినవి. ఇక భావము దాని లోతుపాతులను గుఱించి చర్చింపవలసిన పని లేదు ఈ జాతి కవులకు భావముల తీర్పుకంటె శబ్దముల కూర్పు ముఖ్యము.

కింకపీంద్ర ఘటాపంచాననులు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు **లాలిత్యము** సాధించుటకు గాబోలు, చంపక మాలికావృత్తము జెప్పిరి.

'విని వినినంతమాత్రమున పీనుల విందని సంతసించి చ
య్యన లిఖియింపబోవలయు, నంటిన తోడను బోక వచ్చు ద
న్కను బఠియింపగావలె, ననంతరమందు సమస్తవేళలన్
బనిగొని దానినే మదిని భావన సేయవలెన్, గ్రమక్రమ.
మ్మున రసమెక్కుడై కఱప్రస్ఫురణలు గుల్కెడి వన్నెలాడి పొం
దును బలె జెప్పనొప్పని వినోదమొసంగవలెన్ రతాంత సం
జనితసుఖమ్ము వోలె వివశత్వము జూపవలెన్ వసంత వే
ళను వనమధ్య నొప్పెడు విలాసపుమంటపమందునన్ బసం
దున దగు కమ్మతెమ్మెరలు దోపగ వారవధూమతల్లికా
భినయవినోదముల్ వలె నవీనముదంబొసగన్ వలెన్ దనం
తన తనసంగతిన్ మఱచి తానెవరో పరులెవ్వరో యెఱుం
గనియటులుండగావలె నొకానొక డెవ్వడుగాని తన్ను బి
ల్చిన నికవాని కుత్తరము లేదు సరేగద పల్కెనేని, 'యే
మనదగు నారసంబు నహహా! మహనీయగుణాఢ్యుడెవ్వడో
వినుతికి నెక్కగల్గిన కవిత్వమహత్వపటుత్వ సంపదన్
గని రచియించె. లేకునికి గల్గునె యిట్టి రసప్రసార' మం
చును నడియే పచించుగద సొక్కుచు సోలుచు వెఱ్ఱివాని రీ
తిని మదిరారసంబు చవిదేలిన పూరుషు భాతి మందు పో
ల్కని గనుపట్టి చొప్పడ వలెన్ మఱి యెద్దియు చేసి కారణం
బున నొకవేళ నద్ది మఱపుంగను దుర్దశ మూడెనేని మిం
చిన తమి దన్ను పూర్వము వశీకృతుగా నొనరించి యెన్నియో
దినము లభేదరీతుల మనం గరగించి యకారణంబ త
న్నును విడనాడిపోయిన యనుంగు దెలిన్ దలపోయునట్టి జా
రుని గతి దద్వశీకృతి పురోగముడై చరియింపగావలెన్
వెనుకటిరీతినద్ది స్మృతిపీథి దగుల్కొని నప్పు డెంతయున్
దనకు బ్రియమ్ము గల్గు వనితామణి యల్లనవచ్చి క్రుచ్చి య
క్కున బెనగొన్న సంగతులకున్ సరిగావలె సత్కవిత్వ మ
న్నను ...'

(నానా రాజసందర్శనము)

వీరు తెలుగులని, సంస్కృతములని, పంక్తిభేదము పాటింపలేదు.

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారి చంపమాలికా వృత్తము ప్రవర్తిలిన తీరు-

'పొలుపుల నొల్కు లేముగుద యొల్కు చనుంగవ బోలి గుల్కు బె
ళ్కులు గల మేలి కైతము తెలుంగున బల్కెడు కల్కి చిల్క ప
ల్కులవలె పీచుదోయికి దగుల్కొనగా వలె జూలుగోల ము
ద్దుల నును జెక్కుటద్దముల తోరపు లొద్దుగ పూతరంగు ని
గ్గుల పస రెమ్మ వాల్గనుల కోపున దారసిలన్ వలెన్ మఱిన్
దలచిన తుంటవింటి సరదారుని సేతల సోలియాడు ని
మ్ముల చెలి కాని మోవివలె ముచ్చట గావలె, బంటనంటినన్
వలపులనీను క్రపపు టనంటుల బోదెల చాటుమాటునన్
దాలి పొలయల్కు మోముపయి దోపగ జూపుల వాడి తూపులన్
జిలికెడి కుల్కులాడి జిగిజిల్కు హొయల్ వెలజాణపైట లో
పల వలజిక్కు జక్కవ కవన్ బురుణించెడు దబ్బగుబ్బ యు
బ్బుల వెలయింపగా వలయు బొమ్మ, తెలుంగున గైతలిమ్ముగన్
విలస దమర్త్యవాఙ్మయ కవిత్వమునాన్ భుజగేంద్ర భూషణో
జ్జ్వల మణిరుగ్జటాపటల సంవిలుఠద్దివిషత్తరంగిణీ
చలదురు వీచికానికర శబ్ద ధణంధణ ధంధణార్భటీ
కలన నొసంగగావలె నొకానొకయప్పుడు, పద్మసంభవ
ప్రళయ మహోర్ణవోత్సవ దభంగురభంగ మృదంగ నాద సం
కలిత కృతాంతరాట్చరణఘాత దళద్ద్విహిణాండ నిస్సరత్
పెళపెళ సాధ్వసధ్వనుల బింకము నొక్కయెడన్, ముహుర్ముహు
ర్గల దరవిందబృంద మకరంద నిరంకుశ పానమత్త తుం
దిలిత సరస్వతీచరణ లాస్య చలన్నవశింజినీ ఝళం
ఝళల పసందు జూపవలె ఝల్లున రాలెడు పూలతేనె వా
నల నలరారు మాధురి గనంబనుపన్ వలె గొన్ని వేళలన్.

(అవధాన యాత్ర)

ఆచార్యులవారు 'పూలతేనెవానలు' గురియించుచు, ఈ చెంప నొక బాస, ఆ చెంప నొక బాసగా, పెద్దన యడుగులో అడుగు బెట్టుచు నడిచిరి.

శ్రీ గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారి యుత్పలమాలిక:

శ్రీరమణీయులార ! సరసీరుహనిర్య దమందమాధురీ
సారవచస్కులార ! విలసత్కమనీయ యశోవిలాసినీ
హారవిహారులార ! పరమాదరమేదుర చిత్తులార ! యో
సూరివరేణ్యులార ! పరిశుద్ధ వచోరచనా చమత్క్రియా
పార రసానుభావ గుణపాకసమంచిత వృత్తరీతి వి
స్తార మదీయ దివ్యకవితా వనితాభిరతి ప్రసక్తి సం
స్కారము లింపు జూపుటకు గానిదె కోంటి రేకు బూనితిన్
ధోరణి విన్నచో, కనకతోయజకాండ వినిస్సరద్రసా
సారమయప్రవాహరుచి సారెకు సారెకు దోచు, నల్లికల్
గూరుచుచో వసంత నవకోమల పల్లవ వేల్ల దుల్లతా
గార నిరంతరాయ పరికల్పన నుల్లసమాడు, వ్యంగ్యపున్
నేరుపు జూపనెంచ రమణీయ మహోజ్జ్వల యౌవనప్రభా
చారువిలాస సంభరణ సారసపాణి విలాస వాక్చమ
త్కార విశేష వైఖరులు కన్నుల గట్టిన యట్ల తోచు, నో
రూరగ జేయు మత్కవిత నూకొను భాగ్యము గల్గినంత, శృం
గార రసానుభావ పరికల్పిత యౌవన పూర్ణమాన పం
కేరుహలోచనా ప్రథమకేళివినోద బహుప్రకార వి
స్తార దృఢోపగూహన నితాంతరతిశ్రమ పారవశ్యమున్
గూరుపగావలెన్ ప్రణయకోప వికారపరీత భామినీ
ధీరవిహార మానస గతిస్ఫుటవర్తన లెల్ల గొల్లగా
నేరుపగావలెన్ రుచిర నిర్మల శారద చంద్రచంద్రికా
పూర విపుష్యదంబుధి విభూత తరంగ ఘుమంఘుమార్భటీ
ద్వార విమండలావృత ముహుర్ముహురాగత మామకీన వా
గ్ధారను జూడగా వలదె ? తామరసాయతలోచనా నవ
స్మేర మరీచికానిచయ శీర్య దనన్య రసోపమాన గం
భీర కవిత్వ వాగ్విమలవీచికలన్ దనివొంద జెల్లదే ?

(గాడేపల్లివారి కవితావిలాసము.)

శాస్త్రిగారి ధోరణి విలక్షణమైనది జిలిబిలిపలుకులుండవు. ధార - పొంగు లెత్తు పరదలతోడి వార్షుక నదీప్రవాహము వంటిది. ఆ ప్రవాహమున మహా వేగముతో మునుగుచు లేచుచు కొట్టుకొని పోయెడి వ్రేళ్లు తెగిన చెట్లవలె, 'నిర్యత్, విలసత్, వినిస్సరత్, వేల్లత్, విపుష్యత్, శీర్యత్' వంటి శతృప్రత్యయాంతశబ్ద ములు, దరులకెగదొట్టు నుఱుగు తెట్టెలవలె పెద్దన పలుకుబళ్లు విశృంఖలముగా గోచరించును.

ఈ మాలికల పరమోద్దేశము కవితాకళ విగళితవేద్యాంతరమైన యొకా నొక యనిర్వచనీయానందము నొదవించునని చెప్పుటయే. ఆ యానందకందమైన పరవస్తువు రసము. దానిని సాధించుటకు కవి యత్నించును. కృతార్థుడైన కవి యొక్క వాగ్విలాసమే సహృదయ సహృదయావర్జనక్షమము.

ఆకస్మికముగా లేచి, సభలో నిల్చి, యాశుకవులు చెప్పెడి పద్యము లెట్లుండునో పై మాలికల వలన దెలిసికొననగును.

మహాకవులు శబ్దజాలము కొఱకు తడవికొనుట, పులిమికొనుట యుండదు. పద్యమెత్తుకొనవలెగాని శబ్దార్థములు పరుగెత్తుకొని వచ్చును. ఊరకకాదు- "కథం ను వయం ద్రక్ష్యామహే ఇతి మహాత్మనా మహంపూర్వికయైవ శబ్దార్థాః పురో ధావంతి." (కావ్య మీమాంస. 12 అధ్యాయము)

దీనినే శ్రీ తిరుపతి వెంకటేశ్వర కవులు -

'... నొప్పారెడి నీదు వర్ణనకునై చేయూప శబ్దార్థముల్
నేనే వచ్చెద, నేనె వచ్చెదను నేనే వత్తు నేవత్తు నే
నే నే నే యని వచ్చి మీదబడు, మేమెద్దాని గైకొందు మె
ద్దానిన్ వీడుదుమోయి! ...' (నానా రాజ సందర్శనము)

అని తెనిగించి చమత్కరించిరి.

—: ० :—

# మేధాశక్తి

'ధీ ర్ధారణావతీ మేధా' అన్నా డమరసింహుడు.

'మేధతే అనుభూతం సర్వ మస్యా మితి మేధా. మేధృ సంగమే.'

(లింగాభట్టీయము )

విన్నవి కన్నవి అన్ని విషయములు దేనియందు సంగతములై యుండునో దాని పేరు మేధ. అది బహుజన్మపరంపరాసంగతమైన అనుభూతివిశేషముచేత పరిణతము. జన్మాంతరవిషయములు సంస్కారరేఖయందు ఆహితములై యుండును. సంస్కారరేఖచే మేధాశక్తి దీప్తమగును.

మేధ జ్ఞానముయొక్క పత్ని యన్నారు. అనగా జ్ఞానవశవర్తిని. ఈమె కన్నబిడ్డయే స్మృతి.

ఈ స్మృతియొక్క పుట్టుక విద్యాధరకవి యిట్లు వివరించెను:

'వస్తువిషయ స్తావత్ ఆత్మన్యనుభవపూర్వ మింద్రియసన్నికర్షేణా జన్యతే జనితేన సంస్కార ఆధీయతే. ఆహితేనచ కాలాంతరే స్మృతిః ఉత్పద్యతే.'

(ఏకావళి. తృతీయోన్మేషః)

(వస్తువిషయకమగు ననుభవము తొలుత ఇంద్రియసన్నికర్షముచే కలుగును. అనుభవము కలుగగా ఆత్మయందు సంస్కారము ఆహితమగును. ఆహిత సంస్కారమున కాలాంతరమున స్మృతి కలుగును.)

స్మృతి యెవరియందు ప్రత్యగ్రముగా భాసించుచుండునో వారు మేధావులు. అల్లసాని పెద్దనామాత్యుడు 'అతుల పురాణాగమేతిహాస కథార్థస్మృతి యుతుడు.' (స్వారోచిష మనుసంభవము. 1-15).

పెద్దన స్మృతి యీ జన్మమున దాను బాల్యాదిగా గ్రహించిన కథలను సంబంధించిన స్మృతి.

'నష్టో మోహః స్మృతి ర్లబ్ధా' అన్నా డర్జునుడు.

(భగవద్గీత. 18-73)

ఈ స్మృతి యెప్పటిది? యుగముల నాటిది. కనుక జన్మాంతరీయ స్మృతి యిది.

మేధ సర్వము తనయం దిమిడించికొనగల విశాల గంభీర సముద్రము వంటిది.

సర్వప్రాణిసామాన్యమైన జ్ఞాపక శక్తి మానవునియందు పరమాభివృద్ధి పొందియున్నది.

శ్రుత దృష్ట విషయములు మేధ కెగబ్రాకుచున్నవి. బుద్ధిపూర్వకముగా గ్రహించిన విషయమే కాదు, యాదృచ్ఛికముగా శ్రుతిగోచరమైన విషయము గూడ తనంత తాను మేధ కెగబ్రాకుచున్నది మన మొకచోటికి బోవుచున్నాము. త్రోవలో నెవరో యిరుకతలు తమ భాషలో గీచులాడుకొనుచున్నారు. ఆ భాష మనకు రాదు. వారి ప్రసంగము వినవలెనను కుతూహలము మనకు లేదు. అయినను ఆ గోల మన శిరసున కెక్కి తదాకారమున నెలకొనును.

తెలుగుదేశము నుండి కొందరు కూలివాండ్రు రైలుమార్గమున పనిచేయ సకుటుంబముగా బోయిరి ఆ గుంపులో గొందరు అఱవవారుండిరి. అందఱు కలసి మెలసి పనిచేయుచుండిరి. పని పూర్తియైన పిదప ఎవరిదేశమునకు వారు వెడలి పోయిరి. కొన్నాళ్ళకు తెలుగుపిల్లకు తీవ్రజ్వరము సోకెను కలవరింపదొడగెను. ఆ కలువరింతలలో అనర్గళముగ అఱవము మాటాడుచుండెను. చూచినవారందఱు ఆఅవదయ్యము దొండుకొన్నదని చెప్పుకొనచుండిరి. ఆ పిల్లకు చదువు రాదు. అఱవబాస మాటాడుట రాదు. దయ్యము కాకచో నిదెట్లు సంభవమని ప్రశ్న.

ఈ ప్రశ్నకు సమాధాన మొక హూణ తరుణవైద్యుడు కనిపెట్టెను.

జర్మనీదేశమున నొకగ్రామమున నొక పాతికయేండ్ల పడుచు జ్వరపడి వాగ దొడగెను గ్రీకు, లాటిను, హిబ్రూ భాషాపణితులు ప్రబంధధోరణిలో నిరాఘాటముగ నుచ్చరించుచుండెను. మహామహులు లెందఱో ఆ వింత చూచుటకు వచ్చు

చుండిరి ఆమెకు బ్రహ్మరక్షస్సు (Learned devil) పట్టినని తలచిరి. ఆమె నిరక్షరాస్య అందుచేత నిది వింత యయ్యెను శరీరతత్త్వజ్ఞులు, నాడీతత్త్వజ్ఞులు నెందఱో శతవిధముల బరీక్షించి చూచిరి. అంతు చిక్కలేదు. ఆమె యుచ్చరించెడి వాక్పంక్తులు తావుల కొలది వ్రాసి పెట్టిరి. ఇట్లుండగా నొక్క యభినవ భిషక్కు రంగమున ప్రవేశించి కూపీ తీసెను ఆమె యెక్కడ బుట్టినది? ఎక్కడ పెరిగినది? ఎక్కడ పనిచేసినది ? కనుగొనెను. ఆమె దిక్కులేని దగుటచే తొమ్మిదేండ్ల యీడున ఆమెనొక మత గురువు కొనిపోయెను. ఆ వృద్ధ గురువున కొకయభ్యాస ముండెను ఇంటిలో నటునిటు దిరుగుచు గ్రంథము జేత బట్టికొని గట్టిగా జదువు చుండెడువాడు. అక్కడనే వంట యిల్లుండెను. వంటింటిలో ఆ పిల్ల యుండెడిది. వృద్ధుని మరణానంతరము ఈమె ఆ యూరు వదలి వచ్చెను. ఇపుడు తీవ్రజ్వర పీడితయై యీామె యుచ్చరించు వాక్ప్రబంధమంతయు ఆ వృద్ధుని నిత్యపారాయణ గ్రంథములోనిదేయని రుజువయ్యెను కాగా, మనుష్యుల నాడీమండలకేంద్రమున శ్రుతిరాదితములైన విషయములు అప్రయత్నముగ జేరియుండునని, తత్స్మృతిముద్ర లెప్పటికి చెదరిపోవని తేలినది.

(BIOGRAPHIA LITERARIA BY COLERIDGE)

తమ శిరోనాడుల ముళ్లలో ప్రాక్స్మృతి ముద్రలు భద్రముగా నుండుట వలన ఆ తెనుగు పడతి, యీ జర్మను మడతి జ్వరార్తలై యొకానొక యసంప్రజ్ఞాతమైన యవస్థ యందుండి ఆ మాటలు ప్రలాపించుట జరిగెను. జ్వరార్తికి, నాడీ కేంద్ర గ్రంథినిలీన ప్రాక్స్మృతి ముద్రా జాగృతికి గల సంబంధము విచారింతము.

సుప్రసిద్ధ నాడీమండల శస్త్రవైద్యుడు W. Penfield విద్యుత్తుతో రోగి యొక్క మస్తిష్కాగ్రస్థిత ధూసరవర్ణ బహిఃకళను (Cortex) స్పృశింప జేసినచో పురానుభూత శబ్దదృశ్యాదులు తన్మనః ఫలకమున భాసించుట జరుగునని నిరూపించెను. (F. R C Casson)

డాక్టర్ యస్. కల్యాణరామన్ గారు ప్రతి వ్యక్తి యొక్క శిరస్సులో నొక Permanent Tape Record ఉన్నదనియు, ఏ పలుకులు, ఎంత వేగముతో, ఎంత సేపు, ఏ క్రమమున ముద్రింపబడి యుండెనో, ఆ పలుకులు, అంత వేగముతో, అంతసేపు, ఆ క్రమమున, తత్తత్ప్రదేశములందు నొక్కినపుడు యథా

తరముగా వెలువడునని చెప్పిరి (MEMORY – Talk given at the Rotary Club of Salem North on 3rd March 1975-Dr S Kalyana Raman, M S, M S (Neuro), F.R C S (Eng), (Edim), Ph D (Edim) F. I. C S F. I. C A, F. A. C. S., F.A M S, F A.S C)

ఈ నొక్కుట యనునది విద్యుత్స్పర్శచే జరుపబడును.

స్మృతి గోల్పోయిన రోగుల మెదడు మీద నెవో గీఱ లేర్పడునట. వానిని సవరించిననగాని రోగికి స్మృతి కలుగదు.

ఆ గీఱలు తొలగించుటకు, స్మృతి కలిగించుటకు పాటుపడెకి నాడీ చికిత్సా నిపుణుడగుటచే మెదడున నొడిగియున్న వెనుకటి విషయములు నెమరుకు వచ్చుట యనెడియద్భుత విషయము గ్రహించి లోకమున జాట గలిగెను. ఆసూత్రమే తీవ్ర జ్వరజడత్రీల కన్వయించును. జ్వర ప్రకోపమే మేదోమండలస్థ ప్రాగనుభూత విషయ సంపుటిని కదలించి తత్ఫణికు లీరితములు గావింపగలుగుచున్నది.

'మఱి కొన్ని రసాయనాలు గతంలోని మధుర అనుభవాలను వెలికి తెచ్చి, తిరిగి వాటిని అనుభవిస్తున్నట్లు భావన కల్పిస్తాయి.'

(మస్తిష్కంపై మనోరసాయనాల ప్రభావం.)

మేదోవల్కల ప్రచిత విషయ సామగ్రి విద్యుత్సాహాయ్యమున స్మృతి పథమునకు దేబడుచున్నది. ఇది సాధారణ వ్యక్తుల విషయము

అసాధారణ వ్యక్తులైన మేధావులు సంకల్ప మాత్రమున ఆ పని సాధింతురు. వారికి విద్యుదుపకరణ రసాయన ప్రక్రియాదు లక్కఱలేదు. సకల విషయములు-ప్రాగను భూతములు-వారి బుద్ధియందు సముపస్థితములై యుండును. మఱియు సత్త్వ గుణాధిక్యముగల మహానుభావులకు పూర్వజన్మానుభూత విషయ స్మృతియు నుండును.

'భవన్తి సత్త్వభూయిష్ఠాః పూర్వ జాతిస్మరా నరాః'

(సుశ్రుత శారీరస్థానము. ద్వితీయాధ్యాయము. 56 శ్లోకము)

—: o :—

# ధారణాస్వరూప విచారము

ప్రకృతగ్రంథ ధారణార్థము 'ధారణమాతృక' చెప్పబడినది.

ఇట మాతృక యనగా శాస్త్రము.

'వస్తు కోశ స్తథా ద్రవ్యం లక్షణం హేతు రేవచ
ఇత్యేతే ధారణాదేవ్యాః పంచాంగరుచిరం వపుః.' (జయమంగళ టీక)

వస్తు కోశ ద్రవ్య లక్షణ హేతువు లయిదు ధారణాదేవి శరీరావయవములు. వినిన విషయము జ్ఞప్తియం దుండవలెననిన మీది వస్త్వాద్యవయవము లైదింటి జ్ఞానముండవలెనని గ్రంథతాత్పర్యము ఒకచో, ద్రవ్యలక్షణద్వయమాత్రపరిజ్ఞానముచే ధారణ నిలువవచ్చు అపుడాధారణాదేవి పంచాంగరుచిర కాదనుటకు వీలు లేదు సమగ్రయే. అదెటులనిన - ఆమె 'నాసిక, నేత్రములు చూచినంతనే ఆమె దమయంతి యని తెలిసికొంటిని' అనుచో, దమయంతిని గుర్తించుటకు తదన్యము లయిన యవయవముల యభిరామభావము పరిశీలింప నక్కఱ లేకుండగనే పట్టు చిక్కినదని యర్థము ఇట ద్రవ్య లక్షణ ద్వితీయామాత్రదీపితయగు ధారణ అవయవలోపముచే అపరిపూర్ణ కాదు. వస్తు కోశ హేతువుల ఛాయలందు లీలగా నుండితీఱును. మఱొకచో వస్తుజ్ఞానముచేతనే ధారణ నిలువ వచ్చును. కాగా పంచాంగజ్ఞానము నియతము కాదని స్పష్టము.

వస్తు కోశ ద్రవ్య లక్షణ హేతువులు స్థూలముగా నిట్లుండునని భావింప వచ్చును.

వస్తువు :- రామాయణ భారతాదులు, లౌకిక వృత్తాంతము, ఏదియైన గావచ్చును.

కోశము:- శబ్దార్థ కోశము.

ద్రవ్యము - ప్రాకరణిక విషయము.

లక్షణము:- అసాధారణ ధర్మము. ఇది ఛందస్సు కావచ్చు రీతి కావచ్చు ఛందోలక్షణమే లక్షణ మనినచో గద్యకావ్యములందు శాస్త్రగ్రంథములందు అవ్యాప్తిదోషము కలుగును.

హేతువు:- కారణము, లింగము, నిమిత్తము — ఇవి సమానార్థకములు. కావ్యమున నేతత్ప్రసక్తిహేతువే హేతు వనవచ్చును.

వీని యుపయోగ మిట్లు గ్రహింపవచ్చు :

మ రజనీనాథకులైకభూషణుడవై రాజర్షివై ధారుణీ
ప్రజనెల్లన్ దయతోడ ధర్మచరితన్ బాలించుచున్ దొంటి ధ
ర్మజు నాభాగు భగీరథున్ దశరథున్ మాంధాతృ రామున్‌రఘున్
విజయున్‌బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారిక్షితా!
(శ్రీమదాంధ్ర మహాభారతము. ఆదిపర్వము )

ఈ పద్యమున ధారణయందు నిల్పికొనుటకు వస్తుకోశద్రవ్య లక్షణ హేతు సహకారము చూతుము.

1. వస్తువు :- మహాభారతము.

2. కోశము :- రజనీనాథ, ధర్మజ, పారిక్షిత ఇత్యాది శబ్దజ్ఞానము.

3. ద్రవ్యము :- జనమేజయు డాదిరాజసమశ్లోకు డనెడి శ్లాఘ

4. లక్షణము :- మత్తేభవిక్రీడిత వృత్తము. జకారప్రాసము. రామున్, రఘున్, విజయున్ అనెడి సొగసైన విఱుపులు, యతిప్రాసలు.

5. హేతువు : కావ్యమున నేతత్ప్రసక్తి హేతువు. సర్పయాగము నుడిగించ నాస్తీకు డరుదెంచి, స్వప్రయోజన సాఫల్యమునకై జనమేజయుని స్తుతించుట- మ న్నగునవి.

ఒక్కసారి కన్నులు మూసికొని, మహాభారతేతిహాస ఆదిపర్వ సర్పయాగ సందర్భ సమాగతాస్తీక మహర్షి కృత రజనీనాథ పారిక్షిత శబ్దగర్భిత జకారప్రాస మత్తేభ విక్రీడితవృత్త స్తోత్రఫణితి భావించి, కన్నులు తెఱచినచో, పంచాంగరుచిర ధారణాదేవి మనఃపద్మమున పదిలపడును తిరిగి యెపుడు స్మరించిన నపుడు పద్య రూపమున సాక్షాత్కరించును.

ఛందోలక్షణము ధారణా విషయమున నవధానులకు మంచి పట్టు. శతావధాన సభలో నిర్యతిప్రాసకవిత్వము గుఱించి పృచ్ఛింపగా శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారొక పద్యము వ్రాకుచ్చిరి:

మ. యతియుంబ్రాసయు లేకయే కవితకై యాలోచనల్సేయు స
ద్మతిసంఘమ్ములు పూర్వసత్కవుల రథ్యన్వీడి యల్లంత దు
ర్గతికిం బాలుగ జేయుచుండి రకటా! కష్టమ్ము కష్టమ్ము స
న్నుతికిం దప్పుదరింక భూమి నవధానుల్ ధారణాహీనులై.
(గుంటూరు కాలేజీ శతావధానము)

యతిప్రాసలు లేని రచనలు చేసినచో అవధానులు చెడుదురని నిశ్శంకముగ జెప్పిరి. ప్రాసాక్షరము పట్టుకొన్నచో ఆదిపదము స్ఫురించును. పదమునుబట్టి యత్యక్షరము, దానినిబట్టి అక్కడి పదబంధము స్ఫురించును. ఇట్లు పద్యమంతా కరస్థ మగును.

శబ్దాలంకారములు, దీర్ఘసమాస దళములు ధారణాసహకారులు. అలతి యలతి తునియలుగా విఱిచి విఱిచి పద్యము కట్టినచో అవి ధారణయందు గట్టిగా నిలువద్రొక్కికొనజాలదు. గుత్తపు సమాసము లఖండపు రేకులై చెదరిపోక హత్తికొని యుండును. ఈ కొస పట్టికొన్నచో ఆ కొసదాక లేచి వచ్చును. నడుమ తునిగిపోవు.

ఇక్కడొక రహస్యము కలదు వస్తువు భావించి పద్యము నిర్మించుట కుపక్రమించు నవధాని తత్కాలమున న్వప్రయత్న సమాపతిత పదజాలము యథాతథముగా నిల్పికొనవలెను. కుశలత పండింపదలచి, తొలుత దొరలిన పదముల నొప్పరికించి మఱియు మలచి, తెలచి, మార్చి, తీర్చి తంటాలుపడి పద్య మల్లినచో అది మనసున పదిలముగా నిలవదు. సరిగా ధారణకు రాదు. చీకాకు గొలుపును. దీనికొక దృష్టాంతము. ఒక విద్యార్థి పద్యము నేర్చికొనవలెనని చదువుచుండును. తొలుత నొక చరణమున నొక పాదము పొరపాటున తప్పుగా నుచ్చరించును. వెంటనే తప్పు గ్రహించి సరిగా నుచ్చరించును మరుసటి దినమున పద్య మప్ప జెప్పవలసి వచ్చినప్పుడు ప్రప్రథమమున తాను కంఠపాఠము చేయుటకు

గూర్చుండి పొరపాటున ఏ తప్పు పలికియుండెనో ఆ తప్పు ప్రత్యక్షమగును. దీనినిబట్టి ధారణాపత్రమునబడిన ప్రథమముద్ర సాధిష్ఠముగ నిలుచునని గ్రహింప నగును.

ప్రకృత విషయము ధారణయందు నిలిపికొనుటకు సామాన్యముగా ఈ గుర్తు లైదు తోడ్పడునని తలపవలెనేకాని, యివి గుర్తులని, యీ గుర్తులవలన నవ ధాన మెట్టివాడైన నవలీలగా నిర్వహింపవచ్చునని తలపరాదు వాస్తవమున కివి గుర్తులు కావు. ఏ వ్యక్తి మనోభూమి యందయినను ఏ విషయ వృక్షమయిన నిలువ ద్రొక్కికొనియుండుట కీవస్తుకోశద్రవ్యాదులే వేళ్ళు ఆ పని సహజ ముగా తనంత తా జరుగును. కృతకముగా మనము నిర్మించికొనెడి శతసహస్రము లైన గుర్తులు గుర్తులు కావు

శ్రీ శంకర భగవత్పాద శ్రీ హర్ష జగన్నాథ పండితాది మహాత్ములు పాటించిన ధారణ మాతృక యెట్టిది? శబ్దార్థములు, కథా సందర్భములు, శయ్యా పాక రీతులు, ఛందోభేదములు కలిగిన వాఙ్మయము జ్ఞప్తియందుంచికొనుటకు వస్తుకోశద్రవ్యలక్షణ హేతువు లుపయోగపడవచ్చు. అది వాఙ్మయేతర కోలా హల ధ్వనియైనచో, అర్థరహిత ప్రజల్పమైనచో, అన్యభాషామోషయైనచో ఈ సూత్రము పట్టదు. ఆదిశంకరాదు లిట్టిమోషలను యథాశ్రుతముగా జెప్ప గలిగిరి. కావున వీరుపాసించిన ధారణాదేవి సర్వశక్త. అఖండైకరూప. అనిర్వాచ్య యని మాత్రమే తలపవలెను.

అవధాన సభ యందు పృచ్ఛక పంక్తిలో ఏ వ్యక్తి యే ప్రశ్న మడిగి యుండెనో ఆ వ్యక్తికి అవధాని ఏ పద్యము జెప్పియుండెనో కనుగొనుటకు పృచ్ఛక ముఖమే ధారణ మాతృక. ముఖము చూచినంతనే యతడేసంఖ్యవాడో, యే ప్రశ్నమడిగి యుండునో మనసునకు తట్టును ప్రశ్నము తట్టినంతనే పద్యము స్ఫురించును.

మన మెపుడో యొక పుస్తకము చదివియుందుము. తద్గతవిషయము స్మృతి పథమున భావించుటకు ముందు ఆ పుస్తకము, ఆ పుట కనులకు గట్టినట్లు తోచుట సర్వజనానుభవసిద్ధ విషయము. అదే విధముగా అవధాన సభయందు పృచ్ఛకుని ముఖము, పృష్టవిషయము గోచరించి, తత్సంబంధిపద్యము తోచును.

తిరుపతి వేంకటేశ్వరప్రభృతు లీపద్ధతినే పాటించిరి.

పాశ్చాత్యుల **SIMONIDES METHOD** కొంచె మించుమించుగ ఈ పద్ధతికి దగ్గరగా నుండును.

సైమనైడు అనునతడు క్రీ. పూ. 556-469 ప్రాంతమున ప్రసిద్ధుడై యుండిన గ్రీకు కవి. ఇతడొక విందునకు హాజరై అతిథులకు తన కవిత్వము వినిపించుచుండెను. నడుమ-ఎవరో పిలువగా వెలుపలికి బోయెను. ఇతడవతలికి బోయినంతనే గుభిల్లున సింటికప్పు కూలిపడి సభ్యులందరును జచ్చిపోయిరి పీనుగులు చేతికి రాలేదు. నజ్జునుజ్జైపోయెను. మృత్యుగోచరులైన సభ్యుల గురుతించుట సాధ్యపడలేదు. అపుడు కన్నులు మూసికొని, సైమనైడ్సుకవి తాను కవిత్వము వినిపించువేళ తన సమక్షమున నెవరెవరు ఎక్కడెక్కడ గూర్చుండి యుండిరో ఆ దృశ్యము నొకసారి అంతశ్చక్షువుతో వీక్షించెను. వీక్షించి క్రమముగా నందఱి పేళ్ళు చెప్పెను. నాటగోలె నదొక 'ధారణమాతృక'యై లోకమున రూఢి కెక్కెను. **CICERO** మున్నగువా రీపద్ధతికి పట్టము కట్టిరి ఈ పద్ధతి శాస్త్రమర్యాద కల్పింపదగినంత ప్రౌఢిగల పద్ధతి కాదు.

ధారణ గుఱించి **PHILOSTRATUS** నిర్వచనము సరియైన నిర్వచనము.

**"THE MEMORY BESTOWS THE ARTS, BUT IT IS NOT ITSELF TO BE LEARNED BY ART."**

—: o :—

# వ్యవధిచే ధారణ స్థిరపడును

మనోలక్షణము చాల విచిత్రమైనది.

ఒక డొంకచో ఏదో ఆక్షేపించి మాటాడెను. నీ కపుడు దిక్కు తోచినది కాదు. ఊరకుంటివి. తరువాత నీవాసన్నివేశము గుఱించి విచారించలేదు. కొంత కాలము జరిగెను. ఉన్నట్టులుండి యొకనా డప్రయత్నముగా తత్సన్నివేశము నెమరుకు వచ్చి, వాని యాక్షేపోక్తికి సరియైన సమాధానము నీకు స్ఫురించును. ప్రతిపక్షి సమక్షమున లేడు కదా! ఆ సమాధాన మెందుకు వచ్చినది? రావలెనని యెవరు వాంఛించిరి? మనఃక్షేత్రమున న్యస్తమయిన యల్పాల్పవిషయము గూడ దానినుండి ప్రనష్టము కాదు. నేటిది రేపటికి రూఢమూలమగును. శతావధానవ్యాపార మీసూత్రము మీద జరుగుచున్నది.

శ్రుతవిషయబీజము మనఃక్షేత్రమున బదిలముగ నాటుకొని యంకురించి యాకు మాఱాకు సంతరించుకొనుట దానియంత కది జరుగును.

శతావధానమున నొకడొకవిషయము వర్ణింపగోరును నీకపుడుదని అంతు చిక్కలేదు "ఔరా! యేమని పల్కగానగు నమేయంబైన తద్రూపమున్" అని యొక చరణము చెప్పివేసిన జాలును మరుసటి దినమున కది ఆకు మాఱాకు దొడిగి యుండగలదు దుష్కరప్రాస మెత్తికొంటి వనుకొందము. అపుడే నాలుగు ప్రాసపదాలు నీవు నిర్ధరించి చెప్పలేకపోవచ్చు. రేపటి కాపని సుకరమగును

పరీక్ష కేగు విద్యార్థులు రాత్రి చదివి శయనించినచో ఉదయమునకు చదివిన విషయ ముపస్థితమగనుండును అపుడే చదివి, అపుడే వ్రాయవలెనన్నచో తత్తద్విషయవిస్తరము విస్ఫుటముగా గోచరింపదు నిన్నటి దినమున చదివి చదివి చచ్చినను నోటికిరాని విషయము నేడు స్వయంప్రకాశమానమగుట యనుభవ సిద్ధము. శ్రీ విద్యారణ్యస్వామిపాదులు ధ్యానదీప ప్రకరణమున నీవిషయము తేట పఱచిరి.

'బహువార మధీతేఽపి యదా నాయాతిచే త్పునః
దినాంతరేఽనధీత్యైవ పూర్వాధీతం స్మరే త్పుమాన్ '(వేదాంత పంచదశి)

అష్టావధానమున దినాంతర ప్రసక్తి లేదు. అంతా ఒక పూటతో సమాప్తము కావలసినదే. అయిన, పద్యమునకు నాలుగు పాదము లుండును కనుక, ఒకొక్క ఆవృత్తిలో నొకొక్క పాదము చెప్పిన నాలుగావృత్తులలో పద్యము పూర్తి చేయుట జరుగును. కనుక నడుమ ఇంచుకించుక వ్యవధి యేర్పడుచుండును. ఆ వ్యవధిలో ధారణ స్థిరపడుట, సమాధానమును మలచికొనుట జరుగును ఉదాహరణమునకు దత్తపది కంప, చెంప, దుంప రొంప పదములిచ్చి భారత కథా పరముగ నొకపద్యము జెప్పకోరినపుడు - 'కంపము జెందకుండ బహుకానన భూముల సంచరించి' అని ఉత్పలమాలికావృత్తము ప్రథమపాదము చెప్పివేయును. తర్వాత ద్వితీయపాదమున 'చెంప', తృతీయపాదమున 'దుంప' నెటులైన నిమిడ్చికొన వచ్చును. చతుర్థపాదమున 'రొంప' నెట్లు లిమిడ్చవలెను? దానిపై నొకకన్ను పెట్టి వదలవలెను. దానివంతు వచ్చునప్పటికి త్రోవ స్ఫురించును. సద్యస్సుగా మనస్సుకు దట్టని విషయము ఈ యొకింత వ్యవధిలో పొడకట్టును.

తిరుపతి వేంకటకవులు కాకినాడ శతావధానమున నూఱుగురకు నూఱు చరణములు చెప్పుసరికి ప్రొద్దు క్రుంకెను రెండవదినమున రెండవ చరణము చెప్పుదురు. కాని, నాటి సభ్యులు, ఇంటికి బోసచ్చినచో వీరిరువురు యోజించి కొందురని భావించి, కనీయఃపక్షమొక కొన్నిటినైన పద్యముల పూర్తిచేసి పొమ్మనిరి జంటకవు లిరువురు యోజించుకొందు రనుట ముఖ్యము కాదు. రాతిరి నెమ్మదిగా శయనించి కూర్చినచో మనస్సుయొక్క లోపొరలలో ముద్రితములై యుండిన విషయములు పదిలపడును పౌనఃపున్యముగా మననము చేసికొన్నను విషయము లింత సాధీయస్థితి పొంది పదిలపడవు. కన్ను మొగుడ్చి కాసేపు విశ్రమింపవలెను. అపుడే అవి లోపలి యరలలో పుంజికొనును.

—: ౦ :—

# పూర్వజన్మ సంస్కారము

విద్య చెడని పదార్థము. నరాభ్యస్తవిద్య శరీర పాతముచే నశించిపోదు. మీది జన్మమున జీవుడు గైకొనెడు దేహోపాధియందు తద్విద్యా సంస్కారము నిలువ ద్రొక్కుకొని ప్రకాశించును.

వ్యాసభట్టారకుడు—

'తత్ర బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్' అన్నాడు.

(భగవద్గీత. 6-43.)

ఆయుర్వేద శాస్త్రాచార్యుడు సుశ్రుతుడును—

'అభ్యస్తాః పూర్వదేహే యే తానేవ భజతే గుణాన్' అన్నాడు.

(శారీర స్థానము. ద్వి. 56 శ్లో.)

కాకినాడ శతావధాన సభలో తిరుపతి వేంకటకవుల గురించి పెద్దలు -

'ఇట్టి వయసున నింత ప్రజ్ఞ గల్గుట ప్రాగ్జన్మ ఫలమ కాని, కాదువేఱొండు మీ కబ్బుగాక జయము' అని ప్రశంసించి, యాశీర్వదించిరట.

(జాతకచర్య. పూర్వభాగము. 246 పద్యము.)

ఈ విషయము శ్రీమచ్ఛంకర భగవత్పాదులు స్పష్టపఱచిరి.

'జీవో ముఖ్యప్రాణసచివః సేంద్రియః సమనస్కః విద్యాకర్మపూర్వప్రజ్ఞా పరిగ్రహః పూర్వదేహం విహాయ దేహాంతరం ప్రతిపద్యతే ఇత్యేత దవగతమ్.'

(శాంకర బ్రహ్మసూత్ర భాష్యము, 3 అ. 1 పా 1 సూ )

ఇందు కుదాహరణముగా అద్యతన ప్రపంచ శిశుబాల విద్యా ప్రకాశన విశేషములు పరిశీలింప వచ్చును.

(1) జాన్ ఫిలిప్ బేర్టియర్ అను జర్మనీ దేశ బాలకుడు తన రెండవ యేటనే బహు భాషలు నేర్చెనట. నాలుగవ యేట ఫ్రెంచ్, జర్మన్, లాటిన్ భాషలు ధారాళముగా మాటాడెడివాడట. అయిదవ యేట బైబిలును గ్రీకు భాషలోని కనువదించెనట. చరిత్ర భూగోళము గణితము మున్నగు శాస్త్రముల పాండితిచే జర్మనీ పండితుల మించెనట. ఆఱవ యేట బెర్లిన్ రాయల్ అకాడెమి సభ్యుడయ్యెనట. ఆ పసివాడు డాక్టర్ ఆఫ్ ఫిలాసఫి పట్టముచే సత్కృతుడయ్యెనట.

(2) 1761 సంవత్సరమున జర్మనీలో జన్మించిన క్రిష్టియన్ ఫ్రెడరిక్ అను శిశు రత్నము జన్మించిన కొన్ని గంటల నుండి పెద్ద మనుష్యులవలె స్పష్టముగా మాటలాడెనట. రెండవ యేట నతని మేధాశక్తి అద్భుతముగా పనిచేయ దొడగెనట. బైబిలులో ఏ పదము ఏ పుటలో నున్నదో చెప్పెడివాడట. అతని సర్వతోముఖ ప్రజ్ఞ విని, అతనిని చూడవలెనని కుతూహలము కలిగి డెన్మార్కు రాజు పెన్‌హేగెన్‌కు ఆహ్వానించెనట. ఈ బాల పండితుడు నలుదిక్కుల తన దివ్య ప్రతిభా పరిమళము వెదచల్లి, నాలుగవ యేటనే కన్ను మూసెనట.

(3) ఇంగ్లండులో డేవోన్ అను శిల్పి కుమారుడు జార్జి తన రెండవ యేటనే గణిత పండితు డయ్యెనట నాలుగవ యేట దేశ పర్యటనము చేయ దొడగి తన విద్య ప్రదర్శించుచు బోయెనట. 4444 పౌండ్లకు 4444 రోజులలో $4\frac{1}{2}$ శాతము చొప్పున చక్రవడ్డి యెంతగును? ఇటువంటి లెక్కలు రెండే రెండు నిమిషాలలో చెప్పగలిగెడి వాడట

ప్రస్తుతము గణితశాస్త్ర విదుషీమణి శ్రీమతి శకుంతలాదేవి గారు (బెంగుళూరు) ప్రపంచ మంతయు పర్యటించి విద్యా ప్రదర్శనము కావించినవారు కదా! వీరు కూడ తమ మూడవ యేటనే గణిత ప్రజ్ఞ జూపిరనుట ప్రత్యక్ష నిదర్శనము.

(1, 2, 3 బాల బృహస్పతులు. ఈనాడు దినపత్రిక. 31-10-1978)

గుర్వాదుల యుపదేశము లేకయే, పూర్వార్జిత విద్యా సంస్కార బలము చేత వీరందరు ప్రసిద్ధి పొందినవారు.

కవులయందు, అవధానులయందు పూర్వ జన్మ సంస్కార విశేషము పొడుకొని యుండును.

—: o :—

# అవధానవిద్య వంశపరంపరా ప్రాప్యమా?

వ్రేళ్లమీద లెక్కింపదగిన ప్రాచీనార్వాచీనావధానులు రామరాజభూషణుడు, చరిగొండ ధర్మన్న, శిష్టు కృష్ణమూర్తి, మాడభూషి వేంకటాచార్యులు, తిరుపతి వేంకటేశ్వరులు. వీరి పరంపరలో వీరికి ముందుగాని వెనుక గాని అవధానులు లేరు. అవధానుల మాటయే కాదు, కవిత్రయము, నాచన సోమన, శ్రీనాథుడు,పోతన, శ్రీకృష్ణదేవరాయలు, అష్టదిగ్గజకవులు వీరి కథయు నంతియ. ఒక కాలమున ఒకా నొక మహాపురుషు డొకవిద్యయందు పరమోచ్ఛస్థితి బొంది. ఒక వెలుగు వెలుగును. ఆ వెలు గాఱిపోయిన తరువాత ఆ యింట ఆ జ్యోతి వదలిపెట్టిన చిట్టెము మిగులును.

శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి తమ పుత్రుడు కవీశ్వరుడు కావలెనను కాంక్ష కొండంత యుండెను.

కం. నా కొమరుం డేమాత్ర
మ్మో కవియై నాకొసంగు మోదమ్మును శ్రీ
హైకోర్టు ఛీఫుజడ్జీ
యై కూడ నొసంగజాల డనుకొందు మదిన్.

తే గీ. అల్ల కాదంబరీకావ్య మాత్మజనకు
రచనకుఁన్ దీసిపోని వ్యాగచన యలర
బూర్తిగావించె, దాదృశపుత్రు గన్న
బాణున కొనర్తు నే నమోవాకశతము.

(ఇటీవలి చర్య. 50, 58 పద్యములు.)

పై పద్యముల వలన బాణభట్టు పుత్రునివలె దమ పుత్రుడును పైతృకమైన వ్యవసాయము నవ్యవహితముగా సాగింపవలెనని శాస్త్రిగా రభిలషించుట తేట పడును. వాలి మహాశూరుడు. వాలి పుత్రుడు అంగదుడు. సుగ్రీవుని రాజ్యమున

యువరాజయ్యెను. ఇతడును శూరుడే. వాలి భుజశక్తికి, అంగదుని భుజశక్తికి ఎంత భేదమున్నదో, బాణభట్టు వాక్చక్తికి. తత్పుత్రుని వాక్చక్తికి అంత భేద మున్నది తండ్రియంతటి వ్యక్తి కాడు.

ఒకనాడు శాస్త్రిగారి కుడి కన్నదరుట, తత్ఫలముగా పుత్రరత్నము శ్రీ దుర్గేశ్వరశాస్త్రిగారు, ద్వివేది సత్యనారాయణగారిని జంటగా గొని, అష్టావధానము చేసెనను వార్త వినుట సంభవించెను. శాస్త్రిగారి జీవితచరిత్ర, ఇదివరి చర్య, వారి నిర్యాణానంతరము వారి పుత్రరత్నము పూరించిరి. ఆ తండ్రి గారి భాగ్యఫల మంతే.

'కాయ బలంబు శాశ్వతము గాదు, శరీరబలావలేపమే
ధీయువతీమణీ హృదయదీప్తికి జాలిన పట్టుగొమ్మ స్వ
శ్రేయస మిచ్చగించు కవిశేఖరు లీద్వితయానుకూల్య ముం
బాయక యే వధాన పరిపాటిని గోటను మీటు టొప్పగున్.

(శతావధాన సారము.)

శరీరబలావలేపము చాలని వ్యక్తి యగుటచే తత్పుత్రు డవధానకార్య నిర్వోఢ కాలేదు. నిర్వోఢయై యుండినను ఆ వర్చస్సు వచ్చియుండదు. పువ్వు పుట్టగనే పరిమళించును.

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు బందరులో శతావధాన సభానంతరము వేణు గాన సభ జేసిరి. గానసభలో తానొక వేణువునూని ఆచార్యపుత్రుడు- పదునై దేండ్ల ప్రాయమువాడు- తండ్రికి జాసరై కూర్చుండెనట. తత్సన్నివేశమును శ్రీ వెళ్ళపిళ్ళవారిట్లు కొనియాడిరి:

తే గీ. కారణగుణమ్ము లయ్యవి కార్యమందు
సంక్రమించు నటంచు శాస్త్రజ్ఞులండ్రు
దానికి నుదాహృతిగ వీరిలనయు వేణు
గానమును జూచికొనుడయ్య! ఘన సుకవులు.

(బందరు శతావధానము. పుట ౯౬.)

ఆచార్యులవారి పుత్రునకు గాన మబ్బినది. అవధాన విద్య అబ్బలేదు.

సుగృహీత నామధేయు లయిన యవధానుల యింట మఱి తత్సదృశప్రజ్ఞ గల యవధానులు పుట్టలేదు.

అవధాన విద్య వంశపరంపరాప్రాప్యము కాదు.

—: ० :—

౯)

# అవధానవిద్య గురుముఖ లభ్యమా ?

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు గుంటూరు శతావధాన సభలో శిష్యచూడామణి శివరామశాస్త్రిగారిని యౌవరాజ్యపదమున నిలిపి యాశీర్వదించిరి.

శిష్యులమని చెప్పికొని వెంబడి దిరుగువారు పదివేలమంది యుండగా 'పేర్మి హెచ్చగ మా యేలిన యీ వధాన కవితా సామ్రాజ్యభారంబు మోయగ బూనం గదవయ్యా! తండ్రి! శివరామయ్యా! చిరంజీవివై' అని తిరుపతిశాస్త్రిగారును, 'సంతానంబది నాకు లేదను మనశ్శల్యంబు నీ వైదుషీకాంతుల్ ద్రోచె గదోయి' అని వేంకటశాస్త్రిగారును శివరామశాస్త్రిగారి నాత్మసాత్కరించికొనిరి. అలనాడు గుంటూరు కాలేజిలో శివరామశాస్త్రిగారు కావించిన సంపూర్ణ శతావధానప్రౌఢి గురువులకంత ప్రఖ్యాతి గూర్చినది. (గుంటూరి సీమ. ఉత్తర రంగము.)

ద్రోణు డర్జునునకు వలె తిరుపతి వేంకటేశ్వరులు శివరామశాస్త్రిగారికి అవధానవిద్యా మహాస్త్రమంత్రము లధికముగా జెప్పియుండిరా ?

'వేలూరివారు శ్రీ జయంతి భగీరథశాస్త్రిగారి వద్ద వ్యాకరణం చదివారు. చెళ్ళపిళ్ళవారి వద్ద ఏమీ చదువలేదనీ, వారివెంట ఒక నెలరోజుల తిరగడమే శుశ్రూష అనీ విన్నాను' అని శివరామశాస్త్రిగారి సన్నిహితమిత్రు లనుచున్నారు.
(నే నెఱిగిన కవులు. అంబటిపూడి వెంకటరత్నంగారు.
ఆంధ్రపత్రిక. 5-8-1956.)

తిరుపతి వేంకటకవుల శతావధానసందర్భమున లక్ష్మీనరసాపురపు శతావధాన మున్నది కాని, యీ శతావధానమున శిష్యుని చర్య కూడ ఉన్నది.

'లక్ష్మీనరసాపురం శ్రీ చెల్లయమ్మ్యాలారావుగారి షష్టిపూర్తిలో తిరుపతిశాస్త్రి గారూ నేను కలిసి సుమారు ఏబది మందికి అవధానం చేశాము' అన్నారు శివరామ శాస్త్రిగారు. (ఆంధ్రపత్రిక. స్వర్ణోత్సవ సంచిక.)

ఆ సభలో వేంకటశాస్త్రి గారున్నారు. కాని, 'జ్వరపడి యున్న హేతువున సాయము నీకొనరింపజాలనో తిరుపతిశాస్త్రి!' అని కూర్చున్నారు.

ఇక్కడ గురువులతో సమానస్కంధుడై శిష్యుడు నిలుచుట విశేషము. వీరి శైష్యోపాధ్యాయికాస్వరూప మిట్లున్నది.

గురువుల వెంట నొక నెంరోజులు తిరుగుటయే - కుమిరుగా గూర్చుండి వినుటయు గాదు- శిష్యత్వమా ? 'గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తుచ్ఛిన్న సంశయాః' (దక్షిణామూర్తి ధ్యానము. శ్లోకము 2) ఈ పద్ధతి వైఖరీగురువులపట్ల అన్వయించునా ?

శ్రీ మాడభూషివా రవధానము చేయుచుండగా చూచి నేర్చినవారు చెళ్ళపిళ్ళ వారు. వేలూరి వారును చెళ్ళపిళ్ళవారి యవధానము చూచి నేర్చిన వారందమా? చూచి గ్రహించుటయే సంప్రదాయమయినచో నెందరు చూడరు ! అందరికి అబ్బు చున్నదా ? ఆశ యున్న మాత్రమున ఫల మున్నవారికే అబ్బుచున్నది. ఆ ఫలమే పూర్వజన్మ సంస్కార నిష్పన్నమైన ఆ జీవుని భాగ్యఫలము.

తిరుపతి వేంకటేశ్వరులు తమ పరమ గురుపాదులు బ్రహ్మయ్యశాస్త్రిగారి యొద్ద శబ్దశాస్త్రము చదివిరి. అవధాన శాస్త్రము కాదు.

మాడభూషివారి గురుపాదు లవధానులు కారు.

మఱి శిష్యులమని చెప్పికొనువారి మాట యేమి కావలెననిన, ఏమియు గానక్కఱ లేదు. అది వారి యేకలవ్యభక్తికి దార్కాణము కాదు. ద్రోణుడొక మహా విద్యయందు పరాకోటస్థాన మాక్రమించిన వ్యక్తి. ప్రాగ్జన్మ సంస్కారము పుక్కిట బట్టికొని రేకులు విప్పుచున్న పక్వమైన మొగ్గ యేకలవ్యుడు. ఆ గురుని ఆశీఃపూర్వక కరస్పర్శ, లేదా, యశశ్శోభ కూ కోరకము చతురస్రజృంభిత ముగా వికసించుటకు కారణమైన దనుకొనిన అనుకొనవచ్చును

గురుడు శిష్యునకు శాబ్దమైన వ్యుత్పత్తి గఱపగలడు. మఱికొన్ని యొడుపులు తెలుపగలడు అంతేకాని, అవధాన నిర్వహణశక్తి అందీయలేడు.

అవధానవిద్య గురుముఖ లభ్యము కాదు.

---:o:---

# అవధానవిద్య ఉపాసనా సాధ్యమా ?

అవక్రీతుడను మునికుమారుడు -

ఆ. వె. 'చదువకయును నాకు సర్వవేదంబులు
సర్వశాస్త్రములును సంభవిల్ల
వలయునని తలంచి, వదలక నిష్ఠతో
నగ్రతపము' చేసి సాధించె నట.
[శ్రీమదాంధ్ర మహాభారతము. అరణ్యపర్వము.
3 ఆ. 254 ప.]

మంత్రోపాసకు లెందఱో యెన్నో సిద్ధులు పొందినట్లు కథలు కలవు. కవిత్వ శక్తిహీనుడును, సరస్వతీమంత్రతంత్ర ప్రయోగము వలన కావ్య నిర్మాణక్షమ మైన శక్తి సంపాదించికొనవచ్చునని రాజశేఖరు డన్నాడు.

'కవిత్వం నస్థితం యస్య కావ్యేచ కృతకౌతుకః
తస్య సిద్ధిః సరస్వత్యా స్తన్త్రమంత్రప్రయోగతః'
[కావ్య మీమాంస. 4-22.]

మఱియు నావేశికుడు, సంక్రామయిత అను నిఱుదెఱగుల వ్యక్తుల గుఱించి తెలిపినాడు.

మంత్రాద్యుపదేశవశమున లబ్ధసిద్ధియై తద్దేవతావేశసమయమున కవిత్వము చెప్పువాడు ఆవేశికుడు. మంత్రసిద్ధి పొందినవాడై కన్యలయందు, బాలకులయందు సరస్వతిని సంక్రమింపజేయువాడు సంక్రామయిత.

కొందరు మహాత్ములు శిశువులచేత, పశువులచేత మహావిషయములు చెప్పించిరని పూర్వకథలలో కనబడును. అమ్మహాత్ములు సంక్రామయితృ మంత్రసిద్ధులు.

సామాన్యమానవశక్తికి దుర్ఘటములుగాదోచు పనులేవియైనను సరే, వాని నుపాసనాలబ్ధములని భావించుట లోకపరిపాటి.

తిరుపతి వేంకటేశ్వరులకు కాళికోపాసకులని ప్రసిద్ధి కలదు కాని, అవధానవిద్య తదుపాసనైకఫలమని వారెక్కడను జెప్పలేదు ఆమె దయవలన నాకు నాలుగక్షరాలు వచ్చినవని, ఆమె దయవలన నన్నోదకములు లభించినవని, ఆమె దయవలన నవధానము చేయుట సంభవించినదని చెప్పుట విశేషము గాదు. అవి యందరు జెప్పెడి మాటలే. తిరుపతి వేంకటేశ్వరులు తమకేయుపాసనయు లేదని నెత్తిన నోరు పెట్టికొని, కుండ బ్రద్దలు కొట్టిరి. విధిలేక కొందరికడ బొంకిరి.

'మేమును గొంతమందితో నుపాసనా బలమనియే యొప్పుకొని వారిని సంతోషపెట్టుచుండుటయుగలదు. ఏమన యథార్థము చెప్పినచో బొత్తిగా విశ్వసింపరు కదా!' (ఉపోద్ఘాతము. శతావధానసారము)

అవధాన విషయమై సభ్యుల యోజనగురించి సీసము జెప్పుచు-

'ఇది యభ్యాసమొ లేక యేదేవు కరుణయో
గురుకృపయో యంచు గొణుగువారు,
కాదిది యుచ్ఛిష్ట గణపత్యుపాసనా
ఫలమంచు లోలోన దలచువారు
నైరి సభనున్నవారు ... (శతావధానసారము)
అని పలురకముల మనుజుల తలపుల తెలుగుల వివరించిరి.

ఉచ్ఛిష్ట గణపత్యుపాసన చేసినగాని అవధానముచేయజాలరని యూహించు వారున్నారనుటకు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి వ్రాతయు నొకమచ్చు.

'అష్టావధానము చేయుట ధారణా శక్తిచేత నగుకొక, సామాన్య జనులు మంత్రశక్తియని భ్రమించి కాదని నా మిత్రులు చెప్పినను నమ్మక, నా కుచ్ఛిష్ట గణపతి యుపాసన యున్నదని, నేను గోచి పెట్టుకొంటినో లేదోయని, నా వెనుకకు వచ్చి కొందరు చూడసాగిరి' (స్వీయచరిత్రము పుట 92.)

సహస్రావధానము దుర్ఘటము కనుక దాని కుపాసనాబల మావశ్యకమే కానిచో తిరుపతి వెంకటేశ్వరులు—

'కడున్ వేగమ వేయిమందికయినన్ రమ్యస్థితుల్ మీఱ నా
సత్కవిత్వం బొసంగింప నేరుతుము శ్రీశూలిప్రియామానినీ

య కటాక్షమ్మున....'

అని యేల పలుకుదురు? కాశీసహస్ర కృతి యేల వ్రాయుదురు? ఇవి కొందరి ప్రశ్నలు. వీనికి శతావధాన సారోపోద్ఘాత వాక్యములే సమాధానములు.

'దైవ కృప యనునది అన్నిటికిని గావలయును. అన్నిటితోబాటు దీనికిని ఉండవలెను. కేవలము దైవకృప మాత్రము పనిచేయదు.'

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు 'అష్టావధాన పాదశతావధాన అర్ధశతావధాన సంపూర్ణ శతావధానములందు అనేక విధములుగా శ్రీ హయాస్యుడే నాచే నెన్నియో పద్యముల నల్లించి శ్రోతృజనాదర పాత్రముల గావించుచుండెను.'
(విజ్ఞప్తి అవధానయాత్ర.)

అని వ్రాయుట బట్టి వారు హయగ్రీవోపాసకు లనుట తెల్లము. వారు మఱియు లోతునకు దిగి, తమ యనుభూత విశేషము వివరించిరి ఆ చంపక మిది-

"అది నా
హృదయ గుహాంతరాన నొకయించుక భీతి జనించె, గుండియల్
వదవదలాడె నేమొ యొక ధ్వాంతమునం బడినట్లు దోచె, నా
యెదుట గలట్టివారెవరొ, యెచ్చటనుంటినొ, తోచదయ్యె నా
మది నపు డొక్క భక్త హనుమయ్యయు దెల్లని దంతపంక్తిపై
నొదవెడు మందహాసముల నొప్పుచు జల్లగ నన్నుజూచు నీ
వదనము దోచె, నా హృదయ భావము లన్నియు మాయమాయె నిం
పొదవగనాయె నెల్లరకు, నొక్క దొసంగు పొసంగదాయె, ని
య్యదియు సమస్తమున్ భవ దుదారకృపారసధారచేతనే
కద! యిదె మ్రొక్కు నీకు, నొక కంట ననున్ గనిపెట్టు మెప్పుడున్."

'హయాస్యుఁడు నాచే బద్యము నల్లించె' ననుమాట యౌపచారిక వాక్యమని కొట్టివేయవచ్చు కాని, హయాస్యుడు హనుమత్సమేతుడై సాక్షాత్కరించె ననుట అంత తేలికగా కొట్టివేయుటకు వీలు లేదు. ఇంతియ కాదు. అవధాన మధ్యమున నొక పృచ్ఛకు డడిగిన దానికి ఏమి సమాధానము చెప్పవలెనో తోపనప్పుడు -

'అయ్యరో! ప్రసవశ్రమమున
నియ్యెడ నేనుంటినయ్య! యీయయ్యకు నే
నెయ్యుత్తర మియ్య వలెన్
జయ్యన దోపించుమయ్య! సైంధవ వదనా!
(అవధాన యాత్ర. పుట 116.)

అనియు, పద్యము లప్పుడెప్పుడెప్పుడేకియైన పద్యమో, పాదమో, పదమో జ్ఞప్తికి రానిచో -

'భావమునందు నిన్నెపుడు బాసి యెఱుంగనివాడనయ్య! యో
పావన నామధేయ! నను గాలను ముంచిన నీట ముంచినన్
నీవ గదయ్య దిక్కితరునిన్ మఱి వేడగ బోవ నోహయ
గ్రీవ! వధానవార్ధి నను రేవును జేర్పుము నీకు మ్రొక్కెదన్.'
(బందరు శతావధానము.)

అనియు వేడికొని తత్కృపచే కృతార్థుడనైతి నని చెప్పుచున్నారు. అట్టి సాంద్రుష్టిక విశేషముల నుపేక్షించుటెట్లు?

తిరుపతి వేంకటకవులు- 'మన్నెవరికేని యియ్యది యేయుపాసనము వలన నైన లభించియుండునేమో మాకు దెలియదు కాని, మాకు మాత్రమట్లు రాలేదని యధార్థముగా వక్కాణించుచున్నారము, అని వ్రాయుట పాక్షికముగా నుపాసనా శక్తి నంగీకరించుటయే కదా! 'మాకు దెలియ' దన్నారే!

వాక్స్తంభము, వశ్యము, ఆకర్షణము, మోహనము మున్నగు విద్యలు తెలుగుదేశమున ఆ కాలమున ప్రచుర ప్రచారముననుండెను తమ విద్యలు ప్రద

ర్శించువారు, వెలుపలినుండి తమ కెట్టి యపాయము కలుగకుండుటకై తొలుత నష్టదిగ్బంధము చేయుచుండిరి. దానినే 'కట్టు' అందురు 'కూచిపూడివారు గొప్ప మంత్రశాస్త్రజ్ఞులు.' (వేయిపడగలు. పుట 800)

చూపోపనివారు మంత్రప్రయోగమునే నొకవిద్య తత్కాలమున భాసింప కుండ జేయుదురనుట యథార్థమైనపుడు, మంత్రోపాసకు డవధానకార్యము నవ లీలగా నిర్వహింపగలడనుట యథార్థము కాకపోవునా?

నైషధగ్రంథకర్తను గుఱించి 'చింతామణీమంత్రసిద్ధుం డుపాధ్యాయభట్ట హర్షుండు' అని శ్రీనాథు డనెను. (శృంగార నైషధము. 8-203)

శ్రీనాథుడు 'బ్రాహ్మీదత్త వరప్రసాదుడు.'

ఏనుగు లక్ష్మణకవి శ్రీనాథుని ప్రస్తుతించిన రీతి పరికింపుడు:

తే గీ. మహిత చింతామణీదివ్య మంత్ర సిద్ధు
నైషధాది ప్రబంధ సందర్భనిపుణు
సకలవిద్యావిశారదు సత్కవిత్వ
పట్టభద్రుని శ్రీనాథు బ్రస్తుతింతు. (రామేశ్వర మాహాత్మ్యము)

నంది మల్లయ ఘంట సింగయ కవులు 'వాగీశ్వరీ మంత్రరాజ సిద్ధి పార గుల' మని పలికిరి. (వరాహ పురాణము. 1-12)

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి 'వాణి నా రాణి' యనెనట. ఒక్కరేయి సరస్వతియే యతనియింట గూర్చుండి జైమిని భారతము తెనిగించి పోయెనని కథ కలదు శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు జైమిని భారతమునకు పీఠిక వ్రాయుచు, 'ఈ కథ యందలి సత్యము భగవంతుడే యెఱుంగును. 'బావజ్ఞులకు బరా పశ్యంతి మధ్యమా వైఖరు లేదేవి వర్ణసరణి' యను సరస్వతీధ్యాన ఘట్టమును జూడగా నీతడు శారదా మంత్రోపాసకుడనియు, మంత్రతంత్ర రహస్యవేత్త యనియు దేటపడుచున్నది.' అని వ్రాసిరి. (జైమిని భారతము. వావిళ్ళ)

సప్తర్షు లొక పచ్చికిరాతునకు రామమంత్రోపదేశము చేసిరనియు, ఆక్కిరాతుడే వాల్మీకియై కరుణరస ముట్టిపడ రామాయణము వ్రాసెనని కథ లున్నవి.

'ఏతాదృశులకుం బ్రతిలోమంబుగా నుపదేశింపవలయు'నని సప్తర్షులు, 'మరా మరా యటంచు బల్కు మా యనుగ్రహంబునన్ బరాకు రాదటంచు రామమంత్ర మిచ్చి' చనిరట. (వాల్మీకి చరితము. 2-125)

పక్షిని గొట్టిన కిరాతుని దిట్టిన వాల్మీకి పుట్టుకచే కిరాతుడని కథ యల్లిన మన పెద్దలు కాళిదాసు నెందుకు వదలి పెట్టుదురు? లోకమునందందరికన్న మందు డజాజీవుడు కనుక, ఆజాజీవుడే కాళీప్రసాదమున కవియై కాళిదాసన బరగెనని కథ కల్పించిరి. (వినోదకథాకల్పవల్లి)

వాల్మీకి కథయు, కాళిదాసు కథయు రెండును వినోదకథలే. దేవతోపాసన చేత సాధింపరాని వేవియు లేవని, పరమక్రూరుడు కరుణప్రధానకావ్యము రచింప గలుగునని, పరమమూర్ఖుడు సర్వజ్ఞతావిశిష్ట కావ్యప్రపంచము రచింపగలుగునని వక్కాణించుటయే తత్కథలు కల్పించిన పెద్దల యుద్దేశము. వాల్మీకి కాళిదాసుల కవిత్వములు లోకోత్తరములుగా నుండుటకు తదుపాసిత దైవతశక్తియే కారణమని విశ్వసించువారు నేడును గలరు.

ఈ యుపాసన గురించి ఇంతదూరము చర్చించుటకు బీజమున్నది. 'శత లేఖినీ పద్యసంధాన ధౌరేయు' డైన మన రామరాజ భూషణుడు 'హనుమదుపాస కుడు'. 'పవమానకుమార కృపావర్ధితోభయ కవితా కళారత్న రత్నాకరుండు.'
(హరిశ్చంద్ర నలోపాఖ్యానము. 1-46)

హనుమత్కృపతో నితడు కవియయ్యెను. కనుక నితని కవితయెడ హను మంతున కధికారము కలదు తదధికారము పురస్కరించికొని, స్వప్నమున గనిపించి, 'ఈ హరిశ్చంద్ర నల కథాయుగ నిబంధ చిత్రబంధప్రబంధ మంకిత మొనర్పు రఘుభర్తకు' అని యాదేశించెను అట్లే రామరాజభూషణుడు తన యుపాస్యదైవతమగు నాంజనేయునకు నిష్టదైవతమగు శ్రీరామునకు దాని నంకితము గావించెను.

కాళికారహస్యమున నాంజనేయుడు 'సర్వవిద్యాసంపత్ప్రదాయకః వాగధీశః నవవ్యాకృతిపండితః' అని యుపశ్లోకితుడయ్యెను.

(శ్రీమ దాంజనేయాష్టోత్తరశత నామస్తోత్రము)

ఉపాసితదైవతగుణము లుపాసకునందు ఫలించునని లోకవిశ్వాసము. రామరాజభూషణుడు 'శ్రీరామచంద్ర చరణారవిందవందన పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్ర భాషాసామ్రాజ్యుడు.' తనయందు 'సర్వవిద్యాసంపద' 'వాగధీశత' పండించుకొనెను.

కావ్యనాటకాలంకారశాస్త్రాది పరిచితిలేశము లేక, కేవల 'శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారుడును', 'శతలేఖినీ పద్యసంధానధౌరేయుడు' నయ్యెనా?

మా యొద్ద మంత్రము లేదు, తంత్రము లేదని కుండ బద్దలు కొట్టిన తిరుపతి వేంకటకవు లొకచో రామరాజభూషణు నొరవడిగా గొని-

"మమ శ్రీమత్పరదేవతా మహిమ సంప్రాప్తాశుధారాకవి
త్వ మహత్త్వప్రథితప్రబంధ రచనాపారీణులన్ బండితో
త్తమ సంభావ్య శతావధానుల సమస్తప్రక్రియాప్రౌఢిమ
ర్గములన్ శ్రీపతి వేంకటేశ్వరుల జక్కంజూచి పల్కెం గృపన్.'

అన్నారు. (శ్రీనివాస విలాసము. 1-28)

సమాసగ్రథనము బట్టి పద్యము చెళ్లపిళ్లవారిదని చెప్పవచ్చు శాస్త్రిగారు నుదుట పెద్ద కుంకుమబొట్టు పెట్టి, మెడలో రుద్రాక్షమాల కట్టి, బెత్తము చేతబట్టి, మంత్రోపాసకులవలె గనిపింతురు. వారపుడపుడు చెప్పెడు పద్యములు గూడ అట్టి యభిప్రాయమును దృఢీకరించును.

'భూదారిణి స్త్రీవిదూషక విదారిణి అస్మదుపాస్య అమ్మహో
దారచరిత్ర యిట్టితల దా రచియింపకపోదు సాయమున్.'

(శతావధాన సారము)

ఇట్టి వేషభాష లొక ప్రయోజనము నుద్దేశించియే యవలంబించెడివారు. 'ఆంధ్రవాణి'లో వారు వ్రాసిన "అవధాని యెడల పృచ్ఛకులకు భయం కూడ వుండాలి" అన్నమాట మనము మఱవగూడదు.

'కేవల దైవకృప మాత్రము పనిచేయదు.' ఇది తిరుపతి వేంకటకవుల తీర్పు.

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు సభారంభమున – 'ఈ జామున నీ దయా ప్రతిభ చక్కగనుండవలెన్ మహేశ్వరీ! అని గురువుల వలెనే ఆ దేవికొక నమస్కారము చేసి రంగమున దిగిరి.

మద్దురుపాదులు శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిగారు అవధాన సభా ముఖమున 'శంకరు దస్మన్మనమం దఖండకవితాకారమ్మునన్ దోచుతన్' అని ధ్యానించిరి.

ఇది సంప్రదాయము.

ఈ యుపాసనాపర్వమునకు ముగింపుగా శ్రీ వేలూరి శివరామశాస్త్రి గారి పంక్తులు టంకించుచున్నాను :

'అట్టి సమయంలో ఏకాగ్రత ఒకటే శరణ్యము. దాన్నే శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు హయగ్రీవుడని అంటారు. చిదంబరశాస్త్రిగారు ఐతగణపతి అంటారు. మఱోరు అయితే సరస్వతి అంటారు.'

( ఆంధ్రవారపత్రిక. స్వర్ణోత్సవ సంచిక. )

--: o :--

# అవధాన విద్య ఓషధీ సాధ్యమా?

కవయిత కాగోరువాడు బ్రాహ్మ్యర్కమును ఆఱు నెలలపాటు సేవించినచో కృతార్థుడగునని 'అర్కప్రకాశము' నందు జెప్పబడినది.

'బ్రాహ్మ్య బుద్ధిప్రదశ్చార్కః షణ్మాసాభ్యాసతః కవిః'

(అర్కప్రకాశము. 3-91)

అప్పకవి, ఘటికాశత గ్రంథ కల్పనా సామర్థ్యము కలుగుట కొఱకు యోషధీ కల్పమును జెప్పినాడు.

సీ. కరకకాయలమీద గలుగు బర్బరయును
    బిప్పలిమూలంబు తిప్పతీగ
బ్రాహ్మియు శుంఠియు బావంచి విత్తన
    మ్ములు నపామార్గమ్ము మొదలివేళ్ళు
వాయువిశంగంబు లాయష్టిమధుకంబు
    సన్నపిప్పలియు నచ్చపు సముద్ర
పొడ విత్తనంబులు బోడతరంబును
    వలమూటి తుంగముస్తెలును వసయు

తే గీ. సమములుగ దూచి పొడిచేసి సంతతంబు
ప్రొద్దునను లేచి, నేతితో ముద్ద జేసి
కర్షమాత్రంబు భక్షింపగలిగెనేని
గడియ కొకపద్యశతకంబు సడువు టరుదె? (అప్పకవీయము. 2-431)

కవులగుటకు ఆశు కవులగుటకు మందులు తెలుపబడినవి. అష్టావధాన శతావధాన ప్రముఖ ధారణా ప్రధాన కార్యములును వానిచే సాధ్యము లనియే తద్రచయితల తాత్పర్యము. అసలు వాగ్దేవతయే స్వాధీన యగుట కింకొక కల్పము నప్పకవియే ప్రస్ఫుటముగా జెప్పినాడు.

సీ. చెంగల్వకోష్టును చిఱుత పిప్పలియును
మంచియోమపు బొట్టు మ్రానిపసుపు
మైపూత పసుపును మధుకంబు సైంధవ
లవణంబు చిత్రమూలంబు ఖరడు
జీలకఱ్ఱయు శుద్ధి జేసిన శుంఠియు
సమభాగములుగాగ సంతరించి,
చూర్ణంబు గావించి శుభ్రపటంబుపై
రాచి యాకిర్రింఁదను రాలినట్టి

తే. గీ. పొడుము నూతన ఘటములో నిడి ప్రభాత
సమయమున బ్రత్యహంబు నాజ్యమున మెదిపి
వేసరక చిన్నమెత్తు సేవించు నరుని
నాలుకను గాపురంబుండు నలువ చెలువ.

[అప్పకవీయము. 2-432]

ఇవిగాక కవయితల బుద్ధిబలము వృద్ధి బొందించు ద్రవ్యములు, క్షీణింప జేయు ద్రవ్యములు 'పాలలికములు' (మాంస సంబంధి పదార్థములు) కలవని చెప్పుదురు.

'మేక మెదడు బుద్ధికి బలమును దేహమునకు ఆరోగ్యము నిచ్చును.'
(వస్తుగుణదీపిక. పుట 653)

'పూరేడు (పిట్ట) మాంసము, పుంజు మాంసము, పక్షుల తల మెదడు తలకు మెదడికి బలమును ఇప్పించునవి.'
(యూనాని వైద్య దార్ఢ్యవృద్ధి బోధిని. పుట 225)

పశుపక్షి కీటకాదుల మెదళ్ళు మెదడుకు పుష్టి నిచ్చునని పైరీతిగా కొందరు భిషక్కులు వక్కాణించిరి. కాని, వీనిని గుఱించి పలువురకు సదభిప్రాయము లేదు. క్రూర స్వభావము గల పశుపక్షికీటకములయు, తెలివిలేని తిర్యగ్జంతువు లయు మెదళ్ళు తదన్యస్వభావఫలము నొసంగుననుట విశ్వాసపాత్రము కాదందురు.

బుద్ధివికాసము గలిగించు ద్రవ్యము లున్నట్లే బుద్ధిమాంద్యము గలిగించు ద్రవ్యము లున్నవని చెప్పబడెను.

శ్రీహర్షుని యసాధారణ మేధాశక్తి గుర్తించి, చూపోపక, అతని మేన మామ మాషధాన్య ప్రయోగము చేసెనట. తన చెల్లెలికి జెప్పి, అల్లునకు ప్రతి దినము మినుపగారెలో బూరెలో చక్కిలములో లడ్డులో విధిగా దినిపించు లాగున జేసెనట. ఒకనాడింటికి వచ్చి అల్లుడేమి చేయుచున్నాడని చెల్లెలి నడుగగా అల్లుడే సమాధాన మిట్లు చెప్పెనట:

'అశేష శేముషీ మోష మాష మశ్నామి మాతుల !' అని.

ఔషధములం, పశుపక్షికిృమికీటకాదుల మేదోమాంసాదులు, కవితాగంధ శూన్యులందు కవితావృక్షము మొలిపించి విస్తరిల్లజేయుట కల్ల మాంద్యము తగ్గించుటకు, చురుకుదనము హెచ్చించుటకు వానికి గొంత శక్తి కలదనుట నిజము.

'ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః'

—: o :—

# అవధాన విద్య అభ్యాస లభ్యమా?

'ఊరివెలుపలి నారికేరపుదోపులో తిరుపతి వేంకటకవులు తొలుత శతావధానము నభ్యసించిరి చెట్లు చేమలే పృచ్ఛకులు; సభ్యులు అవి నోరులేనివి కదా. వీరిద్దరిలోనే యొకరు వృక్షపక్షమున నిలిచి, పృచ్ఛించుట, రెండవవారు తత్ప్రశ్నము గ్రహించి ప్రథమపాదము చెప్పుట, తరువాత క్రమముగా నిద్దరు కలిసి పద్యములు పూర్తిచేసి, యప్పజెప్పుట చేసిరి. (జాతకచర్య పూర్వార్థము)

ఒకరే యభ్యసించునపుడు ప్రశ్నములు స్వతః కల్పించికొని, నాలుగావృత్తులలో నాలుగు పాదములు పూర్తిచేసి యప్పజెప్పికొనవలసియుండును.

నిర్జనవనమునకేగి పాదపముల ముందు నిలబడి పద్యము లల్లి చెప్పి యొప్పించుట కంటె, యింటిలోనే పండుకొని కనులు మూసికొని, మనవీథిలోని యిరువైపుల నుండెడి యిండ్లనే పృచ్ఛకులుగా భావించి, యొకొక్కపాదము చొప్పున పద్యములు చెప్పి యప్పగించుట సుఖదాయి.

సిసాధయిషువులు తమకే తోప యనుకూలించిన ఆ త్రోవ పాటించుట యుత్తమము

అభ్యాస మనినంతనే అదేదో ద్రావిడ ప్రాణాయామము వంటి కసరత్తని భావింపరాదు.

తిరుపతి వేంకటకవులు తమ ధారణ పరీక్షించుకొనుటకే కొబ్బెరచెట్ల నాశ్రయించిరి. ప్రకృతిసిద్ధమైన ధారణాశక్తిపీఠము వారి మేధోఽంతరమున బొనుగు వడకుండ విరాజిలుచుండెను.

విక్టోరియా మహారాజ్ఞి కాలమున THE TIMES పత్రికలో వార్తాహరుడుగా పనిచేసిన DE BLOWITZ అను మేధావి తన జ్ఞాపకశక్తి ప్రకృతిసిద్ధమనియు, దానికి శిక్షణ యక్కఱలేదనియు వ్రాసెను దానికి సూతగా తన చిన

నాటి ముచ్చట యొకటి వ్రాసెను అతని తండ్రియొద్ద బంగరుపొన్నుగల చేతి బెత్త ముండెనట. దానిని తన కిమ్మని కోరగా తండ్రియొక పరీక్ష పెట్టెనట. రేపటికి నీవు 'KOSROS THE WISE' కంఠస్థము చేసి నాకప్పజెప్పినచో ఇచ్చెదనని. అది Shakespeare's 'Hamlet' అంత గ్రంథమట మరుసటిదిన మత దనాయాసముగా ఆ గ్రంథమంతయు నప్పజెప్పి పొన్నుగఱ్ఱ గెల్చికొనెనట. ఈ రీతిగా ఇంట గెలిచి రచ్చ గెలిచెను.

(MY MEMOIRS By De Blowitz)

తిరుపతి వేంకటకవులను 'మీరు శతావధానము చేయగలరా?' యని కాకినాడ పౌరు లడిగినపుడు, రేపు చెప్పెదమని చెప్పిపోయి, నాటి కేళ తరుష డము జేరి పరీక్షించికొని వచ్చి చేయగలమనిరి మేధావులకు అభ్యాస ప్రయోగ కాలములు రెండును సమానములే. శ్రమయనునది వారికెప్పుడును నుండదు. అనాయాసముగ నీప్సితార్థము సాధింతురు.

"Ease and strength, effort and weakness go together"
(George Bernard Shaw)

'అనగ ననగ రాగ మతిశయిల్లుచునుండు
తినగదినగ వేము దియ్యగుండు'

నన్న వేమన సూక్తిలో నిజము లేకపోలేదు కాని, సంస్కారము లేని వాడెంత మొత్తుకొన్నను వానికి గాన కళా కౌశలము కలిసిరాదని మన మెఱుగుదుము. ఇక వేపాకు తియ్యగానుండుట యనుభూతమయ్యెనేని అది గుణము కాదు. తిక్తామ్ల కట్వాది రుచిభేదము గుర్తించు శక్తి జిహ్వ కోల్పోయినదని యర్థము.

'సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినురవేమ.'

సాధనము చేత కవితా ప్రజ్ఞతోడి ధారణాప్రధాన వృత్తియైన యవధానము మాత్రమందరు చేయజాలరు. అసలు వేమయోగి మాటలు యోగీశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మని——

'అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణచ గృహ్యతే.' (భగవద్గీత 6-35)

అను ప్రవచనమునకు వివృతిప్రాయము.

మేమును శతావధానము చేసెదమని చెప్పి,తప్పినవారింగూర్చి శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు చెప్పిన సీస పద్యము అనధికారుల యభ్యాస వైయర్థ్యమును సూచించుచున్నది.

సీ. నాలుగామడ దాట నా నేర్పు మీద నా
చేతగాదను నొక్కకోతిగాడు
ఎన్మిదామడ దాట నేనేర్తు మీద నా
చేతగాదను నొక్కకోతిగాడు
పదియామడైన నే బరతెంతు మీదనా
చేతగాదను నొక్క కోతిగాడు
పండ్రెండయిన నాదు పనిగాని మీద నా
చేతగాదను నొక్క కోతిగాడు

ఇట్లు పల్కుచునున్న కపీశ్వరులు శ
రములు వంపగ శతయోజనముల వార్ధి
దాటి వచ్చిన నిన్నెన్న దరమె మాకు?
నాంజనేయ! కవిధ్యేయ! యప్రమేయ! (నానారాజ సందర్శనము.)

అభ్యాసము వలన లాభమే లేదా? యన్నచో ఉన్నది.

అభ్యాస మవధాన శక్తిని ప్రసాదింపజాలదు. కాని, మదికి కుదురుపాటు నొసగగలదు. దానితో తత్తరపడక యవధానము నిర్వహించికొనుట కొక సౌలభ్య మేర్పడును. కొందర కభ్యాసము చాలనపుడు సభా కంపము, ఘర్మోద్గమము తప్పదు. శ్రీ చెళ్లపిళ్ల వారి వ్రాత చూడుడు:

6)

'చెబితే నమ్ముతారో లేదో గాని, కాకినాడ అవధానాన్ని ప్రారంభించేటప్పటికి అది చలి కాలమైనా వొళ్ళంతా చెమటతో తడిసిపోయింది అప్పటికి మాకింకా శాలువులు లేవు. సామాన్యమైన నూలు బట్ట పూర్తిగా కప్పుకొన్నాను. ఆ బట్టంతా తడిసిపోయింది. అతనికి (తిరుపతిశాస్త్రికి) మాత్రం ఈ అవస్థ కలగలేదు.'

(నేనూ మా తిరుపతి)

శ్రీ వెంకటశాస్త్రిగారు ప్రతి చిన్న విషయము చింతన చేసి నిత్యోపస్థితముగా మనసున బెట్టికొను స్వభావము కలవారు తిరుపతి శాస్త్రిగారు ఏ విషయమును గురించి ముందుగా నాలోచించెడివారు కారు. అదొకరకపు దొమ్మపొగరు. 'సొదు రేగిన తల పొలమున గాని నిలువ' దన్నట్లు కినిసినపుడు 'గోరీ కట్టింపనె కాకవిప్రతతి కర్థిన్ నేడు హేలాపురిన్' అని దట్టించుట వీరి స్వభావము. ఇట్టి వ్యక్తికి చెమట యెట్లు పట్టును?

అభ్యాసము వలన క్రమముగా సభా కంపము తగ్గును. మనస్స్వాస్థ్యమేర్పడును. నెమ్మదిగా నవధాన కార్యము నిర్వహించికొనవచ్చును.

—: o :—

# స్వప్నోపలబ్ధి

'ఇతి స్వప్నలబ్ధః' అను మాట అప్పయ్య దీక్షితుల వ్యాఖ్యాన గ్రంథము లందు అటనట గనబడును.

'పిళ్ళః కవి, రహం విద్వాన్' అన్నాడు.

వేదాంతదేశికులు పిళ్ళె. అప్పయ్య దీక్షితులు విద్వాంసుడు.

'పాదుకాసహస్రము' వ్యాఖ్యానించు సందర్భమున వ్యాసఘట్టములందు దేశికులు స్వప్నమున సాక్షాత్కరించి, నిజహృదయ మెఱిగించెడివారని. ఆ రీతిగా స్వప్నమున లభించిన విశేషార్థమును దీక్షితులు 'స్వప్నలబ్ధ' మని వ్రాసిపెట్టిరని ప్రతీతి కలదు.

స్వప్నములు సప్తవిధము లని మన పెద్దలు తెలిపిరి.

'దృష్ట శ్శ్రుతోఽనుభూతశ్చ ప్రార్థితః కల్పిత స్తథా
భావికో దోషజశ్చైవ స్వప్న స్సప్తవిధో మతః.' (స్వప్న ప్రకాశిక)

అప్పయ్య దీక్షితులు వేదాంతదేశికుల నర్థించి కలలో కానిపించికొని, కవ్యభిప్రేతమైన యర్థము దెలిసికొనెనని విశ్వసింతుమేని అది ప్రార్థితస్వప్నము.

స్వప్నలబ్ధ విషయములు ప్రకటించిన పాశ్చాత్య పండితులును లెక్కకు మిక్కిలిగా నున్నారు.

JOHANN M. SCHLEYER అను పండితు డొక విషయము గుఱించి చిరకాలము శ్రమించుచు, కొట్టుమిట్టాడుచుండగా నతని కొకనాడు స్వప్న ప్రబోధ లాభము కలిగెను. వెంటనే లేచి, యథాక్షరముగా తన మనశ్చక్షువునకు గోచరించిన విశేషములు వ్రాసికొనగలిగె నట.

VOLTAIRE, COLERIDGE మున్నగు మహనీయులు నిద్రలోనే పద్యములు రచించిరట. TARTINI సంగీత విద్వాంసుడు, నిద్రలోనే సంగీతపు మెట్లమర్చెడివాడట FRANKLIN కు రాజకీయ సమస్యల పరిష్కార మార్గము పలుమారు స్వప్నములందే తోచెడిదట KEKULE రసాయన పరిశోధకుడు స్వప్న ముఖమున లోకోపకార విషయము లనేకములు గ్రహించెనట.

(UNCONSCIOUS BRAIN WORK. page 39)

కుట్టుమిషను కనిపెట్టిన మేధాశాలి ఇలియాన్ హోవి. ఇతడు చచ్చిబ్రతికి యంత్రమంతయు నిర్మించి, సూదికి బెజ్జ మెక్కడ వేసినచో దారము నడచుట కనువుగ నుండునో తోపక, తల పగుల గొట్టుకొనుచుండెను. ఇట్లుండగా ఒకనాడు ఆతనికొక స్వప్నము వచ్చెను. ఎవరో కొంద రాటవిక సైనికు లతనిని నిర్బంధించి, 'మేమిచ్చిన గడువు లోపల నీవు కుట్టుమిషను తయారు చేయవలెను. లేకున్న నిన్ను చంపెద' మని రట. ఇత డాలోచించుచుండెను. గడువు తీరిపోయెను. సైనికులు శూలములతో చొడుప వచ్చిరి. వారి చేతులలోని శూలాయుధముల మొనల కించుక క్రిందుగా చిన్న బెజ్జముండెనట. ఇత డాబెజ్జము గనుగొని నంతనే గట్టిగా అఱచెనట. మెలకువ వచ్చెను. లేచి, సూది మొన కించుక క్రిందుగా చిన్న బెజ్జము వేసి, దార మెక్కించి, కుట్టెను. ఈ రహస్య మతనికి స్వప్నలబ్ధము.

(ఈనాడు, దినపత్రిక. 16-12-1979)

ఏతాదృశస్వప్నములు భావికములు.

నా సహపాఠి యొకడు స్వప్నలబ్ధివిషయము వ్రాసికొని వచ్చి నాకు జూపి నన్ను నచ్చెరువున ముంచెను. ఆ కథ యించుక వివరించెద.

నేను మూడవ ఫారము చదువుచుండగా, తోడి విద్యార్థి జంగంరెడ్డి బాల రంగారెడ్డి నాతో పోటీ పడుచుండెను. పరీక్షలలో మా తారతమ్యము-నేను ప్రథముడు, ఆతడు ద్వితీయుడుగా నుండెను. ప్రాథమ్యము తనకు రావలెనని పట్టుదలతో చదువుచుండెను. ఒకనా డతడు నాకొక కాగితము జూపెను. చూచి యాశ్చర్యపడితిని. నా నోట్సు అతనికి జూపెడివాడను గాను. నేను విశేషపరిశోధనచేసి అపూర్వ విషయములు కొన్ని సేకరించియుంటిని. అర్జునునకు పాశుపతము వలె నా నోట్సు నాకు అండగానుండెనని మురియుచుంటిని. అతడు చూపిన

కాగితమున నా నోట్సులోని వస్తుసంతయు నుండెను ఇదెట్లు సాధ్యమయ్యెను ? అతడీవస్తువు గురించి తీవ్రముగ నాలోచించుచుండెను. ఒకనా డతనికి స్వప్నమున తెల్లని దుస్తులు ధరించిన సాధు వొకడు పొడసూపి, యేదో చెప్పెనట. డగ్గున లేచి దీపము వెలిగించి తదుక్తవిషయము వ్రాసికొనెనట ఆ కాగితమే నాకు జూపెను. అతడు ఋజువ్యక్తి. సత్యవాది. పాపము, విద్యార్థి దశయందే జలగండమున పంచత్వము బొందెను.

మనోలక్షణము చిత్రమైనది. మన మొకవ్యక్తితో మాటాడుచుందుము. మన సొక విషయము నాలోచించుచుండును. యౌగపద్యముగా రెండు క్రియలును జరుగుచున్నవి మనము మాటాడుచున్నపు డేమనస్సు ఆలోచించుచున్నదో, ఆ మనస్సు మనము నిద్రపోవునపుడు గూడ ఆలోచించుచున్నది. ఒక విషయము హఠాత్తుగా స్ఫురితమై మెలకువ వచ్చును. ఇది సహజము. ఎవరో యొక అపరిచిత వ్యక్తి సాక్షాత్కరించి, యే మహా విషయముయొక్క మూలము చిక్కక నీవు క్లేశపడు చుంటివో, ఆ మహావిషయమూలము కరతలామలకముగా నీకు జెప్పి వేయుట, ఆ చెప్పబడిన సుదీర్ఘవాక్యపంక్తులు, నిద్ర లేచి నీవు కాగితము మీద వ్రాసికొనునంత పర్యంతము జ్ఞప్తియందుండుట ఆశ్చర్యకర విషయము.

ప్రశ్నోపనిషత్తు జీవుడు స్వప్నమున దర్శించు విషయములు వివరించు చున్నది.

'అత్రైష దేవః స్వప్నే మహిమాన మనుభవతి. యదృష్టం దృష్ట మను పశ్యతి. శ్రుతం శ్రుత మేవార్థ మనుశృణోతి. దేశ దిగంతరైశ్చ ప్రత్యను భూతం పునఃపునః ప్రత్యనుభవతి. దృష్టం చాదృష్టంచ శ్రుతం చాశ్రుతం చానుభూతం చాననుభూతంచ సచ్చాసచ్చ సర్వం పశ్యతి సర్వః పశ్యతి '

(ప్రశ్నోపనిషత్తు చతుర్థప్రశ్నము 5 )

పరిత దృష్ట విషయములు క్రమ్మర విరుద చూచుట సరే. అపరిత విష యములు, అదృష్టవిషయములు విరుటచూచుట యున్నదనియే ఉపనిషత్సిద్ధాంతము

అవధాని క్షణకాల నిమీలితనేత్రుడై ప్రార్థిత భావిక స్వప్నఫలములను గ్రహింపగలడు.

—: o :—

# ఏకసంధాగ్రహణము

ఏకసంధాగ్రహణ విద్య కొందఱికి పుట్టుకతో వచ్చును. విన్నదానిని విన్నట్లు తత్క్షణమే చెప్పగలరు.

ఒక యుపన్యాసము విన్నాము. తతఃక్షితిక్రమముద్ర ధీసంపుటియందు ఆర్ద్రముగనుండును కనుక అపుడే దాని నావిష్కరించుట సులభము. దాని మీద నూత్నఫణితిముద్రలు పడినచో అది శిథిల మగుటయో అథరస్థ మగుటయో సంభవించును.

**De Blowitz** అను నతడు ఒక పనిమీద, నొక కార్యాలయమున కేగి, తదధికారి వినిపించగా, ఒక ఫైలులోని సమాచారమంతయు నవహితుడై వినెను. శ్రుతవిషయము, పదవాక్య క్రమబద్ధముగ, పరమ జాగరూకతతో మెదడున భద్రపఱచికొని, హుటాహుటి రైలు స్టేషనుకుబోయి బండి యెక్కెను. స్మృతి ముద్ర చెడునను భయముతో, తనకు వీడుకో లీయ వచ్చిన మిత్రులతో సయితము మాటాడినవాడు కాడు. బండి కదలినంతనే తన మెదడు తలుపు దెఱచి, శ్రుత విషయము - అక్షరము పొల్లుపోకుండ - తన కార్యదర్శికి అప్పగించెను. అతడు తన పాటు నిట్లు లుట్టంకించెను.

**"I was afraid of forgetting the preamble if my attention were diverted by conversation" (MY MEMOIRS)**

ఇత దేకసంధాగ్రాహి. ఒక సభలో నొకవక్త యుపన్యసించుచుండగా విని, యింటికి వచ్చి, కనులు మూసికొని, ఆ సభారంగమును ఆ వ్యక్తిని ప్రత్యక్షీకరించుకొని, ఉపన్యాసమంతయు నట్లే వ్రాసిపెట్టగల దిట్ట.

నైషధకావ్యకర్త శ్రీహర్షుడు నీళ్ళబావి దగ్గర జరిగిన ఆడువారి జగడము, రసగంగాధర గ్రంథకర్త జగన్నాథపండితుడు గుఱ్ఱపురౌతు మావటీంద్ర జగడము తమ చెవిలో పడినది పడినట్లు వినిపింపగలిగిరని కథ లున్నవి. వీరు విన్నది

స్వకీయ భాష కాదు- పరకీయభాష. అయినను దాము విన్న శబ్దవితానము నప్ప గింపగలిగిరి.

డాక్టర్ జాన్ లీడెన్ ఒక్కసారి విన్నచో ద్రాఘిష్ఠమైన పార్లమెంటు వ్యవహారము గాని, డాక్యుమెంటు గాని తిరిగి అప్పజెప్పగలిగెడివాడట.

శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు కోర్టులో జెప్పిన యేబది తావుల సాక్ష్యము యథాక్షరముగా గ్రమ్మర నప్పగించుట ప్రత్యక్షవిషయము.

(ఆంధ్రపత్రిక. వారపత్రిక. స్వర్ణోత్సవ సంచిక)

సెనెకా, సుగృహీతనామధేయుడైన వేదాంతి, తన చదువుకొనెడునాళ్లలో ఒకసారి, వివిధ విద్యార్థులు చదివిన పరస్పర సంబంధము లేని, రెండు వందల పద్యములను విని, తుదినుండి మొదటిదాక, అనగా 200, 199, 198, 197, 196, 195 ఈ రీతిగా విలోమక్రమమున జెప్పెనట.

ఈ వేదాంతి మఱియొక విశేషము దెలిపెను. ఒక కవి తన వ్రాసిన పద్యములు తెచ్చి చదివెనట శ్రోతలలో నేకసంధాగ్రాహి యొకడుండెనట. వాడు కవిని బట్టికొని, ఆ పద్యములు తనవని తగవులాడెనట. న్యాయమెవరు చెప్పగలరు? వ్రాసిన కవి తన పద్యములను కాగితము చూచి కాని చదువలేడు. శ్రోత కాగితము చూడకుండ చదువుచున్నాడు.

సరిగా అట్టి సంఘటనమే తిరుపతిలో శ్రీ పనప్పాక మనంతాచార్యులవారింట జరిగినది. ఒక విద్వాంసు డక్కడ స్వరచితశ్లోకములు వినిపించుచుండెనట మాడ భూషి వేంకటాచార్యులవారు ప్రక్కనుండి వినుచుండిరట. విని, 'అయ్యా ! యీ శ్లోకములు చిన్ననాడు మా నాయనగారు చెప్పిరి. ప్రాచీనకవికృతము లయిన యీ శ్లోకము లనంతాచార్యులవారెఱుగరు గదా యని యాత్మీయములుగా జదువ నారంభించితి రా ?' యని యాక్షేపించిరట ఆ పండితుడు కినిసి, పెదనవ్వు నవ్వి, 'ఏదీ ? నీకు వచ్చునేని చదువు' మని తుటాయించెనట. మాడభూషివా రాశ్చర్య కరముగా తచ్ఛ్లోకములు గడగడ చదివివేసిరట

(కవిప్రశంసా స్తబకము చాటుపద్య మణిమంజరి 2 భా)

షెక్స్పియర్ కవి మిత్రుడు బెన్‌జాన్‌సన్ మనీషి తన రచించిన పది నాటకములు తనకు కంఠస్థములే యనెను.

శంకరవిజయమున — 'కేరళక్ష్మాపాలో యతిసార్వభౌమసవిధం ప్రాప్య, ప్రణమ్యాంజసా, లబ్ధ్వా తస్యముఖాత్ స్వనాటకవరా జ్ఞానందపాథోనిధౌమజ్జం స్తత్పదపద్మయుగ్మ మనిశం ధ్యాయన్ ప్రతస్థే పురీమ్.' అని యున్నది.
(శంకర విజయము. చతుర్థ సర్గ 175 శ్లో.)

ఆ భూవరుడు శంకరభగవత్పాదుల సన్నిధిలో నెపుడో తన నాటకత్రయ మును విన్పించియుండెనట. ఆ నాటకము లుత్సన్నములు కాగా, రాజు దిక్కు తోపక శంకరుల శరణు జొచ్చెనట. శంకరులు పూర్వశ్రుత రాజకృత నాటక త్రయమును నిజస్మృతిపథమునుండి వెలికి దీసి యనుగ్రహించిరి.

మహామేధావుల కిది క్రీడాప్రాయము. ఆ తేకు కదలించినచో గ్రంథ మంతయు నందుండును.

సామాన్యమేధావు లించుక పౌర్వాపర్యము నెమకి చూచి చెప్పగలరు. స్మృతిచక్రమున గతచరిత్రపాఠము చుట్టబడియుండును. ఆ చుట్టలు పొరలు పొరలుగా నుండును. ఏదైన నొకవిషయము కావలెనన్నచో సూటిగా నదే దొరకదు. తత్సంబంధియైన పొరదీసి అదినుండి చదువవలెను. మనకు గావలసిన విషయ మెక్కడ ప్రసక్తించునో అక్కడ నాగి గ్రహింపవలెను. బడి పిల్లకాయను బిలిచి, ఇరువదియాఱులెంతరా? యని యడిగినచో వాడు తటాలున జెప్పలేడు. ఇరువదవ యెక్కమును మొదలు పెట్టి, $20 \times 1 = 20$, $20 \times 2 = 40$, $20 \times 3 = 60$, అని వరుసగా వల్లించుచు, $20 \times 6 = 120$ ఇక్కడ ఆగును. అదొక పొర. పొరలో నొకరేకు స్మృతి చక్రమునుండి దానిని బట్టికొని చదువవలెను. అపుడే కావలసిన వస్తువు లభించును.

వివరణ మిది :-

**"When he wished to recollect a particular point in any thing which he had read, he could do so only by repeating**

to himself the whole from the commencement till he reached the point which he wished to recall "

(THE SCOPE OF MEMORY – P. 47)

భోజమహారాజు నా స్థానమున ముగ్గురు పండితులుండెడివారట. ఒకడు ఏకసంధాగ్రాహి. ఒకడు ద్విసంధాగ్రాహి. ఒకడు త్రిసంధాగ్రాహి. ఎవడైన రాజ సందర్శనము చేసికొని తన శ్లోకము వినిపింపగూడదు. వెంటనే యేకసంధా గ్రాహి లేచి, 'ఓహో! ఇది ప్రాత శ్లోకము. నాకు వచ్చును. విను'డని చదివెడి వాడట. అవునవు నిది ప్రాతశ్లోకమే, నాకును వచ్చునని ద్వి సంధాగ్రాహి చదివెడి వాడట. వాని తర్వాత ముమ్మాఱు వినుటచే ధారణ స్థిరపఱచికొన్న త్రిసంధా గ్రాహి లేచి తానును జదివెడివాడట. వచ్చిన కవి తెల్లమొగము వేసి వచ్చినదారి బట్టెడివాడట. కథ యిట్లుండగా కాళిదాసు వచ్చెనట. ఆయన మీద గూడ ఈ ముగ్గురు అదే ప్రయోగము జేయ జూచిరట. కాని, అది సాగలేదు. పరిస్థితి యెఱిగినవాడు గనుక కాళిదాసు యోజించికొనిపోయి, ధారణకు ఒదిగిరాని యయో మయపు గ్లిష్టశ్లోకపు బండ ఆ పండితుల నెత్తిన వేసి నవ్వెనట. ప్రాణము పోక వారును నవ్విరట. రాజు నిజము గ్రహించెనట ఈ పుక్కిటి కథలో చమత్కారము కంటె యాథార్థ్యమే యధికముగా నున్నది.

ఏకసంధాగ్రాహికిని కొన్ని మ్రింగరాని ముద్దలుండును

అష్టాదశ శతాబ్ది మధ్యమీయ కాలమున Macklin అను ప్రసిద్ధ నటుడు తా నేకసంధాగ్రాహినని యుపన్యసించుచుండగా, Foote అనునత డెదుర్కొని యీ క్రింది వాక్యములు వ్రాసి, పరీక్షార్థ మిచ్చెను:

"So she went into the garden to cut a cabbage-leaf to make an apple-pie; and at the same time, a great she bear coming up the street, pops its head into the shop. 'What! No soap? So he died, and she very imprudently married the barber; and there were present the picninnies, and the Jobillies, and the Garynles, and the Grand Panjandrum himself, with the little round button on top; and they all fell to playing the game if catch-as-catch can, till the gun powder ran out of the heels of their boots." (MEMORY EFFICIENCY AND HOW TO OBTAIN IT – P. 36)

పై పంక్తు లొకసారి చదివికొనెను. కాని, Mackiin తిరిగి చెప్పలేక పోయెనట. Foote కల్పించియిచ్చిన వాక్యజాలమట్టిది :

కాళిదాసు చెప్పెనన్న శ్లోకమెట్టిదో చూడుడు

శా॥ వాశ్చారేర్ధ్వజ దగ్ధృతోద్వధిపతిః కుద్రేర్ధ్వజాని ర్గణే
ద్గోరా డారు డరః సరే డురుతర గ్రైవేయకబ్రాడరమ్
ఉడ్వీర్ద్రు జ్నరకాస్థిర్భ క్రిర్భృగిభే డార్ద్రాజినాచ్ఛచ్ఛవిః
సస్తాదంబు మదంబుదాలి గళరు గ్దేవో ముదే వో మృడః.

ఫూట్ ప్రకల్పిత వాక్యజాలమున అర్థగతమైన క్లిష్టత యున్నది. కాళిదాసీయ శ్లోకమున శబ్దగతమైన క్లిష్టత యున్నది.

రచనలో నెంత యార్జవముండిన నేక సంధాగ్రహణమున కంత యనుకూలముగా నుండును

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగా రన్నమాటలు : 'ఏవో కొన్ని పద్యాలు మాత్రమే యేక సంధకు వస్తాయి గానీ, అన్నీ రావు. అర్థంతెలిసేవైతే రావడాని కభ్యంతరం వుండదు ' (కృష్ణాపత్రిక. జూన్ 1936)

ఆదిశంకరాదుల యేక సంధాగ్రహణ శక్తి అసాధారణము. సాధారణ మేధావంతులు అర్థవంతములైన పద్య గద్యబంధముల నొకసారి విన్నంతనే స్మృతి ఫలకమున నిలిపికొనగలరు. శ్రీహర్ష జగన్నాథ పండితుల కథ వేఱు. అర్థరహితములు, అన్యభాషా నిబంధములు గ్రహించి, అనులోమ ప్రతిలోమ క్రమమునగూడ జెప్పగలిగిన మేధిష్ఠులు. అట్టి శక్తి జన్మతస్సిద్ధము అర్థాన్వయముల ఋజిమ బట్టి యేకవార శ్రవణ మాత్రమున గ్రహించి తిరిగి యప్పగింపగలవారు- ప్రధానముగా ఛందోధారపై నాధారపడువారు- ప్రతిభాచతురాననులు. రామరాజ భూషణుడు. శిష్టు కృష్ణమూర్తి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, పిసుపాటి చిదంబరశాస్త్రి. గడియారము వేంకటశేషశాస్త్రి ప్రభృతులీ తెగవారు.

ఈ యిరుదెగలవారు గాక, మూడవతెగవారు కొందరున్నారు వీరి ధారణా శక్తికి మూలము పాండిత్యము కాదు, ప్రతిభ కాదు, అభిరుచి.

పసిబిడ్డలకు జ్ఞాపకశక్తి స్వల్పము ఇంచుకసేపటిలోనే వారికి మఱపు కలుగును. ఆడుకొనెడు వస్తువు లెక్కడబడిన అక్కడ వేసి వత్తురు. అడిగినచో దిక్కులు చూతురు అట్టి బిడ్డలకు, రేపు సాయంకాలమున సినిమాకు బిల్చికొని పోదుమని చెప్పితిమా, మనము మఱచినను వారు మఱువరు. సరిగా ఆ వేళకు

సినిమాకు రమ్మని పట్టి పీడింతురు రేపు పూలచెట్లకు నీళ్ళు తోడి పోయుడని చెప్పి, మనము గ్రామాంతరము వెళ్ళినచో ఆ పని చేయరు. ఏమిరా? అని అడిగినచో, మఱచిపోయినామందురు. దేనియం దభిరుచి యుండునో దానిని మఱువరు.

మఱియొక విశేషము కలదు. సినిమాకు బోయి వత్తుము. వచ్చి నిద్ర పోదుము. తెల్లవాఱినంతనే పిల్లవా డొకపాట పాడుచు నిద్రలేచును. ఆ పాటలోని యర్థము వానికి దెలియదు. ఆ పాట నిన్నటిరేయి సినిమాలో ఒక్కసారే విన్నాడు. వాని కెట్లు నోటికి వచ్చినది? పాట వట్టి సాహిత్యము కాదు. సంగీతమూలము. సంగీతాత్మ కలవానికి ఆ పాటయొక్క మూలద్రవ్యము మిత్రము. అది వచ్చి, అయస్కాంతమున కయోరజము వలె నంటికొనును. సరి. పసివాని యెదదను బట్టికొన్నది సంగీతమే కదా, సాహిత్యము కూడ వల్లింపగలుగు టెట్లు? సంగీత మనెడి సూత్రము సాహిత్యపుష్పకదంబమును బట్టికొనియున్నది. దారమును లాగినచో తత్సూత్రసంలగ్నపుష్పకదంబము కదలి వచ్చుటలో చోద్యమేమున్నది?

ఒకని బుద్ధి గణితమును పప్పుబెల్లముగా భావించును. ఎన్ని యంకెలైన గుర్తు పెట్టుకొనును. ఏ లెక్క చెప్పినను చిటుకలో చేసివేయును. అట్టి వ్యక్తికి గణితసంబంధివిషయములు స్మృతియందు గట్టిగా నిలుచును. తొలగిపోవు.

ఒక వృద్ధుడు - ఏబదేండ్ల క్రితము పేరయ్య పెండ్లిలో జరగిన సంగతులు, సూరయ్య వడుగులో జరగిన సంగతులు పూస గ్రుచ్చినట్లు చెప్పును. జ్ఞప్తి పెట్టుకొనదగిన విశేష మొక్కటియు నుండదు కాని యేకరువు పెట్టి చెప్పుకొనుచు బోవును. ఇట్టి వ్యక్తుల గుఱించి, J Louis Orton యిట్లన్నాడు-

"Some persons have had remarkable memories who have been almost idiots" (MEMORY - EFFICIENCY)

వీరు పురాణము వినరు హరికథలకు బోరు. సద్గోష్ఠి కిలకింపరు క్షుద్రమలైన గృహచ్ఛిద్రములు, పొరుగింటి సుద్దులు-వీనియందే వారి యభిరుచి. పంది బురద మెచ్చు

ఒక విద్యార్థి సినిమాతారల జన్మతిథులు జ్ఞప్తి పెట్టుకొనియుండెనట. పేరు చెప్పిన జాలు, తత్క్షణమే తద్విలాసినీజన్మతిథి చెప్పివేయునట. కాని, తన పాఠ్యగ్రంథసందర్భమున, బాబరు దండయాత్ర చేసిన దెపుడని యడిగినచో చెప్పలేడట. రుచిభేదమున కుదాహృతిగా డాక్టర్ యస్ కల్యాణరామన్‌గారు పై విద్యార్థి విషయము బేర్కొనిరి. ROBERT LYND-"We forget only un-plesant things" (FORGETTING)అన్నాడు.

మణిపాల్‌లో మెకానికల్ ఇంజనీరింగ్ చదువుచున్న సాంకేతిక విద్యాశాలా విద్యార్థి మహాదేవన్ అనునతని మేదస్సు కంప్యూటరును మించినదని పాత్రికేయులు స్వయముగ పరీక్షించి ప్రకటించిరి ఆ ప్రకటన సారమిది-

'ఎంతటి వేల సంఖ్యలను ఎటుత్రిప్పి యెటు ఇచ్చినా ఈయన అవలీలగా తిరిగి చెప్పగలరు. ఎన్నిరోజుల తరువాతనైనా వీటిని ఏ రూపంలో కావాలంటే ఆ రూపంలో చెప్పగలరు రైల్వే టైమ్ టేబుల్‌ను ఒక్కమారు చూచి తిరిగి ఒక్కసెకనులో మననం చేసుకు చెప్పగలరు. అంతేకాదు. 1877 మార్చి 15 వ తేదీన మెల్‌బోర్న్‌లో ఇంగ్లండ్ ఆస్ట్రేలియా జట్లకు జరిగిన క్రికెట్ ఆట వివరాల దగ్గరనుంచి, ఇప్పటివరకు అన్ని క్రికెట్ ఆటల వివరాలు గడగడా తడుము కోకుండా చెప్పగలరు '

(ఈనాడు. దినపత్రిక. 10-9-1977)

ఈ సాంకేతిక విద్యార్థి జ్ఞాపకశక్తి పట్టి అంకెలకు సంబంధించినది. అంకె లనెడి యిష్టికల మీదనే ఈతని స్మృతిసౌధము నిలబడుచున్నది. అంకె లతని ప్రాణబంధువులు.

లూయిస్ ఫెర్రి హోజిర్ క్రీ. శ. 1634-1708 ప్రాంతీయుడు. ఆ కాల మున ఫ్రాన్సులోని ఉన్నత కుటుంబాల వంశ వృక్షాలన్ని జ్ఞప్తిలో ఉంచికొని యుండెడివాడట. అతనికి తన నాలుగవయేట అంధత్వము తటస్థించెనట తదారభ్య అతని జ్ఞాపకశక్తి యినుమడించెనట గ్రుడ్డివారి గురి గుఱుతు మీదనే యుండును.

కొందరికి రాజ వంశములందు, తత్తుల్య సంపన్న కుటుంబములందు నిర్వ్యాజపు భక్తిప్రపత్తులుండును. ఆయిండ్లలో నవతరించు వారందరు పుణ్యాత్ము లైన మహా పురుషులని వారి తాత్పర్యము. 'శుచీనాం శ్రీమతాం గేహే యోగ భ్రష్టోఽభిజాయతే' అన్నాడు గదా, గీతాచార్యుడు. అందుకే 'పుత్రడి గలవాని పుండు బాధయు గూడ వసుధలోన జాల వార్తకెక్కు' అన్నాడు వేమన్న. ఇట్టి వార్తలకు చెవి కోసికొనెడివారిలో లూయిస్ ఫెర్రి హోజిర్ గణనీయుడు

ఈ తెగవా రభిరుచి వ్యగ్రత చేత ఏకసంధాగ్రాహు లగుచున్నారు.

ఏకవారశ్రవణ మాత్రమున ప్రతి వ్యక్తి యొక్క మేధా గగన మండల మున, అది మాట గాని, పాట గాని, పద్యము గాని, మంత్రము గాని, పట్టి ధ్వని గాని సౌస్థిత్య మెనయుచున్నది. దానిని గ్రహించి, తిరిగి ప్రదర్శించుటకు తేజ స్వినియైన మనశ్శక్తి కావలెను తచ్ఛక్తి తారతమ్యము బట్టి ధారణాతారతమ్యము గోచరించుచున్నది.

—:o:—

# అవధాన శబ్ద విచారము

'చిత్తైకాగ్ర్య మవధానమ్' అని వామనాచార్యుడు నిర్వచించెను.
(కావ్యాలంకార సూత్రవృత్తి. 3-17)

ఈ సూత్రమునకు వృత్తి నిట్లు కల్పించెను :

'చిత్తైకాగ్ర్యం బాహ్యార్థ నివృత్తి స్తదవధానమ్.'

'అవహితం హి చిత్త మర్థాన్ పశ్యతి.'

బహుముఖము చపలము అయిన చిత్తము కుదుటబడి యొకచో నిల్చుటయే అవధానము. అవధానము పొందిన చిత్తమే అసలు విషయము నవలోకింప గలుగును.

ఆ యవధాన మెట్లు సిద్ధించుననిన -

'త ద్దేశ కాలాభ్యామ్' అనెను. (కా.సూ.వృ. 3-18)

దేశకాలము లెట్టి వనిన -

'వివిక్తో దేశః' .... 3-19)

'రాత్రియామ స్తురీయః కాలః' అనెను. .... 3-20)

'వివిక్తో నిర్జనః రాత్రే ర్యామో రాత్రియామః ప్రహర స్తురీయ శ్చతుర్థః కాల ఇతి. తద్వశా ద్విషయోపరతం చిత్తం ప్రసన్న మవధత్తే' అని వృత్తి.

నిర్జనప్రదేశము, చతుర్థయామము అవధాన సాధనములు.

గోపేంద్రభూపాలుని కామధేనువ్యాఖ్య కాలదాసుని - 'పశ్చిమా ద్యామినీ యామా త్ప్రసాదమివ చేతసా' అనుపంక్తిని, మాఘుని 'గహన మపర రాత్రప్రాప్త బుద్ధిప్రసాదాః కవయః ఇవ మహీపా శ్చింతయం త్యర్థజాతమ్' అను పంక్తిని నుదాహరించి, తెల్లవారుజామున జిత్తమున కవధానము కలుగుటయు, తత్సమయ మున కవులు రచన పట్ల నవహితు లగుటయు సూచించెను.

పై విషయము మనసులో బెట్టుకొనియే 'శబ్దార్థ కల్పతరువు' అవధానము మనోయోగ మనెను.

'ప్రమాదోఽనవధానతా' అని అమరసింహుని కూర్పు. ప్రమాదికానివా డవధాని.

యాదవ ప్రకాశుడును 'తంద్రా కౌసీద్య మాలస్యం ప్రమాదోఽనవధానతా' అనియే కూర్చెను. (వైజయంతి)

ప్రాచీన గీర్వాణాంధ్రకవు లందరు అవధానశబ్దము నీయర్థముననే ప్రయోగించిరి.

భవనేత్రవహ్ని మదనుని భస్మీకరించెను. రతి మూర్ఛిల్లెను. సభూత గణముగ భూతపతి యంతర్హితుడయ్యెను. పార్వతి తండ్రియొద్ద కేగెను. అట్టి శూన్యస్థలమున కన్నుదెఱచి రతి పతికొఱకు చూచినది. తత్సందర్భమున కాళిదాసు-

'అవధానపరే చకార సా ప్రళయాన్తోన్మిషితే విలోచనే
న వివేద తయో రతృప్తయోః ప్రియ మత్యన్త విలుప్తదర్శనమ్ '
(కుమార సంభవము. 4-2)

అని వ్రాసెను. 'అవధానం పరం ప్రధానం యయో స్తేఽవధానపరే దిదృక్షయాఽవహితే చకార' అని మల్లినాథసూరి వ్యాఖ్యానించెను.

గీతాసక్తిచే క్షుధను సహితము పరిగణింపని మృగీకదంబమును భారవికవి యిటు లభివర్ణించెను :

'కృతావధానం జితబర్హిణధ్వనౌ సురక్త గోపీజన గీతనిస్స్వనే
ఇతం జిఘత్సా మపహాయ భూయసీం న సస్య మభ్యేతి మృగీకదంబకమ్.'
(కిరాతార్జునీయము. 4-36)

మల్లినాథసూరి 'కృతావధాన మేకాగ్రచిత్త' మని వ్యాఖ్యానించెను.

లవచంద్రకేతులు తారసిల్లినపుడు పరస్పరము స్నిహ్యామాణులగుట రూపించుచు భవభూతి యిట్లు వ్రాసెను :

'మమైతస్మిన్ దృష్టే హృదయ మవధానం రచయతి.'
(ఉత్తరరామచరిత నాటకము. 5-16)

'అవధానం వ్యాపారాంతర రహితతామ్' అని శ్రీ వాధూల వీరరాఘవాచార్యుల వ్యాఖ్యానము.

విద్యానాథుని నాటక ప్రకరణమున అవధానశబ్దము సుప్రయుక్తము.

నటీ:- 'సంగీత సారస్స మహణ్ణవో ఉవ్వేళ్ళ ఇ. అవహాణ జానపత్తం ఆరోహదు అజ్జో.' (ఛాయ. సంగీత సారస్య మహార్ణవ ఉద్వేల్యతే. అవధాన యానపాత్ర మారోహత్వార్యః') (ప్రతాపరుద్రీయ నాటకప్రకరణమ్.)

నన్నయ భట్టారకుడు -'దత్తావధానులరై వినుండు?' అనెను.
(శ్రీమదాంధ్ర మహాభారతము. ఆది. 1-31.)

తిక్కన సోమయాజి - 'అవధానంబుతో నవధరింపుము.' అనెను.
(శాంతిపర్వము. 1-14)

ఎఱ్ఱాప్రెగ్గడ - ఉదంకుడు దుంధుండను రక్కసుని వధింపుమని బృహదశ్వుని వేడు సందర్భమున ఈ పద్యము రచించెను.

అతులిత విష్ణుశక్తి సముపాహితమూర్తివి గమ్ము లెమ్ము, సం
తత భుజశక్తి నిట్టి యవధాన మొనర్పగ నీవ కాని యీ
క్షితి నితరుండులే దధికకీర్తియు బుణ్యము జేరునిన్ను నూ
ర్జితగుణ! యింతవట్టు దగ జేయుము కావుము లోకమంతయున్.
(అరణ్య పర్వము. 4-387)

శ్రీనాథుడును "విశ్వావసు ప్రధాన నానా గంధర్వ జేగీయమాన భుజావధానుండై" గరళగ్రీవుడు ఆడెన్ దాండవ మని రచించెను.
(భీమేశ్వర పురాణము. 4-147)

అల్లసాని పెద్దన-స్వరోచి 'మృగయాకుతూహలోల్లాసమునన్ జరించె జల లక్ష్యవిభేద విధావధానుడై' అని రచించెను. (మనుచరిత్ర. 6-85)

తెనాలి రామలింగకవి- 'అవధానంబుననుండి శంకరకథావ్యాసక్తి భాసిల్లుచున్' అని రచించెను. (ఉద్భటారాధ్య చరిత్ర. 1-23)

పుష్పగిరి తిమ్మన "శ్రీమదంజనాతనయ దయారస లసత్కటాక్ష వీక్షా మహత్త్వ సంప్రాప్తకవిత్వ విద్యావధానకవి." అని గద్యయందు రచించెను. (శతకత్రయము.)

'సావధానస్య కవేః దూషణం భూషణాయతే.' క్షేమేంద్రుడు కవికి అవధాన మవసర మనెను. (ఔచిత్య విచార చర్చ)

తిరుపతి వేంకటకవులు 'స్థైర్యములేని చిత్త మవధాన మెఱుంగని సత్కవిత్వము. ...... .... అసారము' అనుట మీది క్షేమేంద్రోక్తికి వివృతిప్రాయము.

శార్ఙ్గదేవుడీ యవధానము వాగ్గేయకారకునకును అవసర మనెను.

'రోషద్వేష పరిత్యాగః సార్ద్రత్వ ముచితజ్ఞతా
అనుచ్ఛిష్టోక్తి నిర్బంధో నూత్నధాతు వినిర్మితిః
పరచిత్త పరిజ్ఞానం ప్రబంధేషు ప్రగల్భతా
ద్రుత గీత నిర్మాణం పదాంతర విదగ్ధతా
త్రిస్థాన గమకప్రౌఢి ర్వివిధాలప్తి నైపుణమ్
అవధానం గుణై రేభి ర్వరో వాగ్గేయకారకః'

(సంగీత రత్నాకరము.)

సర్వంకష వివేకముతోడి యేమఱుపాటులేని దృష్టి యేదో అది అవధానము.

'శతలేఖిన్య పధాన పద్యరచనా సంధాసుగత్రాణ చిహ్నితనాముడు' చరిగొండ ధర్మసుకవి.

'సకల భాషావిశేష నిరుపమానావధాన శారదామూర్తి' భట్టుమూర్తి

'శతఘంటావధాన ప్రసిద్ధుడు' మఱింగంటి సింగరాచార్యుడు.

'అష్ట ఘంటావధాన విశిష్ట బిరుదుడు' హరిభట్టు.

'అష్టావధాన కలిత శతలేఖినీపద్యగద్యశక్తి పాటిమీఱిన'వాడు రేటూరి రంగరాజు.

చరిగొండ ధర్మన్న మొదలు ఇటీవలి కవులు వాడిన యవధానశబ్దము యొక్క యర్థము వేఱు

ఎఱ్ఱన్న 'ఇట్టి యవధాన మొనర్పగ నీవ కాని యీ క్షితి నితరుండు లేడు' అన్నచోట హెచ్చరికతోడి కార్యమని అవధాన శబ్దమునకు నర్థము చెప్పికొనవలెను.

జక్కన తాత పెద్దయ్య- 'ఎవ్వ డేయవధాన మెఱుగు నయ్యవధానమున వాని కించుక ముల్లు నూప' నేర్చినవాడు. ఇక్కడ హెచ్చరికతోడి వాఙ్మయ క్రియ యని యవధాన శబ్దమున కర్థము చెప్పికొనవలెను

మధురవాణి — 'మేధాం వ్యనక్తి వివిధావధానే' యనుట యిట్టిదే? వివిధ వాఙ్మయ ప్రక్రియలయందు ప్రౌఢి ప్రదర్శింపగలదని యర్థము.

'అవధాని' శబ్దము వైదికులను నర్థమున నంది మల్లయ ఘంట సింగయల వరాహపురాణావతారికయందు ప్రయుక్తము.

ప్రాచీను లెవ్వరును ధారణాశక్తి నికషాయమానమైన సారస్వత వ్యాపార మను నర్థమున నవధాన శబ్దమును ప్రయోగింపలేదు.

బ్రౌన్ దొర 1852 సంవత్సరమున ప్రకటించిన తెలుగు-ఇంగ్లీషు నిఘంటువున నిట్లు వివరించెను:

అవధానము - **Attention, Care, Regard,** మనోయోగము. (హెచ్చరింపు, హెచ్చరిక, ఆంధ్రభాషార్ణవము)

అవధాని or అవధానుడు plu. అవధానులు.

**He who is attentive or careful. He who is skilled in Vedas.** హెచ్చరిక గలవాడు, జాగ్రత్తగలవాడు, వేదము బాగుగా వచ్చినవాడు. **అష్టావధాని. Versatile, who can attend to or manage various matters simulataneously.**

అష్టావధాని : **Genious, one who cannot attend to eight things atonce.**

శ్రీ పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులవారు-

'అవధానములు ధారణా ప్రధానములు. ధారణ చిత్తైకాగ్రత వలన చేకూరును. చిత్త మేకాగ్రమైనపుడే అది బాహ్య విషయముల మాని ముఖ్యార్థ ముల నవలోకింప గలుగును. ఈ యర్థమంతయు 'అవ' పూర్వక (డు) ధాఞ్- ధారణ పోషణయోః అను ధాతువునుండి యేర్పడిన అవధాన శబ్దమునం దిమిడి యున్నది' అని నిర్వచించిరి.

(అవధానములు. విజ్ఞాన సర్వస్వము. షష్ఠ సంపుటము.)

కవిత్రయ కాలమున నవధాన విద్య లేదు. శ్రీనాథుని కాలమున 'అష్టావ ధానంబుల గ్రీడించుట' యుండెను. కాని, వాని స్వరూపము వేఱు.

శ్రీకృష్ణదేవరాయల తండ్రి కాలమున 'అవధాను' లనగా వేదావధానులను రూఢి యుండెను. ఈరూఢి విజయరాఘవరాయకుని కాలమున పురోహిత సామాన్య వాచకమై పరిహాసభాజనమయ్యెను.

బ్రౌన్ దొరగారి వివరణము, ఆచార్యులవారి నిర్వచనము రెండును అర్వాచీన కాలమున రూఢిగన్న అష్టావధాన శతావధాన విద్యల కన్వయించును.

'చిత్తైకాగ్ర్య మవధానము.'

—:٥:—

# ప్రాచీనాష్టావధానము

శ్రీనాథుడు ''సంస్కృత ప్రాకృత శౌరసేనీముఖ్య భాషాపరిజ్ఞాన పాటవంబు'' కలవాడు

జక్కయ తాత పెద్దయ 'సంస్కృత ప్రాకృత శౌరసేన్యాదుల ఘటికలో నొక శతకంబు జెప్ప' జాలినవాడు.

ఉభయులు అష్టభాషా పండితులు.

వెన్నెలకంటి అన్నయ తీర్చిన చిలుక 'అష్టభాషల మధురాశు చిత్ర విస్తర కవితలు' పచరింపగల జాణ.

భట్టుమూర్తి 'సకల భాషావిశేష నిరుపమానావధాన శారదామూర్తి'
మఱింగంటి సింగరాచార్యుడు 'అశుకవితాష్టభాషావిశేష' మనీషి.
రామభద్రాంబ 'అష్టభాషాకల్పిత చతుర్విధకవిత.'
పసుపులేటి రంగాజమ్మ 'అతులితాష్టభాషాకవితా సర్వంకషమనీషావిశేష శారద.'
కాళహస్తికవి 'అష్టభాషామహితాశు ప్రబంధనిర్మితిచాతురీధుర్యుడు.'
గుడారు వెంకటదాసు 'అష్టభాషావధాన ప్రౌఢుడు.'
ఆంధ్ర రతిరహస్య కర్త మల్లయ 'అష్టభాషాకవితాప్రవీణుడు'.

తంజావూరు నేలిన శహజీరాజు కాలమున 'అష్టావధానకవి' యొకడుండెను. ఇతని నామధేయ మంతర్హితమై పౌరుషనామమే నిల్చినది. నిజప్రజ్ఞా విశేషములు సూచించు పట్టిక యేదియు నితడు వ్రాసిపెట్టలేదు. కాని, 'చంద్రశేఖర విలాస' మను నాటకము సంస్కృత ప్రాకృత ఆంధ్ర మహారాష్ట్ర ప్రభృతి భాషలలో వ్రాయఃబడ్డి యిత డష్టభాష లెఱిగినవాడని, అందుచేతనే యితనికి 'అష్టావధాని' ప్రసిద్ధి యేర్పడి యుండునని యూహింప నవకాశము కలదు.

భట్టుమూర్తియు, గుడారు వేంకటదాసుడును అవధాన శబ్దము భాషాశబ్ద సహితముగా వాడుట గమనింపదగినది.

'నాట్యచూడామణి' గ్రంధకర్త సోమనాథుడు 'అష్టావధాన విఖ్యాతుడ' నని చెప్పికొనెను. ఈ గ్రంథము సంస్కృతమున వ్రాయబడినది. సంస్కృత సాహిత్య చరిత్రమును వ్రాసిన శ్రీ యమ్ కృష్ణమాచార్యులుగారు ఈ సోమనార్యుడు నాచన సోముడు కావచ్చునని యభిప్రాయపడిరి. అయినచో అష్టభాషావధానియే అష్టావధానియని సువిస్పష్టముగా జెప్పవచ్చును. నాచన సోముడు అష్టభాషాకవి యని శాసనము కలదు.

'అష్టభాషా కవిత్వశ్రీ వాణీవిజితసంపదే
సోమాయ నాచనాంభోధేః సోమాయామిత తేజసే'.
(INSCRIPTIONAL GLOSSARY OF ANDHRA PRADESH)

నన్నయభట్టు సహాధ్యాయి నారాయణభట్టు 'అష్టాదశావధారణ చక్రవర్తి' యని రాజరాజు నందంపూడి శాసనమున పేర్కొనబడెను.

సాహిత్య దర్పణకర్త విశ్వనాథకవిరాజు 'అష్టాదశభాషా వారవిలాసినీ భుజంగః' అని మీసము ద్రిప్పి చెప్పినవాడు.

నారాయణభట్టు విశ్వనాథకవిరాజువలె అష్టాదశభాషావధారణ చక్రవర్తి యౌనా? నన్నయ భట్టునకు భారత పురాణ రచనమున తోడ్పడినవాడు కనుక 'అష్టాదశ పురాణావధారణ చక్రవర్తి' యని పురాణపదము నధ్యాహరించుకొను టయే యిట నౌపయికము.

ఇట్లే 'అష్టావధానము'న భాషాపద మధ్యాహరించికొనవలెను.

రామరాజభూషణునకు సంస్కృతప్రాకృతాంధ్రపద్యములతో అష్టావధానమే కాక, శతావధానము కూడ చేసి చూపెననియు ... ఒక ప్రథ కలదు' అని శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు వ్రాసిరి.

(భూషణ కిరణావళి. పుట 51)

ఈ ప్రథ నిరాధారము కాదు. రామరాజభూషణుడు అష్టావధానము వేఱుగ, శతావధానము వేఱుగ చేసియుండడు. అష్టావధానకలిత శతలేఖినీపద్య సంధానకార్యము చేసియుండును.

రేటూరి రంగరాజు 'అష్టావధానకలిత శతలేఖినీ పద్య గద్య శక్తి'పాటి మీఱిన వాడనని తానే వ్రాసికొన్నాడు.

న్యాయకంటి మాదన 'నిరుపమ నవలేఖినీ ఘటనాఢ్యు, సముచితాష్టావధాన నిష్ఠాగరిష్ఠు' అని చెప్పికొనగా, ఆంధ్రరతిరహస్యగ్రంథకర్త 'అష్టభాషాకవితా ప్రవీణ', 'నవఘంట సురత్రాణ' బిరుదములు గద్యమున స్పష్టముగ జెప్పికొనెను.

ఈ కవులు తమ శతలేఖినీపద్యసంధానవిద్య అష్టావధానహృద్యముగా ప్రదర్శించెడివారు.

తంజాపుర నాయకరాజుల 'శారదాధ్వజ' సభలో కవులు అష్ట భాషలలో సమస్యలు పూరించెడివారు.

అలనాటి అష్టభాషలు - శౌరసేని, మాగధి, పైశాచీ, చూళికాపైశాచి, అపభ్రంశము, ప్రాకృతము, ఖాండారభాష, సంస్కృతము నట.

(శారదాధ్వజము. పుట 258)

కొరవి గోపరాజు 'సింహాసనద్వాత్రింశికా' కృతియందు 'అష్టాభాషా విదుడన్' (1–58) అని చెప్పికొనెను. మఱియు 'అనుచు నాల్గు భాషలను రాజు దీవించి' (2–46) అనుచో నాలుగు భాషల వైఖరి చూపించెను చతుష్షష్టికళలు ప్రస్తావించుచు, ''నానాదేశ భాషలు, యను నియమాద్యష్టాంగ యోగంబును, అష్టావధానంబును' (11-168) అని వ్రాసెను.

తాళ్ళపాక చినతిరుమలాచార్యులు (1485–1560) వేంకటేశ్వరునిపై అష్టభాషా దండకము వ్రాసి, 'అష్టభాషా చక్రవర్తి' బిరుదము నందికొనెను. (సప్తగిరి సంచిక. మే 1982.)

అద్దంకి గంగాధరకవి 'అష్టభాషలయందు నాంధ్యంబులేకుండు హొంతకారి కవీంద్రు లొక్కవంక' నుండి రనెను.

అలనాటి కవులు అష్టభాషానిష్ణాతులు. కవులకు అదొక యోగ్యతాపట్టము పూర్వసంప్రదాయము పాటించి, వెలితి లేకుండ, తానును అష్టభాషల గఱచి, బాల వ్యాకరణ రచయిత శ్రీ పరవస్తు చిన్నయసూరి 'సంస్కృతాది భాషాష్టక లక్ష్య లక్షణ జ్ఞాన మహాపండిత జేగీయమాన ... ...' వ్యక్తినని గద్యము వ్రాసికొనెను.

జింజీ తుండీరప్రభువులచే సత్కృతుడైన గణపవరపు వేంకటకవి అష్ట భాషాసీసమున ప్రాకృతము, శౌరసేని, మాగధి, పైశాచి, చూళిక, అపభ్రంశము, సంస్కృతము, ఆంధ్రము కనబడును.

(ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము. ప. 876)

నాచన సోమన కవనము, సంస్కృతము, ఆంధ్రము, కర్ణాటము, మహా రాష్ట్రి, శౌరసేని, మాగధి ప్రాచ్య, అవంతి — ఈ భాషాష్టకమున ప్రవర్తిల్లెనని శ్రీ కుందూరు ఈశ్వరదత్తుగారు ప్రకటించిరి.

అప్పకవీయము —

తే॥గీ॥ సంస్కృతము ప్రాకృతంబును శౌరసేని
జగతిపై మాగధియును బైశాచికయును
జూళికయు నపభ్రంశంబు సొరిది నంధ్ర
భాషయును నివి చను నష్టభాష లనగ.

అని వివరించెను. (ప్రథమాశ్వాసము 77 ప.)

లక్షణదీపికాకారుడు అష్టభాషారచనావధానమునే అష్టావధాన మనెను. అదెట్లన —

1. ఏకపాదత్రిపాద కఠినప్రాస విషమసమస్యాపూర్తులు,
2. వ్యస్తాక్షరీ సంఘటిత పద్యములు,
3. ఇష్టదేవతావరప్రతిపాది నిషేధాక్షర రచనాచమత్కృతి,

4. అష్టావధానంబులు,

5. ఘటికాశతగ్రంథకల్పన,

6. ఆకాశపురాణంబులు - అని తత్కాలోచిత త్వరితగతిని రచియింపం బడు నది ఆశుకవిత్వంబు ఇది తదీయనిర్వచనము మీది ఆఱింటిలో అయిదు అచ్చముగా సారస్వత వ్యాపారములు. మిగిలిన 'అష్టావధానంబులు' అను వ్యాపార విశేషముయొక్క స్వరూప మెట్టిది? 'అష్టావధానంబులు'ను శబ్దచిత్ర భేదములే యనుటకు వీలు లేదు. చెప్పవలసిన చిత్రము లన్నియు పట్టికలో జెప్పబడినవి కనుక ఈ 'యష్టావధానంబులు' అష్టభాషాసంబంధ్యవధానములే కావలెను.

'శివరాత్రి పుణ్యకాలమున.... పురాణంబులు వినిపించువారును, ఇతిహాసంబులు చదువువారును ...దురోదరంబుల వినోదించువారును, అష్టావధానంబుల గ్రీడించువారును, వీణ లాస్వాదించువారును ... కావ్యగోష్ఠి సలుపువారును, పరిహాసం బాదరించువారును, బిందుమతి యభ్యసించువారును, ప్రహేళికలు భావించు వారును ... ఐ, జాగరంబులు సలుపుచుండిరి' అని శ్రీనాథకవి సార్వభౌముడు వక్కాణించెను. (శివరాత్రి మాహాత్మ్యము. చతుర్థాశ్వాసము. 47 వచ.)

ఇటు ద్యూతక్రీడ, అటు వీణాగానక్రీడ యుండగా, నడుమ 'అష్టావధానంబుల' క్రీడ క్రోడీకరింపబడినది కనుక దీని యునికినిబట్టి యిది వాఙ్మయేతరక్రీడ యగునేమో యని సందేహింపఁబనిలేదు. 'అష్టావధానంబుల గ్రీడించువారు' ప్రహేళికలు భావించువారి కంటె భిన్నులు. కావ్యగోష్ఠి, పరిహాసము, బిందుమతి, దురోదరము, పురాణేతిహాసములు అష్టావధానమున నుండవని స్పష్టపఱచినట్లయినది 'లక్షణదీపిక' సూచించిన ఆశుకవితా లక్షణమున గూడ సమస్యాపూర్తులు మున్నగునవి అష్టావధానమునకు వెలుపలనే యున్నవి కాగా శ్రీనాథుని నాటి అష్టావధానము లేవి? అష్టభాషలే. అష్టభాషలయందు అవధానము గలవారు అష్టావధానులు.

అష్టావధాన మనునది లోకవ్యవహార రూఢమైన పారిభాషిక పదమైయుండెను. దానినిగుఱించి వివరించి చెప్పవలసినయవసరములేనంత రూఢి దానికుండెను.

క్రీడార్థమో వాదార్థమో గోష్ఠులందు ప్రాకృతాద్యష్టభాషాప్రాగల్భ్యము ప్రదర్శించుట ప్రాచీన పండితాచారమై యుండెను.

ప్రాచీనకాలమున అష్టభాషావధానమే అష్టావధాన మనఁబడెను.

—: ౦ :—

# అష్టావధాన పరిణామము

శ్రీకృష్ణదేవరాయలు దిగ్విజయము చేసి 'భువన విజయ సభాభవనము కట్టించెను. పెద్దనయు, తిమ్మనయు తమ కృతులందు తద్భవనము ప్రస్తావించిరి.

భువన విజయసంసద్భవనమధ్యమున అష్టస్ఫటికసింహములమీద రచియింపబడిన రతనములు తాపిన సువర్ణపీఠము, దానిచుట్టు అష్టపీఠములుండెను సింహపీఠము కర్ణిక. అష్టపీఠము లష్టదళములు. ఈ సింహపీఠ మధిష్ఠించు వ్యక్తి అష్టదిక్పాలకాంశావతీర్ణుడని, అష్టదిగవధానశాలియని తచ్ఛిల్పవిన్యాసము చెప్పక చెప్పుచుండెను.

నడుమ రాయలు కూర్చుండెడివాడు. అష్టదిగ్దళములందు అష్టకవిదంతులు కూర్చుండెడివారు. వీరికే అష్టదిగ్గజములను ప్రసిద్ధి కలిగెను.

రాయలు కట్టించిన భవనము క్రొత్తదేకాని, పెట్టించిన పీఠములు క్రొత్తవి కావు. కృష్ణరాయల తండ్రి నరసరాయలు-

అష్టభాషా కవితాబ్జసంభవులైన
సుకవిపుంగవులు సంస్తుతులు సేయ'
పేరోలగ ముండెడివాడు. (వరాహపురాణము. 1-11)

అష్టదిగ్గజములకు శ్రీకృష్ణదేవరాయలు తిప్పలూరు గ్రామము నగ్రహారముగా నిచ్చినట్లొక శిలాశాసనము కలదు అష్టదిగ్గజ కవు లెవరో దానిలో లేదు

తిప్పలూరు గ్రామము కోకట గ్రామ సమీపమున కడపమండలమున గలదు కనుక అష్టదిగ్గజకవు లందరు తెలుగువారై యుండవలయునని కొందరు చరిత్ర పరిశోధకులు సిద్ధాంతించిరి.

(ఆముక్తమాల్యదాసంజీవనీ ద్వితీయముద్రణ ముఖపత్రము)

దీనికిదోడు మఱి రెండుపపత్తులు చూపిరి. ఆంధ్రేతరవాఙ్మయచరిత్రలో ఆ కాలపు పుటలలో అష్టదిగ్గజకవిప్రసక్తి లేకపోవుటయే అన్యభాషీయు లెవ్వరును అష్టదిగ్గజకవికూటమున లేరనుటకు నిదర్శనమని మొదటి యుపపత్తి. జనశ్రుతి అష్టదిగ్గజకవులాంధ్రులని ఘోషించుచున్నదని రెండవ యుపపత్తి.

నామధేయనిర్దేశము చేయక అష్టదిగ్గజకవి కూటమునకు ఉమ్మడి భోగముగా ధారపోసిన యూళ్ళు లాంధ్రేతరప్రాంతము లందును నున్నవి. అదియుగాక, ఏ ప్రాంతస్థుడు ఆ ప్రాంతీయభాషకే ప్రాతినిధ్యము వహింపవలెనను కట్టడి యేమున్నది? తిప్పలూరునుబట్టి వారు తెలుగు కవులని తీర్మానించుట సరికాదు. అష్టదిగ్గజకవిపీఠము విజయనగరమున నుండును కవులు కాలక్రమమున ప్రాతవారు పోయి క్రొత్తవారు వచ్చుచుందురు దానఫలభోగము తత్కాలదిగ్గజకవి కూటము నందలి సభ్యు లనుభవింతురు. ఇది యుమ్మడి దానతత్త్వము. ఇక అన్యభాషాకవులను గురించిన చారిత్రిక సాక్ష్యము. చరిత్ర వ్రాసికొనుట పట్ల భారతీయుల అనాసక్తి జగద్విదితము. అన్ని విషయములు నేదోయొకమూల చరిత్ర కెక్కియున్నవని యెవరైన జెప్పగలరా? అది కన్నడరాయనికి తెలుగురాయడు కలలో కనబడు కాలము కదా! (ఆముక్తమాల్యద 1-14)

అష్టదిగ్గజ కవికూటమున అల్లసాని పెద్దనకే అగ్రతాంబూలము. కనుక అన్యభాషీయులుండినను తమ యునికిని గుఱించి గర్వపడుటకు గాని, చరిత్ర కెక్కించుకొనుటకు గాని యుత్సహించుట జరిగియుండదు. అసలు సంస్కృత ప్రాకృతాదిభాషలకును ప్రాతినిధ్యము వహించియుండినవారు తెలుగువారే అయియుండిన కథ యింతదూరము రానేరాదు. జనశ్రుతి సరిపెట్టుకొనవచ్చును. అష్టదిగ్గజకవులు పుట్టుకచేత తెలుగువారగుదురో కారో మన కిపు డక్కఱలేదు ఈ కూటము అష్టభాషలకు ప్రాతినిధ్యము వహించుచుండెననుట వాస్తవము.

చిరకాలముగా అష్టభాషలకు పీఠము పెట్టు నాచారము తెలుగుదేశమున కలదు తంజాపుర నాయకరాజుల ఆస్థానములందును అష్టభాషాపరీక్షలు జరుగుచుండెను.

అష్టభాషా త్వష్టలే అష్టావధానులు.

అష్టావధాన నిష్ఠతో శతలేఖినీపద్యరచనము గావించుచుండిరి

శతలేఖిని, సమయలేఖిని ఆశుకవితాకల్పవృక్షశాఖలు.

ఆ కాలమున నూఱు గంటములకు పద్యములు చెప్పి వేయుట శతావధాన మనబడుచుండెను. అష్టావధాని యనగా అష్టభాషావిశేషములతో శతావధానము చేయువాడని యర్థము అట్టి యష్టావధాని కంటె శతావధాని తక్కువవాడు. అందు చేత శతావధానినని చెప్పికొనినవా రరుదు

అల్లసాని పెద్దన 'చతుర్విధ కవితామతల్లిక.' అష్టావధాన ఘటికాశతగ్రంథ కల్పనాదికములు చతుర్విధకవితలందే యంతర్భూతములు. రామరాజభూషణుడును 'చతుర్విధకవితా నిర్వాహకుడన'ని చెప్పికొనెను పెద్దనవలె ఆశ్వాసాంత గద్యమున ఆ మాట చెప్పికొనుటతో నీతడు తృప్తిపడలేదు 'ఏకైక దినప్రబంధ ఘటికా సదృశ్యతగ్రంథకల్పనుడ' నని కృత్యవతారికయందు వివరించుకొనెను. 'జగత్ప్రాణనందనుడు' హనుమంతుడు వాయువేగి. ఆ మహాత్ముని 'కారుణ్యకటాక్షలబ్ధ కవితాధార' కనుక దానికిని శైఘ్ర్య మధికము 'ఆశువునందు కరము మేటి' యన్న తెనాలి రామకృష్ణుని ప్రతిజ్ఞోక్తి కిది పోటి ఇంకటి యీ మహాత్ముల యాశు కవితలు ఆకాశమున గలిసిపోయినవి భూమిపై నిలిచినవి కావు

చరిత్రకందని పరిధిలో నాచన సోమనాథు డష్టావధాన విఖ్యాతుడు. క్రీ.శ. 1350 వరాహపురాణకర్త హరిభట్టు అష్టఘంటావధాని క్రీ శ. 1530. శహాజీ రాజ్యమునందుండిన పేరులేని అష్టావధాని యొకడు క్రీ శ 1684-1712 న్యాయకంటి మాదన, రేటూరి రంగరాజు అష్టాదశ శతాబ్ది పూర్వార్ధమున నుండిన వారు. మాదన 'సముచితాష్టావధాన నిష్ఠాగరిష్ఠుడు ' రంగరాజు 'అష్టావధాన కలిత శతలేఖినీపద్యగద్యశక్తి పాటిమీఱినవాడు.'

తదనంతరకపులో కనిష్ఠికాధిష్ఠితనామధేయుడు విద్వన్మాదభూషి వేంకటాచార్యులవారు. పదపడి శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు, తచ్ఛిష్యపరంపర, ప్రత్యర్థి పరంపర.

అష్టావధానులలో ఆద్యులు శుద్ధముగా అష్టభాషావధానులు

'బహుళ సందర్భాష్టభాషావధాన దుష్ప్రాప దుష్కరబంధ' రచనాదక్షులు.
(ప్రబంధశిరోభూషణ ప్రకృష్టబలరామచరిత్ర.)

మధ్యీయులు - అష్టవిచిత్రవిషయావధానులు, శతలేఖినీపద్యసంధానధౌరేయులు. ఈ విచిత్రవిషయము లెవ్వియన వీనికొక కట్టుబాటు లేదు సంగీతాత్మ కలవాడు సంగీతసంబంధి చమత్క్రియలు, గణితాత్మకలవాడు గణితసంబంధి చమత్క్రియలు, శబ్దచిత్రాత్మకలవాడు శబ్దచిత్రసంబంధిచమత్క్రియలు, క్రీడాత్మ కలవాడు ద్యూతాదిక్రీడాసంబంధిచమత్క్రియలు, అష్టసంఖ్యకు నొడిగించికొని నిర్వహించుచు, శతలేఖినీ పద్యఘటనము నెరపెడివారు. ఉదాహరణము—

సీ॥ వ్యస్తాక్షరీధుర్య విస్తీర్ణభావంబు
క్రముకసంఖ్యాఖ్యానకౌశలంబు
నారోహణావరోహణ లేఖనప్రౌఢి
యగ్రపద్యగ్రహణాభిరక్తి
యనవలోకిత శారికాభిఖేలనరీతి
వరసమస్యాపూర్తి వైభవంబు
సముదగ్రశిక్షిత చతురంగబలకేళి
కా విలాసము నేకకాలముననె
యలర బ్రకటింపనేర్తు వష్టావధాన
కలిత శతలేఖినీ పద్యగద్య శక్తి
బాటి మీఱితి వంధ్రకర్ణాట చోళ
రాజసభలందు రేటూరి రంగరాజ! (భానుమతీ పరిణయము)

ఈ ప్రక్రియను నేటిదృష్టితో అష్టావధానగర్భిత శతావధాన మనవచ్చు. కొందరు చిల్లర విషయములను పెంచి, పద్యములు తగ్గించి, అవి యివి కలిపి, వంద చేసి శతావధాన మనిపించి, మంగళారాత్రికములు పాడువరకు ఈ ప్రక్రియను పలుచబఱచిరి శేషాద్రిరమణ కవులీవిషయ 'మవధాన మంజరి' తొలి పలుకులందు దడవిరి.

అద్యతను లష్టావధాన నిష్ఠతో- అనగా అష్టభాషావధాన నిష్ఠతో గాదు, అష్టవిషయావధాననిష్ఠతో, శతలేఖినీపద్యసంధానము గావించు పద్ధతినే స్వీకరించి,

శతలేఖినీ స్థానమున కతియతేఖినీపద్యసంధానకార్యము నేర్పఱచికొని, యీ పద్ధతికి శుద్ధముగా 'అష్టావధానము' అని నామకరణము చేసిరి.

శ్రీ మాడభూషి వేంకటాచార్య తిరుపతి వేంకటేశ్వర ప్రభృతు లీవిధాన మవలంబించిరి.

తిరుపతి వేంకటేశ్వరులు 'అష్టావధానము' నందు కవిత్వ మెంద రడిగిన నందరికి జెప్పగలమని నుడివియుండుట పరికించితిమేని పై విషయము ధ్రువ పడును.

ఇట్టి యష్టావధానములు శ్రీ మాడభూషివారి కాలమున గణనీయముగ విస్తరిల్లెను శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల కాలమున ఎక్కడ జూచినను అష్టావధానుల సుద్దులే యయ్యెను ఈ యూపున గీర్వాణ శిక్షితాక్షరులు కొందరు అష్టావధానము నన్యూనాతిరిక్తముగా కవితతో గలిపి అష్టసంఖ్యకే పరిమితము చేసిరి. అదే స్థిరపడి నేడు నడుచుచున్నది

ఆంధ్రసాహిత్యప్రపంచమున అష్టావధాన ప్రక్రియ యొక్క పరిణామము దెలుపు నాలుగు దశ లివి :-

1. అష్టభాషావధానము.
2. అష్టభాషావధానకలిత శతలేఖినీపద్యసంధానము.
3. అష్టవిషయావధానకలిత కతిపయపద్యసంధానము.
4. అష్టవిషయ పద్యావధానము.

అప్రస్తుతప్రసంగ, పురాణవ్యాఖ్యాన, ఘంటాగణన, చతురంగక్రీడాది విషయములు. నిషేధాక్షర, సమస్యాపూరణ, వర్ణనాదిపద్యములు కలిపి మొత్తము అష్టసంఖ్యకు ఒపిగించికొని, అష్టావధానకార్యము ప్రస్తుతము నిర్వహించుచున్నారు.

—: ౦ :—

# అష్టావధానము

అభినవపండితరాయ శ్రీ మాడభూషి వేంకటాచార్య ధీవరుడు 'ఏకకాల సందర్శితాష్టావధాన ప్రకారుడు.' తత్పద్ధతియే తెనుగు దేశమున విస్తరిల్లినది

ఆచార్యులవారు ఆత్మీయమైన అష్టావధాన లక్షణ మిదమిత్థమని సూత్రించి పెట్టినవారుకారు. లోకాహ్లాదకరముగా వారవధానము జేయుట ప్రత్యక్షముగ జూడనోచిన విద్యార్థులు కొందరు తత్పద్ధతి గ్రహించి తాము నష్టావధాన మొనర్ప మొనసిరి. కాని, కృతార్థులైనవారు తక్కువ.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు కుశాగ్రబుద్ధి. 'గోచి పెట్టకమున్న కోమల కవిత చెప్పినవాడు.' ఫిడేలు మీద కొన్ని సంగీతపు వరుసలు చెప్పించుకొన్న సరసుడు. మంచి మాటకారి మాధుకర మెత్తి పలుచోట్ల అగచాట్లుపడి కావ్య పాఠములు నేర్చిన దీక్షాశాలి కడియెద్ద చర్ల బ్రహ్మయశాస్త్రులయొద్ద వ్యాకరణ మభ్యసించుచు, కవితా వ్యాసంగ మొకవంక గావించు పదునేడు పదునెనిమిదేడుల ప్రాయపు కళార్థి. ఈయన పెంటపాడు గ్రామములో ఆచార్యులవారి అవధానలీల దర్శించి, తత్పద్ధతి గ్రహించిరి. అంతేకాని, వారి యంతేవాసి కాడు ఏకలవ్య శిష్యుడనవచ్చు.

తరళ. మలయమారుత మంజువైఖరి మాడభూషికులుండు శో
భిలగ నష్టవధానకార్యము బెంటపాడున జేయుటల్
కలయ జూచిన చెళ్ళపిళ్ళ కులర్షి వేంకటశాస్త్రి వా
గ్లలితు డయ్యవధాన విద్యకు గట్టె పట్టము దిట్టయై

(శతావధాన ప్రబంధము. ప్రథమ ఖండము.)

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు సతీర్థ్యుడును కవియు నగు దివాకర్ల తిరుపతి శాస్త్రిగారికి అవధానతత్త్వ మెఱిగించి, జంటకవిని జేసికొని చతుర్భుజులయిరి.

(తిరుపతికవి జీవిత సంగ్రహము. పుట 26 )

ఈ జంట 'తిరుపతి యతండు వేంకటేశ్వరుడ నేను, వెరసి తిరుపతి వేంకటేశ్వరుల మేము' అనుచు నానారాజ సందర్శనము చేయుచు, అవధానములు ప్రదర్శించుచు, ఆంధ్రదేశమును కవితాదివిజాపగాతరంగములతో ముంచియెత్తిన దంట!

పిఠాపురాస్థానపండితులు శ్రీ దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారు, తమ్మన్న శాస్త్రిగారును తదాస్థానమునకు వచ్చి శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు అవధానము ప్రదర్శించి చూపిన తరువాతనే తాము ప్రదర్శింప నేర్చిరి.
(మహేంద్ర విజయ కావ్య పీఠిక )

దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారు, మాడభూషి వెంకటాచార్యులవారు సమ వయస్కులు. క్రీ.శ. 1835 సంవత్సరమున జన్మించినవారు. చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు చిన్నవారు క్రీ శ. 1870 సంవత్సరమున జన్మించినవారు దేవుల పల్లివారికి చెళ్ళపిళ్ళవారికి ఉభయులకు ఆచార్యులవారి అవధాన విధానమే మేలుబంతి.

ఆచార్యులవారి అనంతరము శ్రీ తిరుపతి వెంకటేశ్వరులే అవధాన సామ్రాజ్య పీఠాధిపత్యము వహించి విక్రమించిరి
(రాజయోగి పత్రిక. శతావధానసారానుబంధము )

తిరుపతి వేంకటేశ్వరు లను సమాస మెంత స్నిగ్ధముగ కుదిరినదో, వారి చెలిమియు నంత స్నిగ్ధముగ కుదిరినది. ఒక చరణ మాయన, మరొక చరణ మీయన చెప్పినను, పడుగు పేకలవలె చరణము లొదిగి, పద్యము చచ్చదరముగా నెదిగి అందగించెడిది.

జంటకవులుగా దేవులపల్లి సోదరులును రంగమెక్కియుండిరి. కాని ఆ జంట యింకా రాణించలేదు. వారి ప్రచారము గూడా పరిమితమే.

తిరుపతి వేంకటేశ్వరులు జోడు గిత్తలవలె నిల్చి, అవధాన శకటము నల్లేరుపై నడకగా సాగించుట యొక వింతశోభ వెలార్చెను. ఆ వింత చూచుటకు జన మెగబడెడివారు. జంటకవులనుపేరు తిరుపతి వేంకటేశ్వరులకే చెల్లెను.

## అష్టావధాన లక్షణము

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు తమ శతావధాన సారోపోద్ఘాతమున-'పై చెప్పుననే శ్రీమదభినవ పండితరాయ విద్వన్మాదభూషి వేంకటాచార్యులవారు రచించియున్నారు ఏత దనుసారముననే మేము ప్రప్రథమమున ... అష్టావధానమునకు లక్షణము నేర్పఱచుకొన్నాము' అని వ్రాసిరి. దీనినిబట్టి ఆచార్యులవారి అష్టావధాన లక్షణము గూడ నిట్టిదేయైయుండునని గట్టిగా నమ్మవచ్చును.

శ్రీ తిరుపతి వేంకటేశ్వర క్లుప్తలక్షణము :

కావ్యోక్తిః కవితోక్తి రంచితకళావిద్భి స్సహాభాషణం
పౌరాణోక్తి రమందలౌకికగిరో వ్యస్తాక్షరోక్తి స్స్వమమ్
ధీమద్భి శ్చతురంగఖేలన మథో సంఖ్యేయ పుష్పాలయో
యస్మిం స్స్యా ద్యుగప త్తదేవ కృతినా మష్టావధానాభిధమ్.

అని సంస్కృతమునను,

పౌరాణోక్తి కవిత్వ పుష్పగణన వ్యస్తాక్షరుల్ లౌక్య గం
భీరోక్త్యంచిత కావ్యపాఠన కళా విద్భాషణంబుల్ ముదం
బారంగా జతురంగ ఖేలనము నీయష్టప్రకారంబు లొ
ప్పారున్ శంకర! యేక కాలముననే యష్టావధానమ్మనన్.

అని తెనుగునను జెప్పిరి.

1. కావ్యపాఠము 2. కవిత్వము 3. శాస్త్రార్థము 4. పురాణము 5. లౌకికప్రసంగము 6. వ్యస్తాక్షరి 7. చతురంగము 8. పుష్పగణనము - ఇవి అష్టప్రకారములు (శతావధాన సారోపోద్ఘాతము)

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు చెళ్లపిళ్లవారికంటె రెండేండ్లు చిన్నవారు. తిరుపతి వేంకటకవుల అష్టావధానము వెలుగునకు వచ్చిన మరుసటి సంవత్సరముననే తామును అష్టావధానము నిర్వహించిరి. వీరు సూత్రించిన యష్టావధాన లక్షణము—

'కథ ఘంటా సుమసంఖ్యా
కథ నాశ్వప్లుతి పురాణకథన సమస్యా
కథనము లుభయ కవిత్వ
గ్రథన వ్యస్తాది వార కథనాదికమౌ.' (అవధాన యాత్ర.)

1. కథ = యేదోయొక స్వకపోలకల్పిత వినోదకథ పృచ్ఛకు డూకొట్టు చుండగా తడవ కొకింత చొప్పున చెప్పుట. 2 ఘంటాసుమసంఖ్యాకథనము. అనగా గంటలు గాని, పువ్వులు గాని, రెండును గాని లెక్కించి చెప్పుట. 3. ఆశ్వ ప్లుతి = ఒక గణితము. 4 పురాణకథనము. 5. సమస్యాకథనము. 6. ఉభయ కవిత్వ గ్రథనము. 7. వ్యస్త అక్షర కథనము. 8. వారకథనము. = పంచాం గము.

తరువాత పదునాఱేండ్లకు రంగమెక్కిన పిఠాపురాస్థానకవులు శ్రీ వెంకట రామకృష్ణకవులు ప్రదర్శించిన అష్టావధానాంగములు—

1. కవిత్వము 2. చతురంగము 3. నిషిద్ధాక్షరి 4. సమస్య 5. వ్యాకరణ ప్రసంగము 6. వ్యస్తాక్షరి 7. నిర్దిష్టాక్షరి 8. గంటలు.

ఆ మీద అయిదారేండ్లకు శ్రీ నందగిరి శేషగిరిరావుగారు లక్ష్యసహితముగ 'అవధాన దర్పణ' మను లక్షణగ్రంథము ప్రకటించిరి. అందలి లక్షణము—

1. కవిత్వము 2. వ్యస్తాక్షరి 3 గణితము 4 సమస్య 5. పురాణము 6. కావ్యపాఠము 7. చదరంగము 8. లోకవ్యసంభాషణము.

ఈ దర్పణ మానాటి అష్టావధాన స్వరూపమునకు దర్పణము.

రావుబహద్దరు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి 'స్వీయచరిత్ర' గ్రంథమున అష్టావధాన ప్రస్తావన కలదు. పంతులుగారు వయసా తిరుపతి వేంకట కవుల కంటె పెద్దవారు. మాడభూషి వేంకటాచార్యులవారి కంటె చిన్నవారు. వీరడుగు పెట్టని వాఙ్మయశాఖ లేదు కదా! వీరు ఒండురెండు అష్టావధానములు కావించి, తలనొప్పి జనించి చాలించిరి. వీరి వ్రాత పూర్వకాలపు టష్టావధాన పద్ధతి నెఱుగుటకు మిక్కిలి తోడ్పడును.

'అపుడు చేసిన యవధానము లివి-

1. కవిత్వము 2. వ్యస్తాక్షరి 3 నిషేధాక్షరి 4. సమస్యాపూరణము 5. చతురంగవినోదము 6. చీట్లాట 7. సంభాషణము 8 పుష్పపరిగణనము.

కవిత్వము పదిమందికి వారు వారు కోరిన పద్యములలో కోరిన విషయము గూర్చి యొక్కొక్క యక్షరము చొప్పున విడిచిన యక్షరములను మరల నడుగకుండ జెప్పితిని. ఆంధ్ర గీర్వాణభాషలలో ముప్పదిరెండేసి యక్షరములకు మించని పద్యభాగమును శ్లోకమును విడికాగితముల మీద వ్రాయించి, యక్షరముపైని వరుసయంకెలు వేయించి, కత్తిరించిన ముక్కలను కలిపివేసి, కవిత్వము చెప్పునప్పుడు నడుమనడుమ నేదోయొక ముక్క నిచ్చుచు రాగా, కడపట నన్నిటిని జేర్చి, మనసులో వరుసగా గూర్చికొని వారిచ్చిన వాక్యములను జదివి, రెండు భాషలలో వ్యస్తాక్షరిని జెప్పితిని. చరణ మొకటికి రెండేసి తావులలో వారు నిషేధించిన యక్షరములను విడుచుచు వచ్చి, యొక్కొక్క యక్షరము చొప్పున జెప్పి పద్యమును బూరించితిని. వారు సమస్యగానిచ్చిన పద్యపాదమునకు అనుగుణముగా నర్థము వచ్చునట్లాలోచించి యష్టావధానమధ్యమున నొక్కొక్క చరణము చొప్పున పద్యము చేసి, సమస్యాపూరణము గావించితిని. ఈ నడుమనే యింకొక మిత్రునితో చతురంగమాడుచుంటిని. నడుమనడుమ బంటునో మంత్రినో గుఱ్ఱమునో యేనుగునో రాజునో శకటమునో త్రోయుచు నేదో యెత్తువేయుచుండుట తప్ప, చతురంగ క్రీడయందు నాకేమియు కష్టమగపడలేదు చీట్లాటయు నిట్టిదే కాని, వచ్చిన పట్లలోని సంఖ్య లెక్కపెట్టుటలో నించుక కష్టమున్నది. నేనొక్కయాటలోను లెక్క తప్పు బెట్టలేదు కాని, నా యెదుటి పక్షము వారు వినోదము చూచు సందడిలో లెక్క మఱచిపోవుచు వచ్చిరి. మధ్య మధ్య జరిగిన సంభాషణములో నెదుటివారడిగిన ప్రశ్నలకు నేను సదుత్తరము లిచ్చుచు వచ్చితిని. ఈ పనులన్నియు జేయుచుండిన కాలములోనే నా వెనుక నొకరు కూరుచుండి నా వీపుమీద నప్పుడప్పు డొకపువ్వు వేయుచు రాగా, ఆ పుష్పముల సంఖ్యయు సరిగానే చెప్పితిని. ఈ పనియంతయు ముగియుటకు రెండు గంటల కాలము పట్టినది!

(శ్రీ పంతులు గారి స్వీయచరిత్రము నుండి యుద్ధృతము.)

ఇందాక స్థాలీపులాక న్యాయమున, అష్టావధాన స్వరూప మెఱుగుటకు, క్రీ శ. 1870 నుండి 1920 వరకు, అర్ధశతాబ్ది కాలమునకు జెల్లిన అష్టావధానముల లక్షణము పరిశీలింపబడినది.

శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు క్రీ శ. 1854-55 సంవత్సరములో ప్రప్రథమాష్టావధానము చేసియుందురు.

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారు క్రీ. శ. 1874 సంవత్స రములో అష్టావధానము చేసిరి.

శ్రీ దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి, తమ్మన్నశాస్త్రి సోదరులు 1879 సం లో అష్టావధానము చేసిరి.

శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రి, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు 1891 సం.లో అష్టావధానము చేసిరి.

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు 1892 సం లో అష్టావధానము చేసిరి.

శ్రీ ఓలేటి వెంకటరామశాస్త్రి, ద్వివేది రామకృష్ణశాస్త్రి (వేంకటరామకృష్ణ కవులు)గారు 1909 సం లో అష్టావధానము చేసిరి.

శ్రీ నందగిరి శేషగిరిరావుగారు 1913 సం లో అష్టావధానము చేసిరి.

అష్టాంగములలో ప్రధానాంగము కవిత్వము తక్కిన సప్తాంగములలో చతురంగము, పుష్ప, ఘంటాగణనము దాదాపు అందరును స్వీకరించిరి. మిగిలిన ఐదింటిలో ఐకమత్యము లేదు ఎవరికి నచ్చిన విషయము వారు గ్రహించిరి. అంతేకాదు - సభనుబట్టి, సందర్భమునుబట్టి విషయములు మార్చుచు వచ్చిరి. వీని కొక నియతి లేదు.

ఛందోరచనాసంబంధివిషయమునకు కవిత్వమని పేరు అష్టావధాని కవిత్వ రచన పట్ల మొగ్గకు నదనుచూచి,తత్సమాధి భంగించుటకు ఏడుగురు యత్నించు చుందురు. వీరు వరుసగా 1. కావ్యపాఠ 2 శాస్త్రార్థ 3. పురాణ 4. లౌకిక

ప్రసంగ 5. వ్యస్తాక్షరి 6. చతురంగ 7. ఘంటాపుష్పపరిగణన వ్యాపార సంబంధి పృచ్ఛకులు పీరికి అవధాని పద్యములు కట్టి చెప్పుట యుండదు.

కవిత్వ శీర్షిక క్రింద ఎన్ని పద్యములు చెప్పవలెను?

అన్నియు సాఫీ పద్యములేనా? నియమబద్ధములు గూడ నుండునా? ఉండినచో వాని లక్షణ మెట్టిది?

ఈ ప్రశ్నములకు వారి యవధాన గ్రంథములే సమాధానము లీయగలవు.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు కవిత్వ శీర్షిక క్రింద ఎనిమిది పద్యములు చెప్పిరి. (వానమామల అష్టావధానము, ప్రథమ ముద్రణము. 1908 మఱియు నరసారావుపేట అష్టావధానము. ప్రథమ ముద్రణ 1911.)

వీనిలో అన్నియు సాఫీ పద్యములు కావు నిషేధాక్షరులు, సమస్యలు, ఇతరములు కలవు. కాని, అంత కఠిన నియమబద్ధములు కావు.

ఈ పద్యకదంబమంతయు కవిత్వము క్రింద లెక్క.

తక్కిన సప్తాంగముల పరిస్థితి పరిగణింపదగినదిగా నుండెడిది కాదు.

31-3-1899 సంవత్సరమున శ్రీ మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు వారు శ్రీ కొక్కొండ వెంకటరత్నము పంతులుగారి యాధ్యక్ష్యమున జేసిన అష్టావధానము క్రీ శ 1900 సంవత్సరమున ప్రకటింపబడెను. ఆ గ్రంథమునందు 'కవిత్వము' ప్రధానాంగముగను, మిగిలినవి యుపాంగములుగను బేర్కొనబడుట గమనింపదగిన విషయము కవిత్వము అష్టపద్యపరిమితము.

శ్రీ కొక్కొండవారి ప్రశంసాపద్యవ్యాఖ్య 'ఎనిమిదిపద్యముల నేకకాలమున రచించునట్టి' యనియే యున్నది.

వాస్తవస్థితి యిట్లుండగా 'ప్రపంచ తెలుగు మహాసభ' ప్రకటించిన 'ఆశు కవితలు-అష్టావధానములు—చాటువులు' అను గ్రంథమున 'తిరుపతి వేంకటకవుల

అష్టావధానమునకు పృచ్ఛకులు తొమ్మిది మంది' అని వ్రాయబడినది. అంతేకాదు. 'తొమ్మిదిమందికి వర్ణనలు, నిషేధాక్షరులు, దత్తపదులు నిర్వహింపవలెను ఈ విధముగా నివి యిరువది యేడు పద్యాలగును' అనియు వ్రాయబడినవి ఇది ఘోరప్రమాదము. (పుట 47)

తిరుపతి వేంకట కవుల శతావధానసార గ్రంథాన బంధమున కుప్పుచ్చి లక్ష్మయ్యగారి ప్రకటన కలదు. ఆ ప్రకటనలో క్రింది పంక్తులున్నవి:

'తొమ్మిదిమందికి వారువారు కోరుకొనిన వర్ణనలు, వారువారు కోరుకొనిన శ్లోకపద్యములలో వారు ఏర్పరిచిన నియమముతోడను తెనుగున సంస్కృతంబున వారు నిషేధించిన యక్షరములు రాకుండ, నవలీలగ నొక్కొక్కయక్షరమే చెప్పుమనిన వారికి నొక్కొక్క యక్షరము వంతునను, మూడేసి యక్షరములు గోరిన వారికి నట్లేయును, మొదటి చరణము చెప్పుచుండ నంతట నిలిపి, రెండవ మూడవ చరణములలో నొకక్కపదము నడిగిన నట్లే చెప్పుచును, నందులో నడిగిన వారిచ్ఛ యేదియో మూడక్షరముల పదమును గూడ గల్పి చెప్పుడనిన నట్లేయును నొనర్చుచు కవిత్వము చెప్పబడినది.'

(అనుబంధము. శతావధానసారము. పుట 128)

పద్యమడిగినవారికి పద్యము, శ్లోకమడిగినవారికి శ్లోకము, ఏ నియమముతో జెప్పగోరినవారికి ఆ నియమముతో జెప్పుట జరిగినది. పద్యముగాని, శ్లోకముగాని, మఱొకటి గాని, ఒక పృచ్ఛకునకు వారు చెప్పినవి ఒకటి మాత్రమే. తొమ్మిదిమందికి తొమ్మిది చెప్పిరి అష్టావధానమున ఎనిమిదిమందికి ఎనిమిది పద్యములు చెప్పిన జాలును తొమ్మిదవది కొసరు. తిరుపతి వేంకటేశ్వరులు సర్వత్ర తొమ్మిది పద్యములు చెప్పిన వారు కారు. ఆ విషయము వారే అదే గ్రంథమున విశదపఱచిరి. అష్టావధాన లక్షణము వక్కాణించి, 'మే మేర్పాటు చేసికొన్న దింతమాత్రమే యైనను నిందులకు నెన్నియో రెట్లు కష్టము నంగీకరించి చేసిన యవధానములు మాత్ర మనేకములు గలవు. ఈ విషయమున నెల్లూరు, వెంకటగిరులు ముఖ్యముగా నచ్చటివారి వ్రాతలమూలమున మీకు సాక్ష్యము నీయగలవు' అని వ్రాసిరి. (ఉపోద్ఘాతము. శతావధానసారము.)

ఈ తొమ్మిది పద్యాల ప్రకటన నెల్లూరివారి వ్రాత. లక్షణము నతిక్ర మించి 'ఎన్నోరెట్లు కష్టము నంగీకరించి చేసిన యవధానము' గురించి వ్రాసిన వ్రాత. ఆ వ్రాతలో నిరువదేడు పద్యములు చెప్పినట్లు పేర్కొనబడలేదు.

శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు - అష్టావధానము 8×8 = 64 చతుష్షష్ట్యవధానమగునని చమత్కరించిరి. ఎట్లన, గణయతి ప్రాసములు మూడు, తర్కవ్యాకరణాలంకారములు మూడు, సముచిత రచన, సద్విషయము రెండు - వెరసి యెనిమిది. ఒక్క పద్యములో ఎనిమి దవధా నములు. ఎనిమిది పద్యములలో అరువదినాలు గవధానములు - అని. దీనినిబట్టి అలనాటి యష్టావధాని అరువదినాలుగు పద్యములు చెప్పెనని తలప వచ్చునా?

(కొక్కొండవారి బంగారు పద్యములు, పంచరత్నములు. వ్యాఖ్యానము - భూషణము. పుట 26)

సంగీత సాహిత్య విద్యామల్లుడు శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారి అష్టావధానము అత్యద్భుత విధానము.

1. రెండు పాదముల రెండు తాళములు, రెండు చేతులు రెండు తాళములు వేసి, పల్లవి పాడుచు కోరిన జాగాకు కోరిన ముక్తాయిలు వేయుట.

2 ప్రాబ్లెము మెంటల్గా సాల్వు చేయుట.

3. నల్వురకు తెనుగున, నల్వురకు సంస్కృతమున కోరిన పద్యములలో కవిత్వము చెప్పుట.

4. వ్యస్తాక్షరి.

5. న్యస్తాక్షరి.

6. ఇంగ్లీషున నుపన్యాస మిచ్చుట.

7. పూలు, గంటలు లెక్కించుట.

8. ఛందస్సంభాషణ మొనరించుట.

శ్రీ దాసుగారు ఎనిమిదిమందికి కవిత్వము చెప్పిరి.

వీరి యష్టావధానమున సంగీతము విశేషము.

ఆలనాటి 'బుధవిధేయిని' పత్రిక 'ఇదియొక చిన్నపనుల గుంపు' అని చులకనజేసి ప్రకటించెనట. దానిపై గినిసి, దాసుగారు 'కలుషహారిణి' పత్రికా ముఖమున, తమ అష్టావధానము అసాధ్యాష్టావధానమనియు, సంగీత సాహిత్యము లలో ఇట్లవధానము చేయు సమర్థత వేఱొకనికుండుట దుర్ఘటమనియు ప్రకటించి రట. (శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాస విజయము)

తిరుపతి వేంకటకవులు కొన్నాళ్ళకు 'కవిత్వ' శీర్షికనే యెత్తివేసిరి. కవిత్వపు గడుపున నొదుగుచుండిన నిషేధాక్షరి సమస్య దత్తపది మున్నగు వానికి స్వతంత్ర ప్రతిపత్తి కల్పించిపెట్టిరి నిషేధాక్షర్యాదులు స్వనామధేయము లతో అష్టావధానాంగత్వసిద్ధి పొంది కూర్చుండెను. పండితులు వానిని అంగము లుగా గుర్తించిరి. అయినను 'బెల్లము వండిన ప్రొయ్యి' కనుక ఒక సమస్య అడిగినచోట రెండు సమస్యలుకూడ వచించుచు వచ్చిరి.

వానమామల అష్టావధానమున తిరుపతి వేంకటకవులు పాటించిన అష్టాంగ నియమమిట్లున్నది— 1. నిషేధాక్షరి, 2. వ్యస్తాక్షరి, 3. ఆకాశపురాణము 4. పుష్పగణనము 5. వైయాకరణితో శాస్త్రప్రసంగము 6. కావ్యపాఠము 7. త్రిపాద సమస్య. 8. ఏకపాదసమస్యలు రెండు.

ఆకాశపు రాణము కవిత్వ స్థాన మాక్రమించుకొన్నదేమో అనుకొనుట పొసగదు. ఏలయన, పద్యములు చరణక్రమమున నుడువుటయు, సభాంతమున వానినన్నింటిని గ్రోడీకరించి యప్పజెప్పుటయు ఆకాశపురాణమున నుండదు.

నరసారావుపేట (911 సం.), లక్ష్మీనరసాపురము (916 సం) మున్నగు తావులలో జేసిన అష్టావధానములలో ఆకాశపురాణమే లేదు.

ఉన్నచోట నెల్ల హనుమన్మాలము వలె ఆకాశ పురాణము పెంచలేదు. మూడు కంద పద్యాలు, రెండు చంపకమాలలు, ఒక గీతముచెప్పి వానమామలలో చెయ్యికడిగికొనిరి ఏమైనను ఆకాశపురాణము కవిత్వ శీర్షికాతౌల్యా మెనయజాలదు.

ఇట్టి సడలింపు వేంకటరామకృష్ణ కవుల అష్టావధానములందును గోచ రించును. వీరు 17-3-1909 సంవత్సరపు అష్టావధానమున ఒక శార్దూల

విక్రీడిత వృత్తము, మూడు తేటగీతులలో వేసగికాలము వర్ణించి, కవిత్వాంగము పూర్తిచేసిరి. అన్నీ సాఫీ పద్యములే.

ఈ విషయము 'అభినవ సరస్వతి' పత్రిక యెత్తిపొడిచినది.

'పిఠాపురపువారి యవధానములో కవిత్వమునకై మూడు గీతాలు మాత్రమున్నవి కొప్పరపువారి యవధానమున దొమ్మిది పద్యములున్నవి. మొదటివారి గీతములు మూడును నొకటే విషయమును జెప్పుచున్నవి. రెండవ వారివి భిన్న భిన్న విషయములు చెప్పుచున్నవి ... దానికిని దీనికిని గల తారతమ్యము నీవే తెలిసికొనగలవు' (అభినవ సరస్వతి. ఫిబ్రవరి సంచిక 1911 సం)

మఱియు వీరు నిషిద్ధాక్షరి కొకపీఠము, సమస్య కొకపీఠము కల్పించిరి.

26-7-1909 సంవత్సరపు అష్టావధానమున రెండే రెండు కందములతో కవిత్వమునకు స్వస్తిచెప్పి, నిషిద్ధాక్షరి, నిర్దిష్టాక్షరి, సమస్య మూడింటికి మూడు పీఠలు పెట్టిరి.

మఱికొంత కాలమునకు కవిత్వ స్థానమున నిర్నిబంధముగా నొకవర్ణనాత్మక పద్యము మాత్రము చెప్పి, నిషిద్ధాక్షరి, నిర్దిష్టాక్షరి, సమస్య మొత్తము నాలుగింటిని అంగీకరించిరి.

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు 'శరద్వావింశతిన్ బేర్మి హెచ్చగ మాయేలిని యీ వధాన కవితాసామ్రాజ్య భారంబు మోయగ బూనంగదవయ్య! తండ్రి! శివరామయ్యా! చిరంజీవివై' అని తిరుపతి వేంకటేశ్వరు లాశీర్వదించి నిలుపగా నిలిచిన మహామనీషి. అట్టి వేలూరివారి పలుకు లివి :-

'శ్రీ మాడభూషివారూ దేవులపల్లివారూ చేసిన అవధానాలు మొదటి పాదం చెప్పుకోబోయి, తిరిగి వచ్చి, రెండుమూడుపాదాలు పూరించడమే అని అనుకొంటాను. ఏ లంటే, మాడభూషివారి పద్ధతినే మే మవలంబించామని మా గురువుగారు చెప్పారు. వారి పద్ధతినే నేనూ అవలంబించాను. నా మాదిరిగానే శ్రీ పిశుపాటి చిదంబర శాస్త్రిగారు చేసేవారు వీరి కభ్యాసం నా వద్దనే.'

(ఆంధ్ర వారపత్రిక. స్వర్ణోత్సవ సంచిక.)

మన మిపుడు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి అవధానక్రమము, శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రిగారి యవధానక్రమము పరిశీలింపవచ్చు.

శివరామశాస్త్రిగారు బోడపాడులో చేసిన యష్టావధానమున, రెండు సంస్కృత శ్లోకములు, ఒక తెలుగు పద్యము, ఒక సమస్య, ఒక సంస్కృతప్రసిద్ధ శ్లోకమునకు పద్యానువాదము, గంటలు, పువ్వులు లెక్కించుట చేసిరి. ఇవి యేడు. ఎనిమిదవది లౌక్యసంభాషణము అయియుండవచ్చు. చిరివాడలో మూడు శ్లోకములు, అయిదుపద్యములు, గంటలు, పువ్వులు-పది. లౌక్య సంభాషణముతో మొత్తము పదునొకండగును. బెజవాడలో ఒకటి అచ్చతెనుగు పద్యము, ఒకటి శ్లోకము, ఆఱు పద్యములు, గంటలు, వ్యస్తాక్షరి — మొత్తము పది చేసిరి. లౌక్య సంభాషణమును జేర్చికొన్నచో ఇదియు పదునొకండగును. లక్ష్మీనరసాపురమున మూడు శ్లోకములు, ఒక నిషేధాక్షరి, ఒక సమస్య, నాలుగు పద్యములు, పుష్పగణనము, వ్యస్తాక్షరి మొత్తము పదునొకండు చేసిరి. లౌక్యసంభాషణము ఉండి యుండిన పండ్రెండగును (అవధాన భారతి.)

శ్రీ చిదంబరశాస్త్రిగారు తమ యష్టావధానలక్షణము స్పష్టముగా జెప్పిరి :

'దత్తన్యస్తనిషిద్ధవర్ణ మపరం పద్యం వివర్గాక్షరం
ఛందోభాషణ పృష్టకల్పన సమాసార్థైక సంధాగ్రహః
ఏతే ధారణయా సహాష్టవిధయో యత్రక్రియంతే క్రమా
త్తత్తాదృక్ష మిదం చిదంబరకవే రష్టావధానం మతమ్ '

(అవధానాదర్శః)

1 దత్తవర్ణము 2 వ్యస్తవర్ణము 3. నిషిద్ధవర్ణము 4. వివర్గాక్షరము 5. ఛందోభాషణము 6 పృష్టకల్పన 7. సమాసార్థము. అనగా సమస్య. 8. ఏక సంధాగ్రహణము - ఇవి చిదంబరీయాష్టావధానాంగములు.

కవిత్వ ప్రతిరూపమే యిందలి పృష్టకల్పన అది ఒకే ఒక పద్యము. వీరి యష్టావధానమంతా ఛందోవ్యాపారవిశిష్టము. ఏకసంధాగ్రహణమునకు బదులేదియైన నొకశ్లోకమో పద్యమో చేర్చినచో మొత్తము పద్యము లెనిమిది యగును. తిరుపతి వేంకటకవులు తొలుత, మాడభూషివారివలె, కవిత్వమను శీర్షికక్రింద పద్యాష్టకము

జెప్పచుండెడివారు గదా! యీ చిదంబరీయాష్టావధానమంతయు వారి కవిత్వైకాంగ తుల్యము.

ఒక్క కవిత్వమునే అష్టధా విభజించి, అష్టాంగములుగా దీర్చుట 'అష్టావధాన విద్య'ను పలుచబఱచుట గాదా? యనవచ్చు. కాదు.

నిషేధాక్షర, దత్తాక్షర, సమస్యాపూరణాదికములు కవిత్వపు గొడుగు క్రిందికి దూరినపుడు వాని యునికి నామమాత్రమే యయి, అవి మొగము చూపీ చూపకుండును. అవధాని శుద్ధముగా ఎనిమిది గీతులో కందములో చెప్పి తప్పుకొనవచ్చు. మిగిలిన సప్తాంగబలము ఉబుసుపోకకే కాని, లెక్కకు రాదు.

నిషేధాక్షర్యాదులు ప్రత్యేకస్థితి పొంది, అంగభూతములైనపుడు వాని యునికి వేఱు. పృచ్ఛకు లూరక వదలరు. అవధాని కడుంగడు శ్రమపడి పూరింపవలసి వచ్చును. చిత్రచిత్రవిచ్ఛిత్తి విశేషములతోడి పద్యరత్నము లపుడే వెలువడును. కనుక ఈ ప్రక్రియచే అష్టావధానము పలుచబడదు. పైపెచ్చు పద్య శిల్పము జిగియు బిగియు సంతరించుకొనును.

ఈ పద్ధతియే చతురస్ర వ్యాప్తినొంది ఆంధ్రదేశమున అష్టావధాన విద్యను ఏనుగంబారి యెక్కించి మించినది.

శ్రీ పుదూరు సీతారామశాస్త్రిగారు 1849 సంవత్సరమున రచించి ప్రకటించిన 'పెద్దబాల శిక్ష' లో నొక అష్టావధాన లక్షణ మున్నది.

1. చతురంగము 2. కవిత్వము 3 లేఖనము 4 పఠనము 5. గణితము 6. సంగీతము 7. యుక్తి చెప్పుట 8. వ్యస్తాక్షరి.

దీని మూల మీశ్లోకము కావచ్చు. 'యుక్తి ర్వ్యస్తాక్షరీ పాఠ కవితాగీత లేఖనమ్, గణితం చతురంగం చాప్యవధానాన్యమూని హి.'

ఇందు పఠనలేఖనములు సంగీతము నుండుటచే నిది చాల ప్రాచీనమైనదని తోచుచున్నది.

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు సహపఠనము, లిఖితాక్షరి యను రెండు క్రొత్తవిషయములు అంగీకరించి, అష్టావధానము నలంకరించిరి బహుశః ఇవి పెద్ద బాలశిక్షలోని పఠన లేఖనమునకు అన్వాదేశము కాబోలు.

ఇక అష్టావధానమునకు అంగభూతములై రూఢిగన్న విషయము లన్నియు నొకచో సమీకరించి చూతము.

1. కవిత్వము. అనగా వర్ణనము 2 సంగీతము 3. వ్యస్తాక్షరి 4. పురాణము 5. చతురంగము 6. శాస్త్రార్థము 7. ఘంటాగణనము, పుష్పగణనము 8. కావ్యపాఠము 9. లౌకికప్రసంగము 10 చిత్రకథ 11. అశ్వప్లుత్యాదిగణితము 12 వారకథనము 13. నిషేధాక్షరి 14. నిర్దిష్టాక్షరి 15 వివర్గాక్షరి 16. ఛందోభాషణము 17. ఏకసంథాగ్రహణము 18. శ్లోకాంధ్రీకరణము 19. సహపఠనము 20. లిఖితాక్షరి 21. సమస్యాపూరణము 22. ఆకాశపురాణము 23. అన్యభాషోపన్యాసము 24. చీట్లాట.

ఈ వైవిధ్య మేల? అందరు 'పెద్దబాలశిక్ష'లో జెప్పబడిన లక్షణమునే యనుసరించి యేల యష్టావధానము చేయలేదు ? దీనికి కవుల రుచిభేదము కారణమా? సభ్యుల రుచిభేదము కారణమా?

ఒకడు సంగీతవేత్త కంఠమాధుర్యము కలదు. కమనీయరాగకల్పనలతో చచ్చుపద్యమైనను సాగదీసి పాడి సభ్యజనావర్జనము చేసికొనగలడు అట్టి వ్యక్తి తన యోగ్యత ప్రదర్శించుట కనుకూలభూమియగు సంగీతము నేర్పఱచికొనును.

ఒకడు సిద్ధాంతి పంచాంగమంతయు వాని చంకలోనుండును. అట్టి వ్యక్తి తన యోగ్యత ప్రదర్శించుట కనుకూలభూమియగు గణితము నేర్పఱచికొనును.

ఒకడు ఘంటాశతకవి. పలుకరించినచో నిద్రలోగూడ పద్యమెత్తికొనును. అట్టి వ్యక్తి తన యోగ్యత ప్రదర్శించుట కనుకూలభూమియగు ఆశుకవిత నేర్పఱచికొనును.

'సరసకవితా రచయితయొక్క మనస్సు నీరసగణితాది విషయమందు మంచినీటికి చేపవలె నెదురెక్కిపోదు. మఱియు మాటాడినచో వైముఖ్యమేచూపును.

అట్టి వ్యక్తి గణితము జోలికి బోడు. రచనాసంబంధివిషయమో, వినోదవిషయమో యెన్నికొనును. వినోదవిద్యయు అందరికి నొదిగివచ్చెడివిద్య కాదు. ప్రకృతితః నుడికారముతోడి సరసోక్తులు ప్రయోగించు మాటకారులు కొందరుందురు అట్టి వ్యక్తులు లౌకికసంభాషణముచే సభ్యుల నాకట్టుకొందురు కనుక అష్టావధానము యొక్క అష్టవిషయములందు ఐకరూప్యము కనబడదు

వైయక్తికమైన శక్తియుక్తులనుబట్టి తత్తద్విషయము లెన్నికొని ప్రదర్శించుట జరుగును మఱియు నూత్నవిషయములు కనిపెట్టి అంగములుగా నమరించి సభ నలరించు ప్రతిభావంతులును ఉందురు.

## అష్టావధాన త్రివిక్రమ స్వరూపము

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు గద్వాలలో తమ అష్టావధాన పరాకోటిస్థితి నిరువది చరణముల చంపకమాలికయందు వివరించిరి.

"పండితు లెల్లరు నక్కజమ్ముగా
నరయగ మేమొనర్పగల మష్టవధానము, దానిరీతి నే
ర్పఱచి వచింతు, మెట్లనిన బండితసమ్మతిగా గవిత్వ మెం
ద అడిగిరేని యందరికి దప్పులు చొప్పడకుండ నాంధ్రమం
దు రహిని దేవభాషను సుదుష్కరకల్పన లొప్ప జెప్పి యెం
దఱయిన గాని కష్టపు విధమ్మున నెన్నిటినైనగాని య
క్కరము లొసంగిరేని యవి గైకొని తప్పక చెప్పి యంత బో
క రయము మీఱ లౌకిక ప్రకారముగా వచియించువారి కు
త్తరము లొసంగి మీదను ముదంబలరన్ జదరంగమాడి కొం
దఱికి గురుత్వమూని పఠనమ్ముల జెప్పి, పురాణగాథలన్
దుర మొనరన్ బఠింపగ నెదుర్కొని యర్థము జెప్పి పుష్పముల్
గరమును వీపుపై విడువగా సరిగా గణియించి ఘంటికల్
నెఱయగ గొట్ట వానిని గణించి నిషేధ మొనర్చునట్టి య
క్కరములు మాని పద్యములు కల్పన చేసి మనోహరమ్ముగా
విరచన సేయనేర్తుము ... ....." (నానారాజ సందర్శనము)

ఈ మాలిక యష్టావధాన పండితులనే పల్లటీలు కొట్టించుచున్నది.

1. కవిత్వము నుభయ భాషలందు ఎందరడిగినను సరే, అందరకు జెప్పుదురా? అడిగెడివారి సంఖ్యకు హద్దులేదా? శతమును మించునా?

2. వ్యస్తాక్షరి. ఇక్కడ ఎందరైన నుండవచ్చునా? ఎన్నియైన యక్షరము లియ్యవచ్చునా?

3. లౌకిక ప్రసంగము గూడ ఎందరైనను జేయవచ్చునా?

4. నిషేధాక్షరి 'పద్యములు కల్పన చేసి' యని బహువచనము చెప్ప బడినది. కనుక వీనికిని మిరి యగుపడదు.

శతావధానికి అష్టావధానము అప్పడము మడతబెట్టి అష్టావధాన శతమునైన నెగ్గింపగలమని చెప్పుటయే తిరుపతి వేంకటేశ్వరుల తాత్పర్యము. శ్లోక బంధమున జెప్పిన అష్టావధాన లక్షణమును వారు త్రోసిపుచ్చుటలేదు. ఎంత బరువు నెత్తి కెత్తికొని యెన్ని వింతలు ప్రదర్శించినను అది అష్టావధానమే

ఈ జంటకవులు వెంకటగిరిలో విడివిడిగా అష్టావధానములు చేసిరి.

శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారు—

శ్రీ గోపాల నృపాలకస్య నికటే దివ్యే సభామండపే
కర్తుం కాశీ! యతే భవద్బలవశా దష్టావధానం మహత్.
అని యుపక్రమించి దొడ్డ యష్టావధానమే చేసిరి.
దానికి బట్టిన కాలప్రమాణము పది గంటలు.

ఉదయమున నెనిమిది గంటలకు మొదలుపెట్టి, సాయంకాలమున నాలుగు గంటలకు ముగించిరి. భోజన ప్రసక్తి లేదు. నాందీ భరత వాక్యములతో సహ మొత్తము ఇరువదిమూడు పద్యములు చెప్పిరి.

నెలరోజుల తరువాత శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు మరియు దొడ్డ యష్టావధానము చేసిరి.

దీనికి బట్టిన కాలప్రమాణము తొమ్మిది గంటలు.

అపరాహ్ణమున నాలుగు గంటలకు మొదలుపెట్టి,రాత్రి ఒంటిగంటకు ముగించిరి. ఇందు జెప్పబడిన పద్యములు నలుబదిమూడు

అది అష్టావధానమే. ఇది అష్టావధానమే :

తిరుపతిశాస్త్రిగారి అష్టావధానము ద్విగుణితము గాదు, త్రిగుణితము కాదు, చతుర్గుణితమైనది పైగా అబోధవేళ పృచ్ఛకులు ప్రశ్నమీద ప్రశ్న వేయుచు చిక్కువఱచుచున్నారు సంశప్తకులతోడి యుద్ధమువలె నున్నది. శాస్త్రిగారు నిండుకుండ. నిబ్బరముగా బోరాడుచున్నారు వీరి యప్పటి స్థితి సభాస్థితుడైన యొక రాజబంధువునకు జాలి గొలిపినది. అతడు లేచి యిట్లనెను :

'బాబూ! శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు శ్రీ పిఠాపురపు సంస్థానంలో చేసిన అష్టావధానాన్ని నేను ప్రత్యక్షంగా చూచివున్నాను ఆ అవధానానికీ దీనికీ చాలా తేడా వుంది. దానిలో పద్యాలు ఎన్మిదే. దీనిలో పద్యాలు యాభై కంటె కూడ ఎక్కువే. ఇదే మాదిరిగా వ్యస్తాక్షరి వగైరాలు త్రిగుణంగానూ, చతుర్గుణంగానూ దీనిలో వున్నాయి సుమారు నెలరోజులనాడు శ్రీ బావగారి (శ్రీ చెలికాని గోపాలరాయనింగారి) సభలో వెంకటశాస్త్రుల్లు చేసిన అవధానంలో ప్రతి విషయమూ త్రిగుణ మయింది. కాని, యిందులో అంతకంటె కూడా అతిక్రమించింది. కాబట్టి అష్టావధానం ఇలా పెంచడం న్యాయం కాదు ' (కథలు-గాథలు. చెళ్లపిళ్ల)

ఎంద రడిగినను చెప్పగల మన్నారు. ఉత్సాహవంతులు, ప్రష్టమనసులు ముందుకు వచ్చుచున్నారు. ఎందుకు కాదనవలెను? వేంకటశాస్త్రిగారికి మాటల చమత్కృతి యెక్కువ తిరుపతిశాస్త్రిగారికి అది తక్కువ. ఏనుగు వలె, ఎంత బరువు వేసినను మోసికొనిపోవుటే వారి పని. ఈ పద్ధతి కొనసాగనిచ్చిన తెల్లవాఱునని రాజబంధువుల భయము.

ఈ సభలు సామాన్యాష్టావధానమునకు లక్ష్యములు కావు - తిరుపతి వేంకటేశ్వర త్రివిక్రమస్వరూపమునకు నిదర్శనములు.

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు, చేయలేదు గాని, 'శతావధానములో అష్టావధానము గర్భితము చేసి, మధ్య ఘంటాత్రిశతిగా ఆశుకవిత చెప్పి, గర్భావధానము జేయుదు' నని ప్రతిజ్ఞ చేసిరి.

(తొలిపలుకులు. అవధాన మంజరి. శేషాద్రిరమణ కవులు. 1-12-1926)

స్పర్థతో ముందుకు దూకి ప్రతిజ్ఞ చేసి, చేయు అష్టావధాన మహాకార్యమునకు హద్దులు నిర్ణయించలేము. అందుచేతనే నర్సారావుపేటలో అష్టావధానము చేసిన తరువాత శ్రీ చెళ్ళపిళ్ళవారు శతావధానము కంటె అష్టావధానమే కష్టమనిరి.

'అలరు శతావధానమున నత్యధికంబగు కష్టమంచు ప్రా
జ్ఞులె పచియింత్రు గాని యది సూనృతమంచనుకోనునేను, సొం
పలరగ నెవ్వరేనియును నష్టవధాన మొనర్ప మెత్తు నో
యలఘులు సభ్యు లయ్యదియు నాత్మకు మీకును వచ్చియుండెనే.'

(శతావధాన సారము)

తమ యష్టావధానము చూచినవారికి తమ మాటయందలి యాథార్థ్యము గోచరించునని వారి విశ్వాసము.

ఏడ్చుచు, పిసినిగొట్టువాడు తద్దినము పెట్టినట్లు, శాస్త్రోక్తక్రమమున అష్టావధానము చేయుట కాదు- సొంపలరగ జేయవలెను. ఆ విద్య శ్రీ చెళ్ళపిళ్ళ వారి సొత్తు.

ఓడ సముద్రపు నీళ్ళు త్రవ్వుకొనుచు ప్రహతమైన తన మార్గమున తాను గమ్యస్థానాభిముఖముగా పయనించుచుండును. నడుమ తరంగముల ఆటు పోటులు, జలజంతువుల సంరంభ విజృంభణములు, ఝంఝూప్రభంజనాద్యుపద్రవములు నెదుర్కొని తొలగించుకొనుచు నెమ్మదిగా సాగుచుండును నిర్దిష్టవేళకు భద్రముగా గట్టుజేరుకొన్నదే ఓడ. ఔణకక బెణకక కర్తము నిర్వహించి పద్యము లప్పగించిన వాడే అష్టావధాని.

చిన్న సన్న చిల్లర మల్లర కవులందరు అష్టావధాని బిరుదము తగిలించు కొని యహమహమికతో మీసలు ద్రిప్పుట చూచి, తిరుపతి వేంకటేశ్వరులు తమ అష్టావధానశిఖరి నాకసము దాకించిరి. తత్సమయమున ప్రతిస్పర్థుల నుద్దేశించి వారు పలికిన స్రగ్ధరావృత్తమును ఖరికించితిమేని యీ విషయము ప్రస్ఫుటముగా బోధపడగలదు.

'వక్తా వ్యస్తాక్షరాణాం చ్యుతిసహితతయా షోడశా దూనకానాం
పద్యానాంచ త్రయాణాం కథమపిచ భవే ద్యోఽపి వాష్టావధానీ
సోఽయం సాక్షాన్మహాకాళ్యధికతరదయాపాత్ర విద్వత్కవీంద్రై 9
స్స్పర్థాళుశ్చే త్కథం వా సభవతు కలహో వ్యాఘ్రమార్జాలశిశ్వోః'
(ఉపోద్ఘాతము. నానారాజ సందర్శనము)

ఓనమాలు రానివాడు గూడ సభావేదిక లెక్కి, తప్పుడు తడక పద్యము లల్లి గొప్పలు బోవును. పిల్లి తాను వ్యాఘ్రగోత్రసంభవనని నిక్కినంత ఆది పులియగునా? పులి పులియే! పిల్లి పిల్లియే పులి కంటె నే నెక్కువ గంతులు మొగ్గలు వేయగలనని పిల్లి తీంద్రించి ఓభీషికలు చూపినచో నెవరేమందురు? నవ్వుకొందురు.

—: o :—

9)

# అవధాన నిర్వహణము, కాలప్రమాణము

అవధాని కిరుప్రక్కల పృచ్ఛకులు కూర్చుండి యుందురు. పృచ్ఛకులు క్రమముగా నొకొక్కరు తమ ప్రశ్నములను జెప్పుచుండగా, అవధాని యొక్కొకరి కొకొక్క పద్యపాదము మాత్రము చెప్పికొనుచుబోవును. చెప్పినది చెప్పినట్లు పృచ్ఛకులు వ్రాసికొనుచుందురు. ప్రథమావృత్తి పూర్తి కాగానే, ద్వితీయా వృత్తిలో ద్వితీయపాదము వాకొనును. పృచ్ఛకులు నోరు మెదపకుండ కూర్చుండి వ్రాసికొనుచుందురు. తమ ప్రశ్నమును దిరిగి చెప్పుట కాని, జ్ఞప్తికి దెచ్చుకొనుటకు దోడ్పడుట గాని యుండదు. వారి మొగములు చూచి యవధానియే గ్రహించును. లేదా, సంఖ్యనుబట్టి గ్రహించును. పూర్వోక్త పద్యపాదమునకు అతుకు లాగున ద్వితీయపాదము వాక్రుచ్చును ఇట్లే తృతీయ చతుర్థావృత్తులలో తృతీయ చతుర్థ పాదములు పక్కాణించి పద్యములు పూర్తి చేయును. సీసపద్యము లున్నచో ఎత్తు గీతి పంచమావృత్తిలో నుడివి పూర్తి చేయును చేసిన తరువాత ఒక్క క్షణమాగి, చెప్పిన పద్యముల నుపస్థితికి దెచ్చుకొని, వరుసగా నెవరి పద్యము వారికి అప్ప జెప్పును. అప్పజెప్పునప్పుడు పృచ్ఛకులు తాము వ్రాసికొనియుండిన పద్యములు సరిచూచుకొనుచుందురు. మొదటిది కవితాపరీక్ష. తుదిది ధారణాపరీక్ష. ఉభయ పరీక్షలందును అవధాని నెగ్గినపుడే పృచ్ఛకు లామోదము ప్రకటింతురు.

ఇది కవిత్వాంగ సంబంధి విషయము. ఒక పృచ్ఛకునకు ఒక పద్యపాదము జెప్పుచుండగా మఱొకపృచ్ఛకు డడ్డము రాడు పురాణము, కావ్యపాఠము, గణితము, శాస్త్రార్థము మున్నగు విధులు నిర్వహించు పృచ్ఛకులకును క్రమ మున్నది. వారి వంతు వచ్చినపుడే కాని తక్కిన వేళ యందు వా రడ్డు రారు. గంట వాడు, పువ్వులవాడు, వ్యస్తాక్షరివాడు, లౌక్య సంభాషణమువాడు - ఈ మువ్వురు ప్రమాదకారులు. వీరు వేపరుపగా ప్రవర్తింతురు ఏదో పద్య మాలోచించుకొను చుండగా, గంట ఖంగున మ్రోగునో, పువ్వు రివ్వున బడునో, చేతిలో కాగితపుదునుక కనబడి యంతలో మాయమగునో, చెవిలో లౌక్యపు జోరీగ గుంయి

మనునో, యౌగపద్యముగ నాలుగును నెగడునో చెప్పలేము. సంఘ్యేము ఘంటా ధ్వని పుష్ప ప్రపాతములు లెక్కించుకొనుచు, కాగితపుదునుకలలో సపంఖ్యాముగా వ్రాసి చూపించెడి వర్ణముల క్రమపఱచుకొనుచు, లౌక్య ప్రసంగము చమత్కార జనకముగా నలపరించుచు. మీది కవిత్వ వ్యాపారము పొల్లువోకుంత నిర్వహింప వలెను. ఇట్లు అష్టవిషయైకతానమతియై కృతకృత్యుడగువాడు అష్టావధాని.

తిరుపతి వేంకటేశ్వరుల విశేషావధానమునకు ఏడు గంటలు. తొమ్మిది గంటలు, పది గంటలు పట్టెను సాధారణాష్టావధానమునకు రెండు గంటలు లేదా, మూడు గంటలు పట్టియుండును.

వేంకట రామకృష్ణ కవులు ఒక గంట పది నిముసములలో పిఠాపురమున అష్టావధానము చేసిరి (వేంకటరామకృష్ణ గ్రంథమాల)

పురాణము శాస్త్రార్థము, లౌకిక ప్రసంగము వంటివి పెంచుకొనుచు బోయినచో గంటలు కాదు దినములు చాలవు వానిని ఎక్కడివి కక్కడ త్రుంచి కొనుచు బోయినచో ఒక గంట లోపలనే ముగించవచ్చును.

మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరుగారి 'అష్టావధాన వినోద సభ' పగలు మూడుహోరలప్పుడు ప్రారంభమై, రాత్రి యెనిమిది ఘంటలవరకు జరిగెను. అయిదు గంటల కాలము పట్టినది. సభాంతమున నభినందన పద్యోపన్యాసాది విలాసములసలు మొత్తమును మించిన వడ్డివలె నతిశయించినవో, అష్టావధానమే పెండ్లినడక నడిచినదో వింగడింపబడలేదు

(రాజా మంత్రిప్రెగడ భుజంగరావుగారి అష్టావధానము పుట 2.)

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు 'ఈ పనియంతయు ముగియు టకు రెండు గంటలకాలము పట్టిన'దన్నారు (స్వీయ చరిత్ర.)

బ్ర సం. వి. శేష గిరిశాస్త్రులు 'ఈ యష్టావధానము పూర్తియగువరకు సుమారు నాలుగు గంటలు పట్టిన'దన్నారు (అవధాన దర్పణము. పుట. 158)

శ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులవారు 'తనీసము అష్టావధానము నాలుగు గంటలు పట్టు'నన్నారు. (విజ్ఞాన సర్వస్వము. షష్ఠసంపుటము. పుట 622)

సావకాశముగా జేసినచో ఐదుగంటలు పట్టునని వారి తాత్పర్యము.

ఆకాశపురాణము సాగించుచు, నడుమ నడుమ అదనముగా దత్తములగు సమస్యాపికలు లప్పటి కప్పుడే అళువుగా పూరించి వినోదించుచు, అప్రస్తుత ప్రసంగికి అడుగడుగున సమాధానము చెప్పి, సభ్యుల నలరించుచు, ప్రత్యక్షర నిషేధముగా నిషేధాక్షరి నాలుగు చరణములు రచించుచు, అష్టావధానము జన మనోరంజకముగా నిర్వహింపవలెనన్న నాలుగు గంటలకు తక్కువ పట్టదు.

ఆకాశవాణీ కార్యక్రమమున అష్టావధానము అరగంటలోనే పూర్తి చేయ వలసి యుండును. పై పోట్లు లేకున్నచో పద్యము లల్లుట యెంత సేపు !

నీటి కొలది తామర.

—:o:—

# ద్విగుణిత త్రిగుణిత చతుర్గుణిత పంచగుణిత దశగుణితాష్టావధాన ప్రకార విచారము

ఒక అష్టావధానము జనమనోహరముగా నిర్వహింపగల వ్యక్తి యేక కాలమున రెండష్టావధానములు నిర్వహించుట యెట్లుండును? ఇద్దరు భార్యలతో కాపురము చేసినట్లుండును!

లౌక్య సంభాషణము చేయు పృచ్ఛకు లిద్దరు చెఱియొక ప్రక్క నుందురు. ఒకరు వదలిన నింకొకరు పట్టికొందురు వారికి సమాధానము చెప్పుచుండగనే ఘంటికు లీ చెవిలో దూరునట్లొకరు, ఆ చెవిలో దూరునట్లొకరు ఇద్దరు గంటలు కొట్టుదురు. పుష్పతాడనము పెట్టుకొన్నచో, వీపుపై గొట్టువా రిద్దరు చేయి చేసికొందురు. ఈ సందడిలో వ్యస్తాక్షరి పృచ్ఛకులు తమ యక్కరముల కాగితపు ముక్క లిరుప్రక్కల నిక్కి చూపింతురు. కాగా, నిషేధాక్షర్యాది పృచ్ఛకుల ద్వంద్వరణమునకు దెఱిపి యెపుడౌదవును? ఒదవెబో, అదెంతసేపు? 'అయ్యా! నేను రెండు పెండ్లిండ్లకు సంబంధించిన గుంపులకు వడ్డింపవలసియున్నది. కనుక, విస్తర పఱచి, ముచ్చట్లాడుచు. కొసరుచు వడ్డించుటకు వీలులేదు గబగబ బఫెట్ తిండివలె అందజేయుదును. సరిపెట్టుకొనవలెను అని విన్నవింపవలెను.

సాంగోపాంగముగా చక్కగా ఒక్క అష్టావధానము నిర్వహించుటకు మూడు గంటలకు పైగా పట్టును ద్విగుణితాష్టావధానమునకు ద్విగుణితకాలము - అనగా ఆఱు ఏడు గంటల కాలము తీసికొని చక్కగా నిర్వహింప వచ్చును గదా, అన్నచో అది సరే

ఈ లెక్క ప్రకారము త్రిగుణిత చతుర్గుణిత దశగుణిత సమగ్రాష్టావధానముల కెంతకాలము పట్టునో చెప్పనక్కఱ లేదు. తారీఖు మాఱును.

గంటకు పదిమైళ్ళ వేగముతో నడిచెడి బండిని గంటకు వందమైళ్ళ వేగముతో నడిపింపవచ్చును. అదే మాదిరి కవితాధారావేగము పెంచినచో అల్ప కాలముననే అధిక సంఖ్య నధిగమింపవచ్చును గదా! అన్నచో, ఇక్కడొక చిక్కున్నది. ఒకేసారి కప్పించి త్రొక్కినట్లు పద్యమంతయు వక్కాణింపరాదు. ఒకొక్కసారి ఒకొక్క పాదమే వక్కాణింపవలెను. ఆ వక్కాణించిన పాదమును మఱియొకమారైన తనలో తాను వల్లించుకొని, ధారణాగృహమున భద్రపఱచు కొనవలెను. వదపడి వచ్చినచోటికే మమ్మాఱు వచ్చి మూడు పాదములు సంధింప వలెను ప్రతిదఫా పూర్వోక్తచరణముతో పరోక్తచరణము సరిగా పొసగు చున్నదా, లేదా? అని పరీక్షించికొనుచుండవలెను. టేప్‌రికార్డరు యంత్రమున వేగము పెంచినట్లు అష్టావధాని తన ధిషణాసంపుటియందు వేగము పెంచలేడు. తటిల్లతా ద్రుతగతి జెప్పలేడు కనుక జాగు తప్పదు ఈ జాగు దశగుణితాష్టావధాన మున తారీఖు మాఱు దనుక జరుగుట కవకాశముండును. ఈ యరిష్టమును పరిహరించికొనుట కొకపన్నిక యెత్తవలెను ఒకే యష్టావధానమైనచో ఆడుకొనుచు పాడుకొనుచు జేయవచ్చును పని నిర్వహింపవలెను గనుక, అధికప్రసంగము కట్టి పెట్టి అందరు సహకరింపవలెను. యథావిధిగా జరుగవలెనని కూర్చున్నచో తెల్ల వాఱినను దశావష్టావధానేష్టి తెల్లవాఱదు. ఇది యథార్థము ఇక మీ యిష్టమని చేతు లెత్తవలెను పృచ్ఛకులు, సభ్యులు నందరు నైకకంఠ్యముగా నవునవునందురు. అప్పుడు పృచ్ఛకులు సరిగా సగము మంది తమ యెత్తిన కత్తులను దింపి. యొఱలో దూర్చికొని చిత్తరువుల వలె గూర్చుందురు. మిగిలినవారు, కఠోర గర్భిణియైన కన్నకూతురుపై కార్యభారము మోపక ఆవోక తిరగనిచ్చు పితరుల వలె నేమము సడలించి కూర్చుందురు అవధాని పని, గాలి వాటమునకు తెరచాప యెత్తిన పడవ వలె, నిరర్గళముగా సాగును. తుదకీ ప్రక్రియ అర్ధశతావధానమున కంటె లోకువైన దశగుణితాష్టావధానమనెడు పేరు నేలిబీర యగును

17 వ శతాబ్దిలో చిన్‌చిహుఆవాంగ్టీ యనెడి చైనా మహారాజుకు 13,140 పదుమూడువేల నూట నలుబది (మంది) భార్యలుండిరట అమ్మహామహుడు త్రయో దశసహస్రాధిక కళత్రరత్నములతో తనివిదీఱ కాపురము నెఱపెనని పలుక వచ్చు గాని, అందఱిని దనిపి యేలికొనెనని పలుకలేము గదా!

'పెక్కుపూవుబోండ్ల బెండ్లాడి పైపై నా
నర్చు కాపురమ్మున రసము చెడు,
చక్కగా నొనర్చు నొక్క యష్టావధా
నమ, తనర్చు సహృదయ మధురగతి.'

(శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము)

### అష్టావధానగర్భిత శతావధానము

ఒక పద్యము కడుపున నింకొక పద్యము నిమిడించి చెప్పుట గర్భకవిత్వ మందురు సీసపద్యమున మత్తేభ విక్రీడితము, కందము, గీతము - మూడింటి నిమిడించి చెప్పవచ్చును.

శతావధానము సీసపద్యము వలె నిడుపుగా సాదాగా నుండును. కనుక దానియందు అష్టావధానమును గర్భీకరించి, పైపెచ్చు ఘంటాత్రిశతిగా ఘంటా పంచశతిగా ఆశుకవిత్వము చెప్పుటకు యత్నించిన కవు లున్నారు.

వ్యుత్పన్నుడు, ఆశుకవి, సంగీతమధురవాణి, అగ్రామ్యపరిహాసకుశలుడు, స్ఫురద్రూపి, మేధీయుడు అగు మహాత్ముడే తాదృకకృతిక్షముడగును.

—:○:—

# నిషేధాక్షరి

అష్టావధానమునకు కిరీటాయమానమైనది నిషేధాక్షరి తక్కిన పృచ్ఛకు లందఱొక యెత్తు. నిషేధాక్షరి పృచ్ఛకు డొక్కఁడు నొక యెత్తు. అందఱు నేదో యడిగి కూర్చుందురు. తలవంచికొని, చెప్పినది వ్రాసికొందురు ఇతరదట్లు కాదు. చేయి చేయి కలిపి కుస్తీ పట్లకు దిగును అడుగడుగున నడ్డు తగులును అందుకే 'నిషేధాక్షరి యొకటి ప్రేవులు తెంచు' నన్నారు మధురాపంతులవారు.

నిషేధాక్షరి పద్యము నిర్మించుట జిమ్మియాకుతో విస్తరి కుట్టుట వంటిది

దీని లక్షణ మిట్లు చెప్పబడినది:

'స్వాపృష్ట వృత్తవర్ణ్యే పద్యే యత్ర ప్రత్యక్షరం
నిషిధ్యంతే వర్ణాః పృచ్ఛకైః స్తత్ నిషిద్ధాక్షరమ్.' (అవధానాదర్శః)

పృచ్ఛకు డొకవృత్తమున నొక విషయము వర్ణింపగోరును. అవధాని ఆ వృత్తమున ఆ విషయము వర్ణింప మొదలుపెట్టును. పృచ్ఛకుడు యోజించి, తన కేయక్కర మక్కఱ లేదో చెప్పుచుండును నిషిద్ధాక్షరము వదలి వేఱొక యక్షరము వేసికొనుచు అవధాని పద్యము నడిపింపవలెను గణ యతి ప్రాసచ్ఛందో నియమములు పాటించుచు. వర్ణ్యవిషయము రూపొందులాగున ముందుకు సాగవలెను. అది యెట్లనగా, శ్రీరామ పట్టాభిషేకము వర్ణ్యవిషయ మనుకొందము. పృచ్ఛకుడు దశరథుడై శ్రీరాముని గాని, తత్సహోదరుని గాని, హనుమత్సుగ్రీవాదులను గాని శుద్ధాంతమును గాని పొడసూపనీయక నిషేధించుచుండును. శ్రీరామ ప్రవేశమున కవకాశముండదు రాముడే రాకున్న పట్టాభిషేక మెవరికి? రాముడు రావలెను. కనుక రాముని దెచ్చుటకై యవధానిశిరోమణి శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు 'అవధాన తత్త్వశాస్త్ర ప్రకారము నిషిద్ధాక్షరికో వర్ణ్యవాచక పదములోని వర్ణమును నిషేధింప జనదు' అని యొక వర్తని జూపిరి

(అవధానయాత్ర. పూర్వభాగము. పుట 52)

అచ్చతెనుగు కబ్బము రచించుచు బొన్నిగంటి తెలగన్న –

కం. తెనుగుననను మాఱు పేళ్ళిడి
పెనచిన వినగూడ దనుచు బిరుదులు బేళ్లన్
మును వేల్పుబాస వెంబడి
నునిచెద గాదనకుడయ్య! యుల్లము లందున్.

(యయాతి చరిత్ర. 1-14)

అన్నాడు. ఇపుడు కృష్ణాచార్యులవారు సెలవిచ్చిన వర్తని కూడ అట్టిదే. దానిని బాటించినచో, దొరగారి కుటుంబసభ్యులకు నాటకశాలలో ఫ్రీపాసు వలె నిషేధాక్షరి పద్యమున వర్ణ్యవాచకములోని వర్ణములకు సుఖప్రవేశము కలుగును. అవధాని పని సుకర మగును.

అచ్చతెనుగు కబ్బమున 'రాము' డనుటకు బదులు పదితేరులవాని తొలి పట్టి యని వ్రాయవచ్చు. అసలు దశరథుడనగా పక్షిరథుడు - విష్ణునామము సుగమమగు నీ యర్థమును బరికింపక, పదితేరులవాడని, బంతిబండ్లవాడని మన పెద్దలు మాఱు పేళ్లిడిరి. అచ్చతెనుగు కవి తత్సమనామధేయములు యథాతథముగా వాడుకొనునట్లే అవధానియు వర్ణ్యవాచకపదములు నిరాటంకముగా వాడుకొనుట జరిగెనేని, నిషేధాక్షరీ పద్యనిర్మితి తేలికయై దాని బైసిపోవును. కావున కష్టపడి యైన పర్యాయపదములు కల్పించుకొని శ్రీరామాదుల రంగమునకు దెచ్చి, పట్టాభిషేకము జరిపింపవలెను. అట్లు జరిపించినపుడే నిషేధాక్షరికి సార్థక్యము.

ఘంటాపథముగా రథము లాగుట బరువు కాదు. కర్దమస్థపుట స్థలమున జక్రములు తిరుగకుండ మోకులతో బిగించి కట్టిన నిండు బండి లాగుట మిక్కిలి బరువు సాధారణ పద్యరచనము ఘంటాపథరథగమనము. నిషేధాక్షరీ పద్యరచనము పంకస్థపుటపథరజ్జు బద్ధచక్ర రథగమనము. సాగదు. సాగించుట కెంతో శక్తి బూనవలెను.

'అవధానాదర్శ' కృతికర్త వర్ణ్యవాచకపదములోని వర్ణముల నిషేధింప వచ్చునా, లేదా అను విషయము స్పష్టపఱుపలేదు కాని, యవధాన సభలందు వారు చెప్పిన చాల శ్లోకములందు వర్ణ్యవాచకపదములను నేరుగా చొప్పింపక,

చుట్టు త్రిప్పి, త్రుంచి, చొప్పించిన తీరును బట్టి వర్ణ్యవాచకపదము నందలి వర్ణములను గూడ పృచ్ఛకుడు నిషేధించెనని, దానికి వారు తలయొగ్గిరని తెలియు చున్నది. ప్రజ్ఞాధిక్యము ప్రదర్శింపదలచువారే దీని కియ్యకొందురా? 'రౌతు మెత్తనయితే గుఱ్ఱం మూడు కాళ్ళతో నడుస్తుంది' అన్నట్లు పృచ్ఛకుడు మెత్తని వాడు తటస్థించినచోట అవధాని స్వతంత్రించి వర్ణ్యవాచకపదము నిషేధించునా? లేక, అవధానులే ఒకొక్క సభలో ఒకొక్క నియమము పెట్టుకొందురా? పూర్వ కాలపు అవధానులలో మీది ముత్తైదువుల ధోరణులును గోచరించును

ప్రత్యక్షర నిషేధము వర్ణ్యవాచక వర్ణములకును గలదు. వానిని నిషేధింప జనదనుట భావ్యము గాదు

యతి ప్రాసలకు నిషేధము లేదు.
పద్య మన్నంతనే యతి ప్రాస లుండక తప్పదు.
'ఆద్యో వళి ద్వితీయో వర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు
స్వస్వచరణేషు పూర్వః ప్రాసః సర్వేషు చైక ఏవ స్యాత్.'
(ఆంధ్ర శబ్దచింతామణి)

ఈ నియమ మపరిహార్యము. కనుక యతి ప్రాసాక్షరము లతికికొనుటకు అవధాని కవకాశ మీయవలెను.

కొందరు-ప్రాసము సావర్ణ్యనియమము కలది కనుక నిషేధింపదగదు. యతి తదన్యమిత్రవర్ణస్థితి నంగీకరించును గనుక నిషేధింపదగునని వాదింతురు. అది సమంజసము కాదు. రేఫమునకు లకారమునకు అన్యవర్ణమైత్రి చెల్లదు. ప్రాచీనులు రేఫశకటరేఫములకు మైత్రి నంగీకరించినవారు కారు లకార మకార విషయములు గూడ అంతే లకారమునకు డకారము, మకారమునకు బిందుపూర్వక ప ఫ బ, భలు చెల్లింపవచ్చును కాని. అది యంత సుఘటము కాదు లకార మిత్రములైన డకార శబ్దములు తక్కువ ఉన్నవానిలో దేనిని గ్రహించినను తత్పదోత్తరాక్షరము పృచ్ఛకుడు టక్కున నూహింపగలుగును. బండి నిలబడును. ఇక బిందుపూర్వక పఫబభవర్ణములు మకారమునకు మిత్రములైనను యతిస్థాన మున, కందమునందుగాని, ప్రసిద్ధవృత్తములందుగాని నిలుపుటకు గణ నియమ మడ్డువచ్చును ఇట్టి చిక్కులెన్నోయున్నవి. కనుకనే యతికి నిషేధము లేదనిరి.

యతి ప్రాసవర్ణముల స్వచ్ఛంద క్లుప్తికి అవకాశము కలదు ఆ యింత యవకాశము అవధానికి మేరువంత మేలు చేయును

రామశబ్దము గూర్చికొను నుద్దేశముతో నవధాని మకారప్రాసము దీర్చికొనుట జరిగెనేని పృచ్ఛకుడు పాదాదియందు రేఫమును నిషేధించుచునే యుండును. ప్రాసాక్షరమగు మకారమున కవకాశ మిచ్చునే కాని, తత్పూర్వాక్షరమగు రేఫమున కవకాశ మీయడు. యతిస్థానమున నెట్లో క్రమపడి రేఫము వేసికొనవచ్చు గాని, మకారము కుదురదు. 'రామ' శబ్దము బదులు 'రాజ' శబ్దము వేసికొనవచ్చు. దీనికిదోడు సీతాపతి పర్యాయపదములు పొదుగుటకు జూడవలెను. సీత, జానకి, మైథిలి, భూపుత్రి లక్ష్మి-వీనిలో సీత ప్రాసస్థానమున సులభముగా నిలువగలదు. దానికై తకారప్రాసముతో పద్యము నారంభింపవలెను. పృచ్ఛకుడది కనిపెట్టి పాదాదియందు సకారము నిషేధించుచు వచ్చును. జానకి త్ర్యక్షర శబ్దము· కాబట్టి, యెక్కడను నిముడదు. మైథిలియు నట్టిదే భూపుత్రి తత్పర్యాయ పదములతో నెక్కడనైన నిమడగలదు. భూజ, క్ష్మాజ, జ్యాజ, కుజ వంటి శబ్దముల మీద ఇన, ఈట్, ఈశాది ప్రభు పర్యాయపదములు చేర్చినచో రాము దవతరించును.

యతిస్థాన పూర్వ వర్ణము 'కు' చెప్పినచో, యతి స్థానమున నిర్నిషేధముగ 'జ' చెప్పవచ్చును. కు వర్ణము ద్రుత వశమున సరళమైనచో పృచ్ఛకుని దారి తప్పించును. యతిస్థానమున 'జ' వర్ణము నిలుపుకొనదలచినచో అవధాని ముందుగనే పాదాదియందు తన్మిత్రాక్షరము నిక్షేపించికొనియుండవలెను.

నిషేధాక్షర పద్యరచనయం దుపయోగింపబడెడు సామగ్రి - ఏకాక్షర నిఘంటువు, ద్విరూపకోశము, పదసంధి, అన్యార్థభ్రాంతిక్పత్పదము,శబ్ద చమత్కారము, అప్రసిద్ధ గూఢపదము, జల్లులు - వీనినుండి సంగ్రహింపబడు చున్నది

ఏకాక్షర నిఘంటు ప్రయోజన మెంతైన నుండును. ఒకొక్క యక్కరమునకే పది పదునేనర్థము లుండును అట్టి బహ్వర్థకాక్షరములను బట్టికొని పద్యము నందు సార్థకముగ నొదిగించికొనుటకు దక్షత కావలెను.

'అకారో బ్రహ్మ విష్ణ్వీశ కమఠే ష్వంగణే రణే గౌరవేఽన్తఃపురే హేతౌ భూషణేఽజ్ఞాపి వృమే జ్యయోః' (ఏకాక్షర పదకాండము. నానార్థ రత్నమాల.)

అకారమునకు పదుమూడర్థములు.

'ఞో' వ్యూహే విషయే గర్వే లేపే మూర్ధ్ని ఖరధ్వనౌ త్రిషూత్తానే మూఢరూపే క్లీబే తు భయపద్యయోః'

ఞ వర్ణమునకు పది యర్థములు.

'హం క్లీబ మన్త్రసుఖయోః క్వణితే మణిరోచిషి పరబ్రహ్మ మంత్రణయో స్త్రిషు తూత్థాన హాస్యయోః '

హం వర్ణమునకు ఎనిమిది యర్థములు.

ఏకాక్షర నిఘంటు స్వరూప మిట్లుండును ఈ నిఘంట్వక్షరములు నిక్షేపించుచు ఐద్యము నిర్మింపగల యవధాని పృచ్ఛకుని యూహాకందని దుష్పథమున బోవుచుండును

రెండవది ద్విరూపకోశము. దీని సాయముతో నవధాని నిలబడకుండ ముందుకు బోగలడు క్రిందికొమ్మమీద కాలూని నిల్చి, మీది కొమ్మను గట్టిగా జేత బట్టికొనియుండిన వ్యక్తి. క్రింది కొమ్మను వదలిన పైకొమ్మ నాలంబము చేసికొని నిలువ వచ్చును పై కొమ్మను వదలిన గ్రిందకొమ్మ నాలంబముగ జేసికొని నిలువ వచ్చును ద్విరూపకోశము నాలంబముగాగొను నవధానియు నంతే

'కవాటంచ కపాటంచ కపిలం కపిలం తథా
సంకర శ్శంకరోఽపి స్యాత్ తలునీ తరుణీ తథా'
(శ్రీ పురుషోత్తమదేవ ప్రణీతః శబ్దభేద ప్రకాశః)

ద్విరూపకోశస్వరూప మిట్లుండును

సాధారణముగా జల-జడ, తటాక-తడాగ, రోమ-లోమ, దులి-దలి శబ్దము లంద రెఱిగినవే యయినను వాని నూతగొని సాగు నవధానిని పృచ్ఛకుడు కదలింపలేడు అగు, అవు, ఔ వంటి క్రియలెంతో యుపకరించును.

పదసంధి అవధాని చేతిలో నొక మంత్రదండము. దానిచే బృచ్ఛకుని కన్నుగప్పి తప్పించుకొనును.

'స్వ' అన్నంతనే పృచ్ఛక పండితునకు 'స్వో జ్ఞాతా వాత్మని స్వం త్రిష్వాత్మీయే స్వోఽస్త్రియాం ధనే' అను నమరకోశ శ్లోకము స్ఫురించి, యతని బుద్ధి తద్గత నానార్థజాతమున మునిగి తదన్యము పట్ల మూఢమగును. అవధాని సు + అ = స్వ యణాదేశసంధినిష్పన్నరూపము జెప్పును

'సచ్ఛ' అన్నాడనుకొందము.
సత్ + శ అని ఛత్వసంధి చేసెనా?
సత్ + ఛ అని శ్చుత్వసంధి చేసెనా?
స + ఛ అని తుగాగమసంధి చేసెనా?
తదనంతరపర్ణము వాకొనుదనుక బృచ్ఛకున కెఱుకపడదు.
ఇట్లే 'తద్ధ' అన్నప్పుడు అది తత్ + ధ కావచ్చు.
తత్ + హ కావచ్చు.
'ఓ' విడదీసినచో అ + ఉ + ఓ.
అ = శివునియొక్క, ఉ = నేత్రము.
'ఓతము' = ముక్కంటి కంటి మంట.
'త శ్శంకరే బృహద్భానౌ' = నానార్థరత్నమాల.
ఇట్టి శబ్దము లసలే పృచ్ఛకుల కంతుచిక్క పు.

## అన్యార్థభ్రాంతికృత్పదములు

తెలుగను భ్రాంతి గొలుపు సాంస్కృతిక శబ్దముగాని, సాంస్కృతికమను భ్రాంతి గొలుపు తెలుగు శబ్దముగాని అవధానికి మిక్కిలి అక్కఱకు వచ్చును.

'బొ' ఇది ఝడితిగా తెనుగనెడి స్ఫూర్తి గలిగించును.

తెనుగున అను నను నర్థమున క్రియ ప్రశంసార్థమున నవ్యయము. సంస్కృతమునచో సుకుమారస్వామి, స్వచ్ఛమగు మేను, చంద్రకళ, శేషుడు, సిద్ధులయొక్క విమానము:—అంచదర్థములు

యడాగమము వలన 'ఓ' కారము 'యో' కార మగును. ద్రుతము వలన 'అ' కారము 'న' కార మగును. పృచ్ఛకుడు యోకార నకారములు తత్సమశబ్దాది వర్ణములని భ్రమపడును. యోగ, యోధ, యోని, యోషా శబ్దముల గుఱించి, నక్త, నక్ర, నగ, నట, నత, నద్ధ, నమ్ర, నర, నవ, నష్ట శబ్దముల గుఱించి యోజించును.

ద్రుతము వలన పరుషాక్షరము సరళాక్షర మయినపుడును భ్రాంతి తప్పదు.

ఆల, తల, వల, కల, మల, జడ, పడ, తల్లి, తాత, పూత, చేత, నేత, ప్రోత, ఏల, కోల, ఊరు, పేరు, ఉత్త, చిల్ల, పిల్ల, ముద్ద-ఇవి తత్సమశబ్దములే. కాని, తెలుగు లనెడి భ్రాంతిని గలిగించును.

ఊరు శబ్దమునకు తొడ యనెడి అర్థము కంటే గ్రామమనెడి అర్థమే తటాలున స్ఫురించును. పేరు శబ్దమునకు సూర్యుడు, సముద్రము అని రెండర్థము లున్నను వానికి రూఢి తక్కువ నామధేయమనెడి అర్థమే చప్పున స్ఫురించును. పిల్ల = క్లిన్ననేత్రము ముత్ + ద = ముద్ద. ముదమిచ్చునది. తెనుగున ముద్దగ్రాసపిండము. ప్రతిభాశాలియగు నవధాని యిటుచూపి యటు, అటుచూపి యిటు శబ్దప్రయోగము చేయుచు నిషేధాక్షరపద్యము పూరించును.

శబ్ద చమత్కారము

వర్ణ్యవాచక పదము పల్వలము- అల్పసరస్సు. పృచ్ఛకుడు మనసంతయు పల్వలమునందు పెట్టుకొని యుండును. దానిని రానీయడు. త్ర్యక్షరపదము నవధాని వేయను కూడ. కాశీకృష్ణాచార్యులవారు 'అరం సలం పల్వరమ్' అన్నారు. రేఫము లేనిది, లకారము కలది యైన పల్వరము అనగా పల్వలము ఇదియొక శబ్ద చమత్కారము

'వర్ణ్య వాచక పదములోని వర్ణమును నిషేధింపజనదని చెప్పినను, జ్ఞప్తి లేకయో అవధానిశక్తి పరీక్షింపనెంచియో పృచ్ఛకుడు నిషేధించె'నని ఆచార్యుల వారు వ్రాసిరి. (అవధాన యాత్ర పుట. 52)

శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రి గారు వర్ణ్యావాచకమగు పత్రమును పదము నిఱికించుటకు 'పయ గయు క్సమ్య క్రమ్' అనియు,

'కృష్ణ' అను పదము గూర్చుటకు 'క్రాదిః ష్టః' అనియు, 'కపిత్థ' మను టకు 'పిత్థం కాది' అనియు జెప్పిరి. (జీవితచరిత్ర, అవధాన సాహిత్యము )

అలంకారికులు- 'అప్రయుక్త మపుష్టార్థ మసమర్థం నిరర్థకం నేయార్థం చ్యుతసంస్కారం సందిగ్ధం చాప్రయోజకమ్, క్లిష్టం గూఢార్థకం గ్రామ్య మన్యార్థం చాప్రతీతికం మవిమృష్టవిధేయాంశం విరుద్ధమతిక్రృత్తథా అశ్లీలం, పరుషం చేతి దోషా స్స ప్తదశస్స్మృతాః' (ప్రతాపరుద్రీయము) అని రసాపకర్షకములైనపదగత శబ్దదోషము లుగ్గడించిరి

నిషేధాక్షర పద్యనిర్మాత వీనిని చాలమట్టుకు లెక్కింపడు. అప్రయుక్తము' నిరర్థకము, సందిగ్ధము, క్లిష్టము, గూఢార్థము, అప్రతీతికము. పరుషము అనబడు దోషములు గుణములుగా గ్రహించును.

సాహిత్య దర్పణకారుడు 'గూఢార్థము'ను 'నిహితార్థ'మని వ్యవహరించెను. ఈ కవిరాజు 'నిహతార్థత్వా ప్రయుక్తత్వములు శ్లేషాదులయందు దోషములు కావు' అన్నాడు (సాహిత్య దర్పణము 7-581)

నిషేధాక్షర పద్యము శ్లేషాదులకోవకు జెందిన చిత్రకవిత్వజాతి పద్యము. కనుక దోషజుష్టము కాదు.

నిరర్థకోక్తులనే జల్లిమాట లందురు

'చాలు జాలును పట్టి జగజల్లిమాట' -రంగనాథుడు.

'జల్లి పూరక మపశబ్ద మక్రమము నొల్ల' -పాల్కురికి సోమనాథుడు.

నంది మల్లయ ఘంట సింగయలు - 'పద్యపూరణంబునకు నాదికారణంబులైన సంస్కృతాంధ్రభాషలం గల జల్లులు విసర్జించి' వరాహపురాణము తెలిగింప బూనిరి

ఈ నిరర్థకపు మాటల కూరుపది యెట్లుండునో మూర్తికవి యించుక ప్రదర్శించెను.

కం. ఇల బదపూరణమాత్రం
బలపడినపదంబు కృతి నిరర్థక మయ్యెన్
దలపగ వెలయును లలి ను
జ్జ్వలమగు నీతిని విలాస సౌష్ఠవ మనగన్.

(కావ్యాలంకార సంగ్రహము. 4-9)

ఇట్టి జల్లుల నొల్లక నెమ్మదిగా గూర్చుండి శబ్దము లేఱుకొని, తూచి చూచి పద్యము కట్టుదుమని వరాహపురాణకవుల ప్రతిజ్ఞ మంచిదే. అడ్డగించువారు లేనపు డెన్ని శిల్పములనైన జూపవచ్చును. అవధానికి నిషేధాక్షరపద్యము నల్లునపుడు జల్లులే ముప్పాతికపాలు శరణ్యము లగును. పృచ్ఛకుడు గట్టిగా బట్టికొన్నచో ఒకపాటి యవధాని తట్టుకొనలేడు అట్టివేళ అన్ని జల్లులే పడవచ్చు.

ప్రొద్దుటూరి కన్యకాపరమేశ్వరీశాలలో శ్రీ దోమా వెంకటస్వామిగుప్తగారు అష్టావధానము చేసినపుడు నిషేధాక్షర పృచ్ఛకులు శ్రీ గడియారము వేంకటశేష శాస్త్రిగారు గ్యాస్‌లైటు వర్ణింపగోరిరి దేవతాస్తుతి కాదు, పురాణకథ కాదు. ప్రాచీన కవుల చేతిలో మెదిగిన వస్తువు కాదు. ఆధునికము వెలుగు. శాస్త్రిగారి నిషేధమునకు గుఱియై గుప్తగారి భారతి నడిచిన తీరు-

కం. కడు సమ్మరి నిచ్చన్ గా
నెడ నెచ్చో నొగి కడున్ రహిన్ బలు వెస దా.

ఇది యింతే ఉత్తరార్ధము, ప్రొద్దువోవుట యేల యని, మానివేసిరి. జరిగిన రెండుచరణములలో రెండుచోటుల కాంతిపర్యాయపదము వేయుటకు అవధాని యత్నించిన చిన్నె లగుపడుచున్నవి. ప్రథమచరణమున నాలవయక్కరము 'ని' నిగ్గుననుద్దిష్టము. ద్వితీయచరణమున బదుమూడవయక్కరము 'వె' వెల్గున నుద్దిష్టము. వక్త్రుద్దేశము గ్రహించిన పృచ్ఛకుడు గకార లకారములు నిషేధించుటతో నిగ్గు పోయి 'నిచ్చంగా', వెల్గుపోయి 'వెస' అయినవి. వెలుగు రానేలేదు.

సంస్కృతమున వెలుగున కెన్నియో పర్యాయపదము లున్నవి

'స్యుః ప్రభా రుగ్రుచి స్త్విడ్భా భా శ్ఛవి ద్యుతి దీప్తయః రోచి శ్శోచి రుభే క్లీబే' అని అందఱుకు నోటికి వచ్చిన అమరమున్నది. రుక్, త్విట్, భా, భాః-ఇవి యేకాక్షరములు

ఇక తెలుగున - 'నిగ్గు, డాలు, మిసుకు, మిన, మించు, నిగ, తళ్కు, మెఱుగు, చికిలి, కళుకు, బిగి, రంగు, మెఱపన బొలుచు గాంతి' యని సాంబ నిఘంటువు చెప్పినది. వీనిలో డాలును 'డాల్' అని యేకాక్షరముగా ప్రయోగింప వచ్చును.

చా, ఛ, ద్యు వర్ణములు కాంతిపర్యాయములే. ఆభయు ప్రభయే. శుద్ధాభ లేక శుభ్రాభ యన్నపుడు ఆకారము కనిపించదు భకారము మాత్రమే కనిపించును. కనుక 'ఆభ' యేకాక్షరము క్రిందనే లెక్క.

ఇవి యేవియు గ్యాసులైటు వర్ణన పద్యమున చోటు చేసికొనలేదు.

పద్యార్థము చూతము.

ఎడన్ = ఈ స్థానమున, ఎచ్చో = ఏచోట, అనగా అంతట, ఒగిన్ = వరుసగా, కడున్ = అత్యంతము, తాన్ = గ్యాసులైటు తాను, బలు = మిక్కిలి, వెసన్ = శీఘ్రముగా, రహిన్ = ఆనందమును, కడున్ = అత్యంతము, సమ్మతిన్ = ఇచ్ఛతో, ఇచ్చున్‌కా = ఇచ్చును గదా!

దీనిలో వెలు గెక్కడున్నది? సహృదయుడు వెలుగును 'రహి' శబ్దమునందే చూడవలెను. శబ్దరత్నాకరము రహికి ఆనందము, ఆసక్తి, తెలివి, బాగు, రక్తి, విధము అని ఆఱర్థము లిచ్చినది. ఇక్కడి రహికి ప్రకాశ మనియే ప్రాకరణికార్థము.

పద్యమున 'కడు' పదము పునరుక్తము. అయినను రెంటికి నడుమ 'ఎడ' యున్నది. ఎడ, ఎచ్చో, ఒగి, రహి, బలు. వెస, తా, కా—ఇన్ని తునుకలు

జోడించి పద్యము నిర్మించుట యలతిపని కాదు. ప్రథమపాదాంతమున 'కా' ద్వితీయ పాదాంతమున 'తా' పూరణార్థము వచ్చిన గురువులే పూరణమను మాటకు వచ్చినచో మొత్తము ఇరువదిమూడు వ్రాలు పూరణమే అయినను ఈ కూర్పునందు నేర్పు లేదనలేము.

నిషేధాక్షర పద్యములు భూతచికిత్సకు డుచ్చరించు మంత్రముల వలె నుండునని కొందఱు ఎగతాళి చేయుదురు. కాదనలేము. కాని, మాంత్రికు డుచ్చరించు బీజాక్షరములకు సాహిత్య సంబంధియైన యర్థము చెప్పజాలము. అవధాని కట్టిన పద్యమునకు చెప్పవచ్చును. ఈ పద్యము చూడుడు.

కం. ప్లాథృ సువి ద్దాథాంత
రోఽవ్వోథృ కథాకృ త్సదృ గ్వపుర్ద్యుతి బునా
రోథృగభస్తి రవి యెసగె
గాథధ్వజఘస్తి జేసి క్షణికక్లాంతిన్.
(శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము)

పృచ్ఛకగ్రస్తకవి, కేతుగ్రస్త రవి వర్ణ్యవిషయము

పై పద్యమునందలి శబ్దములు దుశ్శ్రవములే కాదు, అప్రయుక్తములు, సందిగ్ధములు, క్లిష్టములు, గూఢార్థములు అప్రతీకములు గూడ అవియే అవధానికి శ్రీరామరక్ష.

సువిత్తులు = ప్రచ్ఛకపండితులు, ప్లాథలు = పందెము చలుచువారు. దాథ = కోఱపల్లు, సమూహము. కథాకృత్తు = అవధాని, వోథ = ధురంధరుడు పునారోధృగభస్తి రవి. తిరిగి మొలకెత్తు మిసుకుపాము, ధ్వజఘస్తి = కేతుగ్రహణము. ఇందేదియు నిరర్థకపదము లేదు.

మాధుర్యగుణధర్మయుతమైన పద్యములును నిషేధాక్షరియందు చెప్పవచ్చు ననుటకిక్రింది పద్యము తారకాణ

వర్ణ్యవిషయము జనాభా పెరుగుదల వలన పేదవాని పరిస్థితి.

కం. భూర్ణియగు భూమి న్వాద్ధిన్
బర్ణి మిగుల్ జాడ యేడ? ప్రబ్బె నెగుల్, ఒల్
కీర్ణి గుచేలసద్మ తుడు
జీర్ణి బడలు నేటి పౌరశేఖరు డకటా!

భూర్ణి = మరుభూమి పర్ణి = పర్ణములు గలది, వృక్షము ఏర్ణి = పుడమి. నృ = ఋద్ధి = న్వార్ద్ధి = నరుల పెరుగుదల

(శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము.)

వర్ణ్యవస్తువు

లక్షణ దీపిక ఇష్టార్థదేవతాపరిపతిపాప నిషిద్ధాక్షర చమత్కృతి' యనెను. దేవభాషయందు దైవస్తుతికి నెంతయైన సామగ్రి లభించును. నిషేద్ధ రెండు చేతు లొడ్డినను అవధాని యుఱుకు. ఒడలికె నూనె పూసికొనిన మల్లునివలె దుసికిలిపోగలడు. ప్రాయశః దేవతాస్తుత్యాత్మక పద్యములే చెప్పబడును.

పార్వతీపరిణయము, సీతాకల్యాణము వంటి దేవతావివాహ వర్ణనాత్మక పద్యములు కొంచెము బరువగును అయినను అంగీకార్యములే

ఒక కల్పన యిచ్చి పద్యము కట్టు మన్నచో కష్టము. ఆ రీతిగా పృచ్ఛకు డడుగ గూడదు. అవధాని యొడబడ గూడదు. సరే యన్నచో పృచ్ఛకు డొక హద్దులో నుండడు మహాభారతకథ యంతయు పిసికి పిండము చేసి కందపద్య మున జొప్పించి చెప్పుమనును. మఱియు పలుమన్నచో నొక యలంకారము గిలింపు మనును. ఇది సాధ్యమా? యన్నచో 'వరస్వతిస్వరూపులగు మీకు అసాధ్యమా?' అనును. కనుకనే పెద్దలు 'దేవతాస్తుతి' చాలున్నారు.

కల్పనాత్మక పద్యము లడుగ గూడదు. అయినను ఒకరకముగా నున్న ప్రశ్నములను ప్రోసిపుచ్చక, కొంద రవధానులు తలయొగ్గుదురు. అది వైయక్తి కౌదార్యమేకాని, నియతకార్యము కాదు.

దేవతాస్తుతి సంబోధనాత్మకముగా చెప్పుట మిక్కిలి సులభము.

'రావే! వేవే శ్రీశా!' ఇది కందమున మొదటి పాదము.

రెండవ యక్షరము 'వే' నిషేధించినచో 'రా' యనవచ్చు. పదము తెగినది. కనుక అవధాని యే యక్షరముతోనైన నారంభింపవచ్చు. కనుక తెలిసిన పృచ్ఛకుడు నిషేధము లేదు సాగిపొమ్మనును. 'వే' చెప్పిన 'గ' నిషేధించును. తిరిగి 'వే' చెప్పిన పదము తెగును. విష్ణుస్తుతియైనచో 'శ్రీ' తరువాత 'శ' నిషేధించును. 'శ్రీశా' అనదలచిన యవధాని 'శ్రీనా' యనును. ఈశుడన్నను ఇనుడన్నను భర్తయే.

దేవతాస్తుతి వర్ణనాత్మకముగా చెప్పుట యొప్పు.

సరస్వతీ స్తుతి:

కం. సృణి రోక సత్వర లస
త్పృణిఫణ కుద్దియగు ధీశిఫ కడున్ వేణీ
ఘృణి సాగుగాక! మణికిం
కిణిక్వణితకాంచియైన గీస్సృతి కరుణన్.

సృణి = సూర్యునియొక్క, రోక = ప్రకాశముచే, ఎండచే, సత్వరలసత్ = గప్పున మెఱయుచున్న, ఫణిఫణకు = పాపపడగకు, ఉద్దియగు = సాటియగు, ధీశిఫ = బుద్ధియనెడి నది, వేణీఘృణి = జలప్రవాహలీల, గీస్సృతి కరుణన్ = సరస్వతి కృపచే, సాగుగాక = వర్ధిలుగాక! వాక్సతి మణికింకిణిక్వణితకాంచి యనగా శ్రీసంపన్న. సృణి, ఫణి, ఘృణి, కిణి ప్రాసవిన్యాసముతో పద్యమున కొక చక్కదన మేర్పడినది. (శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము.)

సీతాకల్యాణము:

కం. ఎక్కుడు మేల్ గాగా గా
ర్ధార్తిక్కెన్ మన ఆప హా వధూవశలన్ దా
రక్కసుల గొంగ చూపఱు
ప్రొక్కుచు నోలాడి రెల్లరు ముదంబోధిన్.

కార్ధార్తిక్కట = పెండ్లాడుట, మనః + ఆప = మన ఆప = మనోహరమైన, రక్కసులగొంగ = రాముడు (శతావధాన ప్రబంధము. ద్వితీయఖండము)

కల్పనాత్మక పద్యము:

పుట్టినప్పుడే పిల్ల మేనమామ సొత్తన్నారు. పిల్ల. పిల్లవాడు కలిసి యాడుకొన్నారు. కాలము మాఱినది ఈడు వచ్చిన పిల్లకు గొత్తచోటికియ నిచ్చయించిరి. అపుడు బాల్యాదిగా ప్రేమించిన వాని స్థితి యెట్లుండును? ఇదంతయు ప్రశ్నమే.

కం దిక్కైక్క యయ్యక్క స్వజన్
దిక్కరి నీటోమి నెమ్మదిన్ దల్ల్యాదుల్
ర్యక్కల్ నా రాయన్ మేల్
దక్కి పడె గమిత యిడ గన ద్వాస్థుల్ జాత్యల్.

(శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము.)

ఆ + యక్క = అయ్యక్క = జ్యేష్ఠ, దిక్కైక్క = తనకు కనువెలుగై, పెద్దదిక్కయి, దిక్కరిన్, స్వజన్ = నవయౌవనయైన తన కూతును, ఈటోమి, తత్ = ఆ కన్య యొక్క, లీ + ఆదుల్ = ల్యాదుల్ = ఆలింగనాదులు ర్యక్కల్ నా = కొయ్యదొలుచు పురుగు లనగా, నెమ్మదిన్, రాయన్ = రాయిడి పెట్టగా, మేల్ దక్కి = పెంపుసెడి, కమిత = ప్రియుడైన వరుడు, ద్వాస్థుల్ జాత్యల్ = వాకిట నున్న చుట్టాలు, కనన్ = చూడగా, ఇడన్ = ఇలన్, పుడమి. పడె=పడెన్. ఇది యతని స్థితి.

విశేషములు: అక్క అయ్యక్కలో జేరినది దిక్కరి దిగ్గజభ్రాంతి గొలుపు శబ్దము. 'దక్కరీ నవయౌవనా' అని హారావళి నెమ్మదిలోని 'ద' నెమ్మదిగా యతి స్థానమున గూర్చున్నది 'దల్ల్యా' లో రెండు సంధులున్నవి. 'ర్యక్క' అప్రసిద్ధ పదము. 'పడె' క్రియ. క్రియాపదము రానీయగూడదని పృచ్ఛకుడు వేయి కనులతో జూచుచుండును కథానాయకుడు వరుడు కనుక 'వ' యన్నంతనే రేఫము నిషేధించెను కమితృ శబ్దమునందలి కకారము ప్రథమవిభక్తియందు గకారమై 'గమి' వరకు, సమూహార్థకమగు నాచ్ఛిక శబ్దమనెడి భ్రాంతి గలిగించును. 'ఇడన్' గూడ నిట్టిదే. ఈయగా అను నర్థమునే స్ఫురింపజేయును.

'లీ = శ్లేషణే చ చపలే'- మేదినీ కోశము 'కాముకః కమితా'- వైజయంతీ నిఘంటువు.

ప్రత్యక్షర నిషేధ పద్యము లిట్లుండును :

వర్గాక్షర నిషేధము, కవర్గ చవర్గ టవర్గ తవర్గ పవర్గములలో నేదో యొక వర్గమునకు జెందిన యక్షరములు నిషేధించుట వర్గాక్షర నిషేధము. ఒక్కొక్క చరణమున ఒక్కొక్క యక్షరమునే ప్రత్యేకించి నిషేధించుట మరియొక పద్ధతి.

ఆదెష్టనిన, మషీపాత్రమ్ (ఇంకిబుడ్డి)

కకారః గకారః మకారః చకారః యథాక్రమం చతుర్ష్వ పాదేషు నిషిద్ధాః.

మషీపాత్రం వర్ధయామ సాధనం యద్భవే త్సునః

వ్యవహారస్య సర్వస్య లేఖిన్యా ఉపయోగతః .

(శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రిగారు.)

దీనిలో పృచ్ఛకునకు నవధానికి నడుమ పెనగులాట యుండదు. నిషిద్ధవర్ణములు మాత్రము పరిహరించి నిర్నిరోధముగ నవధాని పద్యము జెప్పవచ్చు.

మఱియొక పద్ధతి యున్నది వాకిలికడ్డ కావలివాడుండును. సభ్యులను లోనికి బోనిచ్చుచుండును అనుమానించి యొకానొకని నడ్డగించును ఆ విధముగా నిషేధ్ధృ పృచ్ఛకుడు బెల్లము కొట్టిన ఱాయి వలె గూర్చుండియుండి తనకు తోచి నపుడు తోచిన యక్షరము నిషేధించును.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల శ్రీరామపట్టాభిషేక శార్దూలవిక్రీడిత వృత్తము దీనికి తారకాణగా గ్రహింప వచ్చును.

శ్రీజ్యాజాంకభువి ప్రభావరుచిరాః కైకేయికాగర్భజ
ప్రష్ఠాః పార్శ్వభువి ప్రకృష్టజనకాః కీశాగ్రగణ్యాః పురః
అన్యే చాపి విభీషణ ప్రభృతయ స్తత్రాపి తత్రస్థితాః
శ్రీరామస్య తదా ముదా విజయతే పట్టాభిషేకోత్సవః .

(శతావధాన సారము .)

'దీనిలో సగము మాత్రమే నిషేధించినారు' అని వ్రాయబడినది. సగమనగా శ్లోకపూర్వార్థము. నిషిద్ధభాగమున నక్రైకేయికగర్భజ కిశాగ్రగణ్యాది శబ్దములు నిర్నిబంధముగా స్థానమేర్పరచుకొన్నవి. కనుక ఆ సగముగూడ ప్రత్యక్షర నిషేధ పద్ధతితో జరుగలేదని స్పష్టము. పదేపదే నిషేధించుచు వచ్చిన, శార్దూల విక్రీడితాదివృత్తనిర్మాణము దుర్ఘట మగును.

సంస్కృతమున అనుష్టుభచ్ఛందము, తెనుగున కందము ప్రత్యక్షర నిషేధము పాటించి చెప్పుటకు అనుకూలతనువులు.

## నిషేధాక్షరి పృచ్ఛకుడు

అష్టావధానమున నిషేధాక్షరికి పండితుడే కూర్చుండును. ఛందోలక్షణజ్ఞుడు, శబ్దవేత్త, నానాపురాణకథానిష్ణాతుడు అవధాని పేరు తెలుసుకొనగలవాడునై యుండును. ప్రత్యక్షరనిషేధ పద్యమున నాలుగు చరణము లంతము నిషేధించు నధికార మతని కుండును కొందరు ప్రథమ చరణము మాత్రమే నిషేధించి, యిక చాలునందురు. అది స్థాలీపులాకన్యాయము. వర్ణ్యవాచకపదములు వచ్చి, వస్తువు రూపు కట్టినచో రెండు చరణములు నిషేధించి వదలుదురు. ఇది సాధారణము మూడు చరణములు పట్టి చూచి, నాలుగవ చరణము వదలువారు కొందరుందురు. ఇదియు వర్ణ్యవిషయము స్ఫుట మగుటతో నాపుదురు. అప్పటికి దాని రేక లగు పడనచో నాలుగవ చరణము తుట్టతుది దాక వదలనివా రుందురు ఇది సరియైన పరీక్ష.

తత్త్వజ్ఞుడైన పృచ్ఛకుడు ప్రత్యక్షరము నిషేధింపడు వస్తునిర్దేశము చేసి, పద్యనిర్మాణము కానిమ్మనును అవధాని శ్రీకారముతో నారంభించునో, అచ్చుతో నారంభించునో, హల్లుతో నారంభించునో అవధానికే వదలును. స్పష్టముగా పదము తెగినది. ఆపై నవధాని యేయక్షరమైన జెప్పవచ్చు. అప్పుడు పృచ్ఛకుడు నిషేధించుట వృథాపరిశ్రమ సర్పమును వ్యాళమని, వ్యాడమనియు అనవచ్చును కనుక శకారము నిషేధించిన డకారము, డకారము నిషేధించిన శకారము వేసి కొనవచ్చు. ఈ రహస్య మెఱిగియు నిషేధించు టెందుకు?

సంశయాశుపగు పృచ్ఛకుడు ఆలోచించి, ఆలోచించి, తనలోదాను తర్క వితర్కముల కగ్గమై యెంతసేపటికిని నిషేధాక్షరము నుడువలేడు. అతడు నోరు దెఱచి నుడువుదనుక అవధాని వేచియుండక తప్పదు. అక్షరమునకు అక్షరమునకు యజ్ఞమే ఇట్టి పృచ్ఛకుడు తన యాలోచనమునకే మొత్తము మీద నొకగంటకాలము తీసికొనును. ఈ కాల మవధాని యుపయోగించికొనెడి కాలమున జేరి, సభా కాలమును దీర్ఘీకరించును.

సౌమేధికుడగు పృచ్ఛకుడు నిషేధాక్షరి నిర్వహించునపుడే యవధాని కుల్లాసము. అవధాని యేయక్షరము నిక్షేపించునో పృచ్ఛకునకు దెలిసినట్లుండును. పృచ్ఛకు దేయక్షరము ప్రక్షేపించునో యవధానికి దెలిసినట్లుండును. నిషేధము జరుగుచుండును. పద్యము జరుగుచుండును. రామ రావణ యుద్ధము వలె నుండును. ఒక్కవిశేష మేమనగా సహృదయపృచ్ఛకు డొకొక్కవేళ నవధాని ప్రగల్భత కచ్చెరువడి సంతుష్టుడై మురియుచుండును. పృచ్ఛకుని మొగమున జిగురొత్తెడి ఆ మురిప మవధానికి గొండంత బల మిచ్చును. గంధపు చెక్క రాచిన కొలది పరిమళ మిచ్చును. పృచ్ఛకుడు ఒరపు పెట్టుకొలది అవధాని ముత్తెములు రతనములు రాసివోయును.

—: o :—

# సమస్య

'సమస్యా తు సమాసార్థా' అని అమరసింహు డనెను.

సమస్యతే సంక్షిప్యతే అనయేతి సమస్యా. సంపూర్వ్య అనుక్షేపణ ఇతి ధాతుః అర్థోఽస్యాం సమాసార్థా. సమస్యా యథా-

'దామోదర కరాఘాత విహ్వాలీకృత చేతసా
దృష్టం చాణూరమల్లేన శతచంద్రం నభస్థ్సలమ్.'
అత్ర 'శతచంద్రం నభస్థ్సల' మితి సమస్యా
అని లింగాభట్టీయము.
ఈ సమస్య నెవరో-
'చలత్తరంగరంగాయాం గంగాయాం ప్రతిబింబితమ్
సచంద్రం శోభతేఽత్యర్థం శతచంద్రం నభస్థ్సలమ్.'
అనియు బూరించిరి. మొదటిదానికన్న నిది బాగున్నది.

నభస్థ్సల మేకచంద్రమేకాని శతచంద్రము కాదు. శతచంద్ర మనుట యభూతము. ఈ చరణము చరణముగా నేమియు మార్చకుండ అట్లేయుంచి, యేదో యొక కథ యల్లి, తక్కిన మూడు చరణములు నించి, దీనితో జోడించి, సమర్థింపవలెను. సచంద్రమైన నభము కదలెడు తరగలతో ప్రతిబింబితమై శత చంద్రమై శోభిలుచున్నదనుట యిందలి సమర్థనము.

మొదటి పూరణమున శ్రీకృష్ణుడు గ్రుద్దెను చాణూరుడు వెల్లకిలబడెను వాని చిత్తము వికలమయ్యెను. అట్టి స్థితియందు వానికి ఆకసము శతచంద్రముగా అగుపడెను- అని పురాణకథ చెప్పబడినది.

ఈ సమస్యాపూరణవిద్య తెలుగుపొలములందు మెట్టపంటయై మూడు పూవు లాఱుకాయలుగా వర్ధిల్లినది. శివరాత్రిజాగరణవేళ సమస్యా పూరణ హేల

కాలక్షేపకారణమైనది 'ద్విపద మిచ్చువారలును గ్రక్కున బద్యము చెప్పువార లున్' (అనంతామాత్యుని భోజరాజీయము) ముందుకు రాగా, రచ్చ బయళ్ళలో, రాచ పందిళ్ళలో తిరునాళ్ళశోభ వెలసినది

పల్లెటూళ్ళలో భట్రాజు లీవిద్యకు పట్టుగొమ్మలైరి. ద్విపదములు పద్యములు కూర్చి, శరన్నవరాత్రోత్సవములందు, సంపన్నగృహస్థుల లోగిళ్ళలో బడిపిల్లలచేత ప్రదర్శింపజేసి పసదనము లందుకొనుట, నిన్న మొన్నటిదాక మామూలుగానుండెను. చదువను వ్రాయను రానివారును పురాణశ్రవణఫలమైన సంస్కారము కలిమి ఛందోలయజ్ఞాన మెనసి, ద్విపదములు గొని పూరింపగడగిరి.

'గుండ్రాతికి కాళ్ళు వచ్చి గునగున నడిచెన్'

అనెడి సమస్యను పూరింపవలెననెడి సంబరము అవ్యుత్పన్నులందును ఎట్లు దందడించినదో చూడుడు.

గుండ్రాతికి కాళ్ళు వచ్చుటయు, గునగున నడుచుటయు నసంభవమే. కాబట్టి దీనికొక కథ తెచ్చి ముడిపెట్టవలెను. రామాయణమున గౌతమశప్తమైన అహల్య శిలయై పడియుండుట, శ్రీరామపాదరజము సోకి సచేతనయగుట జగత్ప్రసిద్ధ విషయము. ఆ కథ దీనికి అనుసంధించి యీ పద్యము లెవరో చెప్పిరి.

'ఉండ్రా యోరి దురాత్మక
యిండ్రా ప్రాసంబు కవుల కియ్యందగునా?
యండ్రాము పదము సోకిన
గుండ్రాతికి కాళ్లు వచ్చి గునగున నడిచెన్.'

'ఉండ్రాని యడవి లోపల
గుండ్రాయైయున్న మౌనికోమలిపై గో
దండ్రాము పదము సోకిన
గుండ్రాతికి కాళ్ళు వచ్చి గునగున నడిచెన్.'

(తెలుగు సమస్యలు. వావిళ్ళ)

సమస్యకు సరిపడు కల్పన స్ఫురించినంతనే పద్యరచనకు గడగిన రసికు నకు ప్రాసము గళబంధమైనది. బిందుపూర్వక రేఫయుక్త డకారము కదా! అందుచేత సమస్య కూర్చిన వ్యక్తిని నోరార దిట్టినాడు. దేశ్యపదముల నెట్లు సంశ్లిష్టములు చేసినను జేయవచ్చు. తత్సమపదములను జేయరాదు. 'యంద్రా ముడు', 'కోదండ్రాముడు' అనుట తప్పు. అయినను ఈ పెద్దమనష్యుడు సమస్య పూరింపగలిగితినని చంకలు గొట్టుకొనుచున్నాడు. కథలో అహల్య విశ్వామిత్ర పురస్కృతుడైన శ్రీరాము నెదుట గునగున నడిచినదనుట అంత యుదాత్తముగ లేదు.

ఇట్టి పూరయితలు కవయితలు కారు వీరికి శబ్దసంస్కారము మట్టు. వీరు కల్పించెడి కైపదము లింకను ఎబ్బెట్టుగా నుండును.

'ముట్లుడిన సతికి నొక్క మొగశిశు పుట్టెన్.'

'మొగశిశు' అనుట తప్పు 'మగశిశువు' అని దిద్దినచో యతిగణములు రెండును జెడును 'పుంశిశువొదవెన్' అనవచ్చు. కాని, యిక్కడ సమస్యాదాతకు, పూరయితకు, నుభయులకు ఆ విచారము లేదు.

అట్లయితే 'నవమాసము ముట్లుడిగిన సతికి నొక్క మొగశిశు పుట్టెన్.' అని యీడ్చివేయబడినది

కాగా, సమస్యా సస్యక్షేత్రముయొక్క యెల్లలు పండితలోకము నుండి పామరలోకము దాక నిరాఘాటముగా వ్యాపించియుండెనని భావింపనగుచున్నది.

తెలుగువారు సమస్య లనిన చెవి కోసికొందురు.

విద్వత్సభలయందు, అష్టావధాన శతావధాన సభలయందు సమస్య రాచగద్దియనెక్కి శోభిల్లినది.

## సమస్యాపూరణ కళాచమత్కృతి

ఒక సమస్య నిట్లే పూరింపవలెననెడి కట్టడి లేదు. సమస్యను జూచినంతనే అది యే చమత్కృతికి నొదిగివచ్చునో యోజించి, యవధాని దాని నాచమత్కృతితో బూరించును.

ఒకచో ప్రాత సమస్య వచ్చును పూర్వకవు లెందరో దాని బూరించి యుందురు. చిక్కుండదు. తాను నదేదారి బోవచ్చునా? పోవచ్చును. అయినచో తానేమి సాధించినట్లు? సొంపమైన శబ్దార్థ సంపత్తితో పద్యము కట్టినట్లు ధీవరులగు నవధానులు దాని నంతకంటె రమ్యముగా, లేదా, భిన్నముగా బూరింపజూతురు. సాధ్యపడనపు డనుకరణము తప్పదు పృచ్ఛకులు దాని నంగీకరింపక తప్పదు.

సమస్యాపూరణ కళాచమత్కృతు లనేకము లున్నవి. కనుక ఏ యవధాని యు 'ఇది నాచేత గాదు' అనడు. ఏదోయొక చమత్కృతితో దానిని బూరించి, కృతకృత్యు డగును.

పద సమాస వాక్య చమత్కృతి

సమస్య: 'పసులన్గొల్చెడివారి కబ్బు టరుదే? భద్రంబు లెల్లప్పుడున్.'
పశువులను సేవించుట శ్రేయస్కర మని సమస్య.

మ. వ్యసనంబుల్ విడనాడి మేలిసుఖముల్ వర్జించి, తర్జించు స
త్వ సమూహంబుల సాదుసేసి యెపుడున్ బ్రహ్మైక్యసంధాన స
త్యసమాధిన్ బ్రళయాంతమున్ గదిసినన్ స్థాణుక్రియన్ నిల్చు తా
పసులన్ గొల్చెడివారి కబ్బుటరుదే? భద్రంబు లెల్లప్పుడున్.
(అవధాన సారము)

పసులుపోయి తాపసులు వచ్చుటతో పద్యమునకు కళ వచ్చినది. పసులను నమ్ముకొని జీవించెడివారికి భద్రము లబ్బుట లేదా? ఉన్నదున్నట్లు చెప్పిన నేమి? చెప్పిన జెప్పవచ్చు గాని, దానిలో చమత్కృతి యుండదు.

సమస్య: 'సతి సతి గవయంగ పుత్రసంతతి కలిగెన్.'
సతి పతి కాదు. సతి సతి యనుట అబద్ధము గదా!

కం. అతికుతుకం బలరారగ
జతురత మెఱయంగ మదనశాస్త్ర విధమునన్
వితతంబగు తన సౌధ వ
సతి, పతి గవయంగ బుత్ర సంతతి కలిగెన్. (శతావధాన సారము)

సౌధవసతియందు సతిని గూడగా సంతతి కలిగెను
'మరలందున్నది నాతియోర్తు దివిషన్మాన్య ప్రభావమ్మునన్.'

ఆధునిక కాలపు యంత్రములను మరలందురు. మరలు కృత్రిమ శక్తి కలవి. అట్టి మరలందున్న నాతికి దేవతా మాన్యత రాదు. కనుక మరలు తామరలు కావలెను. తామరలందు లక్ష్మి యున్నది. లక్ష్మీస్తుతిచే ఈ సమస్య మెనయును.

మ. కరుణాపూరము జిమ్ము కన్నుగవతో కస్తూరికారమ్య భా
సురఫాలస్థలరేఖతో కఠిన వక్షోజాత విస్ఫూర్తితో
హరికిం బట్టపురాణియై మరున కమ్మై లోకముల్ప్రోవ తా
మరలందున్నది నాతియోర్తు దివిషన్మాన్య ప్రభావమ్మునన్.
(శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము.)

'క్రోడమును గ్రహించి పిల్లి గొబ్బున బాఱెన్.' సమస్య.
పందిని పట్టుకొని పిల్లి గబగబ పరుగెత్తి పోయెనట.

కం. వేడుక మీఱగ గిచకిచ
లాడుచు జీటికిని మాటి కపనిజశాఖన్
గ్రీడించుచుండ, ఆ చి
క్రోడమును గ్రహించి, పిల్లి గొబ్బున బాఱెన్.
(శతావధాన ప్రబంధము ద్వితీయ ఖండము.)

చిక్రోడము = ఉడుత. ప్రాకుల మెలుక. పిల్లికి ఆహారము.
'తన ప్రాణమ్ములు గొన్న బిడ్డకు నిజస్తన్యంబిడెన్ దల్లియున్.'

తన్ను జంపిన బిడ్డకు తల్లి తన స్తన్యమిచ్చెనని సమస్య. ఆ తల్లి చచ్చి స్తన్యమెటు లీయగలదు?

మ. దనుజోత్తంసుడు కంసుడంప లలితోద్యన్మానుషీమూర్తి వ
చ్చిన రక్షోంగన నుయ్యెలన్ మెలఁచుచున్ జిన్నారి కృష్ణుండు జూ
చెను, లేచెన్ జనుఁద్రావె, గ్రిందపడ ద్రోవన్ బల్లిమందౌచు బూ
తన ప్రాణమ్ములు గొన్న బిడ్డకు నిజస్తన్యంబిడెన్ దల్లియున్.
(శతావధాన ప్రబంధము ప్ర. ఖం.)

తన ప్రాణములు కాదు, పూతన ప్రాణములు.

'తల్లీ! రమ్మని పిల్చె భర్త నిజకాంతన్ మన్మథక్రీడకున్.'

శా ఉల్లోలాంబురుఘురీస్ఫురచ్ఛఫరజాలోన్మేష నేత్రాంత! భూ
భృల్లీలా స్తనయుగ్మ! నీచతరనాభీసుందరావర్త! యో
షిల్లోకప్రణుతప్రకాశ! లలనా! సీమంతినీజాతి మ
త్తల్లీ! రమ్మని పిల్చె భర్త నిజకాంతన్ మన్మథక్రీడకున్.

(శతావధానప్రబంధము. ద్వితీయ ఖండము.)

తల్లికాదు. జాతిమత్తల్లి జాజిపువ్వులు గుబాళించు తరుణి. 'తల్లీ తరుణ్యామ్' అని మేదినీ నిఘంటువు. తెలుగు తల్లి మాత. సంస్కృతమున తల్లి తరుణి.

కనుగవ మిలమిలలాడుట, చనుగవ పొంగుట, పొక్కిలిసుడి క్రుంగుట - యివి స్త్రీలయందు ఋతుకాలమును సూచించు చిన్నెలు.

'బొమ్మా! నీకింత సిగ్గు పోలదు సుమ్మా!'

జడవస్తువగు బొమ్మతో మాటాడుచున్నా డెవడో వెఱ్ఱివాడు.

కం. అమ్మరు డుత్తల పెట్టెడి
నెమ్మది నిలుపంగ వశమే? నీవును నేనే
యిమ్మెడ గలము, బంగరు
బొమ్మా! నీకింత సిగ్గు పోలదు సుమ్మా! (అవధానసారము.)

బొమ్మకాదు బంగరుబొమ్మ. ప్రియురాలు.

'స్తనములు లేనిపూరుషుడు సంస్తవనీయుడు కాడు ధాత్రిలో.'

పురుషునకు పాలిండ్లా ?

చం. అనువుగ సర్పమున్ శిశువునైన గరంచును గానవిద్య, భూ
జనులకు గల్గుమూఢతను సాహితి మాన్చెడి, నివ్వి వాక్సతీ
ఘనకుచసన్నిభంబు లనగా బుధు లెంచెద, రట్టి శారదా
స్తనములు లేని పూరుషుడు సంస్తవనీయుడు కాడు ధాత్రిలో.

(అవధాన సారము)

'సంగీత మపి సాహిత్యం సరస్వత్యా స్తనద్వయమ్' అన్నారు పెద్దలు. సంగీత సాహిత్యములు శారదా స్తనములు

ఇదే సమస్య శ్రీచిదంబరశాస్త్రిగారెట్లు పూరించిరి

చం విసుము నరేంద్ర నా మతము, వీనుల కింపులు నింప గంతమం
దును నవరత్న హారమును దొరపు మేన మనోజ్ఞమైన చం
దనమును బొజ్జయందు సుమనః ప్రకరంబును గేం గామినీ
స్తనములు లేనిపూరుషులు సంస్తవనీయులుగారు పృథ్విలోన్

బాలకృష్ణుని కేల వెన్నముద్దల వలె, పురుషుల కేల కామినీ స్తనములుండ వలెనని కవిగారి మతమట.

'గరుడుడు గణపతికి తండ్రి గావలె జుమ్మీ.'
గణపతి విఘ్ననాయకుడు గరుత్మంతుని కుమారుడట.

కం. హరుడు గణపతికి బోలెన్
సరసీజాక్షుండు నాభిజన్మునకు బలెన్
గురుకీర్తి గన్న యా సా
గరు డుడుగణపతికి తండ్రి గావలె జుమ్మీ. (కొప్పరపు సోదరకవులు)

ఉడుగణము = తారాగణము. తత్పతి చంద్రుడు చంద్రునకు సాగరుడు తండ్రి.

'బకములు చూడ రెండు నొకభంగి జరించుట కల్గదెప్పుడున్.'

బకములు = కొంగలు.

చ. సకలజగత్ప్రపంచమున స్థావరజంగమమైన దాన జీ
వకణము లుల్లసిల్ల నిజభానుసహస్రము విస్తరించుచున్
బ్రకటగతిన్ జరించు శశిభాస్కరబింబము లబ్జనేత్రు నం
బకములు రెండు చూడ నొకభంగి జరించుట కల్గదెప్పుడున్.
(శతావధానప్రబంధము. ప. ఖం.)

అంబకములు = కన్నులు.

'వాణీపుత్రుడు మాధవాత్మజు డనన్ ద్వైమాతురుండే గదా'

శా. ఏణీలోచన! శైవగాథలు జగద్ధేరాళ విజ్ఞాన క
ల్యాణాపాదక పూతహేతువులు నిత్యానందసంధానముల్
వీణాగేయములౌ శివాత్మజు డహో! విద్యాకరుం డట్టి శ
ర్వాణీపుత్రు, డుమాధవాత్మజు డనన్ ద్వైమాతురుండే కదా.

(అవధాన వాణి)

'భగముల వార్చెదరు సంధ్య భవ్యచరిత్రుల్.'

కం. జగతీనిర్ఝరు లౌకచో
భగీరథసుతాజలముల బంకేరుహ షం
డ గళన్మరందబిందు సు
భగముల వార్చెదరు సంధ్య భవ్యచరిత్రుల్

(శతావధానప్రబంధము. ప్ర. ఖండము)

సుభగము = సుందరము.

'పందే నాకిష్ట మనుచు బాపడు పలికెన్.'
ముందే చెప్పితి గద, నా
కుం దేవలె శ్రాద్ధవేళకు బనసకాయన్
సందేహ మేల? జాగో
పందే నాకిష్ట మనుచు బాపడు పలికెన్.'

(శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము.)

'రావణు డాసీత మగడు రక్షించు మిమున్'

కం. శ్రీవనజాప్త కులాంబుధి
జైవాతృకు డసురవీర సంహారకుడున్
బావన నాముడు నిర్జిత
రావణు డాసీత మగడు రక్షించు మిమున్. (అవధాన సారము)

నిర్జితరావణుడు = రాముడు.

'అంగము లింగమును జూచి యలమట జెందెన్.'
ఇక్కడ అంగము, లింగము అశ్లీలార్థద్యోతకశబ్దములు.

కం. సంగత ముసలప్రాస వి
భం గనుపట్టుచు మృకండుపట్టి యుసురు వీ
యంగన్ వచ్చిన యము సే
నాంగము లింగమును జూచి యలమట జెందెన్.
(శతావధాన ప్రబంధము. ప్రథమ ఖండము,)

సేనా + అంగము = సేనాంగము మార్కండేయుని ప్రాణములు దీయుటకు యముని సేనాంగము ముసలాది సాధనములతో బయలుదేరి వచ్చి, అతనికి ఆశ్రయముగానున్న శివలింగమును జూచి అలమట జెందెను. అనగా చేతులు పిసికికొనుచు యమదూతలు నిలబడిరని యర్థము.

'కుపతిని గని మెచ్చె సాధ్వి కోర్కులు మించన్.'

కుపతి = భూపతి. కుపుత్రి = భూపుత్రి. కనుక సమస్యలో విశేషమేమియు లేదనవచ్చు. కాని, సద్యస్స్ఫూర్తి వీడు చెడ్డవాడు, ఆమె మంచిది అని కలుగుచున్నది. కనుక, లోకరూఢిసెబట్టి పోవలెను.

కం. విపులాక్షి యిందుమతి ధా
త్రిపతుల గాదని గమించి, తీయని వలపుం
గపురపు దృక్కుల నిష్ఠా
కుపతిని గని మెచ్చె, సాధ్వి, కోర్కులు మించన్.
(శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము)

'కరి లంఘించి నిశాతదంతహతి నుద్ఘాటించె హర్యక్షమున్.'
ఏనుగు సింహమును జీల్చి వైచెను.

మ. ఝురిణీతీర కుడుంగదేశమున ముస్తాఖాదనవ్యాగ్ర ఘు
ర్ఘురరావప్రతిశబ్దితాఖిలదిశాక్రోడాంత వీక్షించి దు
ర్భరగర్జోత్థచపేటమై పయికి బోవన్ ఘూణి కాయప్రథా
కరి లంఘించి నిశాతదంతహతి నుద్ఘాటించె హర్యక్షమున్.
(శతావధాన ప్రబంధము. ప్రథమ ఖండము.)

సెలయేటి గట్టున నొకపొదరిల్లు అక్కడ సింహమున్నది. తుంగముస్తెలు దిను పంది ఘురుఘురుమని దిక్కులు పిక్కటిల్లునట్లు రొద పెట్టుచు దూరినది. సింహము గర్జించుచు పంజాయెత్తి పైకి దూకినది. ఆ పంది చిన్నదా? కాయప్రభాకరి. మేని చాయతో, ఆయతితో ఏనుగువంటిది. ఎగిరి వాడి కోఱతో చీల్చి వైచెను.

'కపిని వివాహమాడినది గౌరి యెఱింగి జగత్ప్రసిద్ధిగన్.'
కోతిని వివాహమాడుట మన దేశమున లేదు.

చం. ప్రతపగొని శంకరుం గొలిచి తాపసి మన్మథు డడ్డువచ్చి భ
స్మపటల మౌట ఱిచ్చపడి శ్యామ తపోరత యయ్యెఁ, గ్రమ్మఱన్
సుపరిచితస్థితిన్ మెలగి సుందరి పార్వతి ధూర్జటిన్ వృషా
కపిని వివాహమాడినది గౌరి యెఱింగి జగత్ప్రసిద్ధిగన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం )

వృషాకపి = శివుడు. 'హరవిష్ణూ వృషాకపీ' అని అమరము.
'పుత్రుని జంపి శంకరుడు పొందెను పెండిలి మన్మథార్తుడై.'

ఉ. గోత్రవరేణ్య పుత్రికను గూర్చ సురల్ సుమబాణు బంపి, రా
చిత్రధనుఃకరాంకుశలి చేకడిమిన్ బ్రకటింప, నుగ్రుడై
నేత్రవమన్మహాగ్నిమయ నిష్ఠురకీలల నిస్సహాయు శ్రీ
పుత్రుని జంపి శంకరుడు పొందెను పెండిలి మన్మథార్తుడై.
(శతావధాన ప్రబంధము, ద్వి. ఖం)

శ్రీపుత్రుడు = మన్మథుడు.

'ఖరపదము పరిగ్రహించి కననగు ముక్తిన్.'

వసుదేవుడు గాడిద పాదము పట్టుకొని, జైలునుండి విముక్తి పొందెనని లోకమున వాడుక యున్నది. ఈ సమస్య పైకి అట్లే కనబడును

కం. అరుణ జటాభర కుంజ
స్ఫురచ్ఛశిప్రసవగుచ్ఛ సురభిళ కకుబం
తర భక్తరక్త శశిశే
ఖరపదము పరిగ్రహించి కననగు ముక్తిన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం)

ఖరపదము శశిశేఖరపదమై ముక్తిదాయక మగుచున్నది.

'సింగములన్ మట్టె గంధసింధుర మయయో!'

కం పొంగుచు గొందఱు రాజులు
సింగారము లొలుక వేట సేయంజని వే
డ్కం గెలన దిరుగ నా రా
సింగములన్ మట్టె గంధసింధుర మయయో!

(శతావధాన సారము.)

'గర్భములోనున్న బిడ్డ గ్రిక్కున తుమ్మెన్.'

కం. నిర్భయగతి నిద్రించుచు
స్వర్భువనాధిపు విధాన సస్మిత ముఖసం
దర్భుడు మందిరడోలా
గర్భములోనున్న బిడ్డ గ్రిక్కున తుమ్మెన్.

(శతావధాన ప్రబంధము. ప్ర.ఖం )

డోలాగర్భము = ఊయెల నడిమి చోటు.

'రంభ త్రికోణమధ్యమున రాజిలుచుండెను రత్న మొక్కటే.'
త్రికోణశబ్దమునకు అడుగుటి యను నర్థము తెనుగున రూఢము.

ఉ. శుంభ దధిక్రియన్ త్రిపురసుందరిచక్రము నిల్పి, భక్తి వి
స్రంభముతో ద్విజుం డొకడు బ్రాతి జపించుచునుండగా, దిగు
జ్జృంభితశోభ దద్విమలదృక్ఫలమై నవకుంకుమాంకసం
రంభ త్రికోణమధ్యమున రాజిలుచుండెను రత్న మొక్కటే.

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

'రమతేఽస్మి న్నితి రత్నమ్.'

'ముగ్గురు పంచపాండవులు మూడుజగంబుల వన్నెకెక్కరే?'

ఉ అగ్గగనావలగ్న మధురాకృతి మాద్రి కనెన్ దనూజులన్
నిగ్గు లెలర్ప నిర్వురననింద్యచరిత్రుల, గుంతి మున్ కనెన్
దిగ్గజతుల్యులన్ ముగుర దీప్తబలాఢ్యుల, జూడ నిద్దరున్
ముగ్గురు పంచపాండవులు మూడుజగంబుల వన్నెకెక్కరే?

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

'లంగోటను బాఱవైచి లక్ష్మని గాచెన్.'
లంగోట = మల్లులు ధరించెడి గోచి

కం. అంగారకల్పతేజుడు
సంగరభీముడు శివాజి చన, యవను డొకం
డంగద నుపాయ మది పో
లంగోటను బాఱవైచి లక్ష్మని గాచెన్
'పొగత్రాగనివాడు దున్నపోతై పుట్టున్'

కం. భుగభుగమని పొగలెగయగ
నగణితముగ నాజ్యధార లాహుతి గాగా
నిగమాది మంత్రయుతముగ
బొగ ద్రాగనివాడు దున్నపోతై పుట్టున్. (చాటుపద్య మణిమంజరి.)

ఇక్కడి పొగ ఆజ్యహవిర్ధ్రుతమైన యజ్ఞ ధూమము. బీడీపొగ గాదు. దేవతార్చన చేయనివాడు పశువగునని దీని భావము

'మంగలవాడు నీ మగడు మానిని శ్రీసతి సంతసింపుమీ'

ఉ. సంగత శంఖచక్రముఖసాధన భీషణమూర్తి, యార్తిభి
న్మంగళదాయి చారుకరుణావశభవీక్షణు డుజ్జ్వలాంబుభృ
త్తుంగవిలాససంహననధూర్వహు డవ్యయు డీ త్రిలోకి నో
మం గలవాడు నీ మగడు మానిని! శ్రీసతి! సంతసింపుమీ!
(శతావధానప్రబంధము ప్ర. ఖం)

ఓమన్ + కలవాడు. ఓమం గలవాడు. రక్షకుడు. క్షురకుడు కాడు.
'లలనా రమ్మనిపిల్చె సత్య పయి చేలంబూని శ్రీకృష్ణునిన్.'

మ. జలజాతాక్షుడు రుక్మిణీ గృహమునన్ సయ్యాటలన్ దేలుచున్
బులకింపం దిలకించి మానవతియై భ్రూభంగ విన్యాస కో
మల లీలన్ జని, ప్రొద్దువుత్తువిట లెమ్మా! చాలుజాల్ దీని హే
లలనా? రమ్మని సత్య పిల్చె బయి చేలంబూని శ్రీకృష్ణునిన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం)

లలనా యనెడి సంబోధనము, హే లలనా? యనెడి ప్రశ్నార్థక కాకువైనది.

'శునకమ్మయ్యెను విష్ణుదేవుడు సురస్తోమమ్ము కీర్తింపగన్.'

విష్ణుదేవుడు మీన కూర్మ వరాహ సింహాద్యాకృతులు ధరించెను. శునక మగుట పురాణములందెక్కడను లేదు.

మ. ఖనటత్పూస్త్రియమున్ దహింపగా జనన్ క్ష్మాస్యందనంబయ్యె, బ్రా
క్తనముల్ గుఱ్ఱములయ్యె విద్యలు, రథశ్రేష్ఠత్వమున్బూనె బ్ర
హ్మ, నగశ్రేష్ఠము చాపమయ్యె, నవిజిహ్మస్ఫూర్తి నవ్వేళ నీ
శున కమ్మయ్యెను విష్ణుదేవుడు సురస్తోమమ్ము కీర్తింపగన్.

(మదీయము.)

ఖ + నటత్ + పూః త్రయము ఆకసమున విహరించుచున్న రక్కసుల పురములు మూడు త్రిపురసంహారవేళ శ్రీమహావిష్ణువు ఈశునకు అమ్ముఅయ్యెను.

'చాకలదాని పెందొడల సందున భీముడు చిక్కె నాజిలో.'

చాకలిది = రజకి.

ఉ. భీకరరౌద్ర ముఖబింబమునన్ గనుపింప రుష్ట ద
ర్వీకరభోగచండము ధరించి గదన్ రణభూమి నిల్చి, దు
ర్ధీకు సుయోధనున్ బొడిచి రేగినవాని గదాహతిన్ బళా!
చా కలదాని పెందొడల సందున భీముడు చిక్కె నాజిలోన్.

(శతావధాన ప్రబంధము ప్ర. ఖం.)

చాక, అల, దాని చాక = చావక, అల = ప్రసిద్ధమైన, దాని = మద గజము. భీముడు ఏనుగు తొడల నడుమ చిక్కెను.

'గణచతుర్థినాడు ఫణిచతుర్థి'

వినాయకుని చవితినాడే నాగుల చవితి యని సమస్య.

ఆ వె ఎన్నిదినము లాయె నిట నన్ను డించి నీ
వరిగి? యనిన జత్ని కనియె భర్త
నేటి కెన్నగ బదినెలాయెగా! నేడు
గణచతుర్థి, నాడు ఫణిచతుర్థి. (శతావధాన సారము.)

నేడు గణచతుర్థి — నాడు ఫణిచతుర్థి అని వాక్యవిచ్ఛిత్తి.

'అగ్రగజానుజులై రనుజాగ్రజులుగ'

అన్నతమ్ములు తమ్ముడు అన్న అయిరి అని సమస్య.

తే. గీ. పుష్యమిన్ భరతాఖ్యుడు పుట్టినాడు
మొనసి లక్ష్మణు డాశ్లేష బుట్టినాడు
భరత లక్ష్మణక్రమమిది యరసి చూడ
నగ్రజానుజులై రనజాగ్రజులుగ (శతావధాన ప్రబంధము. ద్వి. ఖం)

భరతుడు లక్ష్మణునకు అన్న కావలయును. అయినను లోకము రామలక్ష్మణభరతశత్రుఘ్నులనుచున్నది.

'భీష్ముని పెండ్లి కేగిరట పిన్నలు పెద్దలు బంధు లందరున్.'

ఉ. గ్రీష్మములోన లగ్న మరిగెన్ సమకూర్చెదనన్న భార్గవా
ర్చిష్మ దనూనకోప మతిశీతలమయ్యె, బ్రతిజ్ఞ చూడగా
భీష్మముగాగ మాఱె, తలపెట్టని వన్నియు దాపురించె నా
భీష్ముని పెండ్లి, కేగిరట పిన్నలు పెద్దలు బంధు లందరున్.
(చమత్కార కవిత్వము.)

భీష్ముని పెండ్లి జరుగునని ఆహూతులై వచ్చిన చుట్టము లందరు ఎక్కడివా రక్కడకు నేగిరి. కారణము - పరశురాముడు చల్లబడెను, భీష్ముడు లొంగలేదు

'గాంగేయుండు వివాహమయ్యె ద్రుపదక్ష్మాభృత్తనూజన్ వడిన్.'

శా. పొంగెన్ దూర్యమహానినాదము నభోభూభాగముల్ నిండ, ను
త్తుంగాభోనిధి భంగభంగి, జనసందోహమ్ము నిండెన్ సభన్
రంగత్పాండుతనూజపంచకము సుభ్రఖ్యాతి దీపింపగా
గాంగేయుండు, వివాహమయ్యె ద్రుపదక్ష్మాభృత్తనూజన్ వడిన్.
(శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము)

గాంగేయు డిక్కడికి ఆశీర్దాత మాత్రమే. పెండ్లాడినది పాండుతనూజ పంచకము.

'దుర్మతి రాజుగాగ బరితోషము గైకొని రెల్లవారలున్.'

ఉ. నిర్మలచంద్రకాంతివలె స్నిగ్ధమ ఖస్మితరోచి పైకొనన్
నిర్మథితారి సర్వరమణీయగు ణోజ్జ్వలు దర్థవేత్త స
ద్ధర్మవిధిజ్ఞు డంచు బ్రజ తద్రఘుసత్తము నెప్డు కోరుకొం
దుర్మతి, రాజుగాగ బరితోషము గైకొని రెల్లవారలున్.
(శతావధాన ప్రబంధము. ప్రథమ ఖండము)

కోరుకొందుర్ + మతి అని ఛేదము. దుర్మతి నామసంవత్సరమున రాజుగాగ సంతసించిరనియు జెప్పవచ్చును. కాని పిఱుపునందువలె ఇంపు రాదు.

'సంధ్యావందన మాచరింపవలదా? చౌశీతి బంధంబులన్.'

సంధ్యావందనము దేవతాత్మకము చౌశీతి బంధములు కామిన్యాత్మకములు. రెంటికి లంకె పొసగదు.

శా. కంధ్యాడంబర మింత హెచ్చె, దివి జుక్కల్ మొల్వగాజొచ్చె నం
చాంధ్యంబొప్పగ దీవరింతు రతికై, యంతర్బహిశ్శుద్ధతన్
సంధ్యావందనమాచరింపవలదా? చౌశీతిబంధంబులన్
వంధ్యత్వంబును దీర్తువే జనికి? కాంతాచారుకేళీగతిన్ (అవధాన సారము)

ఈ పద్యమున సమస్య తృతీయ చరణమున నిలుపబడినది. సంధ్యావందనము వలన జన్మమునకు సార్థక్య మేర్పడుననియు, కాంతాకేళీగతి వలన అధోగతి గలుగు ననియు ఆ యిల్లాలు మగనికి బుద్ధి చెప్పినది.

'భీమసేనుడు గాంధారి పెద్దకొడుకు.'

తే గీ కాలసమవర్తిమూర్తులు గదలు పూని
చూపఱు భయంపడన్ రణక్షోణి నిలిచి
పోరు సలిపిరి భీషణస్ఫురణ మెఱయ
భీమసేనుడు, గాంధారి పెద్ద కొడుకు. (శతావధాన ప్రబంధము ద్వి. ఖం.)

'ముది పూబోడిరా ! చెంతజేర గదవే ! మోమెత్తి మాటాడవే !'

మ. అదయుండై చెలరేగి మన్మథుడు పుష్పాస్త్రమ్ములన్ జిమ్మెడున్
గదియన్వచ్చి సమీరభూతము కడున్ గారింప జొచ్చెన్, ముదా
స్పదుడౌ చంద్రుడు శత్రుడయ్యె, గరమున్ బాధాకరంబయ్యె గౌ
ముది, పూబోడిరా ! చెంతజేరగదవే ! మోమెత్తి మాటాడవే !
(అవధాన సారము )

కౌముది. వెన్నెల సంస్కృతమున 'ముది' యన్నను వెన్నెల యగును బాధాకరంబయ్యెడన్ ముది అని పిలిచి. పూబోడిరా అని సంబోధింపవచ్చు. అవకాశమున్నపుడు కౌముది యనుటయే లెస్స

'పెండ్లి మయ్యెను పార్వతి విష్ణువునకు.'

తే గీ వాణి సతియయ్యె బ్రహ్మకు, స్థాణునకును
బెండ్లి మయ్యెను బార్వతి, విష్ణువునకు
లక్ష్మి వల్లభయయ్యె, నీలాగునన్ ద్రి
మూర్తులు గృహస్థులైరి విభుత్వమూని

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం)

'దృఢసత్వంబున చీమ తుమ్మె గదరా, దిగ్దంతు లల్లాడగన్.'

మ. దధిమంబొప్పెడు మాకుమంచమున దీర్ఘంబైన మేన్వైచి, ము
క్కు ధమాన్నాదములీన నిద్రగను నాకుంభశ్రవుండంత మ
త్త షుస్క్రాంతిని ముక్కులోనరిగి యంతర్భాగమున్ గుట్టగన్
దృఢసత్వంబున జీమ, తుమ్మె గదరా దిగ్దంతు లల్లాడగన్.

(అవధానసారము.)

తుమ్మినది చీమ కాదు. కుంభకర్ణుడు.
'తేలును ముద్దులాడి చెలి తియ్యగ నవ్వును పండువెన్నెలన్.'

ఉ. బాలకిసాల చారుతనువల్లి, మనోభవవహ్నితప్త చిం
తాలస దాని జూడ దగదా ? దురపిల్లెడు నిన్నుగూర్చి, రా
రా ! లలితాంగరాగమధురా ! నెల గాలెడు, మోదవారిధిం
దేలును ముద్దులాడి చెలి తియ్యగ నవ్వును పండువెన్నెలన్.

(శతావధాన ప్రబంధము. ప్ర ఖం)

తేలు = వృశ్చికము. దాని జుంబించనచో అది కొండితో మీటక మానదు. చెలి నవ్వునా? ఏడ్చునా? పండువెన్నెల చల్లనిపొద్దు సలుపుట మిక్కుటము.

దూతిక ప్రియునితో జెప్పుచున్నది. చింతా + అలస, దాని మైదీగ లేజి గురుటాకు. మదనాగ్నిచే కమలుచున్నది. చెలి నిన్ను గుఱించి యల్లాడుచున్నది. లలిత అంగరాగ మధురా - రారా చందనాదుల పూతనే ఒప్పిదమైనవాడా రమ్ము.

నెల గ్రాలెడు = చంద్రుడు ప్రకాశించుచున్నాడు. నీవు వచ్చినచో మోదవారిధిన్ తేలును సంతోష సముద్రమున దేలును. ఇక్కడి తేలు క్రియ.

'తురకలు సంధ్యవార్తురట తోయములన్ గొనితెమ్ము జానకీ.'

తురకలు = తుర్కీదేశస్థులగు తురుష్కులు. వారి మతము వేఱు. సంధ్య వార్చుట అనెడి ధర్మము వారికి లేదు.

చం పరమమునీశ్వరుల్ గ్రహణపర్వము నేడగుటన్ దమంత వ
చ్చిరి శతవృద్ధు లందఱు, నిశిన్ గడుదవ్వగ గంగ కేగ జా
లరు, మనయింటనుండి కనులన్గని చందురు, రాహుదంష్ట్రికా
తురకళు, సంధ్యవార్తురట, తోయములన్గొనితెమ్ము, జానకీ!

(అవధాన సారము.)

రాహుదంష్ట్రికా + ఆతుర + కళు = రాహువు కోఱలచే పీడింపబడిన కళలుగల చంద్రుడు సంధ్యవార్చువారు పరమమునీశ్వరులు.

'సీతాపతి యంత చంద్రశేఖరు డయ్యెన్.'

కం. ఆ తఱి గిరిజా కన్యక
యాతత తప మాచరింప నభవుడు వటుడై
నాతి బరీక్ష సలిపి, ఓ
సీతాపతి! యంత జంద్రశేఖరు డయ్యెన్.

(పి. ఎల్. వి. ప్రసాదరావుగారు )

ఎవరో సీతాపతికి గౌరీపరిణయగాథ చెప్పుచున్నారు.

నూతన కల్పనా చమత్కృతి

'కరి నెత్తుకపోయి యెలుక కలుగున దినియెన్.'

కరి = ఏనుగు. ఎలుక = మూషికము. కలుగు = బొఱియ.

కం. కరులు చిలుక లెద్దులు శ
ర్కరతో నొనరించి యార్చి, కడ బెట్టెడుచో
గరి మఱచె వర్తకుం డా
కరి నెత్తుకపోయి యెలుక కలుగున దినియెన్. (అవధాన సారము.)

ఎలుక యేనుగు నెత్తుకొనిపోగలదా? అది దాని బొఱియలో పట్టునా?

ఏనుగు చక్కెరబొమ్మ యని కల్పింపబడినది.

'రవిక విప్పి కోడలు మామ రాక గోరె'

ఇది ధర్మవిరుద్ధము.

తే గీ తా వృషస్యంతియౌటను దాళలేక
చంద్రు డాకసమ్మున వెల్గు జాడ జూచి
మగడులేని యద్దమ రేయి, నగడుకోర్చి
రవిక విప్పి కోడలు మామ రాక గోరె.

వృషస్యంతి = కాముకి మామ రాక గోరెనని పూరింప వచ్చు పూరణమున వైరుద్ధ్యము తొలగ లేదు. స్థిరపడినది. కనుక ఇట్టి పూరణము తగదు. పెద్దలు మెచ్చరు

తే. గీ అల్ల పాంచాలకన్య శయ్యాగృహాంత
రమున భీమసేనుని గూడి ప్రమదకేళి
దేలి చెమ్మట దోగుచు, నోలి బట్టు
రవిక విప్పి, కోడలు, మామ రాక గోరె

భీమసేనుని తండ్రి గాలి రతిశ్రమక్లిన్నయైన ద్రౌపది కంచెల విప్పి, గాలి రాక గోరెను వాయుదేవుడు వరుసకు మామ కదా!

ఇది సరియైన పూరణము. సమస్యాదాతృహృదయ మిదియే 'స్తనవస్త్రం పరిత్యజ్య వధూః శ్వశుర మిచ్ఛతి' అని మూలసమస్య.

'మూడును మూడుమూడు మఱిమూడును మూడును మూడుమూడుగన్'

ఉ ఆడకు నాడకే జరగు ట్టి యొకానొక జంగమయ్య పెం
డ్లాడ ప్రయాణమున్ జలిపి యయ్యెడ రంగపురంబులోన నే
వాడల బోవ జూచినను వాని కెదుర్పడ జొచ్చె నామముల్
మూడును మూడుమూడు మఱిమూడును మూడును మూడుమూడుగన్.

(అవధాన సారము.)

జంగమునకు నామాలు గిట్టవు. శుభకార్యప్రయాణవేళ నామము లెదురు పడుట మంచిశకునము కాదందురు అది రంగపురము. కనుక దొంతులుగా నేదు ర్పడుచున్నవి.

'చంద్రా! నీవొక రాతిగుట్టవు సుమా! చాల్చాలు నీ దంభముల్.'

మానవుడు చంద్రలోకమున నడుగుపెట్టి, అదొక రాతిగుట్టయని తెలిసి కొన్నాడు. చంద్రలోకమునుండి చూడగా భూలోక మొక యుజ్జ్వలనీలమణివలె కనిపించినది ఆ చూచినవాడు వచ్చి భూమిమీద అడుగు పెట్టిన నెట్లుండును? రాళ్లు గుట్టలే ఆ లోకమునకు చంద్రు డధిపతి.

శా. ఇంద్రున్ దిద్దెడి యొజ్జ యొజ్జయగునా కీవేమొ తద్భామ పీ
వుం ద్రాక్షుంజనకేళికిం దివిరె దబ్బో! చాల, నాన్, నవ్వి ప
ల్కెం దస్త్రాత్మిక కాక తారయు నధిక్షేపించుచున్ జంద్రమున్
జంద్రా! నీవొక రాతిగుట్టవు సుమా? చాల్చాలు నీ దంభముల్.

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖండము.)

ఇంద్రున్ దిద్దెడియొజ్జ బృహస్పతి. చంద్రుడు విద్యార్థి. తార గురుపత్ని. ఇదెక్కడి నీతి? ముద్దాడుచున్నావు. అని చంద్రుడన్నాడు తార తగ్గలేదు. ఎగతాళిగా నవ్వి, చంద్రుడనగా సరసుడనుకొన్నాను. వట్టి జడుడు. చక్కిలిగింత పెట్టినను కదలడు. వట్టి రాతిగుట్ట అనెను. చంద్రుడు చలించలేదు. నాకు తెలియును. నీవు నన్ను పరీక్షించుచున్నావు. ఇక నీ దంభవృత్తి చాలించు అని పైబడెను.

'సుందరి వక్షస్థలంబు సున్నంబాయెన్.'

కం. సందీపితాంగజాగ్నిన్
దెందము కాగన్ బెరిలుపెరిలుమని ముత్తెం
పుందండ మ్రగ్గి చెమ్మట
సుందరి వక్షస్థలంబు సున్నంబాయెన్.

(శతావధాన ప్రబంధము ప్ర.ఖం )

మదనతాపమున నెద క్రాగెను. ఆ కాకకు ముత్యాలదండ తట్టుకొనలేక పోయెను. ముత్తెములు పొక్కి సున్నమయ్యెను. చెమట చిత్తడికి సుధారస మయ్యెను.

'ప్రాఙ్నగమధ్యభాగమున భానుడు గ్రుంకె నదేమిచిత్రమో'
తూరుపుగొండనడుమ పొద్దు క్రుంకుట చిత్రమే.

ఉ. దిఙ్నియమమ్ములెల్ల జెడె దేశములందు నకాలవాతముల్
ధిఙ్నయమొప్పగా విసరె దివ్యు లదివ్యులయ్యెరి దేవతా
వాఙ్నతులున్ వృథాపడియె బ్రహ్మయు సొల్వడె నంత్యవేళలో
బ్రాఙ్నగమధ్యభాగమున భానుడు గ్రుంకె నదేమి చిత్రమో.
(అవధాన భారతి)

ఈ చిత్రము సమర్థించుటకు అవధాని లోకప్రళయము కల్పించెను
'రారా తమ్ముడ రార యన్న యనియెన్ రాజాస్య ప్రాణేశ్వరున్.'

శా. సారా త్రావు టనర్థహేతు వది లజ్జాజ్ఞానమర్యాదలన్
నీరుంజేయుట నిక్కమిద్ది విను డానీరుం గడుంద్రావి దు
ర్వార బౌ కయిపెక్క మైమఱచి నిర్వస్త్రాంగయై నవ్వుచున్
రారా తమ్ముడ రార యన్న యనియెన్ రాజాస్య ప్రాణేశ్వరున్
(కొప్పరపు సోదరకవులు)

సారాయి కైపులో వావివరుసలు వ్యత్యస్తములైనవని కల్పన.
భంగ్యంతరపూరణము.

శా. గారాబల్లుడు నర్జునుండు శ్వశురాగారంబునందుండగా
నీరేజాస్య సుభద్రవచ్చి. యతిని వీక్షించి పెన్సిగ్గునన్
బాఱంజొచ్చిన, సత్య పట్టుకొని యింపారంగ నయ్యర్జునున్
రారా తమ్ముడ రార యన్న యనియెన్ రాజాస్య ప్రాణేశ్వరున్
(చాటుపద్య రత్నాకరము)

తప్పుద్రావి, వావి మఱచి ప్రేలిన దనెడి కల్పన కంటె, సత్య వచ్చి సుభద్ర చేయిపట్టికొని ఆ రాజాస్య ప్రాణేశ్వరుడైన అర్జును రారా తమ్ముడ రారా అన్న అని పిలిచెననెడి కల్పన రమ్యతరముగనున్నది.

'తల్లికి తనయకు మగడయి తనరెను గిరిన్.'
చాటుపద్య రత్నాకరమున నొక పద్యమున్నది.

'అల్లుడ వయ్యెదో మగడ వయ్యెదవో మనుమంప వయ్యెదో' అని పృచ్ఛింపగా విటు డిట్లు సమాధానము చెప్పెను:

ఉ. మొల్లసుగంధి కూతురిని ముంగిట గంటిని దాని మాన, నీ
వెల్లవిధంబులన్ రతుల నేలెడుదానవు నిన్ను మాన, ను
త్ఫుల్లసరోజనేత్ర వరపుత్రికపుత్రిక దాని మాన, నీ
కల్లుడనయ్యెదన్ మగడ నయ్యెద, నీమనుమండనయ్యెదన్.

తల్లికి తనయకే కాక, మనుమరాలికిని మగడైనవాడీవిటుడు. అట్టి వ్యక్తిని తనరెను కీర్తిన్ అనలేము.

కం. అల్లన కిటియై ధరణిన్
విల్లు విఱచి సీత నేలి ప్రేమకళాసం
పల్లీల విష్ణుదేవుడు
తల్లికి దనయకు మగడయి తరెను గీర్తిన్

(శతావధానప్రబంధము. ప్ర. ఖం)

వరాహావతారమున క్షితిపతి యయ్యెను. రామావతారమున సీతాపతియయ్యెను. సీత క్షితిపుత్రి. జన్మాంతరమున దేహాంతరమున జరిగిన సంబంధ బాంధవ్యములివి.

'దాని కుమారులన్ మువురు దాని రమించి రదేమి చిత్రమో.'

ఉ. దాని కుమారులున్ మువురు దాని రమించి రదేమి చిత్రమో
యౌననుచున్ సమస్యయిడ నయ్యెడ నొక్కకవీశ్వరుండు తొల్
దానికి గుంతియున్ బిదపదానికి ద్రౌపదియంచు నర్థమున్
దానొనరించి పూరణ మొనర్చెను దన్నిమిషంబునందులన్.

(అవధాన భారతి)

సమస్యాచరణముతోనే పద్య మారంభింపబడినది. అది తుదియందే లగ్నమై యుండవలెనను పట్టింపు లేదు. నాలుగు చరణములలో నెక్కడనైన నుండవచ్చును.

'మదగజయానకున్ రవికమాత్రము చాలును జీర యేటికిన్.'

చ. అదియిది తెచ్చిపెట్టుమని యంబరముల్ నినమొన్న నాల్గుకొ
న్నది నవవర్ణరమ్యము లనర్ఘము లిప్డు బజారు కేగినన్
బదపడి దుర్వ్యయంబు నవశ్యము మిత్రమ! నీవ తెమ్మి మా
మదగజయానకున్ రవికమాత్రము చాలును జీర యేటికిన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

చీరలు మొన్ననే కొన్నాము. ఇపుడు రవిక మాత్రము కొన్న చాలును.

'అమవస నిందుండు తోచె నద్దమరేయిన్.'

కం. కమలాక్షు డొక్కగోపిక
యమవసయని జంక, నద్దమం దచ్చెలి ఫా
లము జూపి యనియె, గను మెటు
లమవస నిందుండు తొచె నద్దమరేయిన్ ? (శతావధాన సారము.)

'పూలు సెగలు పొగలు పుక్కిలించె.'

ఆ వె. వల్లభుండు వచ్చు, పరిరంభమున గ్రుచ్చు
నంచు జెలి యలంకరించుకొనియె,
ప్రొద్దు పోవబోవ బూబోడి క్రొమ్ముడి
పూలు సెగలు పొగలు పుక్కిలించె (శతావధానసారము ద్వి. ఖం.)

'సరసునివైపు వీపు నలచానమొగంబటు గోడవైపు.'

ఇది సమస్యకాని సమస్య.

చం. సరసుని వైపు వీపు నలచానమొగంబటు గోడవైపు, నా
సరసుడు కేలు చాపు, నలచానయు జన్నుల జేయిమోపు, నా
సరసుడు కోర్కి జూపు, నలచాన తొడందొడలోన దోపు, నీ
వరుసనె తెల్లవారె నొకవైఖరి నొక్కనికొక్క వేశ్యతోన్. (శతావధానము.)

దానితోనే యారంభించి, దానివలెనే తక్కిన చరణములు తీర్చుటలో విశే షమున్నది. మనోహరమైన కల్పన.

'ఒకచో సూర్యుడును జంద్రు డొప్పిరి జంటన్.'

కం. ప్రకట సుధాకలశము గొని
చకచక వడ్డించు వేళ, సౌదామిని వం
టి కలికి మోహిని జూచుచు
నొకచో సూర్యుడును జంద్రు డొప్పిరి జంటన్.

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

అమృతకలశము బూని మోహిని వడ్డించుచుండగా, దేవతాపంక్తిలో సూర్య చంద్రు లొకచోట గూర్చుండియుండిరి.

'తన సతి పెండ్లి చూచుటకు తానును నేగెను సత్వరంబుగన్.'

చం. ఘనగతి నేమిఘోష మెసగన్ ఋతుపర్ణరథమ్ము దోలుచున్
మనమున నగ్నియై దరికొనన్ దమయంతి పునస్స్వయంవరం
బనియెడివార్త బాహుకసమాఖ్యుడు నైషధు డా విదర్భకున్
దన సతిపెండ్లి చూచుటకు తానును నేగెను సత్వరంబుగన్.

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం)

ఏగెను సత్వరంబుగన్ అన్నంతనే అశ్వహృదయపరిజ్ఞాతయైన నలుడు విదర్భకేగెనని స్ఫురించును. విదేశములలో నైనచో తమ సతి పెండ్లి చూచుటకు తామును నేగిరి సత్వరంబుగన్ అని బహువచనమే చెప్పవచ్చు. అట్టి కల్పనల కంటె పురాణకథాసంబంధికల్పనలు రమణీయములు.

'ముండను జూచి మగడెంతొ మోదము నొందెన్.'

కం. చండియని వీడిపోవ, వి
భుండు గతించెనని ముండమోసె సతి, విర
క్తుండయి భిక్షించుచు, ఆ
ముండను జూచి మగడెంతొ మోదము నొందెన్.

(శతావధాన ప్రబంధము ద్వి. ఖం.)

సతి క్రూడరాలు. దానితో కాపురము చేయలేక, మగడు చెప్పకుండ వెడలి పోయి సన్న్యాసులలో కలిసెను వాడు చచ్చెనని ఆ చండి ముండమోసెను పిదప కొన్నాళ్ళకు భిక్షాపాత్ర పట్టుకొని ఆ త్రోవబోవుచు ఆ ముండను జూచి సంతో

షించినాడు. అనగా సన్న్యసించినను వీనిలో కోపము చావలేదన్నమాట గుండు గొఱిగించుకొని, బూడిద పూసికొని, ఒక్కప్రొద్దులతో శివశివ అని కాలక్షేపము చేయుచున్నది ఈ శిక్ష దీనికి పడవలసినదే యని యతని యక్కసు.

'కొమ్మల్ పుట్టెను జూడ కోమలి కిలన్ గూర్మిన్ బుధుల్ మెచ్చగన్.'

శా. తమ్ముల్ కుంభికరోరకుంభములకున్, దాయాదు లంభస్సర
స్సమ్మర్దమ్ములు తమ్మిమొగ్గలకు, విప్రంభార్హముల్ ప్రాణ మి
త్రమ్ముల్ తత్కులపర్వతమ్ములకు, స్నిగ్ధమ్ముల్ కుచప్రఖ్యముల్
కొమ్ముల్ పుట్టెను జూడ కోమలి కిలన్ గూర్మిన్ బుధుల్మెచ్చగన్.
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

'ఒక్కటి పాలు దాల్ప మఱియొక్కటి మూత్రము దాల్ప నయ్యెడిన్.'

ఒకటి క్షీరస్థానము. ఒకటి మూత్రస్థానము

ఉ. చక్కని పైడి కుండలని చన్గవ మారనిధానమంచు న
య్యెక్క విమోహబుద్ధి గణియింతురు పండితులేమి చెప్ప, కై
పెక్కిన యౌవనోద్ధతి ద్యజించి విచారము చేసి చూడుమీ
యొక్కటి పాలుదాల్ప మఱియొక్కటి మూత్రము దాల్ప నయ్యెడిన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం)

యౌవనపుమబ్బు వస్తు విచారము చేయనీయదు. చదువుకొన్నవారే మోహముగ్ధులై మాటాడుదురు. ఎద బంగారపు కలశములు, ఆ చోటు- మన్మథ నిధి యందురు. వట్టి భ్రాంతి. ఏమున్నది? ఇక్కడ పాలు, అక్కడ మూత్రము.

## క్రమాలంకార చమత్కృతి

యథాసంఖ్యముగా సమస్య బూరించుట క్రమాలంకార చమత్కృతి.

'యథా సంఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః' (చంద్రాలోకము.)

సమస్య: 'అనిరుద్ధుడు నెమలినెక్కి యంబుధి దాటెన్.'

అనిరుద్ధుడు ప్రద్యుమ్న సుతుడు. నెమలి నెక్కువాడు కుమారస్వామి. అంబుధి దాటినవాడు ఆంజనేయుడు. ఇదెట్లు పొసగును?

కం. మనసిజ నందను డెవ్వడు?
నని షణ్ముఖు డెద్దియెక్కి యరుల జయించెన్?
హనుమంతుడేమి చేసెను?
అనిరుద్ధుడు, నెమలినెక్కి, యంబుధి దాటెన్.
(తెలుగు సమస్యలు- వావిళ్ళ)

క్రమముగా, మీది ప్రశ్నములకు క్రింది పదములు సమాధానములు.
'సంధ్యల్ వార్తురు గాదె నిర్జరవరుల్ సంభోగ కాలంబునన్.'

శా. సంధ్యావేళల నేమి చేయుదురు నిష్ఠాయుక్తులై బ్రాహ్మణుల్?
వంధ్యత్వంబు ఘటింపజేయకయ యెవ్వారిత్తు రిష్టార్థముల్?
వింధ్యాద్రుల్ బలె కామినీ స్తనము లేవేళన్ విజృంభించెడిన్?
సంధ్యల్ వార్తురుగాదె, నిర్జరవరుల్, సంభోగకాలంబునన్.
(శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రిగారు)

సంభోగ కాలమున సంధ్యవార్చు నాచారము స్వర్లోకవాసులకు లేదు. కనుక సమస్య లోకవిరుద్ధము వైరుధ్యము పరిహరించుటకు అన్యధా గతి తోప నపుడు కవి క్రమాలంకార చమత్కృతి నాశ్రయించును. ఇక్కడ సమస్యాపాదము త్రిధా విభక్తమైనది.

'రావణు డన్న రామునకు రామునకున్ నుమ తల్లి కోడలౌ.'

దశరథరామునకు దశకంఠుడు జ్యేష్ఠభ్రాత మఱియు నతనికి పార్వతి తల్లియైన మేనక కోడలు లేదా తల్లియు కోడలును అగును. ఇది సమస్య.

ఉ. భూవరు భార్య నెత్తికొనిపోయె నెవండు? సురేంద్రసూతి సు
గ్రీవున కేమియయ్యె? కలిగెన్ దగవేరికి? శంభురాణి యే
పావని? పూజ్య యెవ్వతె? ప్రభావతి రుక్మిణి కేమి కావలెన్?
రావణు, డన్న, రామునకు రామునకున్, నుమ, తల్లి, కోడలౌ.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

సమస్య షోఢా విభజింపబడినది. 1. జానకి నపహరించినవాడెవడు? రావణుడు. 2. వాలి సుగ్రీవున కేమి యయ్యెను? అన్న. 3. వివాద మెవరికి

గలిగెను ? రామునకు రామునకు, అనగా రఘురామునకు, భృగురామునకు 4. శివుని పత్ని యెవతె? ఉమ. 5 పూజ్య యెవతె? తల్లి 6. ప్రద్యుమ్నుని భార్యయగు ప్రభావతి రుక్మిణి కేమి కావలెను ? కోడలు.

'కాౖటేనికి గుహుడు మఱియు గణపతి తమ్ముల్.'

కాౖటేడు శ్మశానపతి శివుడు. శివునకు షణ్ముఖ కరిముఖులు తనయులు. తమ్ములు కారు.

క. చౖటాసుత సతి యెవనికి ?
వౖటువశక్తి కలడెవడు ? వటు డెవ్వడు ? ఖల్
కుౖటలు సలుపుదు రెవ్వరు ?
కాౖటేనికి, గుహుడు, మఱియు, గణపతి, తమ్ముల్.
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

'కుంజరయూథంబు దోమ కుత్తుక జొచ్చెన్.'

ఏనుగుల గుంపు మశకకంఠనాళమున ప్రవేశించెనని సమస్య.

కం. సంజకడ దోచు నెయ్యది ?
పుంజుకొనగనీయ దెద్ది పొలుగగు నిద్రన్ ?
మంజుఫలభక్ష్య మెక్కడ ?
కుంజరయూథంబు, దోమ, కుత్తుక జొచ్చెన్.
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

సంధ్యావేళ విహారార్థము బయలు వెడలునది కుంజరయూథము. నిద్ర చెఱచునది దోమ. మధురపదార్థము గ్రస్తము.

శ్లేషచమత్కృతి

'కొరవిని కౌగిటను జేర్చికొనుము లతాంగీ!'

కొరవి = ఎఱ్ఱగోరంటచెట్టు. కొరవి యన్నంతనే కొఱవి = ఉల్క యను కొని యుల్కిపడుదురు నాయిక యెఱ్ఱ గోరంట చెట్టును గౌగిలించుకొన్నచో అకాలమున పుష్పించునని చెప్పుదురు. ఇదొక దోహదక్రియ.

కం. తరువుల దోహద మెఱుగక
తిరిగెద వొకమాట నేను దెలిపెద వినుమా!
యరుదార బూలు పూచును
గౌరవిని గౌగిటను జేర్చుకొనుము లతాంగీ! (అపధాన సారము.)

'పగలుశశాంకు డంబరముపై విలసిల్లు గళాసమగ్రుడై'

చం. నగెనని ప్రక్కయింటిచెలి నన్గని మాఱుమొగమ్ము పెట్టుచున్
బిగిసెద వయ్యో! నా యెడల నిక్కము లేదొకదోస, మప్యయం
బగు నమృతమ్ముమాని యితరాసవ మెవ్వడు కోరు? నేల యీ
పగలు? శశాంకు డంబరముపై విలసిల్లు గళాసమగ్రుడై.
(శతావధాన ప్రబంధము-ద్వితీయ ఖండము)

పండువెన్నెల కాయుచుండగా పతి సతిని బతిమాలుకొనుచున్నాడు. ఆమె కితనిపై తెగని యనుమానము-ప్రక్కింటి వాల్గంటిని చూచుచున్నాడని.

పగలు = దినము పగలు = పగయొక్క బహువచన రూపము. విరోధములు.

'అమ్మా! రమ్మని పిల్చె భార్యను మగం డయ్యర్ధరాత్రంబునన్.'

శా. క్రమ్మెన్ మేఘము పిదతోచ జినుకుల్ రాలన్ దొడంగెన్ గడున్
నెమ్మెక్కెన్ శయనమ్ము, దుప్పటియు, నున్నింపందగున్ దప్పులన్
వెమ్మున్ నెమ్మది, ముద్దుగుమ్మ! యలపూవిల్కాని క్రొందమ్మియౌ
నమ్మా! రమ్మని పిల్చె భార్యను మగం డయ్యర్ధరాత్రంబునన్.
(శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము)

అమ్మ = బాణము. పూవిల్కాని క్రొందమ్మియౌ నమ్మా! ముద్దుగుమ్మా! పుష్పచాపుని నవారవిందబాణమా! అని సంబుద్ధి.

పొరుగూరికిబోయి మగడింటికి వచ్చి, నడిరేయి, ముసుగు పెట్టికొని కుక్కి మంచమున నక్కి పడుకొని యుండిన యిల్లాలు తల్లి కాబోలునని, పొరపాటున 'అమ్మా' యని పిలిచెనని కల్పించి పూరించినచో 'అమ్మ'కు అర్థాంతరము చెప్ప వలసిన యవసరముండదు సమస్య పొసగును.

'రాముడు ధర్మమున్ జెఱిచె రాజులు యోగులు సంతసింపగన్.'

రాముడు ధర్మభంగమునకు పాల్పడునా? దానికి రాజులు సంతసించిన సంతసింప వచ్చు. యోగులు సంతసింతురా?

'ధర్మోఽహింసోపమాయోగోపనిషత్సు ధనుష్యపి' అని త్రికాండశేషము. ధర్మ శబ్దమునకు ధనుస్సు అనెడి అర్థము కూడ కలదు. ఇక్కడ రాముడు ధనుర్భంగము చేసెనని చెప్పవలెను.

ఉ. ఆ మునివెంట బైనమయి యాటవి దాటక గీటడంచి ప్రో
ద్దామత జన్నమున్ నడిపి దారి నహల్య బవిత్ర జేసి, పై
గా మహిజన్ వరింప శివకార్ముకవీక్షణ కేగుదెంచి, శ్రీ
రాముడు ధర్మమున్ జెఱిచె రాజులు యోగులు సంతసింపగన్.

(చమత్కార కవిత్వము.)

'ఎన్నిక కానివారు ప్రజ నేలుచునుండుట చిత్రమయ్యెడిన్.'

ఎన్నిక = ఓట్లద్వారమున నగు ఎన్నిక, పరిగణన.

ఉ. చెన్నగు నాభిజాత్యమును శీలపటుత్వము సాధువృత్తమున్
మన్నన పొందు నేమనుజమాన్యుని పట్ట నతండు లోక మం
దెన్నిక గాంచుటొప్పు, ప్రజ నేలుట యొప్పు, నిదేమికాలమో
యెన్నిక కానివారు ప్రజ నేలుచునుండుట చిత్రమయ్యెడిన్.

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

'అక్షప్రౌఢిమ మీఱ ఆ శకుని లంకాధీశుతో బోరెడిన్.'

అక్షములు పాచికలు. శకుని ధృతరాష్ట్రుని బావమరది.

శా. రక్షోవల్లభకర్షితక్షితిసుతన్ రాజీవనేత్రిన్ దయా
పక్షుండై విడిపింపనెంచి పరితఃపక్షచ్ఛటాస్ఫోట తీ
వ్రక్షేపోద్ధతి ఖడ్గఘట్టనములన్ వారించుచున్ నిల్చి, హ
ర్యక్షప్రౌఢిమ మీఱ ఆ శకుని లంకాధీశుతో బోరెడిన్.

(శతావధాన ప్రబంధము ద్వి ఖం.)

హర్యక్షము = సింహము శకుని=పక్షి, జటాయువు

'శరమున్ గని జింకపిల్ల సంతస మందెన్.'

శరము బాణము. శరమునకు నీర మను నర్థము కూడ కలదు.

'శరో దధ్యాద్యగ్రసారే బాణే కాండే తృణాంతరే శర మంబుని.'

(నానార్థ రత్నమాల.)

కం. ఖరకర తాపవ్యథ గుri
మ్మరి వనభూమి నొకచోట మంజునికుంజ
స్ఫుర దుజ్జ్వల కాసారపు
శరమున్ గని జింకపిల్ల సంతస మందెన్.

(శతావధాన ప్రబంధము-ప్ర. ఖండము)

కాసారపు శరము = సరోజలము.

'శంఖంబులు దివినుండి జాఱిపడియెన్ జంబూఫలప్రక్రియన్.'

శంఖములు తెల్లనివి జంబూ ఫలములు నల్లనివి. జంబూ ఫలములవలె శంఖములు పడెననుట పొసగదు. శంఖమునకు రెండర్థములు. సంకు, ఒక సంఖ్య, 1000000000000. ఈ సంఖ్య నాశ్రయించి పూరించుట లెస్స.

శా. శంఖధ్వానము చేసి దేవపతి రక్షఃకాండ లక్ష్యమ్ముగా
బ్రేంఖచ్చాపము దాల్చి జ్యారవము దిగ్వీధిన్ విడంబింపగా
ఋంఖమ్ముల్ మఱిపుంఖముల్ వదలె నప్డున్బాణముల్ ఖర్వెడిన్.
శంఖమ్ముల్ దివినుండి జాఱిపడియెన్ జంబూఫలప్రక్రియన్.

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

సకంకపత్రములైన శిలీముఖములు నీలాకాశమునుండి జాఱిపడుట జంబూ ఫలములు జాఱిపడినట్లే యుండును.

ఇవి శ్లేషచమత్కృతి కుదాహరణములు.

## ప్రాస చమత్కృతి

'వక్త్రింబుల్పది కన్నులైదు కరముల్ వర్ణింపగా వెయ్యగున్.'

తలలు పది, కన్నులైదు, కరములు వెయ్యి – ఇది సమస్య. క్రమాలంకార చమత్కృతితో దీనిని బూరించుట కష్టము కాదు. కాని, ప్రాసము దుష్కరము. అందుచేత ఇక్కడ ప్రాసమునకే ప్రాధాన్యము.

శా. ఈ క్రాంతిప్రాసము చెడ్డదంచు విన మీరెంతేసివా రాడగా
వాక్రాంతిసంబది సత్కవీశ్వరులకున్ వర్ణింప నే జెప్పెదన్
దిక్రాంతిరాతికి బార్వతీశ్వరులకున్ దిగ్మప్రభారాశికిన్
వక్త్రంబుల్ పది, కన్నులైదు, కరముల్ వర్ణింపగా వెయ్యగున్
(తెలుగు సమస్యలు. వావిళ్ల )

సమస్య పూరించుకొనుటకు నిక్షేపముగా మూడు చరణము లుండగా, కవి ఒకేయొక చరణ ముపయోగించుకొనెను దిక్ + త్రి + అరాతి=దిక్ప్రాలశత్రువు. వానికి పదితలలు. అనగా వాడు రావణుడు. పార్వతి + ఈశ్వరుడు, ఇద్దరికి 2 + 3 = 5 కన్నులు. తిగ్మప్రభారాశి = సూర్యుడు. సూర్యుడు సహస్ర కరుడు.

'తార్క్ష్యుని జూచినంత రఘునాథుని పాములు వీడిపోయెగా.'
తృక్షస్య ఋషే రపత్యం తార్క్ష్యః గరుత్మంతుడు.

మేఘనాధుడు శ్రీరాముని నాగపాశబద్ధుని జేసెను. 'గరుడదర్శనమాత్రమున సర్పములు వీడిపోయె' నని సమస్య. సమస్యలో విపరీతార్థ మేమియు లేదు. ఉన్న చిక్కంతా ప్రాసము గూర్చికొనుటలో నున్నది సమస్యాపాదమున యతిమైత్రి లేదు. మైత్రి కల్పించికొనెడి బాధ్యత యవధానిదే. తృతీయపాదాంతమున నకారపుబొల్లు కొట్టినచో అది తార్క్ష్యశ్లిష్టమై నాథమైత్రి బొందును.

ఉ. వార్క్ష్యపరుల్ విషణ్ణులయి వందురుచుండగ నింగినుండి దై
దార్క్ష్యముచేత వచ్చి తన దట్టపు టెక్కలు విచ్చి సర్పజై
ఘార్క్ష్యమునన్ ధరాస్థలికి గ్రక్కున డిగ్గగవచ్చు నాతని
న్తార్క్ష్యుని జూచినంత రఘునాథుని పాములు వీడిపోయెగా
(అవధాన సారము.)

వార్క్ష్య, దైదార్క్ష్య, జైఘార్క్ష్య శబ్దములు వృక్ష, దిదృక్షా, జిఘృక్షాశబ్దముల నుండి కవి కల్పించుకొన్న రూపములు తార్క్ష్యుడు తృక్షశబ్దమునుండి పుట్టిన రూపమే

'దుఃఖము గాదె చక్కని వధూటితరంబు విదగ్ధకోటికిన్.'

విదగ్ధుడనగా నాగరుడు, నిపుణుడు. వానికి జక్కని వధూటిరతము సుఖదము. దుఃఖమనుట పొసగదు. దానిని 'నిరస్తధీదుఃఖము' అని పూరించుట కష్టము కాదు. కాని, ప్రాసనిర్వహణము కష్టము.

ఉ. గీఃఖననంబు లేల? పరికించి వచించెద నొక్కమాట 'జా
రాః ఖలు పాపినో' యని తిరంబుగ బల్కెడి ఛాందసోక్తులన్
భాఃఖచితోక్తులన్ బలె మనంబున నెంచకుడీ, నిరస్త ధీ
దుఃఖము గాదె చక్కని వధూటిరతంబు విదగ్ధకోటికిన్.
(శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రిగారు.)

అది లభింపకపోయెనే యని యేడ్చువారి కది లభించుట సుఖదమని భావము.

'తుంక్త్వా ప్రత్యయముల్ రసజ్ఞమతికెందుం దుష్టి జేకూర్చునే?'

శా. రంక్త్వారంతు మటంచు గౌముది క్రియల్ రాపాడు నాత్మేశుతో
మంక్త్వోష్ఠాప్సు హి శాలివాహనవిభో! మామాప్సు యా మోదకాన్
భంక్త్వాస్యే యని భార్య కౌముది క్రియల్ వాంఛింపదే వేఱుగా
దుంక్త్వా ప్రత్యయముల్ రసజ్ఞమతి కెందుం దుష్టి జేకూర్చునే?
(అవధానవాణి)

శాలివాహనుని భార్య మలయమతి గొప్ప విదుషి ఆమె భర్త తానును విద్వాంసుడు కావలెనని శ్రమపడుచుండెను ఒకనాడు ఆలుమగలు జలక్రీడలాడుచుండిరి. శాలివాహనుడు పెద్ద పెట్టున నీళ్ళు మీదికి జిమ్మగా, నామె యుక్కిరిబిక్కిరియై 'మోదకైస్తాడయ' యనెను ఆ మాటవిని యితడు తటాలున మోదకములు తీసికొని వానితో మోదెను మోదకములు = ఉండ్రాళ్లు. ఆమె లబోబలాడుచు, ఇదేమి చేష్టిత మనగా, నీవు చెప్పినట్లే చేసితిని. నా దోష మేమి యనెను. 'మా + ఉదకైః తాడయ' అని ఆమె వాక్యార్థము. (నీళ్లతో కొట్టవద్దు) ఇతడు గ్రహించిన యర్థము 'మోదకైః = ఉండ్రాళ్లతో, తాడయ = కొట్టుము' అని. సందర్భమునుబట్టి కదా అర్థము గ్రహింపవలెను! ఈ నాయికానాయకుల ప్రసిద్ధకథ నాధారము చేసికొని, కవి సమస్యను పూరించెను

రంజ్ ధాతురూపములు 'రంక్త్వా రంతుమ్' అను సిద్ధాంత కౌముదిలోని క్రియలు వల్లెవేయుచున్న భర్తతో మలయపవన వేడినీట స్నానమాడి, మోదకములు భుజించి, కౌముదీక్రియలకు రమ్మని పిలిచినది. కౌముదీక్రియలు వెన్నెలయాటలు.

'గొడ్రాలికి కొడుకొకండు గొబ్బున బుట్టెన్.'

కం. విడ్రాజి యలర దశరథ
రాడ్రత్నము మఖము చేసె, వ్రతఫలముగ స
మ్రాడ్రీతిని చిరకాలపు
గొడ్రాలికి కొడుకొకండు గొబ్బున బుట్టెన్. (అవధాన సారము.)

విట్ + రాజి = విడ్రాజి = జనసమూహము.

'గ్రీష్మపుటెండ నెత్తి గొఱిగెన్ హరి మంగళభావపూర్ణుడై.'

ఉ. భైష్మకి గొంచు దానరుగ భగ్గున మండుచు దత్సహోదరుం
డిష్మనిరోధకుం డిషువు లేయుచు మార్కొన రుక్మి, సర్వత
స్స్పష్మపృషత్కజాలమున జొన్పి నిజాసిని దూసి, నవ్వుచున్
గ్రీష్మపుటెండ నెత్తిగొఱిగెన్ హరి మంగళభావపూర్ణుడై
(శతావధాన ప్రబంధము ద్వి. ఖం)

భైష్మకి = రుక్మిణి. ఇష్మము = మార్గము. సర్వతస్స్పష్మ = అంతట చుట్టివచ్చిన తాళ్లవంటి, పృషత్క = బాణములయొక్క, జాలమున = వలలో, చొనిపి = బద్ధుని జేసి, శ్రీకృష్ణుడు శిరోముండనము చేసెను.

'మూర్ఖుండొక్కడు రాజుగా నయినచో ముల్లోకముల్ వేగవే'

శా. మీర్థద్యోతులు మీ ర్ప్రతాపఖనులున్ మీర్వైభవోదారులున్
మీర్థడ్గప్రవిదారితారిజనులున్ మీర్గొప్పవారంచు ద
న్నేర్థేలానుతి దేల్చు రట్టి జనులందే నమ్మికన్ బూను ఆ
మూర్ఖుండొక్కడు రాజుగా నయినచో ముల్లోకముల్ వేగవే.
(శతావధాన ప్రబంధము. ప్ర ఖం)

'బంగ్లామీదికి దారి జూపగలవా? భామాశిరోరత్నమా!'

దారి జూపెడి స్త్రీ చేటిక కాదు. భామాశిరోరత్నము. బంగ్లామీద మఱియొక తరుణి లేదు. కనుక బంగ్లా వర్ణింపబడుచున్నది.

శా. ఆంగ్లేయుల్ వసియించు నంచితమహాహర్మ్యాంతరంబందు వె
ల్గుం గ్లేదుచ్ఛవిజిష్ణుశుభ్రతర వల్బుజ్వాలదీపమ్ము లెం
దుం గ్లస్త్రాంధ్యము, లధ్వముల్ మయసభన్‌బోలెన్ గనన్‌రావిటన్
బంగ్లామీదికి దారి జూపగలవా? భామాశిరోరత్నమా!

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

'పంద్రంగిచ్చటి కెంతదవ్వు చెపుమా? పంకేజపత్రేక్షణా!'

శా. గుంద్రా కావలెనంచు నేనడుగ నాకుం బల్లెవారందఱున్
బంద్రంగిన్ గలదంచు జెప్పిరది నా భావంబులోనెంచి య
వ్వాంద్రన్ మెచ్చుచు, దాని గొంటకయి యీ ప్రాంతస్థలింజేరితిన్
బంద్రం గిక్కడి కెంతదవ్వు చెపుమా? పంకేజపత్రేక్షణా!

(శతావధాన సారము)

పంద్రంగి ఊరిపేరు దాని కొఱకు గుంద్రా దెచ్చికొనవలసివచ్చెను.

'రాప్తా డిచ్చటి కెంతదవ్వు చెపుమా, రాకేందుబింబాననా!'

అనియు నొక సమస్య కలదు. పంద్రంగి తెరువరి 'పంకేజపత్రేక్షణా' అనెను అది పగలు కాబోలు. రాప్తాటి తెరువరి 'రాకేందుబింబాననా' అనెను. అది రాత్రి కాబోలు.

'జగద్వ్యాప్తములయ్యె నిరులు ఖరకరు డుండన్.'

ఇది దుష్కరప్రాసము. ముందుగా దీనిని కందమని గుర్తింపవలెను. ఒక యక్షరము తృతీయచరణమున నుండవలసినదాని నిక్కడ జేర్చుట వలన, వెంటనే గుర్తుకు రాదు. తరువాత సూర్యుడుండగా చీకట్లు లోకమున వ్యాపించుట యసహజము. ఇది చిన్నపద్యము. ప్రాసనిర్వహణమునకే పద్యమున సగపాలు ఖర్చగును. ఏదో కథ కల్పించినగాని సమస్య తీఱదు ఉన్నంతలో సర్దుకొన వలెను.

కం సద్వ్యాఘాతము నిండె, వి
యద్వ్యాపృతి శౌరి చక్ర మడ్డుపఱుప, నా
పద్వ్యథితుడయ్యె క్రీడి, జ
గద్వ్యాప్తములయ్యె నిరులు ఖరకరు డుండన్. (అవధాన సారము.)

'ఖాద్యాస్త్రీతాధిపుడు శేషు కౌగిట జొచ్చెన్.'

ఇదియు నట్టిదే

'సబ్మాజస్ట్రేటు మొగము చల్లగ నయ్యెన్.'

ఇదియొక చిత్రమైన సమస్య.

కం రబ్మోదలు గలిగె, కేసున
తబ్మిలగయి లంచమందు, దాన కలెక్టర్
సాబ్మిగుల గినిసిరా గని
సబ్మాజస్ట్రేటు మొగము చల్లగ నయ్యెన్.

(అవధాన సారము.)

రబ్ అనెడి ఆంగ్లపదముతోబాటు తబ్ అనెడి హిందుస్తానీపదము గూడ నిరభ్యంతరముగ నుపగ్రాహ్యమైనది.

## సాంకేతిక చమత్కృతి

'కనులును బంద్రెండు మఱియు గౌ నయిదయ్యెన్.'

ఈ సమస్య జ్యౌతిషిక సంకేతము చేతనే పూరింపబడవలెను.

కం విను మేడులేని యారున
కును జంఘలు పదియు నిదునొకండు కుచంబుల్
కనుబొమలు తొమ్మిదై తగు
గనులును బంద్రెండు మఱియు గౌ నయిదయ్యెన్ (అవధాన సారము.)

1. మేషము 2 వృషభము 3 మిధునము 4. కర్కాటకము 5 సింహము 6. కన్య 7. తుల 8. వృశ్చికము 9. ధనుస్సు 10 మకరము 11. కుంభము 12. మీనము - ఇది ద్వాదశ రాశిచక్రము దీనిబట్టి చూచిన, కనులు పంద్రెండు అనగా మీనములు కౌను అయిదు అనగా సింహము ఎవరికి? అని ఆకాంక్షకొని, ఏడులేని ఆఱునకు అనగా తులలేని కన్యకు అని సరిపెట్టుకొనవలెను తుల సాటి, సమానము జంఘలు పది అనగా మకరములు. కుచములు పదునొకండు అనగా కుంభములు కనుబొమలు తొమ్మిది అనగా ధనుస్సులు - ఈ రీతిగా కవి సమయానుసారము సమన్వయించుకొనవలెను.

ఏడులేని ఆరు = ఈడులేని కన్య - ఇది కర్తృపదము.

'మూడును మూడుమూడు మరిమూడును మూడుమూడుగన్.'

ఉ. వాడిమగండు గండుమెయి భార్గవరాముడు క్షత్రవంశమున్
బూడిదసేయగా శపథమున్గొని మైకొనునాడు తీవ్రముల్
దాడులు చూడ గ్రొమ్మెఱుగుతండము గ్రమ్మినచాడ్పునందగెన్
మూడును మూడు మూడు మఱి మూడును మూడును మూడు మూడుగన్.
(శతావధాన ప్రబంధము. ద్వి. భా.)

ఏడుమూళ్ళు = ఇరువదియొకడు. పరశురాము డేకవింశతి పర్యాయములు క్షత్రియవధ చేసెనన్న సంఖ్యాసంకేతమునాశ్రయించి సమస్య రూపొందినది.

గణితసంబంధి మఱియొక్క సమస్య :

'తల లొక్కఱువదినాల్గు గానబడియెన్ దద్గౌరి వక్షంబునన్.'

పార్వతీదేవి యక్కున చతుష్పంచాశచ్ఛిరస్సులు కనబడెనని సమస్య.

మ. లలితాకారు కుమారు షణ్ముఖునిన్ లాలించి చన్నిచ్చుచో
గళలగ్నగ్రహరత్నదీప్తకళికా గాంభీర్య హేమాంచితో
జ్జ్వల రత్న ప్రతిబింబితాననములన్ శంభుండు వీక్షించినన్
దల లొక్కఱువదినాల్గు గానబడియెన్ దద్గౌరి వక్షంబునన్.
(తెలుగు సమస్యలు. వావిళ్ళ.)

గౌరీవక్షస్థ్సలమున నవరత్న పదకమున్నది. చనుబాలు త్రావుచున్న షణ్ముఖుని తలలు తొమ్మిది రత్నములలో ప్రతిఫలించినవి. కాగా $6 \times 9 = 54$ తలలు ఆమె యక్కున గనబడినవి.

'వికిరాన్నంబిడి పార్వతిన్ శివుడు తా బెండ్లాడె మోహాంధుడై.'

వికిర మనగా పిండనిర్వాపము. అట్టి వికిరము వివాహ శుభమున ప్రసక్తింపజేయుటయే సమస్యలోని అమంగళ వ్యాపారము.

మ. వికట భ్రూకుటి బూడిదై పడిన పూవిల్కాని పై నల్కమై
మకరాంకాయ రతిప్రియాయ భవతే మద్దత్త మేతత్త్రిలో
దక మంచున్ శశిరూపపిండమిది తత్తారాళి రూపమ్ముగా
వికిరాన్నంబిడి పార్వతిన్ శివుడు దా బెండ్లాడె మోహాంధుడై.
(చమత్కార కవిత్వము.)

'తనకు సంబంధించినవాడు గతించినచో తానేదైన శుభకార్యము చేసుకొన వలసివచ్చినపుడు ఆ గతించినవానికి కర్మ చేయకుండ తాను శుభకార్యము చేసికొనరాదని ధర్మశాస్త్రము.' ఈ సమస్య ధర్మశాస్త్ర సంకేత నిర్మితము.

'ధవళకాకజుండు దశరథుండు.'

దశరథుడు తెల్లని కాకికి బుట్టినవాడని యర్థము. తెల్లని కాకి లేదన్నచో దశరథుడును లేడనవలెను.

ఆవె. ధవళకాకమనగ తగు వేదహంసిక
దశరథుండనంగ దగును విష్ణు
వధ్వరముల శ్రుతుల నతడుదయించుట
ధవళకాకజుండు దశరథుండు. (చమత్కారకవిత్వము.)

దశరథుడు పక్షిరథుడు. విష్ణువు. అధ్వరములయందు మంత్రక్రియలచే అతడు రామాద్యవతారములతో బుట్టెనని భావము ఇది వైదిక సంకేతము.

'తన్నిన ధూత్కరించినను దాపము జెందక నవ్వుబొప్పునే?'

ఉ. కన్నె పసిండియందియలు గల్లురనంగ నశోకవృక్షమున్
దన్నె మొగమ్మునందుమిసె దద్బకుళద్రుమవు జూచి, దాన బూ
చెన్నగ వంకురింప ముఖసీమ ద్రుమంబులు రెండు మెండుగన్
దన్నిన ధూత్కరించినను దాపము జెందక నవ్వు బొప్పునే?
(శతావధాన ప్రబంధము ద్వి. ఖం.)

'అశోక శ్చరణాహత్యా', 'వకుళో ముఖసీధునా' అని దోహద శాస్త్రము. ఈ సమస్య తత్సంకేత నిర్మితము.

## అధిక్షేప చమత్కృతి

'మార్తాండుం డుదయించె నస్తగిరిపై మధ్యాహ్నకాలంబునన్.'

శా. ఆర్తింజెంది విషజ్వరంబున నొకం డాపైని తద్రోగ వి
స్ఫూర్తిన్ భ్రాంతియు సన్నిపాత మమరన్ బూర్వాపరజ్ఞాన స
ద్వార్తాశూన్యుడు పల్కెనిట్లని యసంబద్ధప్రలాపంబుగన్
మార్తాండుం డుదయించె నస్తగిరిపై మధ్యాహ్న కాలంబునన్.
(అవధానసారము.)

దత్తమైన సమస్యయే యసంబద్ధప్రలాపమని యధిక్షేపింపబడినది.

'కొడుకా! రమియింపు మనుచు గూతుర పలికెన్.'

కం. పరతులపై మోహంబున
సుడివడియెడి తండ్రి జూచి, 'క్షుద్రులతో నె
ప్పుడు గూడ నిటులె ముండా
కొడుకా! రమియింపు'మనుచు గూతురు పలికెన్.
(శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రిగారు.)

## అపహాస్య చమత్కృతి.

'బల్లికి రెక్క లేర్పడియు బామును మ్రింగె నెలుంగు వీపుపై.'

బల్లి = గృహగోధిక. దానికి రెక్కలు వచ్చి, భల్లూకపృష్ఠమున కెగిరి, అక్కడనొక సర్పమును మ్రింగినదట ఇది సమస్య. బల్లికి పక్షములు వచ్చుట, చక్షుశ్శ్రవమును భక్షించుట రెండును గల్లలే.

ఉ. కల్లలు పొల్లులాడు టనగా నది యిట్టిద, వేయి చిల్లులన్
జెల్లెడు కుండనిండ నిలిచెన్ జలపూరము, కుంటివాడు మో
కాళ్ళనె సంచరించెను జగమ్మఖిలమ్ము నిమేషమాత్రలో
బల్లికి రెక్క లేర్పడియు బామును మ్రింగె నెలుంగు వీపుపై.
(అవధాన సారము )

సమస్యలోని కల్లలకు తోడుగా మఱికొన్ని జేర్చి, యపహసించుటయే పూరణము.

'కుంతికి గుంభకర్ణునకు గూతురుగా జనియించె సీతయున్.'

ఉ. దంతిముఖుండు పుట్టె నెలతన్ దమయంతిని వాలి గూడగన్
గంతుని తల్లి శూర్పణఖ కన్న కుమారుడు భీష్ముడే, హనూ
మంతు నెఱుంగమే యసురమంత్రి శకుంతలయందు దా గనెన్
గుంతికి గుంభకర్ణునకు గూతురుగా జనియించె సీతయున్.

(శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము)

మృచ్ఛకటికనాటకమున శకారుని పద్యము లిట్టివే.

'కింశే శక్కే వాలిపుత్తే మహిన్దే లమ్హాపుత్తే కాలణేమీ శుబన్దూ
లుద్దేలా ఆ దోణపుత్తే జడాఊ చాణక్కే వా దుస్తూమాలే తిశఙ్కూ.
చాణక్కేణ జధా శీదా మారిదా భాలదే జుగే
ఎవ్వంమే మోడయిశ్శామి జడాఊ విఅ దోవ్వదీమ్.'

(మృచ్ఛకటికమ్. 8-34, 35.)

(వాలి కొడుకు మహేంద్రుడు. రంభ కొడుకు కాలనేమి. ద్రోణుని కొడుకు జటాయువు. భారతమున చాణక్యుడు సీతను జంపినట్లు, జటాయువు ద్రౌపదిని జంపినట్లు.)

ఇదే చాలున వేణుగోపాల శతకమున నొక సీసమున్నది.

సీ. రామాండక కతలెల్ల వేమెఱుంగనియవె?
కాటమరాజుకు కర్ణుడోడె,
బోగతకత లంత పోల నెఱుంగమె?
యగనేసు దర్జును నిరగబొడిసె,
భారతకతలోన బాలరాజొక్కండు
కుంభకర్ణుని బట్టి కుత్తసించె,
కందపురాణాల కత పిల్ల కాటేరి
యీరబద్రుని యిషయించి సంపె
అనుచు మూర్ఖులు పలుకుదు రవనియందు ....

మూర్ఖుల పురాణ కథా పరిజ్ఞానము నపహసించుచు పూరించుట యిదొక చమత్కృతి.

## అర్థాంతరన్యాస చమత్కృతి

'ఉక్తి రర్థాంతరన్యాసస్స్యా త్సామాన్యవిశేషయో'

సమస్య:'ఉష్ణీషంబున గట్టవచ్చునె? మదవ్యాఘ్రోగ్ర శుండాలమున్'

శా. ఉష్ణాంశుప్రతిమానతేజ! ధృతరాష్ట్రోర్వీశ! నీ సూను డీ
కృష్ణున్ సర్వ జగత్ప్రపూర్ణుడని యొక్కింతైన లోనెంచకే
తృష్ణాపాశవినిర్గతాత్ముడయి బంధింపంగ దానెంచె హా!
యుష్ణీషంబున గట్టవచ్చునె? మదవ్యాఘ్రోగ్ర శుండాలమున్.

(చమత్కార కవిత్వము.)

ఉష్ణీషము = తలపాగ.

'గొడ్డురాలికి దెలియునే బిడ్డబాధ.'

తే. గీ. తాను బ్రచ్చించుచు శతావధాని గూర్చి
ధారణాశక్తి పోవగ ధార యఱగ
నెందు గష్టము గూర్చును బ్రచ్చకుండు
గొడ్డురాలికి దెలియునే బిడ్డబాధ? (అవధాన భారతి.)

'కుట్టకయున్న వృశ్చికము కుమ్మరిపుర్వని యెంతురే కదా!'

ఉ. కట్టడి సూర్యనందనుడు కార్య మెఱుంగక దుష్టబుద్ధియై
చుట్టలు మిత్రులున్ సుతులు సూరెల గొల్వ సుఖానమన్న వా
డట్టె యికేల తామసిలి నాతని త్రోశ్చదగింపు లక్ష్మణా!
కుట్టకయున్న వృశ్చికము కుమ్మరిపుర్వని యెంతురే కదా!

(కొప్పరపు సోదరకవులు.)

సూర్యనందనుడు = సుగ్రీవుడు

## కాకుస్వర చమత్కృతి

'రాముడు శూర్పణఖ నపుడు రతి బెండ్లాడెన్.'

కం. కామించి చూడ బోడే
భామిని, శ్రీరాము డేకపత్నీవ్రతు డో
స్వామి! యిదియేమి మా టే
రాముడు శూర్పణఖ నపుడు రతి బెండ్లాడెన్?
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం )

'పాతివ్రత్యవిభంగభీతి విటులన్ బై కొందు రజ్ఞాననల్ '

శా. పాతివ్రత్యము భారతక్షితి దగున్ బాశ్చాత్యదేశమ్ములన్
జేతశ్శుద్ధిగ దాని బూను టరుదై చెల్లున్ యథేచ్ఛారతుల్
కాతర్యమ్మున కౌగ్గి నిల్వ రౌకచో గాలూని, పాటింతురే
పాతివ్రత్యవిభంగభీతి? విటులన్ బై కొందు రజ్ఞాననల్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం )

'నాతికి మీసముల్ మొలప నాథుడు ప్రీతిని ముద్దు బెట్టెడిన్.'

సతి మూతిమీది మీసములు పతికి ముద్దుగూర్చునా?

ఉ. చూతఫలప్రభాముమిషుల్ చనుగుబ్బలు పోకలంతలై
చేతులు కొయ్యబాఱి, నునుసిగ్గుతెరల్ మృగతృష్ణవారియై
బ్రాతిగ రూపు దిద్దికొనె బౌంస్నగుణంబులు చూచి యేగతిన్
నాతికి మీసముల్ మొలవ నాథుడు ప్రీతిని ముద్దు బెట్టెడిన్?
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

స్త్రీయందు పుంధర్మ మేర్పడినచో మీసములు మొలుచును. తత్పరిణామ ఫలముగా, మామిడిపండ్లంత పెద్దపాలిండ్లు పోకలంత లగును. మృణాళనాళ మసృణ బాహులతలు కొయ్యబాఱును. లజ్జామాధుర్యము పంచబంగాళమగును ఇట్టి నాతి నెవడు చుంబించును?

## శబ్దగతార్థ చమత్కృతి

'మానవతీలలామ కభిమానమె చాలును చీర యేటికిన్?'

ఉ. ఓ నవనీతచోర! దయయుంచి పటమ్ముల నిమ్ము వేగ మా
మానము గావుమన్న, వ్రజమానిని పల్కుల కెంతొ వింత న
వ్వానవసీమ దోప గమలాక్షుడు తానిటు పల్కె, మానినీ!
మానవతీలలామ కభిమానమె చాలును చీర యేటికిన్?(శతావధాన సారము)

మానవతి యనగా మానము కలది. అది యుండిన జాలును. అన్యమెందుకు? చీర అన్యము. ఇది శబ్దగతమైన అర్థచమత్కృతి.

## లోకోక్తి చమత్కృతి

'తటుకున స్వర్ణకారుని దాపున జేరె సుబుద్ధి మిద్ధరన్.'

చం. నటకుల చెంత, గ్రామకరణంబుల పొంత, వకీళ్ళయందు, బ్ర
స్ఫుటనవయౌవనాఢ్యలగు బోగపుగాంతల పల్కులందు ని
ల్చుట యది ధర్మమా యనుచు లోన దలంచుచు దూరదర్శియై
తటుకున స్వర్ణకారుని దాపున జేరె సుబుద్ధి మిద్ధరన్ (అవధాన సారము)

ఇదొక లోకోక్తి. ఈ పద్యమునకు మూలమగునేమో, యీ శ్లోకము ప్రచారమున నున్నది.

శ్లో. భూత్వా పౌలిస్టకా [illegible] రజకా నాఖాప్య పౌరాణికాన్
గానస్థాన ముపేత్య దాసి కరణా నాలింగ్య నత్వా కపిన్
వేశ్యాసద్మని సంప్రవిశ్య చ గతా వైద్యస్య వాజి గృహం
భూయో హంత! సువర్ణకారసదనే సానంద మాస్తే మృషా.
(మం[illegible]శ్వరశాస్త్రిగారి చాటువు.)

'పట్టపగలు చుక్కలు పొడిచెన్.'

కం. నిగమాగమపారగులౌ
సుగుణుల బరిహాసమాడ జూచు మహాత్ముల్
జగతి జనించిన కతనన్
సుగుణా! [illegible] చుక్కలు పొడిచెన్.
(శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రిగారు.)

## లోకజ్ఞతా చమత్కృతి

'కన్నెఱికము చెడక మునుపె గర్భంబాయెన్ '

ఈ సమస్య విన్నంతనే, ఆ, యేమున్నది? కుంతికథ చెప్పినచో సరిపోవు ననుకొందురు కుంతి సూర్యసమాగమముచే కన్యాత్వము చెడి గర్భిణి యయ్యెను. నీ కన్యాత్వము దూషితము కాకుండెడుమని సూర్యుడు వరమిచ్చెను. అది వేఱు. ఇక్కడ కుంతి కథ పొసగదు.

కం. చిన్నది పండ్రెండేండ్లది
యెన్నడు రతికేళి సుఖము నెఱుగక మునుపే
వెన్నున దామర పుట్టెను
గన్నెఱికము చెడక మునుపె గర్భంబాయెన్. (తెలుగుసమస్యలు. వావిళ్ల.)

వెన్నున తామర పుట్టినచో చిన్నికన్నెలకు చూలేర్పడునని వైద్యులందురు. ఆ చూలు వట్టి మాంసపేశి కావచ్చు.

'వేకటి లేక బిత్తరియు బిడ్డ గనెన్ గగనస్థలంబునన్.'

గగనస్థలము దేవతా విహారస్థలము కనుక దేవకామినులు సద్యోగర్భమున బిడ్డఁగనుట వింత కాదు కాని, హంసలు గగనమున బోవుచు గ్రుడ్లుబెట్టుట, రవి కర స్పర్శచే తత్క్షణమే గ్రుడ్లు ప్రిదిలి పిల్లలగుట, ఆ పిల్లలు మట్టు ఆటే తల్లి వెంట బోవుట-పక్షిశాస్త్రమందు హంసజాతి పరిజ్ఞానముగల కవి, బిత్తరిని పులుగు బిత్తరిని జేసి యిట్లు పూరించును.

ఊ. మూకలు గట్టి క్రౌంచములు మందర బోవుచునుండ నొక్కటిం
జోకగ గ్రుడ్లుబెట్టె నొక సూర్యకరంబది దాకి పిల్లయై
యాకలు వచ్చి తల్లికడకేగ వడింజనె, నైదునాల్నెలల్
వేకటి లేక, బిత్తరియు బిడ్డ గనెన్ గగనస్థలంబునన్.

(తెలుగుసమస్యలు. వావిళ్ల.)

'ఆకులు పోకలుంగలుగ నంతియ చాలను సున్నమేటికిన్.'

ఉ. శ్రీకర కీర్తిహార గుణశేఖర కొమ్మనమంత్రి తిక్కనన్
రాకలు గోరి ముగ్ధయును రాగము జెందిన మన్మథాగ్నిచే
బ్రాకటమైన ముత్యములు పాకములైనవి వేగ తేఁవయా
యాకులు పోకలుంగలుగ నంతియ చాలును సున్నమేటికిన్
(తెలుగు సమస్యలు. వావిళ్ల.)

ముత్తియము లగ్గిసెగ తగిలినచో సున్నమగును. ఆ సున్నము తాంబూల దళములకు రాచి, పూగఖండములు కలిపి సేవించినచో రక్తిమ కలుగును. ఈ పద్యమున శబ్దశుద్ధి తక్కువ. అయినను అభిప్రాయము చక్కగ నున్నది. ఇది వస్తుగుణజ్ఞతా ఫలము.

## పౌనరుక్త్య చమత్కృతి

'నిను నిను నిన్ను నిన్ను నిను నిన్నను నిన్ను ను నిన్ను నిన్ననున్.'

చం. అనిలజ! జాంబవంత! కమలాప్తతనూభవ! వాయుపుత్ర! యో
పనస! సుషేణ! నీల! నల! భానుకులుండగు రాఘవేంద్రు డ
ద్దనుజపురం వే గెలువ దైత్యుల జంపను వేగ రమ్మనెన్
నిను, నిను, నిన్ను, నిన్ను, నిను, నిన్నను, నిన్నను, నిన్ను నిన్ననున్.
(తెలుగు సమస్యలు. వావిళ్ల.)

శ్రీరాముని యాజ్ఞ వానరసేనలో నందఱకి బేరుపేరున దెలియబఱచుట జరిగినది. ఇందు తొమ్మిది నినులున్నవి. సంబోధనము లెనిమిది యున్నవి. మొదటివాడు అనిలజుడు. నాలుగవవాడు వాయుపుత్రుడు. ఇద్దరు నొకరే. కనుక మఱియొకటి తగ్గును. ఆంజనేయుని రెండుమాఱులు సంబోధించుట యతని ప్రాముఖ్యము నామ్రేడించుటకు కాబోలు,

'అందరు నందరే మఱియు నందరు నందరె యందరందరే.'

ఉ. కొందఱు ప్రాక్కిటికేశ్వరులు, కొందఱు కాఱుని యెక్కెటింతలున్
గొందఱు భైరవాశ్వములు, కొందఱు పార్థుని తేరి టెక్కెముల్
కొందరు కృష్ణజన్మమున గూసినవారలు నందరందరే
యందఱు నందరే మఱియు నందఱు నందరె యందరందరే.
(శ్రీ [illegible].)

ప్రాక్కిటీశ్వరులు = తడిపిరాపాస్వాములు, పందులు కాలుని యెక్కి రింతలు = యముని వాహనములు, దున్నపోతులు భైరవాశ్వములు = భైరవుని వాహనములు, కుక్కలు పార్థుని తేరి టెక్కెములు = అర్జునరథధ్వజములు, కోతులు. కృష్ణజన్మమున కూసినవారలు = గాడిదలు.

'సారెకు సారెకున్ మఱియు సారెకు సారెకు సారెసారెకున్.'

శ్రీరమణీయ చారుపరసీరుహలోచను దున్నతాంసు డౌ
రా! రఘురాముడంచు మధుర స్మిత జూడదలంచియున్ సభన్
ధారుణిపుత్రి చూపె దపతస్ఫురదక్షుల, యత్నమూనెడున్
సారెకు సారెకున్ మఱియు సారెకు సారెకు సారెసారెకున్.

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

ధారుణిపుత్రి = సీత. రాముడు చూడదగిన సుభిరామమూర్తి యని కుతూహలముతో చూడదలుచును. అందఱు పెద్దలున్నారు తాను క్రొత్తపెండ్లి కూతురు. సిగ్గు కలుగుచున్నది చూడను మూనను అభితః స్ఫురత్ అక్షుల = అన్నివైపుల తిరుగు కన్నులతో అక్కడెవరున్నారు? ఇక్కడెవరున్నారు? వారు నన్ను చూచుచున్నారా? అని. సందు దొరికినచో రాముని జూడవలెనని మాటిమాటికి యత్నించుచున్నది.

చారిత్రిక సమస్యాపూర్తి

'తల్లికి మగడౌట కంటె ధన్యత కలదే?'

ఈ సమస్య కొన్యాలోకపు తల్లికి మగడౌట కంటె ధన్యత గలదే యని పూరింప వచ్చును. కాని చారిత్రిక వేలుగా పూరింపబడినది.

కం. పల్లవపాణి రతిసమ
సల్లలితాంగి కమలదళ విశాలేక్షణ తో
భిల్లు నల రెడ్డిసుత తని
తల్లికి మగ నౌటకంటె ధన్యత కలదే? (శతావధాన ప్రబంధము. ప్ర ఖం)

అల రెడ్డిసుత = రాయమువేమువి సుత. అనితల్లి అనితల్లిని పెండ్లాడిన అల్లయ వీరభద్రారెడ్డికి ఆధిరాజ్యము లభించినది. అందుచేత అనితల్లికి మగడగుట ధన్యత ఇది చారిత్రికవిషయము

'కింగున కపజయము గూర్చి కీర్తిం గనుమా!'

కం. సాంగత్యదూరవృత్తి వె
సం గాల్బలము బరపించి శత్రుత నెలకొ
ల్పం గన్నుకొట్టునట్టి పె
కింగున కపజయము గూర్చి కీర్తిం గనుమా!

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం)

'ఒకరా యిద్దర ముగ్గురా నలుగురా యూహింప నింకెందరో!'

మ. ప్రకటౌద్ధత్యముతోడ వీచె జనతాపార్టీ మహావాత్య, స
ఖ్యకందంబంబది వచ్చె కాంగ్రెసు ప్రతిద్వంద్విస్ఫురత్స్థానదీ
పకమై, పండిన యాకులై పడిరి భూభాగమ్మునన్ మేటులే
యొకరా యిద్దర ముగ్గురా నలుగురా యూహింప నింకెందరో!

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

ఇది యెన్నికల ఫలితములు వెలువడునప్పటి పరిస్థితి.

## ఛందోనిగూఢ చమత్కృతి

'ఉత్పలగంధిరో యిపుడు నీ వూహూయనన్ బాడియే?'

ఈ సమస్య పూర్వార్ధము చూచినంతనే ఉత్పలమాలికావృత్తమనిపించును. ఉత్పలశబ్దముద్ర కూడ అట్టి భ్రాంతికి ప్రేరకము. ఉత్తరార్ధము మత్తేభశార్దూల విక్రీడితవృత్తముల కనుగుణముగ నతికినవి. ఏల యనగా మెలిగి పాదాదియందు సగణము జేర్చ మత్తేభముగ గాని, గగము జేర్చి శార్దూలముగ గాని మొత్తము పద్యమును దీర్చికొనవలెను. 'ఊహూ' యతిస్థానమున నున్నది కనుక తన్మిత్రా క్షరము పాదాదియందు గూర్చికొనవలెను.

మ కనుసన్నం గొలుపంగ నొప్పితి వలంకారమ్ము లంబంప వే
డ్కను గైకొంటివి. పూవుసెజ్జ దరియంగా రమ్మటంచున్ వయ
స్యను బుత్తెంచితి నమ్మి వచ్చితి, గటాక్షంబింత లేనట్టి చె
య్వుననో యుత్పలగంధిరో! యిపుడు నీ వూహూయనంబాడియే?

(అవధాన సారము)

ఇది మత్తేభ విక్రీడితవృత్తము. ఒక చరణమున గొన్ని యక్కరములు తగ్గించియేకాదు, పెంచియు సమస్య యీయవచ్చును పెరిగిన యక్కరములు తత్పూర్వ చరణమునకు జెందినవియై యుండును.

'యె షాక్లీబులు గూడ బుట్టె జగమెల్లన్ దాన్.'

కందపద్య పాదమున నొక గురు వధికముగ నున్నది. క్ల ప్రాసము.

కం. అక్లిశము బ్రహ్మము ని
త్యక్లిబత్వంబు గలుగు తత్త్వము, తచ్ఛా
యాక్లిన్న మాయ తద్యో
షాక్లీబులు గూడ బుట్టె జగమెల్లన్ దాన్. (అవధాన సారము)

'నాటిరోజు లికరా వికరా వికరావు మిత్రమా!'

దీనికి ముందు భగణము జేర్చినచో నుత్పలమాల యగును. నలము జేర్చినచో జంపకమాల యగును.

చ. పరమ కవిత్వ మండితుల బండితవర్యుల సత్కరింపుచున్
గురుగతి నగ్రహారములు గూర్చుచు రత్న సువర్ణ భూషణాం
బరము లొసంగు దాతలగు పార్థివముఖ్యులు పోవ, బోయె, ని
ర్భరములు నాటిరోజు లికరా వికరా వికరావు మిత్రమా!
(శతావధాన ప్రబంధము. ప్ర ఖం)

ఇది చంపకమాల. సమస్యయందు ముందుజేరిన నాలుగు లఘ్వక్షరము లలో నాద్యక్షరము యతిమైత్రి గలిగియున్నది.

'రాముని రాక్షసాంతకుని దాశరథిన్ వినుతించుటొప్పునే?'

ఈ సమస్యలో యతిభంగ దోషమున్నది. పృచ్ఛకుడు కావలసియే యిచ్చెను. అవధాని దానిని సమర్థించుకొనవలెను.

ఉ. ఏమి విభీషణా! దనుజు లేమయిరన్ మతిలేకు జింత లే
దా? మన చెల్లిలిం జెఱచినాతని పెండ్లము దెచ్చినాడ ద
ప్పా? మనుజుండు గొప్ప? పలు పల్కులు మానుము, సిగ్గులేక త
ద్రాముని రాక్షసాంతకుని దాశరథిన్ వినుతించుటొప్పునే?
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

రాముడు తత్సమ పదము కనుక 'త్రాము' డనుటకు వీలైనది. ఇదే సమస్య-

1. రాముని రాక్షసాంతకుని నాశకరున్ వినుతించుటొప్పునే?

2 రాముని రాక్షసాంతకుని లంక నిటుల్ వినుతించుటొప్పునే?

అని మార్చి యీయవచ్చును అప్పుడు 1. సిగ్గువీడుచు్రామునిని, అని,

2. ఇదేమి వాగుట్రలామునిని, అని కూర్చికొన్నచో యతి కుదురును.

'పుష్పిణి నంటె రాఘవుడు లోలమతిన్ సతి శౌచదూరుడై.'

ఈ సమస్యను బూరించుట దుర్ఘటము. యత్యర్థము శ్రమపడవలెను. తృతీయచరణము తుదియందు లకారమునకు మెఱ విఱిచిన గాని యతి పొసగదు. పుష్పిణి సతి లోలమతియైన పతికి శౌచబుద్ధి లోపించుట వింత కాదు. కాని పరమ ధర్మిష్ఠుడైన శ్రీరామునకు శౌచదూరత అంటగట్టుట ప్రాజ్ఞు లొప్పరు. పుష్పిణీపదము సమాసమున గ్రుచ్చికొను నవకాశ మున్నచో ఈ తంటా యుండదు.

ఉ బాష్పసమాకులేక్షణ మబంధురవక్త్రము వంచి రాము వా
స్తోష్పతి బోలు గాధిజుడు చూచితె యీ శిలయంచు బల్కు తా
దుష్పథవృత్తి గౌతమపధూమణి పాదపరాగభూతి గల్
పుష్పిణి నంటె రాఘవుడు లోలమతిన్ సతి శౌచదూరుడై.

(శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు)

కల్లు, కలు = ఱాయి. కల్పుష్పిణి = అహల్య సతి = పతివ్రత లోల మతి = సంభ్రమముతో, శౌచదూరుడై = దూరమునుండి నడిచి వచ్చినవాడు కాళ్ళు మొగమైన కడిగికొనలేదని చెప్పవలెను ఇంద్రచరణరజముచే నపవిత్రమైన గౌతమాశ్రమము ఉపేంద్రచరణరజముచే పవిత్రమయ్యెను.

సమస్య ద్విచరణ త్రిచరణరూపమున నీయబడుటయు క్వాచిత్కముగా గోచరించును.

సీ. (నిలువుటద్ద మెదుట నిలిపి చూపితి గాని
పలుకెంపు లేమని పలికినాన?
పసమీరు దుప్పటి పైన గప్పితి గాని
పసపు రంగేమని పలికినాన?
విరుల సురటి దెచ్చి విసరుచుంటిని గాని)
చెమ టదేమని పృచ్ఛ చేసినాన ?
పవళింప విరిపాన్పు సవరించితిని గాని
యాయాస మేమని యడిగినాన ?

తే. గీ. మొగము వెలవెల బోయిన మూలమేమి?
యెరుపు కనులందు గలిగిన హేతువేమి?
నాథ! నాయందు లోప మున్నను క్షమింప
బాడియగుగాక, తప్పులు పట్టదరమె? (శతావధాన సారము.)

పై పద్యమున రెండున్నర చరణములు సమస్య. తక్కినది అవధానుల **పూరణ.** పూరణమున జిక్కేమియు లేదు తదనుగుణముగ పద్యము కట్టుట మాత్రమే.

త్రిపాదసమస్యలిచ్చు సంప్రదాయము సంస్కృతమున గలదు. ఒకదాని **కొకదానికి** బొంతనలేని మూడు పాదము లియబడును. వానిని క్రిందికి మీదికి **అన్వయానుకూలముగా** మార్చి, చతుర్థ పాదము కల్పించి శ్లోకము నొకకొలికికి దెచ్చి యర్థము సాధింపవలెను.

'అయం స తే తిష్ఠతి సంగమోత్సుకః
విభావరీ భాతి సదంబుజేన.
దుద్ధుద్వయం కుండలపండితానామ్'

పై మూడు చరణములు మూడు గ్రంథములందలి శ్లోకములనుండి ఒకొక్క **చరణము** చొప్పున నెత్తి యీయబడినవి. దేని త్రోవ దానిదే. పరస్పర **సంబంధము** శూన్యము. పూరణము చూడుడు.

అయం స తే తిష్ఠతి సంగమోత్సుకః విభావరీ భాతి సదంబుజేన
దుడ్డుద్వయం కుండలపండితానా మగ్రేసరో దాతుమనా మృగాక్షి!
(దేవులపల్లి సోదరులు)

గద్వాల ప్రవేశపరీక్షలో శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవుల కీమూడు పాదము లీయబడెను.

'రామాయ రామభద్రాయ'

'తప స్స్వాధ్యాయ నిరతమ్.'

'వేణీ సంహార నాటకమ్.'

పూరణము—

తప స్స్వాధ్యాయనిరతం
గురుం నత్వాఽకరోత్కవిః
రామాయ రామభద్రయ
వేణీసంహార నాటకమ్. (నానారాజ సందర్శనము.)

—: o :—

# దత్తపది

పృచ్ఛక దత్త పదము లేపద్యమున పొసగింపబడియుండునో ఆ పద్యము దత్తపది. దీనినే కొందరు దత్తాక్షరి యందురు.

పద్యము చతుష్పాదము కనుక పాదమున కొక పదము చొప్పున నాలుగు పదములు పృచ్ఛకు డిచ్చును. ఇచ్చి, వీని నుపయోగించికొని, పలానా విషయము పద్యము కట్టి చెప్పుమని కోరును.

ఉదాహరణమునకు - పద్యము, మద్యము, ఖాద్యము, హృద్యము - ఈ పదములతో శ్రీకృష్ణుని బాల్య క్రీడ వర్ణింపుమనును. పద్యము సరే, బాల్యక్రీడలో మద్య మెందుకని యడుగగూడదు.

ఉ. పద్యములున్ రసార్ద్రములు పాటలు పాడుచు వేణువూని శ్రీ
మద్యమునానదీపులిన మంజు లవంజులపంక్తి నీడలన్
ఖాద్యము లారగించుచు సుఖస్థితి గోవుల గూడియాడు నా
హృద్యమురారి బాల్యగతవృత్తము శక్యమె ప్రస్తుతింపగన్

అని నడిపించినచో ధారాప్రవాహమున మద్యము కలిసిపోవును శ్రీమత్ + యమున = శ్రీమద్యమున.

ఈ రీతిగా దత్తపదములు నాలుగు ప్రాయశః ప్రాసస్థానము నలంకరించు లాగున నుండును.

కల,కత,మల,పల. ఎద్దు,వద్దు,ముద్దు, కద్దు. నవ్వులు, పువ్వులు, గవ్వలు, మువ్వలు. శంఖ, పుంఖ, రింఖ, ప్రేంఖ స్నిగ్ధ, ముగ్ధ, దిగ్ధ, జగ్ధ. చాపము, కోపము, పాపము, రూపము- ఇటువంటి పదాలు ప్రాస సాంగత్యము గలిగి చెవి కింపుగానుండును. కనుక ఈ పద్ధతియే ప్రచురముగా వాడుకకు వచ్చినది. ఇట్లు గాక - అమ్మబాబొ, నాసామిరంగ, నీకడుపుమండ, రావోయిచంద్ర - అని నాలుగు

మాటలిచ్చి భారతార్థమో రామాయణార్థమో వచ్చునట్లు పద్యము చెప్పమని యడుగుటయు కద్దు. అపుడీపదములు ప్రాస స్థానమున గుదురవు. ఎక్కడ గుదిరిన నక్కడే వేసికొనవలెను.

వర్ణ్యవిషయములకు దత్తపదములకు పొత్తు పొసగును; పొసగదు పొసగిన సందర్భమున పద్యము కట్టుట అవధానికి పప్పులు బెల్లము. పొసగని సందర్భమున పచ్చివెలగకాయ. దానిని పక్వము చేసి సేవ్యము గావించుటకు పాండిత్యవైయాత్యములు పుష్కలముగా నుండవలెను.

పొసగుట-పొసగకపోవుట అను విషయము నిట్లు వింగడించి చెప్పవచ్చును. ఒక చిత్రలేఖకునకు ఒక కోడిగ్రుడ్డు బొమ్మ గీచియిచ్చి, చెఱుపకుండ దీనినే పక్షిగా తీర్చి చూపుమని కోరిన అతడు తత్క్షణమే దత్తమైన యావర్తులాకృతికి ముందు ముక్కు, వెనుక తోక, మీద ఱెక్కలు, క్రింద కాళ్ళు గీచి, పక్షిని జేసి చూపగలడు. కోతిని గీచి యిచ్చి, సింగముగా దీర్చుమనిన, మీసాలు, జూలు చేర్చి, సింగమును జేసి చూపగలడు. ఇది పొసగుట కుదాహృతి.

కుక్కను వ్రాసి యిచ్చి సర్పముగా మార్చుమని కోరినచో సర్పాకృతికి పనికి వచ్చున దొకతోకయే. మిగిలిన నాలుగు కాళ్ళు, కడుపు, తల అక్కఱకు రావు. సరికదా, అడ్డు వచ్చును యమధర్మరాజు చిత్రమునిచ్చి, పదునాఱేండ్ల కన్యగా దీర్చు మన్నను కష్టమే ఆ కోఱలు, ఆ మీసాలు, ఆ భ్రూకుటి, గదాపాశ ఖడ్గాద్యాయుధపరికరములు మార్చిన కొదిగివచ్చునవి కావు. ఇది పొసగకపోవుట కుదాహృతి.

## దత్తపద స్వరూప భేదములు

1. అశ్లీలామంగళపదములు.

రండ, ముండ, బండ, కుండ. వర్ణ్యము సీతాకల్యాణము.

'శుభం పలకరా పెండ్లికొడుకా అంటే, పెండ్లికూతురు ముండ ఎక్కడున్న దన్నాడట' అని తెనుగు సామెత. శుభానకు ముండకు అంత దవ్వు 'రండా విధవయోషితి' అని విశ్వకోశము. బండ శిలావిశేషమే కాదు, ఖలశరదుర్జనాదు

లందును వర్తించు పదము. రండ పటము సూత్నపటము శ్రాద్ధాదికర్మలను సూచించును. ఇట్టి పదసామగ్రితో సీతవివాహ శుభము వర్ణింపవలెను

కృతహస్తుడైన యవధాని దాని నిట్లు నిర్వహించును.

ఉ. రం డని స్వాగతాంజలి సురద్విజు లిచ్చుచు, పెండ్లియాడు రా
ముండని సీత జూచి కడు పొంగుచు జుట్టల బల్కరించుచున్
బండగు జ్ఞానవృద్ధుడు సభన్ జనకుండు రవంత లోటు రా
కుండ నొసర్చె బంక్తిరథు డుత్సవమంద వివాహకార్యమున్.
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం )

రండు + అని, రండని, రాముండు + అని, రాముండని, పండు = పగ్గు. ద్రుతవశమున పరుషము సరళమైనది. బండు అగు, బండగు, రాక + ఉండ = రాకుండ. పద్యమున రండ ముండ బండ కుండలు లేవు లేవనగా శబ్దతః ఉన్నను అర్థతః లేవని యర్థము

'గోలకొండ, మాలముండ, పూలదండ, కొత్తకుండ' భారతార్థమున.

తే గీ. ఓయి కురురాజ ! నీకొడు కుత్త గోల
కొండపలెనుండు, క్షణ మూలముండ దీకను
ఖండనంబున గెల్తురు పాండుసుతులు
నుదరపుడు నూలదండ రేకొత్తికుండ (చాటుపద్య మణిమంజరి)

రామాయణార్థమున -

తే॥గీ॥ ఏటికిగోల కొండపై నేల డాగ
నొక్కమొగిగాగ సత మాల ముండబోదు
దనుజనాయక నీపూదండ వాడు
కొడుకు చేతికి వచ్చులే కొత్తకుండ (శతావధాన సారము.)

'కుక్క, నక్క, దిక్కు, బొక్క, రామాయణార్థమున-

కం. కుక్కయును బోలె వెఱపున
నక్కమలాసనుని పౌత్రు డడె పలపు మదిన్
దిక్క గొలుపన్ గుడీరం
బొక్కడు గనకుండె దూరె నుక్కివు డయ్యున్.

(శ్రీ అవధానము చంద్రశేఖరశర్మగారు.)

## స్వార్థత్యాగ పదములు

ఈ పదములు స్వార్థమున ప్రయోగింపగూడదని చెప్పి యిత్తురు.

కన్ను, చన్ను, పన్ను, మన్ను - ఈ పదములతో భారతకథాపరముగ నొక పద్యము కట్టవలెనన్న సులభముగ కట్టవచ్చును.

కన్ను నేత్రము కాదని, చన్ను స్తనము కాదని, పన్ను దంతము కాదని, మన్ను మృత్తు కాదని స్వార్థము నిషేధించి పద్యము కట్టుచున్నపుడు బరువగును.

ఉ. కన్నుల మ్రోత నగర్భముగా నారి స్యందనమెక్కి నిల్వ మున్
చన్నునుమూక జెండుచు మిషత్ప్రఖరేషుతతిప్రరంపరన్
పన్నుచు గాండివంబుగొని పార్థుడు భారతయుద్ధభూమి సీ
మన్నలిభాగ్జపార్ద్రరుచిమంతము జేసె ప్రచండబాహుడై.

(శతావధాన ప్రబంధము ప్ర ఖం.)

కిన్న = బండికన్ను, నేమి. మున్ = ముందు చన్ = చనుచున్న, నునుమూక = సన్నగా బలిసిన కాల్బలము సీమన్ = మేర. మలిభాక్ + జపా + ఆర్ద్ర రుచిమంతము = పొగడదగిన దాసాని క్రొంజిగిగలదిగా జేసెను.

'కన్ను' పదమునకు నేత్రము, చూపు, జాడ, పదును లోనగువాని గనుపు క్రిందిగుంట, బండిచక్రము, పంతెన ద్వారము, నెమలిపురికన్ను, మృదంగాది వాద్యభాండముఖమునం దేర్పడిన వృత్తివిశేషమండలము, వలయమందలి రంధ్రము, ప్రణాళికారంధ్రము అని శబ్దరత్నాకరము పది యర్థము లిచ్చినది.

'అసువు, [illegible], [illegible] - [illegible] ఇందలి అసువు, జనువు, సెనగ [illegible] = [illegible]

ఉత్సాహవృత్తము.

అనుము దుష్టకృత్య మియ్యదంచు గౌరవేయుతో
జనుము వేగ నటకు నీవు, సంజయాదులెన్న జే
సె, నగడౌందక హరి యంచు జెందు గీర్తి నిన్ను న
మ్మ, నగధారి! యంచు జెప్పె ముందు ధర్మజాతుడున్ (అవధానభారతి)

పాలు గాని పాలు సభావర్ణనము.

ఉ. పాలుగొనన్ సభన్ సఖులు పల్వురు వచ్చిరి మాన్యులున్ మహీ
పాలురు రాజనీతి పరిపక్వమనస్కులు వచ్చి రెందు లో
పాలు ఘటిల్లకుండ గురువర్యుల దీవన లుండ, వాక్స్వరూ
పాలుకులారా! నాకు బరువౌనె? వధానకలాప మియ్యెడన్.

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

అలుకః = శేషనాగే అని నిఘంటువు. వాక్స్వరూపాలుకులు = శబ్దశాస్త్ర పండితులు.

'భారి భేరి, మోరి, జారి'—ఒక స్వాతంత్ర్య యోధుని పోరాటము వర్ణ్య విషయము.

శా. భారింగ ద్ధనురుద్ధతాశుగచయ ప్రక్షుబ్ధ రిప్వబ్ధి శో
భే రిక్తాస్యసితాస్యమండలికి నాయెన్ సీతరామయ్య, లే
మో రిక్కల్ వలె మేసు నా నడచి మృత్యుప్రాయు, డాదండడిన్
జా రింద్రుల్ పగదీఱడైన భరతక్ష్మా బొందె గీర్తిందిరన్.

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం )

ఆనాడు అల్లూరి జయంతి. కనుక తద్విషయము చెప్పబడినది. భా = కాంతి చేత. రింగత్ + ధనురుద్ధత = (చేతిలో పామువలె) ప్రాకుచున్న ధనువు నుండి వెల్వడు నాశుగచయ ప్రక్షుబ్ధ రిపు అబ్ధి సీతారామరాజు. సితాస్యమండలి యెట్టిది? శోభా + ఈ + రిక్తాస్యము. తేజోలక్ష్మీహీనము. అనగా దరిద్రపు మొగము. జాఱు + ఇంద్రుల్ = జారీంద్రుల్. ఇంద్రులు సితాస్యచక్రవర్తులు, చారు = చావరు.

## హీనపద్య పదములు

పదిపదిపదిపది. రంగరంగరంగరంగ, వనము వనము వనము వనము. రణము రణము రణము రణము. మీసము మీసము మీసము మీసము.

ఈ రీతిగా నొకేపదము నాలుగు పాదములందు అర్థభేదముతో పొసగించి పద్యము నిర్మింపవలెను.

'పది, పది, పది, పది' భారతార్థమున-

కం. పదిలముగ గోర్కిదృతి బెం
ప దిగిచి పార్థుండు యంత్రమత్స్యము నేసెన్
పదిమంది యౌననన్ ద్రౌ
పది గొనె, బాంచాలరాట్సభాభాగమునన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

ద్రౌపదిలో నొకపది, సంఖ్యావాచకమగు పది యొకపది, పదిలములో నొకపది, పెంప-తిగిచి లో నొక పది — అర్థభేదముతో నాలుగు పదులు వచ్చినవి.

## విపరీత పదములు

దుర్యోధన దుశ్శాసన కర్ణ శకుని నామములు సంగతములు చేసి, రామాయణకథా పరముగ పద్యము కట్టుట, రామలక్ష్మణ భరత శత్రుఘ్ననామములు సంగతములు చేసి భారతకథా పరముగ పద్యము కట్టుట విపరీతపద దత్తపది యనబడును

భారతయోధనామధేయయుక్త రామాయణకథా పద్యనిర్మాణము:

మ. చన దుర్యోధ నరాచులెల్ల దనువుల్ చాలించి, మాటేదొన
ర్చిన దుశ్శాసన మిట్టులుండెనని మారీచుండు హా లక్ష్మణ
ధ్వని కర్ణద్వనిపై ఘటించెన్ బాణమ్ము రామేషు వ
హ్ని నిశాచరేంద్ర దక్షిణాంశ నికృష్టేంద్రన్ దెరల్చెన్ సతిన్.
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

సరిగమల పద్యము:

కం. మాపని నీపని గాదా?
పాపమ ? మాపాపగారిపని నీపనిగా
నీపని దాపని పని గద
పాపని పని మాని దానిపని గానిమ్మా! (చాటుపద్య రత్నాకరము.)

కం. సరిసరిగా మా మానిని
గరిమగ మరి మరిని దాని గద మగ పదమా
సరిగానిదాని సమమని
సరిగద్దా గసరి దానిదారి గమారీ! (చాటుపద్య రత్నాకరము)

అన్యభాషా పదములు

సన్, రన్, గన్, బన్- కీచకవధ.

తే. గీ సన్నుతన్ గృష్ణ పిలిచె గిరిసుతు శ్రీక
రన్, సుశీలిని నట ముంచెరంబు జేర
గన్ను గలిగె భీముడు పెంపొదల పన్ని
బన్నుగడ ఫలింప వధించె బాబలు నలుక.
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం)

ఆంగ్లపదములు సన్నుతిలో సన్, శ్రీకరన్ ద్వితీయలో రన్, కన్నులో గన్, పన్నుగడలో బన్ కలిసిపోయినవి.

హోకు, బేకు, సాకు, మేకు- నాలుగు కన్నడ పదములు వీని నుపయోగించి రామాయణకథా సంబంధి వర్ణనము.

ఉ. హో కుశలాధినాథ! ధను దండితపర్తినినైన నన్ను ద్రా
బే కుటిలుండు ఎత్తుకొని యేగెనె వ్యోమపథమ్మునన్ చిరం
సా కులుడై, ధనుష్మదధిపా! రఘువంశ పయోధిచంద్ర! లే
మే కులభూష దా, దగవే! విడజూము, రావె, నాపదే!
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

రావణాపహృతయయిన సీతయొక్క విలాపము చెప్పఁబడెను.

ద్రాబ = అధముడు. ద్రాబ + ఏ కుటిలుండో, రిరంసా + ఆసులుడు. లేమ + ఏ = లేమే. లేమయే.

నిరోధ్, యాపు, వాసెక్టమి, ట్యూబెక్టమి- ఇవి కుటుంబ నియంత్రణ కార్యక్రమమున ఆలోపతివైద్యులు విధించు పద్ధతులు

పద్యము - భారత కథలోని భగవద్గీతా ప్రబోధము

మ తగునె యిట్టి నిరోధ మంచదలి పార్థా! కర్తృతాహంకృతిన్
వగపంబోకుము, గాపులాకపసులై ప్రాణుల్ మృతిన్గంద్రుడు, తే
ర్దిగుటల్ వాసె? క్టమిక్టమిస్వనితమౌర్వీన్ ద్రుళ్ళు గర్జుండు, మా
ఱు గతుల్, కవ్వడి యిచ్చోటూబె? క్టమిరుగ్రోపం బడంగింపవే!
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

పులాకపశులు = సంహారకర్తయైన రుద్రుని యొత్తిడికి తలయొగ్గి ప్రాణులు చత్తురు. క్టమిక్టమి = వింటినారి ధ్వని. కవ్వడి = సవ్యసాచి. ఇచ్చోట + ఊబె = ఇచ్చోటూబె? రణరంగమున పేడియా? క్టమి శబ్దముతోడి యెత్తి కోలు ఉపశమింపజేయుము. ఇది శ్రీకృష్ణు నుపదేశము.

కరోమి, కవయామి, వయామి, యామి-ఇవి సంస్కృతక్రియలు. విష్ణుస్తవరూపమైన తెనుగుపద్యమున నిమిడింపఁబడెను.

మ. గరిమన్ నిల్పక రోమిటారివలె గుల్కన్ సాగె దుర్మేధ ధీ
పర హృత్సాంకవయామికుండు నిశ బ్రోవంజూచినట్లే యబో
ధ రహింపంగను దేవ యామిడిని బొందంజేయకే యెందు శ్రీ
ధర యామిన్యధిపాన్వయేశ సురవంద్యా కృష్ణకర్తావనా!
(కొప్పరపు సోదరకవులు.)

పుర గ్రామ ప్రసిద్ధవ్యక్తి నామములు.

ఆగ్రా, మద్రాసు, డిల్లి, మైసూరు మహానగరనామములు. వీనిని జోడించి భారతకథాసంబంధి పద్యము చెప్పుట.

శా. ఆ గ్రామప్రజ గాచుపొంటె, బిశితవ్యస్తాస్థిమద్రాసు లెం
తే గ్రాలన్ బకుడున్నచోటి కరిగెన్ భీముండు వా డిల్లిదే
వ్యగ్రాస్మత్ క్షుధ దీర్ప రమ్మన గ్రుధాహంకారతన్ దైత్యు వ
క్షోఽగ్రమ్మెక్కి వధించె బాండవుల దామై సూరు లగ్గింపగన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

కథ బకభయానకదైత్యవధ. పిశిత + వ్యస్త + అస్థిమత్ + రాసులు = మాంసము నుండి వేఱుపడిన యెముకలుగల రాసులు. మద్రాసు. వాడు + ఇల్లు + ఇదే = వా డిల్లిదే. డిల్లి. తామై + సూరులు = మైసూరు. ఆ + గ్రామ = ఆగ్రా. ప్రజ ఏకచక్రపురవాసులు.

ఆశాఫరేఖ్, హేమమాలిని, జయప్రద, రోజారమణి—సుప్రసిద్ధ నటీమణులు. విషయము జనతాప్రభుత్వపతనము.

మ. అనిదంపూర్వ తమఃప్రదర్శిరుచియై ఆశాఫరేఖం దగెన్
జనతావైభవ హేమమాలి, నిఖిలశ్లాఘాద్భృతిన్, సత్పథం
బు నిరోధించి, జయప్రదర్శనమలిన్ మూర్ఖారివింధ్యంబు ని
క్కినరో జారమణీయరీతి చెడి గ్రుంగెన్ గాలదోవమ్మనన్.
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

ఆశా + ఫ + రేఖ = ఆశను విస్తరించు రేఖ.

'స్ఫారే పరోక్షేచ ఫ శబ్దో' అని నానార్థరత్నమాల.

హేమమాలి = సూర్యుడు. (సూర్యరాయాంధ్ర నిఘంటువు)

## అర్థరహిత పదములు

నునునూ, నెనెనే, నినినీ, ననా - రాధ మధురభక్తి పద్యము.

మ. నునునూల్పుట్టిన పూలదండ లిడలేనో! మోవి గోర్వెచ్చ తే
నెనె నేసీయగ లేనా! పొంది పొసగన్ నిన్ జేరగా లేనా! మా
నిని నీదానను గానా! జాగు సలుపన్ నీకేలరా! సస్మితా
ననా! నా భక్తి గణింపరా! వినర! కృష్ణా! రక్తి నన్నేలరా!
(శతావధాన ప్రబంధము. ప్రథమ ఖండము.)

## ధ్వన్యనుకరణ పదములు

గర్రని, తుర్రని, బుర్రని, సర్రని-అగస్త్యి వాతాపిల్వలుల పీచమణచుట.

ఉ. గర్రని త్రేన్చుచున్ దగరు కండలు మెండుగ మెక్కి బ్రాహ్మణుల్
తుర్రని పోవకుండ, నదధూర్తమృషాకృతి బిల్చు సోదరున్
బుర్రని పొట్ట చించుకొని పొర్మగ నిల్వలు డట్టి కష్టులన్
సర్రని నిగ్రహించె ఘటసంభవు డుగ్రతపస్సమగ్రుడై.
(శతావధాన ప్రబంధము. ద్వితీయ ఖండము)

ఇట్లే రుసరుస, పుసపుస, కసకస, నసనస పదములు-

లొటలొట, పటపట, చటచట, పుటపుట పదములు దత్తము లగును.

## సుకర పదములు

రామ, సోమ, గామ, భీమ - శ్రీరామస్తవము.

కం. రామ! రఘువంశవారిధి
సోమ! దనుజగణవిరామ! క్షోణీతనయా
కామ! కృపాధామ! సమిద్
భీమ! ననున్ బ్రోవుమా! కవిస్తుతనామా!

ఆడెను, పాడెను, వేడెను, కూడెను - భాగవతార్థమున పద్యము.

ఉ. ఆడెను గోపికానికర మంగవిలాసము ప్రస్ఫురింపగా
పాడెను నందనందనుడు పాదపజాలము పల్లవింపగా
వేడెను పాదధూళి హరి వేల్పుల ఱేడు తలన్ ధరింపగా
కూడెను నారదాది మునికోటి సభస్థ్సలి వేడ్కజూడగా.

పర్వతము, చిందము, బిసనాళము, సౌదామిని, కుటిలత, నల్లందనము - ఇవి వచ్చునటులు స్త్రీవర్ణము. సీసము.

సీ. కుదురుమీఱిన మేలి గుబ్బపాలిండ్లలో
పర్వతంబుల ప్రౌఢి పాదుకొల్పి,
కర మక్కజంబునౌ కంఠంబునందున
చిందంబు నందంబు పొందుపఱచి,
పదనుగా దోమిన బాహుయుగ్మంబులో
బిసనాళసౌభాగ్య మెసగజేసి,
అస్తినాస్తి విచికిత్సాప్తి మధ్యంబులో
సౌదామినీరీతి సంతరించి

కుంతలంబుల యందున కుటిలతలును
లవణి వేనలియందు నల్లందనంబు
తనువునందెల్లెడన్ మృదుత్వంబు నించి
నలువ నిర్మింపబోలు నీనాతి మిన్న. (అవధాన భారతి.)

నగరు, తగరు, తొగరు, పగరు - ఈ పదములు రామాయణ, భారత, భాగవతపరముగ రాధామాధవ కవిచే పూరింపబడెను. ఇతడు పదములను తారుమారు చేసి, యథావకాశమున ప్రయోగించెను

రామాయణపరముగా -

చం. నగరు పరాయె నింక విపినంబుల కేగుడు రాజ్యకాంక్షకున్
దగరు కుమారులార! యని తల్లి వగల్మిగులంగ దోపగా
దొగరున రక్తపట్టి మఱి దోపక గద్గద భిన్నకంఠయై
పగరుచునున్న జూచి రఘువంశవరేణ్యుడు తల్లి కిట్లనున్

భారతపరముగా-

చం. తొగరుచి కన్నుదోయి గడు దోపగ గర్జుడు భీమసేనుపై
దగరు ధరాధరంబునను దాకిన భంగిని దాకి నొచ్చి, తా
వగరుచుచున్ వెసన్ బరుగువారిన నచ్చటి రాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మది నాటుటజేసి, ధరాతలేశ్వరా !

భాగవతపరముగా-

చం. వగరుపు మాత్రమే వరుడు వశ్యుడు గాడు సఖీ సఖత్వ మె
న్న గరుడవాహనుండు మము నాడటు డించుటయెల్ల నుద్ధవా!
తగరని కాక మోహపు లతాతనులైన విడంగ జూతురే?
తొగరుచి యోషధీశునకు దోపగ జేయునె పీడనాడగన్.

(రాధామాధవకవి చాటువులు.)

## దుష్కర పదములు

ఉష్ట్రము, భ్రాష్ట్రము, రాష్ట్రము, లోష్ట్రము - నవవధూప్రథమకేళి వర్ణ్యము.

ఇట ప్రాస దౌష్కర్యమే కాదు, వర్ణ్యవిషయగ్రథనదౌష్కర్యమును గలదు. ఉష్ట్రము = ఒంటె, భ్రాష్ట్రము = మంగలము, ఇనుప వేపుడు చట్టి, రాష్ట్రము = దేశము. లోష్ట్రము = మట్టిగడ్డ ఈ పదసామగ్రికి నవవధూప్రథమ కేళికి చుట్టఱిక మెంతకలదో తెలుపనక్కర లేదు. కొంచెము కథ యల్లికొందమన్న పనికిరాని ప్రాసపదములు నోరుదెఱచికొని అడ్డు దవులును ముందు వాని దనుప వలెను.

ఉ. ఉష్ట్రము మాడ్కి నోర్చి చెలి నొయ్యన శయ్యకు దార్చి చీకటిన్
భ్రాష్ట్రము బోలు మందిరమునన్ రహి దేర్చి. వధూమణిన్ రతిడ్
రాష్ట్రము నేలె నవ్వరుడు, దాయక మౌగ్ధ్యము నెంత చూపినన్
లోష్ట్రమునం దనర్ఘపు మణిన్ గ్రహియింతురు గావె నేర్పరుల్!

(శతావధాన ప్రబంధము ద్వి ఖం.)

నేర్పరులు మట్టినుండి మాణిక్యము గ్రహింతురు. పెంకెతనము జూపు ముద్దరాలి నంకెకు దెచ్చికొని, వరుడు మన్మథరాజ్యము నేలెను.

కందమున నవగ్రహనామములు వచ్చునట్లు స్త్రీవర్ణనము

కం. గురుకుచ, రాహుకచ, నిశా
కరాస్య, సితనయన, మందగమన, బుధమనో
హర మంగళాకృతి, యనం
గ రథధ్వజ రమ్య శాటిక, యదె కను నినున్.

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం)

కందము కడుపు చిన్నది. తొమ్మిది గ్రహముల నామములు దానిలో నిమిడించవలెను. అంతేకాదు, స్త్రీవర్ణనము సమకూర్చవలెను. గురుడు బృహస్పతి. స్త్రీవర్ణనమున గురు నెక్కడ గూర్చుండబెట్టవలెను? గురుశబ్దమునకు గొప్పది యను నర్థము కూడ కలదు కనుక, కుచవిశేషణముగా గూర్పవచ్చును. కుజశుక్రశనులను యథాస్థితముగా నిలుపుటకు వీలు లేదు. 'కుజారమంగళాంగారా లోహితాంగో ధరాసుతః', 'శుక్రో భృగో ర్భృగుసుత స్త్వపుసుజశ్చ నితశ్చ సః', 'కోణో మంద శ్శనిః కృష్ణ సూర్యపుత్రో యమశ్చ సః' అని గ్రహనిఘంటువు. కుజశుక్రశనులు మంగళ సిత మందశబ్దరూఢవ్యక్తులు. ఈ శబ్దములు విశేషణముగా ఎక్కడనైన ప్రకాశించును. ఇనశబ్దము సూర్యునకు, స్వామికి చెల్లును. 'రాహు స్తమః కేతుశ్శిఖీ ధ్వజః' ఇంతమాత్రపు నిఘంటుపరిచితి యున్న జాలు. పద్యము నిర్మింపవచ్చు.

అట్లే నవరత్నములు కలిపి పద్యము జెప్పగోరుటయు గలదు.

—: o :—

# వర్ణనము

'లోకోత్తర వర్ణనానిపుణః కవిః'. వర్ణించుట సామాన్య వ్యక్తియు చేయగలడు. దానిని లోకోత్తరముగా జేయగలవాడు కవియొక్కడే. కవియైనవాడే అవధాని యగుచున్నాడు. కనుక అవధాని పృచ్ఛకు లడిగిన విషయము లోకోత్తరముగా వర్ణించి ఆహ్లాదకరుడగుచున్నాడు.

వర్ణనము ఛందోనిబద్ధము. ఛందము బహువృత్తము. వృత్తము రసాశ్రయము ఔచిత్యవేత్తలు—

'కావ్యే రసానుసారేణ వర్ణనానుగుణేన చ
కుర్వీత సర్వవృత్తానాం వినియోగో విభాగవిత్ '

(సువృత్త తిలకము. 3-7)

అన్నారు. ఏ వృత్తబంధము ఏ రసమున వర్ణించుట కనుగుణముగనుండునో తత్త్వ మెఱిగిన కవి సరిగా వినియోగించుకొనును. కాని, అవధానము కవికి రసానుగుణవృత్తము నెన్నికొని చెప్పుటకు స్వాతంత్ర్యము తక్కువ.

అవధానము కవికి పరీక్షా స్థానము. ఈ పరీక్ష వర్ణ్యముతోబాటు వృత్తము నిర్దేశించుటతో మొదలగును.

రామరావణసంగ్రామము నాటవెలదిలో చెప్పుమని కోరినచో అవధాని నీళ్ళు నమలవలసివచ్చును. తగదని పెదమొగము పెట్టుటకంటె ఏదోయొకలాగున నీడ్చివేయుట లెస్స రౌతుమంచిదైన గుఱ్ఱము నడుచును! సమర్థుడైన యవధాని నీళ్ళు నమలక ఆటవెలదినే యోజనస్వంతముగా నడిపించి శ్లాఘాపాత్రుడగును. క్షేమేంద్రు డీసామర్థ్యము గూడ నంగీకరించినాడు.

'నానావృత్తవిశేషాస్తు కవేశ్శస్తస్య శాసనాత్
యాంతి ప్రభో రివాత్యంత మయోగ్యా అపి యోగ్యతామ్.'

(సువృత్త తిలకము. 3-10)

వర్ణ్యమునకు అయోగ్యములగు వృత్తములు పృచ్ఛకుడడిగినపుడు వాని నుపయోగ్యములుగా మలచికొను సామర్థ్య మవధాని కవసరము.

వృత్త మనుమాట వృత్తములకే కాక, జాతులకు నుపజాతులకును నుపలక్షకముగా గ్రహింపవలెను. 'వృత్త మక్షరసంఖ్యాతం జాతి ర్మాత్రాకృతా భవేత్' అనియున్నను, (ఛందోమంజరి. 1-4) ఉభయాత్మకమయిన తన గ్రంథమును కేదారభట్టు 'వృత్తరత్నాకర' మనెను గదా!

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'వృత్తములు కొన్ని వందలు కలవు నన్నయగారి సంప్రదాయముబట్టి చంపకమాల, ఉత్పలమాల, మత్తేభ శార్దూలములు, కందము, సీసము, గీతము ఇవి ప్రధానముగా ఆంధ్రభాషోపయోగిచ్ఛందములుగా స్వీకరింపబడినవి' అనిరి. (జయంతి. నవంబరు - 1959)

ఇది ఆంధ్రకవుల సంప్రదాయము. పృచ్ఛకు లవధానమున చంపకాదులైన పై వృత్తము లడుగ వచ్చును. ఇవిగాక ఆంధ్ర ప్రబంధములందు అపురూపముగా చోటు చేసికొన్న మఱికొన్ని వృత్తములు కలవు. అవి - మత్తకోకిల, తరళ, మానిని, కవిరాజ విరాజితము, స్రగ్ధర, మహాస్రగ్ధర, భుజంగప్రయాతము, పంచచామరము,ఉత్సాహ, ద్విపద, తరువోజ, లయగ్రాహి వంటివి. వీనిని గూడ అడిగిన నడుగ వచ్చును.

'కవికి కంసాలికి సీసము తేలిక' అన్నారు సీస మవధానములో అనాయాసముగా సాగింపవగును. ఒడుపు తెలిసినవాడికి కందము తేలిక ఇక ఆటవెలది, తేటగీతుల మాట చెప్పనక్కఱ లేదు

చంపకోత్పలమాలలు, మత్తేభ శార్దూలములు, సీసము, కందము, ఆటవెలది, తేటగీతి - కావ్యప్రబంధములందు వలెనే అవధానములందును సర్వ సాధారణములు.

రసపరాయణులగు పుణ్యపృచ్ఛకులు కొందరు వృత్త మెన్నికొను నధికార మవధానికే యనుగ్రహింతురు. అప్పు డవధాని పనిమురిచ్ఛయిన భృత్యుని వలె, అల్పవృత్తము గ్రహించి తప్పించికొనిపోవుట తగదు. బహుప్రదర్శనము గావింప

వచ్చిన జెట్టి వలె నిల్చి, వర్ణ్యమునకు అనుగుణమగు వృత్తము గ్రహించి తన నేర్పు ప్రకటించి సభ్యుల మెప్పుబడయజూడవలెను. దీనికొక తార్కాణ జూడుడు.

'కర్ణుడు కూలిన తరువాత కౌరవేశ్వుని స్థితి మీకు తోచిన పద్యమున వర్ణింపు' దని ప్రశ్న. దీని కవధాని -

కదనభూమిలోన కర్ణుండు కూలిన
వార్త వినుచు కౌరవవిభు డట్టె
కుప్ప గూలిపోయి గొబ్బున నేడ్చెను
కర్ణ కర్ణ యనుచు గళము వణక.

అని ఆటవెలది చెప్పవచ్చు.

కవ్వడి కర్ణుని శీర్షము
త్రెవ్వగ నేసిన పదపడి ధృతరాష్ట్రసుతుం
డెవ్విధము పాలువోవక
నెవ్వగ శల్యు దెస జూచె, నిభృతాశ్రిందై.

అని కందము చెప్పవచ్చు.

ధర్మంబెక్కడ డాగెనో కలియుగౌద్ధత్యమ్ము కన్పట్టు దు
ష్కర్ముల్ పాండవు లక్రమంబున హితున్ గర్ణున్ బడన్ద్రోసి రం
తర్మర్మచ్ఛిద మీవియోగ మనుచున్ శల్యున్ గనెన్ ఱేడు, బా
హార్మిప్రౌఢులు పౌరుషైకమతు లుద్యోగింపరే గెల్వగన్ !

అని శార్దూలము చెప్పవచ్చు

పై మూడింటిలోను కౌరవేశ్వరుని స్థితి వర్ణింపబడినది. ఆటవెలదిలో కౌరవ విభుడు గుండె చెదరి యేడ్చుచున్నాడు. అట్టివానికి నిల్చి యుద్ధము కొనసాగించుట దుర్ఘటము కందములో 'ఎవ్విధము పాలువోవక' శల్యు దెస జూచినాడు ఆ చూచుటలో— 'మామా! ఇక నీవే నా సేన కాపాడవలె'నను వేడికోలున్నది. నెవ్వగకు వ్యంజకముగ కన్నీరున్నది. 'ధృతరాష్ట్రసుతుడు' అనుటలో నతడపటు వను నభిప్రాయమున్నది. కర్ణుని శీర్షము త్రెవ్వగ నేసినవాడు కవ్వడి. కవ + వడి =

సవ్యసాచి అందుచేత నెఱ్ఱపగ. అంత దుఃఖమున మునిగియున్నను కసి దీర్చి కొనవలెనను పట్టుదల సడల లేదు.

శార్దూలములో కౌరవేశ్వరుడు తన బహిః ప్రాణమైన కర్ణుడు పడుటచే గ్రుంగియు, పాండవుల సాధింప నుంకించుచున్నాడు దీనుడై శల్యు నర్థించుట లేదు. ధర్మము నుద్ధరించుటకు కంకణము కట్టికొమ్మని పురికొల్పుచున్నాడు. శార్దూల విక్రీడితవృత్తము దీర్ఘాక్షరనిర్మిత మగణములతోగాక, సంయోగపర హ్రస్వాక్షరనిర్మిత మగణములతో నోజస్వియై శిరస్సమీపదేశమున దగిలిన దెబ్బతో సుడివడి క్రోధఘూర్ణిత వృత్తియై పడగ విప్పి లేచిన త్రాచువలె గాఢ బంధమై ప్రకాశించుచున్నది. చతుర్థచరణమునందలి యర్థాంతరన్యాసాలంకారము సుయోధనుని కడక సమర్థింపజాలియున్నది.

బృహత్కుక్షులగు మత్తేభ శార్దూలాదులు చెప్పుటయు, ధారణ పట్టి తరువాత వాని నప్పజెప్పుటయు రెండును బరువే యనుకొని గీతమో కందమో చెప్పి తప్పికొన జూచుట చాలమంది యవధానులకు బరిపాటి చిన్నపద్యములలో రసభావానుకూలశిల్పము కలిసిరాదని కాదు నా యభిప్రాయము ఏవో నాలుగు బఱ్ఱజ శబ్దములను వేసి, అల్పశరీరపద్యము నీడ్చివేయుట తగదనియే. పద్యము రస భావానుగుణశిల్ప రమ్యముగ నుండవలెను.

## అవధాన పద్య లక్షణములు.

అవధాన పద్యములు ముక్తక కల్పములు.

'ముక్తమ్ అన్యేన నాలింగితమ్.' 'స్వార్థే కన్.'

'క్రియాసమాప్తికై పద్యాంతరములతో నెట్టి సంబంధము లేక రసభావాదులు గల యేకపద్యము' ముక్తకము. (కావ్యాలంకారసంగ్రహ వివృతి )

ఈ పద్యము జూడుడు.

ఉ. గంగ కపర్దవీథి చుముకన్ శివు డాగెడు భంగి జూచి ప
ల్కెం గిరికన్య దాని నవలీల భరింతువా సీవు? నాగ ను
త్తుంగపయోధరన్ గిరిజ దూగని పూనిక పిన్ననవ్వు తో
ల్కంగను మేళమాడు హరు గాఢపటిష్ఠత కంజలించెదన్.

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

గంగ శివుని శిరస్సుపై గుభిల్లుమని దూకుచున్నది. అది చూచి పార్వతి గుండె గుబుక్కుమన్నది ఆ దుడుకుపోకిళ్ళదాని మోయగలవా? అని మగనినడిగినది. తత్సమయమున గిరికన్య ఉత్తుంగపయోధర. గర్వముచే నుబ్బిన గుబ్బలు కలది. పైగా కొండకూతురు. తానే గొప్ప అనుకొనెడిది. శివుడు పిన్న నవ్వు తొలకించినాడు. తాను తొణక లేదు. మేకమాడుచున్నాడు. కాని, అవధానము నేమఱ లేదు.

ఇది యవధాన పద్యము. అవతారిక లేకయే పద్యగతవిషయ మవగత మగుచున్నది.

మఱియొక పద్యము.

ఆ.వె. క్రొత్తపెండ్లికొడుకు కొమరుండు చంపకు
పీని రామ! నిన్ను వేడికొందు,
కాశ్యపీశులందు గనలుట ధర్మమె ?
తల్లి జూడు సొమ్మసిల్లి కూలె (శతావధాన ప్రబంధము. ద్వి. ఖం)

ఈ పద్యమున జిఘాంసువైన రాము డెవడు? పద్య మవతారికా సాపేక్ష మనిపించును. కాని, సూక్ష్మముగా విచారించినచో 'కాశ్యపీశులందు కనలుట ధర్మమె?' అను చరణమునందే రాముడు రైణుకేయుడని స్ఫురించును. అది యెట్లన-కాశ్యపి = భూమి. 'త్రిస ప్తకృత్వః పృథివీం కృత్వా నిఃక్షత్రియాం తతః దక్షిణా మశ్వమేధాంతే కశ్యపాయాదగా త్ప్రభుః' తాను సాధించిన భూమి యజ్ఞదక్షిణగా కశ్యపర్షికి సమర్పించి. శస్త్ర సన్న్యాసము చేసినవాడు జామదగ్న్యుడు. ఆ భూమి కాశ్యపియైనది. అట్టి కాశ్యపి నేలుచున్న భూపులందు రోషము తగదు. కాశ్యపీశబ్దము సాభిప్రాయ విశేషణమై యింత యర్థము వ్యంజించుచున్నది.

తిరుపతి వేంకటేశ్వరులు కాకినాడ సభలో సీతా వివాహము వర్ణింపగోరగా నిషేధాక్షరియందీశ్లోకము జెప్పిరి.

'ఏ షా మహానాకృతిభాపమానాం మత్పుత్రికాం తే ప్రదదే హి జాయామ్
తథాప కించిత్తు వదామి పంజ్ఞా శాస్త్రం త్వమేషా విధిరేవ మూర్ఖ్యా.'

(ఈ నా పుత్రిక నొసగెన న
నూనాకృతి భాసమాన నొగి భార్యగ, ని
ద్దాని దగ నేలుకొమ్మని
దీనికి నర్థంబు తేటతెల్లముగాగన్.) (జాతకచర్య పూర్వార్థము.)

వర్ణ్యము సీతాకల్యాణ మనుటకు తద్బోధకపద మీ శ్లోకమున నొకటియు లేదని పృచ్ఛకుల ఆక్షేపణము రాగా తిరుపతి వేంకటేశ్వరు లిట్లు వివరించిరి:

కం. .. 'ఏనా' మన నర్థము
విను డింక, నకారమునకు విష్ణు 'ఇన' యనం
గను భర్త సమాసము చే
సిన లక్ష్మీవాచకత్వసిద్ధియు గలుగున్.

అ + ఇన = ఏన = లక్ష్మి. (బహువ్రీహి)

సీ. అల్ల లక్ష్మికి దండ్రియగు సముద్రుం డాపె
నీయకమున్న తానెనసె విష్ణు
నా మీద రుక్మిణి యనునప్పు రాక్షస
విధిచేత గృష్ణుండు పెండ్లియాడె
నుభయత్ర విహితమై యొప్పు కన్యాదాన
మనుఘటింపకయుండు టభిమతంబు
ప్రకృతపద్యమ్మున 'ప్రదదే' యను పదంబు
దానవాచకమయి తనరు కతన

నెపుడుకాని లచ్చిని దాన మెవ్వడిచ్చె
నయ్యదియ దీని కగు లక్ష్య మదియు గేవ
లము లభింపక యున్కి నా లక్ష్మి ప్రకృతి
గా గలుగు సీత యను నర్థగతి లభించు.

కం. సీతను రాముని కొసగిన
దాత జనకు డగుట నిది యతని వాక్యం బే
సీతయు రుక్మిణి దక్క మ
జే తరుణిగ బుట్టె లచ్చి యేర్పడ జెపుడా! (జాతకచర్య పూర్వార్థము)

'రాఘవత్వేఽభవ త్సీతా రుక్మిణీ కృష్ణ జన్మని' అని విష్ణుపురాణము.

తిరుపతి వేంకటేశ్వరులు ఇంతయు సాధించి వివరించి చెప్పగా పృచ్ఛకుడు 'ఇది చాల క్లిష్టము. నేనొప్పుకొన'నన్నాడు. ఆశుకవితలో క్లిష్టతాదోషము దోషము కాదని సభ్యులు సరిది చెప్పిరి. విషయము నిండుగా వివరించి చెప్పుటకు వీలుపడని నిషేధాక్షరి యందును, తలతోకలేని వర్ణనము పెద్ద లొప్పుకొనలేదనిన, సాధారణ వర్ణన విషయమున నెట్టి పట్టుదల చూపుదురో యూహింపవచ్చును.

కం. అంత నతండును దద్వృ
త్తాంతము విని సంతసంబు తత్తఱుబుపన్
గంతులు వైచెను జూపఱ
వింతగ దనచుట్టు జేరి వీక్షింపంగన్.

ఈ పద్యము 'అంత' తో మొదలింపబడినది తత్పూర్వకథ తెలియదు. ఆతండు ఎవండో తెలియదు. తద్వృత్తాంత మేదో తెలియదు. కథను గాని వ్యక్తినిగాని సూచించు పదము లిందు లేవు ఇట్టి పద్యము లవధానమున జెప్ప గూడదు.

రేవతీబలరాములలో నెవరు ప్రాయమున పెద్ద? అని ప్రశ్నము. దీనికి సమాధానము—

ఉ. ఏరికి నేరితోడ విధియించెనొ పొత్తు సరోజసూతి య
వ్వారికి వారి తోడన వివాహ శుభంబది సంఘటిల్లు, న
వ్వారిజపత్రనేత్ర దలపన్ గడు బెద్ద వయోనిరూఢి న
ప్పూర్వుడు డెవ్వ డెన్నదగునో! వివరింపగ బృచ్ఛకోత్తమా!

ఈ పద్యమున అవ్వారిజ పత్రనేత్ర యెవ్వతె? అపూర్వరుషుడెవ్వడు? పద్యమున ముక్త కలక్షణము లేదు. సమాధాన మిట్లుండవలెను:

శా. ఓహో! పృచ్ఛక సార్వభౌమ! యిది యెంతో నవ్యమైయొప్పు ను
త్సాహమ్మున్ ఘటియించు, బ్రశ్నమనినన్ దానిట్టిదే ప్రశ్నమౌ
నూహింపన్ బలరాముడే వయసుచే నూనుండగున్ రేవతీ
శ్రీహీరంబ గణింప వృద్ధయగు ధాతృప్రోత సంబంధమై
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం)

పద్య పూర్వార్ధమంతయు వృథాప్రస్తావోక్తులతో నిండియున్నది. ఉత్త రార్థమున 'బలరాముడు చిన్నవాడు. రేవతి పెద్దది. ఇది నలువ కూర్చిన కూర్పు.' అని మాత్రమే చెప్పబడినది. చాలు. పృచ్ఛకుని పేరు వగైరాలతో మూడు పాదములు పూరించి వర్ణ్యము నొక్కపాదమున జెప్పినను జెప్పవచ్చును. అది యొక హేల.

అవధానపర్ణన పద్యములను పది పండ్రెండు రకాలుగా వర్గీకరించవచ్చును.

1. దైవస్తుతి పద్యములు
2. పురాణకథా ప్రబంధసంబంధి పద్యములు.
3. చిత్రకవిత్వ పద్యములు.
4. భాషాంతరీరణ పద్యములు.
5. అన్యాపదేశ పద్యములు.
6 ప్రతి పద్యములు.
7. అల్పవిషయ బృహత్పద్యములు, బృహద్విషయాల్ప పద్యములు.
8. అచ్చతెనుగు పద్యములు, సంస్కృత శ్లోకములు.
9. తత్కాల రాజకీయ విషయ పద్యములు.
10. శాస్త్రీయ పద్యములు.
11. ఆశీర్వాద పద్యములు.
12 సంకీర్ణ పద్యములు.

## దైవస్తుతి పద్యములు

దైవస్తుతి పద్యములు దగులని యవధాన ముండదు. శ్లేషలు. శబ్దచిత్రములు, విలక్షణవృత్తములు సాధించుటకు స్తుతి పద్యము లనుకూల భూములు. సాధారణ స్తుతి పద్యము లిట్లుండును:

సూర్యుడు. కందము.
జగమునకు లోచనంబై
ఖగరాజత్వంబు గాంచి కడు వెల్గెడు సూ
ర్యు గడున్ భక్తిన్ గొల్తు న
పగమిత సకలామయున్ బ్రభాసంపూర్ణున్. (శతావధాన సారము.)

సూర్యుడు జగచ్చక్షువు, గ్రహరాట్టు, ఆరోగ్యదాత.
లక్ష్మి. కందము.
సరసిజగేహనివాసిని
గురుదారిద్ర్యమ్ము బగులగొట్టెడు దాసిన్
హరి యురము శయ్యగా గా
పుర మొనరుచు సిరిని మ్రొక్క బోలదె యేరున్. (శతావధాన సారము.)

దారిద్ర్య మనునదొక కొండ. దాని భేదింపగలశక్తి లక్ష్మికి గలదు.

అర్ధనారీశ్వరుడు:

ఉ. ఏ శతపత్రనేత్రకును నెట్టి మగండు నొసంగనట్టి బల్
పేశలమైన దేహమును బ్రేయసి కిచ్చిన దేవదేవు, వా
గీశ రమేశసన్నుతు నహీనవిభూషితగాత్రు నర్ధ నా
రీశు నుతింతు మ్రొక్కెదు నతీంద్రియసౌఖ్యముగోరి నిచ్చలున్.
(శతావధాన సారము.)

పాదపూరణార్థము వచ్చిన 'అతీంద్రియసౌఖ్యము గోరి నిచ్చలున్' అను వాక్యము తెచ్చిన శోభ యీ పద్యమున కహీనభూషణము.

అన్నపూర్ణ:

ఉ. పేరిన కిన్కఁ గాశిని శపింపఁగ బూను కవీశు వ్యాస భ
ట్టారకు బిల్చి శీతలకటాక్షమునన్ గరుణించి షడ్రసా
హారము బెట్టి సప్తదివసాశనలోపము దీర్చినట్టి శం
పారుచి యన్నపూర్ణ గిరివంశజ మాకు బ్రసన్నయయ్యెడున్.

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం)

అన్నపూర్ణాదేవి కవికల్పవల్లి వ్యాసభట్టారకుడు భారతకవి.

సరస్వతి:

సీ. దరహాసరుచులతో బరియాచికము లాడి
 ఫుల్లాస్యముల్ మల్లెపూవులగుచు,
కర్ణకుండల రత్నకాంతులతో వసం
 తములాడి జిగిమీఱు తలిరు లగుచు,
గాటుక రేకల దాటుచో నసలంటి
 లాలిత నీలోత్పలమ్ము లగుచు
శ్రీగంధకుంకుమస్నిగ్ధ కుచాద్రుల
 గ్రీడించి నెత్తమ్మి తేకు లగుచు

నిజ సలీలస్ఫుర దపాంగ నిభృతధార
చిత్ర సుమమాలికాకృతి జెలగ సృష్టి
కర్త గైసేయు శారదాకమలగంధి
బంధురోక్తివై చిత్రి తోడ్పడెడు మాకు.

(శతావధాన ప్రబంధము ప్ర. ఖం.)

సరస్వతి చూడ్కులు మల్లెలు, ప్రవాళములు, ఉత్పలములు, పద్మములు పొడిగిన చిత్రవర్ణపుష్పమాలయై పరమేష్ఠి నలంకరించుచున్నవి.

హరిహరస్తుతి:

సీ. కొండకాపరి నీమగం డటంచు నొకర్తు
పద్మి నీమగడుండు నంచు నొర్తు
తొలి బిచ్చగాడుగా దోచు నీమగడంచు
బలిబిచ్చమెత్తె నీపతి యటంచు
పశుపతి నీమనఃపద్మప్రియుండంచు
పసులకాపరి నీదుపతి యటంచు
వేసిచూపులవాడె యోసి నీమగడంచు
బల్లిచూపరి నీదు పెన్మిటంచు

లచ్చియును గౌరి యిట్లు మేలంబులాడ
వినుచు మోముల జిఱునవ్వు వెలయుచుండ
స్త్రీల చాంచల్యపద్ధతి జెప్పుకొనెడు
హరిహరులు మమ్ము బ్రోచెద రమితదయను (బందరు శతావధానము)

## పురాణ కథా సంబంధి పద్యములు

సంస్కృతమున నాదికావ్యము రామాయణము. తెనుగున నాదికావ్యము మహాభారతము. రామాయణ భారతకథలు మానవజీవితముతో బెనవైచికొన్న కల్పలతలు. అవధానమున వీని ప్రసక్తి యనివార్యము. కథలు పురాతనములైనను తత్సంబంధిప్రశ్నములు మన బ్రతుకునందలి యేదోయొక యంచును స్పృశించు చుండును. కనుక వానికి పురాతనతాదోషము పట్టదు.

ప్రాచేతసుడు రామాయణకథ షట్కాండవిస్తరముగా ప్రపంచించి పలికెను. అదేకథ మూడుమాటలతో మనము నేడు చెప్పగలుగుచున్నాము. కట్టె, కొట్టె, తెచ్చె అని. కట్టినది శతయోజనవిస్తారమైన పారావారమునకు అడ్డముగా సేతువు. కొట్టినది త్రిలోకకంటకుడైన దశకంఠుని తల. తెచ్చినది అగ్ని శుద్ధయగు సీతను. కథ జగత్ప్రసిద్ధము కనుక ప్రధాన విషయములు దిఙ్మాత్రముగా సూచించిన జాలు తక్కినకథ నధ్యాహరించికొనగలము.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరు లవధాన సభలో రామకథ చెప్పినచొప్పు పరికింతము.

తేటగీతిలో-

శివుని విల్ ద్రుంచి జనకుని చెల్మిగాంచి
సీత బెండ్లాడి వనికి వేంచేసి పిదప
రావణుని దున్మి శ్రీరఘురాము దతివ
తోడ బట్టాభిషిక్తుడైనాడు నాడు.

చంపకమాలలో-

ఇనకులమందు బుట్టి జనకేచ్ఛ వనమ్మున కేగి యచ్చటన్
దన సతి దొంగిలించిన కుదానవు సంహృతుగా నొనర్చి సీ
తను గొని సర్వవానరులు తన్ గొలువంగ నయోధ్యకేగి పా
లన మొనరించు రాముని విలాసములన్ వినుతింతు నిచ్చలున్.

శార్దూలవిక్రీడితవృత్తములో-

నీరేజాప్తకులంబునం బొడమి యెంతే భాగ్యయౌ జానకిన్
దారంగా గొని, తండ్రియానతి నరణ్యానం ప్రవేశించి, భూ
భారంబెల్లను మాన్ప రక్కసుల దర్పంబూడ్చి సాకేత మం
దేరాముండు సుఖమ్ములన్ గొనియె నేనీక్షింతు నద్దేవునిన్.

మత్తకోకిలలో-

సారసాప్తకులంబునందు వెసన్ జనించి, యరణ్యమున్
జేరి మీటి విరాధముఖ్యుల జీరి వాలిని మారి వి
స్ఫారశక్తి యెలర్ప జాలను వార్ధి గట్టి చలంబుమై
గ్రూరు రావణు జంపి సీతసుగొన్న రాము దలంచెదన్

సీసములో-

దశరథేశ్వరు నపత్యంబయి జనియించి
యవనిపుత్రికను బెండ్లాడి మించి
పరశురాముని విల్లు భగ్నంబు గావించి
యటు పిమ్మట నయోధ్య కరుగుదెంచి

తండ్రియానతిని గాంతారమ్మునకు నేగి
ఖరదూషణాదిరాక్షసుల జంపి
యయ్యెడ భార్యాపహర్తయౌ రావణు
జెనక సుగ్రీవుతో జెలిమి చేసి

కొని, వనధి గట్టి యవ్వాని దునిమి పిదప
సీతతో దన పురికి విచ్చేసి పట్ట
భద్రుడై యొప్పు శ్రీరామభద్రు చరిత
మెవ్వరికి నేని శుభముల నీయకున్నె? (శతావధానసారము)

తేటగీతిలో శివధనుర్భంగము, సీతాపాణిగ్రహణము, వనవాసము, రావణ సంహారము, పట్టాభిషేకము చెప్పబడినవి.

చంపకమాలలో రవివంశమున బుట్టుట, పితృవాక్యము పాటించి వనమున కేగుట, భార్య నపహరించిన దుష్టుని సంహరించి వానరవాహినీసేవితుడై సీతను గొని యయోధ్యకేగి రాజ్యమేలుట చెప్పబడినవి.

శార్దూలములో సూర్యవంశమున బుట్టి, జానకిని జేపట్టి, అరణ్యము మెట్టి, రక్కసుల గొట్టి, సాకేతమున సుఖించుట చెప్పబడినది.

మత్తకోకిలలో రవికుల జననము, వన గమనము, విరాధ వధ, వాలి వధ, వార్ధి బంధనము, రావణ కథ, సీతాపరిగ్రహణము చెప్పబడినవి.

సీసములో దశరథుని పుత్రుడై పుట్టి, భూపుత్రిని పెండ్లాడి, పరశురాముని భంగపఱచి, తండ్రి యానతితో అడవి కేగి, ఖరదూషణాదులను జంపి, సుగ్రీవుని చెల్మితో సేతువు గట్టి, యిల్లాలి ముచ్చిలిన దశగ్రీవుని బరిమార్చి, సీతాసమేతుడై అయోధ్యకరిగి పట్టాభిషిక్తుడగుట చెప్పబడినది.

తేటగీతి అల్పకుక్షి శార్దూలము బృహత్కుక్షి రామకథ తేటగీతిలో కంటె శార్దూలమున నెక్కువగా కలిసివచ్చిన దేమియులేదు. శివధనుర్భంగ ప్రస్తావన, అక్కడున్నది. ఇక్కడ లేదు. 'ఎంతె యోగ్యయౌ జానకిన్ దారన్‌గా గొని' యనుటకు బదులు, 'కంపకాలు విల్ద్రుంచి, సీతా రామన్ గొని' యనియుండినను

అనియుండవచ్చు. ఆ పని చేయలేదు. పృచ్ఛకుడు కోరిన వృత్తము జెప్పుటయే ప్రధానము. సంహతముగా కథను కుదించి, అగ్గిపెట్టెలో పదిమూరల చీరను మడిచి యిమిడించు సాలీని వలె, చిన్న వృత్తమున నంతయు జొప్పించుట కాదు.

వసంతర్తువు. వసంతతిలకవృత్తము.

సన్న్యాసినోఽపి హృదయం భవసక్త మాసీ
ద్వర్ణీ వివాహవిషయే యతమాన ఆసీత్
వేశ్యా నిరంతరం రతాభిరతా బభూవుః
ప్రాప్తే వసంతతిలకే సుమనోఽభిరామే.

(శతావధాన సారము.)

సుమనశ్శబ్దము శ్లిష్టము. సుమనోఽభిరామమైన వసంతము సుమనోఽభి రామము కదా!

మత్తకోకిల.

మత్తకోకిల లోకమెల్లెడ మానవాళుల కెంతయున్
జిత్తరంజనమున్ నొనర్పగ జేరి తుమ్మెదగుంపులున్
దత్తరింపగ మొల్లతీగలు దొరు మీఱగ జూచు న
త్యుత్తమంబు వసంత మీధర నొప్పుచుండగ భూవరా!

(వేంకట రామకృష్ణకవులు)

ఈ వృత్తమునందు వృత్తనామముద్ర అలంకార విశేషము.

గ్రీష్మర్తువు

చం. తొలకరి వానలేదె యని తొందర గాపులు నింగి జూడ, ని
ప్పు లుమియు నెండయుం బవనమున్ భయదాకృతి గానుపింప, నీ
టుల కమృతత్వకీర్తి దగ, లోకము తీవ విధాన వాడగా
వెలసెను గ్రీష్మ మందఱును బిట్టు తపించుచునుండ నీయెడన్.

(అవధాన సారము.)

ఈ యెండలకు స్థూలకాయుని స్థితి:

శా. తైలస్నానము చేయు చందమున నత్యంతంబు దేహంబునన్
జాలున్వాఱగ జెమ్మటల్ పయిన గ్రిందన్ జెర్వులో దున్న నా
గ్రాలంగా దగ నూపిరిం గొనుటకే కష్టమ్ముగా నెండ లు
ద్వేలంబై తగువేళ స్థూలతను డెంతే దాపమున్ బొందెడున్.

(శతావధాన సారము.)

వేసగిలో మల్లెపూవు:

సీ. తళుకొత్తు నెత్తావి నలరారు రేకుల
పూ దుమారముచేత బొసగియుంట
వేఱుపూవులకన్న దీరుగా జంట ము
క్కాలిరౌతులు సాల గ్రాలియుంట
అన్నిపూవుల కంటె నతిసితకాంతులు
సర్వాంగమునయందు జాలియుంట
తరుణుల పరిగింజ నొరయు దంతమ్ముల
నెనయు నంచును గవు లెంచుచుంట

అన్ని లతికలు వేసగియందు మాడి
పోవ దానొక్కటే విచ్చి పొలుపుదెలుపు
తావి చేత జమాయింప దగును గవులు
మల్లెపూవు వహింతురు మాన్యమనుచు (అవధాన భారతి.)

వర్ష ర్తువు:

పచ్చిక:

ఉ. పచ్చని పచ్చికల్వొలయ భద్రతరంబగు కాంతినొప్పు ని
ప్పచ్చరమైన నేలయును వానలచే జగమెల్ల నిండుచో
ఇచ్చని నింటె జోదున కుపాయనముల్ ఘటియింపనెంచి భూ
భృచ్చరురాజు కంబళము వేసినటుల్ కనుపట్టుచుండెడిన్.

(శతావధాన సారము)

పిడుగులు వాన: మణిగణనికరవృత్తము:
దడదడ పిడుగులు దగ బడునపుడున్
బెడిదపు జినుకులు పిడిపికి శిలలున్
బడ నెడనెడ దగు పథమున నడువన్
జడిసిరి మనుజులు బడి యురవడికిన్. (శతవధాన సారము.)

మహావృష్టి:

కం. యుగవిగమకాల పాథో
ద గభీరాసార ఘోర దశదిక్కుద్య
స్థగిత తమః ప్రబలస్థితి
యగునే వర్ణింప మాకు నాశుప్రోక్తిన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం)

శరదృతువు:

చం స్థిరతరనిర్మల ప్రకటజీవనయుక్తి జగత్ప్రసిద్ధమై
సరసులకెల్ల నుల్లసిలె సద్భటభూతియు జూడనొప్పె బె
క్కురసెను రాజహంస గమనాగమనంబులు నీగతిన్ సభాం
తరజలదాగమాంతము ముదంబొనగూరిచె నెల్లవారికిన్.
(శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు)

మ. సరసిజమ్ములపాలి పంట కడువిస్తారంపు శాల్యోఘముల్
పరిణామమ్మును గాంచు పండుగ చలిన్ బ్రాకించు చేయూత సు
స్థిర కాశప్రసవప్రకాశలహరీ దేదీప్యమానంబునై
శర దుద్యత్సమయంబు భాసిలె విరాజచ్ఛీతరుక్శోభియై
(శతావధాన సారము.)

కం. అలరుల ప్రోవుల పోలిక
దెలికప్రపు గుప్పలట్లు దీధితి వెలయన్
విలసత్కార్తిక చంద్రిక
లొలసె జగన్మోహనముగ నుదధులు పొంగన్ (శతావధాన ప్రబంధము.)

హేమంతర్తువు:

మ. పసుపుంగుమ్మడిపువ్వునం దరళశోభన్ బొట్టుబొట్టై హిమం
బెసగన్ సూర్యుడు కోష్ణరశ్మిచయుడై యింపార గేదార స
స్య సమగ్రేందిర తెల్గుముంగిళుల బ్రోవై రంగవల్లీ మనో
జ్ఞ సభావ్యంజిత పూర్ణకాంతి వెలయన్ సంక్రాంతి పర్వంబిలన్.

(శతావధాన ప్రబంధము. ప్ర ఖం.)

శిశిరర్తువు:

శా. వాలాయంబుగ నెల్లవారలును స్వవ్యాపారజాలంబులం
బ్రాలేయంబున జేయజాలమిని భాస్వద్దీధితుల్ మింటిపై
జాలం గ్రాలిన దాక గేహములలో సౌరొప్పగా నుండి రా
పీలుంగైకొని పైకి వచ్చెదరు పృథ్విన్ శైశిరాహంబులన్.

(శ్రీ వేంకట రామకృష్ణ కవులు.)

చం. తొగల కొలంకులుం జెఱకుదోటలు పొంపిరివోయె, రాత్రులం
దగరువిశేష ధూపితములౌ కురులొప్ప, నిశావలేపన
స్థగిత తనూలతల్ చలికి శయ్యల నక్కిరి తియ్యనూర్పులై
మగువలు కాంతులం గదిసి, మంచిదగున్ శిశిరర్తు పెంచగన్.

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

సూర్యోదయము:

మ. కమలమ్ముల్ వికసింప గోకవితతుల్ కాంతిన్ జెలంగన్ దగన్
విమలాకాశమహాంతరాళమున దీప్తిజ్వాల లింపారగా
గమలాప్తుం డుదయింప తూర్పుమలపై గాంతిచ్ఛటల్ తారకా
సముదాయమ్ముల జాతె దెల్వి గనియెన్ సర్వప్రపంచమ్ములున్.

(శతావధాన సారము.)

చంద్రోదయము:

సీ. ఐరావతంబు దివ్యాపగాంబువునుండి
పైకి నెత్తిన సితాబ్జంబనంగ
గవ్వపుగొండ పాల్కడలిలో దరువంగ
బుట్టిన నునువెన్నముద్ద యనగ

వైజయంతోపరిభాగంబు నందుండి
కొమరారు తెల్లని గొడు గనంగ
గగన హర్మ్యాగ్రభాగమున గట్టగ నెత్తు
దీర్ఘైన పెను గ్యాసులైటనంగ
నుదయగిరి శృంగభాగంబు నుండి వెడలి
యెల్లెడల దన కాంతుల వెల్లి గొలిపె
గలువపూవుల విందు చక్రముల కుందు
చక్కదనముల సీమ యా చందమామ (అవధాన సారము.)

పురవర్ణన: కాశీపట్టణము:

సీ. సంజవేళల మౌనిసప్తకంబు నుతింప
పంచాస్త్రవైరి నర్తించుచోటు
మధ్యాహ్నముల ధరామరరాజి కన్నంబు
బంచాస్య రాణి వడ్డించుచోటు
మాధవప్రభృతు లాత్మాభిధానంబులు
మించ లింగములు స్థాపించుచోటు
కలుషకర్మల సుకర్మలజేయు సురగంగ
యంచితస్థితి ప్రవహించుచోటు
అరయ బంచత్వ మొందిన యట్టి జంతు
వెట్టిదైనను లింగమై పుట్టుచోటు
కాశి యది పుణ్యరాశి దుష్కలుషవల్లి
కా సితాసి భజింతు నిక్కముగ నెంతు. (కొప్పరపు సోదర కవులు)

కాంచీపురావధాన సభ:

మ సకలామ్నాయశిఖారహస్యచయచర్చాయాజ్ఞవల్క్యుల్ నిరం
త కళాభ్యాసులు రత్నకుండలచలద్భవ్యశ్రవశ్మశ్రుకల్ 
మకరాంకద్విడభిన్నమూర్తులు బుధుల్ పౌరుల్ రసజ్ఞుల్ సము
త్సుకతన్ జేరిన కాంచికాపురసభా శోభన్ ప్రశంసించెదన్.
(శతావధాన ప్రబంధము ప్ర. ఖం.)

కన్యాంగసౌందర్య కథనము:

సీ. నీరజాతము బోలు నెమ్మొగమ్మున మేలు
కస్తూరి నామమ్ము కళలు గులుక
రంగార గట్టిన బంగారు సరిగంచు
చీర పాదములపై చిందులాడ
వలలో బడిన జక్కవల బోలి కుచపాళి
కంచెల ఖండించు కరణి నిగుడ
నిరువంక గువలయ సరములు దాపి న
ట్లతినీల నేత్రాంతగతులు సెలగ

చెలియొకతె వచ్చుచున్నది చెలుల గూడి
యలరు విల్తుని మేల్బావు టమ్మనంగ
దాని గూడంగ గల్గిన మానవులకు
వేఱె నాకాబలారతుల్ గోరనేల? (శతావధాన సారము)

ఆంగ్లస్త్రీ వర్ణనము :

సీ. పలుచనై యెఱుపుడా లలరు గులాబిపూ
వట్టు లుండెడు చెక్కుటద్దములును
స్ఫటికపు శిలవోలె బాండరప్రభలతో
బొదలెడు వెడద నెన్నుదురు కుదురు
పగడంబు కాంతితో జగడించి యార్ద్రమై
తగు తరుణారుణాధరము సొంపు
పంచాస్యరాజంబు పరిహసింపగ జాలు
పిడికిట నడగు నెన్నడుము బెడగు

వలల దనుకాంతితో సరస్వతిని మీఱు
తెల్ల దొరసాని యందగత్తియయె కాని
కనుల నలుపు మోమున బొట్టు కాళ్ళసొమ్ము
లేమి బేసని మెచ్చగా లేము మేము. (అవధాన సారము)

కన్యాప్రదానము :

మ. ప్రియమందంబాలిని సౌరసీరు నవిలో రెండొడ్డులం దట్టి రెం
డు దెసల్ పూతము సేయు చందము, ననున్బూతంబు గావించు రెం
డు దెసల్బొల్చు కొలంబువారలకు నెందుంబుణ్యదంబౌను భో
గదమౌ యోగదమౌను రాగదమునౌ గన్యాప్రదానం బిలన్.
(అవధాన భారతి.)

ముగ్ధ : ప్రథమ కేళి :

శా. ఆకృష్టాపి వశం నయాతి బలవ న్నైవీక్షతే లజ్జయా
వాక్యైః ప్రేమపురస్కృతైః పరిచితా నోవా దదాత్యుత్తరమ్
అంకారోహణ చుంబనాదికకళా స్వత్యంతమూర్ఛా పరం
ముగ్ధా కస్య మనో నరంజయతి సా నూత్నైస్స్వకై శ్చేష్టితైః.
(అవధాన సారము.)

ఈ శ్లోకమునకు ఈ శ్లోకమే సాటి. అంత బాగున్నది

మగసేత:

సీ. గోమునోమెడు ముద్దుమోము జాబిల్లిపై
జెమట బిందువులు ముత్తములు గాగ
బిగువులై గొనబగు ప్రీగు బాలిండ్లపై
దారహారమ్ము లుత్తల పడంగ
జికిలి క్రొమ్మొగులు గుత్తకు బట్టు ధమ్మిల్ల
భారమ్ము శయ్యా వ్యాప్తత ఘటింప
నెత్తమ్మి జేకుల నెఱిమించు గైదోయి
దుసికిలు మిసిమి దుపెసలు గూయ
అదలి చూగాడు తొడలలో బదలిపోవ
నలతి జవ్వాదు నడుముతో బొలతి యోర్తు
బూరుషాయితమున దన పురుషు గెలిచి
పందుకొనె బొందు మల్లెల పాన్పునందు. (అవధాన భారతి)

జలకేళి:

మ. తటిదాకారలు గోపభామలు స్వవస్త్రమ్ముల్ విసర్జించి త
త్తటదేశమ్మునబెట్టి కోశపరిముక్తశ్రీజ కౌక్షేయకో
ద్భటరేఖన్ వివరించి మించిరి సరోऽంభఃపూరమధ్యంబునన్
స్ఫుటపద్మమ్ములు సుళ్లు శంఖములు నాచుల్ తాలుమాత్రై చనన్.

(శతావధాన ప్రబంధము. ద్వి.ఖం)

స్త్రీ వర్ణనమునకు ప్రబంధ కవులది అందెవేసిన చెయ్యి ఒకరికంటె నొకరు మధురముగా వర్ణింతురు. ప్రాబంధిక శయ్య పోషించిన యవధానులలో శ్రీ తిరుపతి శాస్త్రిగారు ప్రథములు. శ్రీ గడియారం వేంకట శేషశాస్త్రిగారు ద్వితీయులు. శ్రీ చెళ్ళపిళ్ళవారి చెయ్యి 'పెళుసు' ఈ లక్షణము శ్రీ వేలూరి వారిలోను కొంతకలదు.

శ్రీ మాడభూషివారికొక శైలియు, శయ్యయు లేవు. సమయోచితముగా అన్ని రకముల పల్లటీలు ప్రదర్శింపగలరు.

గౌతమీనది : మత్తకోకిల వృత్తము:

గౌతమాహృతయై సమస్తజగత్ప్రసిద్ధ చరిత్ర సం
స్ఫీతయై యవగాహ నిష్కలుషీకృతాఖిల పాప సం
ఘాతయై పరమేష్ఠిపుత్ర ముఖర్షిరాజ మహోశ్రమో
పేతయై తగి గౌతమీనది పేరుగాంచె ఘనంబుగాన్.

(అగిరిపల్లి శతావధానము మాడభూషి)

అవధాని పితామహుడు శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారి పద్యమిది. గౌతమీనది సమస్తజగత్ప్రసిద్ధ చరిత్రసంస్ఫీత యనిరి. గౌతముడు పరమేశ్వర జట తెచ్చి మృతగోవుపై పిండి, తత్స్రుతజలధారచే బ్రతికించెనని, ఆ ధారయే గోదావరియయ్యెనని, వరాహపురాణకథ కలదు. పురాణశయ్యతో పద్యము రమ్యముగా నున్నది.

నలచరిత్ర: చంపకమాల:

నలు డల యంచకారణమునన్ దమయంతిని బెండ్లియాడి, పె
న్గలుములనంది జూదమున గాగల కార్యము లొంది, మీద గా
నల బలుకష్టముల్వడి యనంతర మాఋతుపర్ణు జేరి వే
ద్కలు చెలువార నాపయి సుఖమ్మున నుండెను దాను బత్నియున్.

(శతావధాన సారము )

హంస దౌత్యము, దమయంతీ వివాహము, ద్యూతము, వనవాసము, ఋతుపర్ణుని కొలువు, తదనంతరము సతీసహితుడై సుఖించుట చెప్పబడినది. కర్కోటకుని కాటు, దమయంతిని దగ్గరి పులిందుడు బుగ్గియగుట, పునస్స్వయంవర ప్రకటనము, అశ్వహృదయవిద్య, పాకశాస్త్రపాండిత్యము చెప్పబడలేదు. చెప్పియుండిన గథాపుష్టిచే చంపక మింకను బరిమళించెడిది. 'జూదమున గాగల కార్యము లొంది' యనుమాటలో చమత్కారమున్నది. జూదమాడి బాగుపడినవాడు లేడని యందలి విశేషము. తుదియందు 'తాను పత్నియున్ సుఖమ్మున నుండె'ననుట తత్పూర్వము వారు విడిపోయి యుండిరనుట దేటపడుచును.

కర్ణశాపములు:

మ. పుడమిన్ గ్రుంగు రథంబటంచు నొకవిప్రుండాడె నీయస్త్రిముల్
చెడి పోడౌ ననుచున్ గురుండు శపియించెం గాక యింద్రుండు బా
పడు తానౌచును పర్మకుండలములన్ బ్రార్థించె నాపైన శ
ల్యుడు సారథ్య మొనర్చె దాన రవిజుండోడెన్ మృతుండై యనిన్.

(బందరు శతావధానము.)

విప్రగురుశప్తుడు, వాసవవంచితుడు, శల్యజుగుప్సితుడు నయి కర్ణుడు పడుట యిట సమగ్రముగ జెప్పబడినది. కర్ణుడు దైవోపహతుడేకాని, అర్జునోపహతుడు కాడు. శ్రీ కాశీ కృష్ణాచార్యులవారి యీ పద్యనిర్మితి ప్రౌఢి పేర్కొనదగినది.

మత్స్యయంత్రము నేసిన బ్రాహ్మణుని జూచిన ద్రౌపదీమనోభావము:

మ. చెలువంబొప్పగ మత్స్యయంత్రమును విచ్ఛేదించి, ప్రవాహ దో
హలభావమ్మున బొల్చు నర్జును సుధాహాసోజ్జ్వలన్ బ్రాహ్మణా
వళి మధ్యస్థితు జూడ ద్రౌపది మనోభావమ్ము పొంగారె క్ష
త్ర లతాంతాయుధరూపధేయు డనుచుద్యద్విస్మయో పేతమై.

(శతావధాన ప్రబంధము ప్ర ఖం.)

ద్రౌపదిమనస్సు ఆమెకు దెలియకుండ మూదితమయ్యెను. తరువాత ద్విజులలో క్షత్రియు డున్నాడే యని వెఱగుపాటు బొందెను. ఆమె యంతఃకరణమున స్ఫురించిన భావము యథార్థము. సజ్జనుల యంతఃకరణప్రవృత్తి యిట్లుండును.

సూతపుత్రుడు భర్త యగుట కంటె బ్రాహ్మణుడు భర్తయగుట మేలు కదా యనుకొన్నదని కాని 'అయ్యో! పంచాంగపుబాపని చెట్టపట్టవలసివచ్చెగదా!' యని వగచినదనికాని చెప్పవచ్చును. కాని ఆ తీర్పు ఇంత యుదాత్తముగ నుండదు.

ఆంజనేయుని చర్య: వీరరసము:

శా. అక్షుంజంపి తదీయవక్షమున బోద్యత్క్రోధవిస్తార సం
రూక్షాక్షిప్రభ నొప్పి యెంతయును బోరుంగోరి పైవచ్చు నా
రక్షస్సైన్యము నెల్ల మాపి తను వీరవ్రాతముల్ మెచ్చ బల్
దక్షుండై దశకంధరాత్మజుని బ్రోలన్ నిల్చె గీశేశుడున్.

(శతావధాన సారము )

క్షకారప్రాసముతో పద్య మెత్తికొన్నను అల్లంతలో వాక్యము ద్రుంచుచు, ఆరభటియై రౌద్రమున బడకుండ పదములు నించుచు, తిరుపతి వేంకటేశ్వరులు- అందును వేంకటశాస్త్రిగారు - వీర రసమును బోషించిరి. 'బల్ దక్షుండై' యను మాట కీశేశు డొకచోటనుండి యొకచోటికి లాఘవమును సూచించుచున్నది. కీశేశుడు కథలో సుగ్రీవుడే. హనుమంతుడు సుగ్రీవుని మంత్రి. మారుతి కీశేశుడుగా స్తోత్ర ప్రసిద్ధుడు.

చిత్రాంగి: మత్తకోకిల:

లాలియించుకలేక పుత్రుని జంపబంపెనొ దుర్మతిన్
బాలు రాజనరేంద్రు డెవ్వతె పాడుమాటలు వింద నా
వాలుగంటి వివేకహీనపు వర్తనంబుల నెప్పుడున్
స్త్రీలు స్వప్నములోననైనను జెందకుందురు గాపుతన్.

(శ్రీ వేంకటరామకృష్ణ గ్రంథమాల)

పద్యమున చిత్రాంగి పేరు లేదు. ఆమె పినతల్లియయి యుండి సారంగ ధరుని గామించి, తమకము పట్టజాలక తెగించి యతని మీదబడుట చెప్పలేదు. ఆమె పేరు, ఆమె నడత అవాచ్యములు. వానిని జెప్పకున్నను కథ రూపు కట్టినది ఈ పద్యమునందు బాలశబ్దము 'మూర్ఖశాబకయో ర్బాలః' అను నర్థద్వయమున గాక, పుత్రుడను నర్థమున బ్రయుక్తము చతుర్థచరమునందలి కవులు చేసిన, హెచ్చరిక లోకమునకు శిరోధార్యము.

తిన్నని భక్తి :

శా. గండూషోదకధార వోసి, యభిషేకంబార్చి బాహోధనుః
కాండచ్ఛిన్న మృగామిషంబొసగి కైంకర్యంబు చెల్లించు తి
న్నం దక్షిస్రవదస్రు సీఖగని యన్నా! చెప్పకాల్వొట్టి, యం
ధుండై నేత్రము లిచ్చె, వానికి త్రినేత్రుండిచ్చె సాయుజ్యమున్.

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

ఈ పద్యమున తిన్నని పూజా విశేషము భక్తితో తన రెండు కన్నులిచ్చి, మూడు కన్నులవానిలో జేరుట చెప్పబడినది

దుర్యోధన శవసన్నిధి గాంధారీ ద్రౌపదులు :

మ. కనియుం దత్త్వము జన్మమృత్యువిధముల్ గాంధారరాట్పుత్రి నం
దను పీనుంగును జూచి యేడ్చె ముఖమున్ దాచించుకొంచున్ సుయో
ధనుడా? పీడని కృష్ణ నవ్వె నపు డంతః క్రోధ దుర్దాంత చే
తనయై క్షత్రియభామినీగతులు వింతల్ గావె, తర్కింపగన్.

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

పౌలిక లనబడిన దుర్యోధను శవమును జూచి గాంధారి మొగము బాదుకొనుచు దుఃఖించినది. తత్త్వ మెఱిగిన వ్యక్తికి గూడ కన్నకడుపుతీపు కలవరపాటు కల్గించినది. ఇక ద్రౌపది నవ్వుట నల్లనిది కనుక ద్రౌపదికి కృష్ణ యని పేరు. మయసభలో దికమకపడు దుర్యోధనుని జూచి ద్రౌపది నవ్వెను. అది మనసులో బెట్టికొని, దుర్యోధనుడు ద్రౌపది చీర లొలిపించి సభలో నవ్వెను. అంతటితో నాగక, తొడ మీద గూర్చుండ రమ్మని సంజ్ఞ చేసెను. అట్టి వాని తొడలు విఱుగ గొట్టించి, నేలబడిన వాని పీన్గును జూచి ద్రౌపది నవ్వెను. అది నవ్వేనా? అంతఃక్రోధదుర్దాంత చేతనయైనవ్వెను. లోపల అణపరాని క్రోధమున్నది. ఆక్రోధ మిటు లావిష్కృతమయ్యెను. క్షత్రియ స్త్రీల చిత్తవృత్తులు చిత్రముగానుండును.

లక్ష్మీపార్వతుల అన్యోన్యపరిహాస వచనములు :

సీ. గంగాధరుడు నీ మగండని నవ్వంగ
వేషధరుండు నీపెన్మిటనియె,
నెద్దునెక్కును నీదు నెమ్మెకాడని నవ్వ
గ్రద్దనెక్కును నీ మగం డటనియె
వల్లకాడిల్లు నీ వల్లభున కనంగ
నడిసంద్ర మిల్లు నీనాథున కనె
నాట్యంబు సేయు నీనాయకుండన నంగు
గావించు వెన్క నీ కాంతు డనియె
ముష్టి కెక్కడి కేగె నీ యిష్టు డనిన
బలి మఖంబున కేగె నో లలన యనియె
నిట్టు లన్యోన్య మర్మంబు లెంచుకొనెడు
పర్వతాంభోధికన్యల బ్రస్తుతింతు. (శతావధాన సారము.)

సీసము నాలుగు పాదములందును ఉక్తిప్రత్యుక్తులు సమముగా సాగినవి. ఎత్తుగీతిలో ఖతిమించి త్రిప్పికొట్టు స్థితికి వచ్చెను. దానితో వాదము ముగిసెను. ఇంత పద్యములో సంబోధన మెత్తుగీతిలోనే కలదు. పార్వతి లక్ష్మిని 'లలన' యనెను. సిరిచే మిడిసిపడుదానా! యని దాని యర్థము. ఈ సీసము స్త్రీప్రకృతికి దర్పణాయమానమై మచ్చట గొలుపుచున్నది.

తిమ్మన సత్య:

ఉ. పువ్వను గొప్పనం దుఱిమి పోడిమి దాని బహూకరించి లే
నవ్వులు చిల్కరించు యదునందన! చాలునటంచు బిుక్కుచుం
జివ్వన లేచి లోచన రుచిన్ బెదిరింపుచు నింపునింపెడున్
జవ్వని, మానినీప్రణయసంభ్రమ మేరికి విందుగొల్పదే?
(శతావధానప్రబంధము. ప్ర ఖం.)

ఈ పద్యము ఆత్యాశూక్తము పద్యమున సత్యపేరు లేదు. చివ్వనలేచి, లోచన రుచిన్ బెదరించెడి జవ్వని వల్కెడి మాటలనుబట్టి పువ్వు పారిజాతమని, బహూకృత రుక్మిణి యని, నవ్వులు చిల్కరించు యదునందనుండు కృష్ణుడని, మానిని సత్యయని విస్పష్టముగా తెలియుచున్నది.

రామాయణము యొక్క ఆత్మార్థము:

చం. ప్రకృతియె సీతయై తనర రాముడె యీశ్వరుడై రహింపగా
వికృతి యొకింతలేక సుకవిప్రవరుల్ తమకావ్యరాశిలో
సుకృతి ఘొసంగ వ్రాయుదురు సుస్థిరమై లగు జ్ఞానలబ్ధికై
ప్రకృత మెఱుంగువారి కది పథ్యముగా దనరారకుండునే?
(కొప్పరపు సోదరకవులు.)

'సీత ప్రకృతి రాముడు ఈశ్వరుడు' అని యొక చరణమున జెప్పి, తక్కిన మూడు చరణములు ఊరక లాగికొనిపోయిరి. అవధానమున కీమాత్రము చాలును. మాడభూషివారు, కాశీవారు, తిరుపతి వేంకటేశ్వరులు ఇట్టి సందర్భములందు లోతుకుదిగి కూలంకషముగ వివరించుచు బోయిరి.

## చిత్రకవిత్వ పద్యములు

అవధానమున జిత్రకవిత్వ ప్రదర్శనము దుర్ఘటము. శ్లేషలు, సామాన్య శబ్దాలంకారములు, నిరోష్ఠ్యములు, ద్విప్రాస త్రిప్రాసపద్యములు, సర్వగురువులు, సర్వలఘువులు - ఇట్టివి క్వాచిత్కముగా కొందరు చెప్పుదురు. ఈ చెప్పుట నిర్బంధమునకు లోగి కాదు, ఉల్లాసముతో.

చెఱకు, భారతము, చంద్రుడు:

కం చెఱకును భారత కథయును
సరసిజరిపుబింబ మొక్క చందమయగు ని
ద్ధరలో బ్రతిపర్వ రస
స్ఫురణంబును బొంది మూడు పొసగుట కతనన్. (అవధాన సారము.)

'పర్వ గ్రంథౌ పంచదశ్యా ముత్సవే'

చెఱకు ప్రతిపర్వ రస స్ఫురణము గలిగియుండును. ఇక్కడ పర్వము గణుపు. భారతము ఆదిసభారణ్య విరాటోద్యోగాది పర్వగీరతము. చంద్రబింబము ప్రతిపర్వ రస స్ఫురణము బొందునది. ఇక్కడ పర్వము పౌర్ణమి. పర్వశబ్ద గత శ్లేషచే పద్యము చమత్కృతమైనది.

కీచకశ్లేష:

ఉ పాచకుడైన భీముడు సెబాసని సజ్జను లెల్ల మెచ్చగా
గీచక మట్లుగా బ్రబలు కీచకునిన్ విఱిచెన్ దటాలునన్
'నీచకృతుల్ పొనర్చు నవినీతులకెల్లర కిట్టి శాస్తి సం
కోచము లేదు కల్గు నిదిగో గనుగొం'డని తెల్పుకైవడిన్.
(శతావధాన సారము.)

'కీచకః పవనాపూరధ్వనద్వే ణ్వసురాంశజే.'

కీచకము = వెదురుబొంగు. కీచకుడు విరాటుని శ్యాలకుడు. ఈ పద్యమున విఱిచెన్ అను క్రియలో స్వారస్యమున్నది.

తాటిచెట్టు విష్ణువు. శ్లేష. అచ్చతెనుగు:

అచ్చతెనుగునకు మాత్రాచ్ఛంద మనుకూలమే కాని, శ్లేషకు అచ్చతెను గనుకూలము కాదు. అవధాని ధీశక్తి కిట్టి పద్యములు నికషములు.

సీ. పులుగులదొర తన్ను గొలిచియుండుట జేసి
లచ్చి యొడయ డనవచ్చు దీని,
ఆకసమ్మల్లన గైకొనుటం జేసి
లచ్చి నెచ్చెలి యనవచ్చు దీని,
ఆకుపచ్చని పించియము గల్గుటంజేసి
లచ్చి నెయ్యుం డనవచ్చు దీని,
కల్లు ద్రావెడియన్న కాచి యుంటంజేసి
లచ్చి వేడని యనవచ్చు దీని,
కాన నిప్పుడు సోకుమూకలకు గొంగ
యంచు బల్కెద మీవుల నొయారముగను
జెట్టు లంచును బొలిచెడి యట్టి మణియ
గూడి యలరారు బలుదట్టు తాడిచెట్టు. (అవధాన భారతి)

పులుఁగులదొర గరుత్మంతుడు. తాడిచెట్టు నాశ్రయించి గ్రద్దలుండుటకద్దు కదా! అందుచేత నది యాతనిపట్టు. ఆకసము గైకొనుట ఊర్ధ్వస్థలముననుండుట, పింఛాకృతి కలిగి విరిసిన పచ్చని యాకులు తలపై నుండుట, కల్లు ద్రావెడి యన్న మద్యపాయి బలరాముడు, సేవించియుండుట, వీనినిబట్టి తాడిచెట్టు విష్ణు వనదగియున్నది. తుది రెండు శౌరిసంబంధి విషయములు శౌరికి విష్ణుప్రసిద్ధి కలదు. అచ్చముగా తెలుఁగు పలుకులు పొసగించుకొనుచు శ్లేష సాధించుట మిక్కిలి కష్టము.

వర్షాకాల ప్రవాహము; గర్భిణీసతి:

తే.గీ. నీరుచే నద్ది యిద్దియు నెగడుచుండు
దృష్టి గన కద్ది యిద్దియుఁ నెసగుచుండు
నదియు నిండియును దప దృశ్యమగుచు దగు
గర్భిణీకాంత నది యుసంగ్రహార్థ (కొప్పరపు సోదర కవులు)

గర్భవతి నీరు మోయుచున్న దనుట లోపమున వాడుక

'భంగః ఖండే పరాజయే తరంగే' భంగ శబ్దమునకు మూడర్థములు నదికి స్త్రీకి పోలిక సాధించుచు వసుచరిత్రకారు డుపయోగించిన శ్లేషపద సామగ్రి యెంతో యున్నది. అంత దూరము పోకుండ తేలిక మాటలతో, చాలమట్టుకు తెలుగులతో కొప్పరపువా రీ గీతము సంతరించిరి.

కవి - చోరుడు. ముత్తేభవిక్రీడితవృత్తము :

పదముల్ మెల్లన జేర్చి శబ్దము పయిన్ భావంబు సంధించుచున్
గదియున్ జిత్రతరార్థజాతము నలంకారమ్ములంగొంచు స
మ్మదము మీరంగ రసాంతరస్థితి దగన్ బొందించి దోషైక దృ
క్పదమున్ బూనెడు సత్కవీంద్రు డలరున్ బాటింప జోరుంబలెన్.

(అవధాన సారము)

ఇందు పదములు, శబ్దములు, అర్థము, అలంకారము, రసాంతరము, దోషైకదృక్పదము - కవికి, చోరునకు అన్వయించి చెప్పుట కనువైన శబ్దములు.

కవి దోషైకదృక్కు. శబ్దార్థాదిదోషములు దొరకకుండ వ్రాసెడు కన్ను గలిగి యుండువాడు చోరుడు - దోషైకదృక్కు. చీకటియందే వాని చూడ్కి. కవి శబ్దాలంకార సామగ్రితో, తగన్-బొటోటరమ్ముగా, రస - అంతరస్థితి బొందించును. చోరుడు అర్థమును, అలంకారములను గైకొని, రసా-అంతరస్థితిని-వేటాకచోటికి జేరవేయుట నిపుణముగా నిర్వహించును.

అనుప్రాసతోడి అక్కలిపడి సీసము :

సీ॥ ధీరుడై సద్గుణాధారుడై సుకృతి మం
దారుడై జగదేకవీరుడగుచు,
గేయుడై బలకార్తికేయుడై కృతిభాగ
ధేయుడై ప్రథితప్రమేయుడగుచు
దానియై సుకవి సన్మానియై కుశలసం
ధానియై సుమతిప్రధానియగుచు
మాన్యుడై నృపలోకగణ్యుడై విదిత సౌ
జన్యుడై దాన పర్జన్యుడగుచు

సకల రాజాధిరాజ రాజన్యలోక
పూజనీయ చరిత్రవిస్ఫూర్తి గలిగి
యాశ్రితుల బ్రోచునట్టి నారయ్య భూప
చక్రవర్తికి జగతిలో సాటి గలరె ?

(అగిరిపల్లి శతావధానము. మాడభూషి.)

ఈ పద్యము శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు చెప్పినది. ఇమ్మహాను భావుడు శతావధానమున ముక్తపదగ్రస్త సీసములును జెప్పెడివాడు.

గౌతమీ కృష్ణాంతరీత మహీరాజ !
హీరాజవాహ సమిద్ధకీర్తి !
సకలావనీపక సందోహ కల్పాగ !
కల్పాగమోక్త సత్కర్మశూర !
సర్వశాస్త్రవిచార చతుర ధీరాధార !
రాధారమణ్యధినాథభక్త !
వానాద్రి యతి కృపాభవ పంచసంస్కార !
సంస్కార విషయ తచ్చాత్రసార !
జయ జయాటవ ప్రకటవాత్సల్య శౌర్య
వీర్య గాంభీర్య ఘనధైర్య.... ....

(అగిరిపల్లి శతావధానము. మాడభూషి.)

వసంతము వృత్త్యనుప్రాసముతో వర్ణించుట:

ఉ. అంత దిగంతదంతుర నిరంతరకాంత వనాంత సంతతా
క్రాంత లతాంత, మంతక దురంతక కంతు నిరంతరాంత వా
సంతిక, మంతరాంతర నిశాంత లతాంతర కాంతకాంత, మ
శ్రాంతము సంతసంబిడె వసంతము సంతత మంత నంతటన్.

(అవధాన భారతి.)

చిత్రకవిత్వలక్షణమున నప్పకవి చెప్పిన 'ఇచ్ఛావాక్యసంఘట్టనము' కూడ అష్టావధాన శతావధానములందు చోటు చేసికొన్నది.

'కలువలు నిద్రనొందె, తమ్మల తుమ్మెదలాడుచుండె, జక్కవలానె వెన్నెలల్-' ఈ వాక్యములు వచ్చునట్లు వెన్నెలరాత్రి వర్ణనము. ఇది ప్రశ్నము. వాక్యములను గలిపికొని పద్యము లల్లుట యేమంత కష్టము కాదు కాని, వెన్నెల గాయుచుండగా, కలువలు మొగిడియుండుట, తమ్మలు విచ్చియుండుట కవి సమయ విరుద్ధ విషయములు. వీనితో జ్యోత్స్నావర్ణనము చేయుట చిక్కుతో గూడినపని.

ఉ. క్రమ్మ రతిశ్రమన్ జెలుల కన్నవకల్వలు నిద్రనొందె, నం
దమ్మగు ముంగురుల్ మొగముదమ్మల దుమ్మెదలాడుచుండె నా
గ్రమ్మె, జిలుంగు పైట దొలగన్ జనుజక్కవ లానె వెన్నెలల్
సమ్మదమందె లోకము కళానిధి వెల్గెడు రాత్రివేళలన్.

(అవధాన సారము.)

కన్నవకల్వలు, మొగముదమ్మలు, చనుజక్కవలు- ఈ రీతిగా నుపమిత సమాసములు చేసికొని, పద్యమునందు తద్వాక్యములు సముచితముగా బొదిగిన యవధాని ప్రతిభ శ్లాఘనీయము.

ఈ పద్యము దత్తపదిజాతికి జెందిన పద్యమనవచ్చు.

'కళాస్త్ర మేసుకోని, కంబడి కప్పుకోని, పంద్దిగిలిస్తే బయమౌనా?' ఈ భావము ప్రకటించి చంపకమాలిక చెప్పుట

చం. పులియొక దేరుదేర గని బోయడొకం డొక వేసమూనగా
బులి చిఱునవ్వుతో నను, 'ప్రజుష్టుడవేపు, కళాసమూని కం
బళి పయిగప్పి యూరకయె పండ్లిగిలింప నెలుంగుబంటివం
చలుకుదునే? వృథాశ్రమము నందితివయ్యయొ! గొల్లబోయడా'!

(అవధాన సారము )

ఇందు భావము దత్తము

విష్ణుప్రార్థనము: నిరోష్ఠ్యము:

ఆ. వె. రక్షసేయుశౌరి! రక్షోనికరహారి!
కందనీల! చారుకనకచేల!
శ్రీకళత్ర! లోకసృష్టిరక్షణసూత్ర!
యనుచు నుతులు సేయ నగును జనులు. (అవధాన సారము )

(ఓష్ఠ్యములు - ఉ, ఊ, ప, ఫ, బ, భ, మ. ఈ యక్షరములు లేనిది నిరోష్ఠ్యము.)

భాషాంతీకరణ పద్యములు:

పృచ్ఛకుడిచ్చిన శ్లోకమునకు సరియైన తెనుగుపద్యము జెప్పుట.

'ద్రౌపద్యాః పాండుతనయాః పతిదేవరభావుకాః
న దేవరో ధర్మరాజః సహదేవో న భావుకః'.

ఈ శ్లోకమునకు శ్రీ దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి, తమ్మన్నశాస్త్రి సోదరులు అచ్చతెనుగున జంపకము జెప్పిరి.

జముకొడుకు కీదుపట్టియును జన్నపుటోరెపుతేనికందు దూ
ర్పు మనియకాని వెజ్జులకు బుట్టినవారును బావగార్లు బేం
ఢ్లు మఱదులౌదు రైదుగురిలో గడు జిన్నత డెన్న బావగా
డు మఱది గాడు పెద్దయతడున్ దగ ద్రోపది కెంచి చూచినన్.
(అష్టావధానము నవంబరు 1879.)

జమకొడుకు ధర్మజుడు. ఈదుపట్టి మారుతి. జన్నపుటోరెపుతేనిపట్టి హవిర్భుగ్రాట్సుతుడు. వాసవి. తూర్పుమనియకాడు పూర్వదిక్పతి యింద్రుడు అతని వెజ్జులు వైద్యులు, అశ్వినీదేవతలు. వారికి బుట్టినవారు. అచ్చతెనుగు పద్యము కట్టుట కడుగష్టము. ఈ పద్యమున దృతీయ చతుర్థచరణములందలి యతి క్లిష్టి యభినంద్యము.

ఈ శ్లోకమునే శ్రీ కాశీ కృష్ణాచార్యులవా రిట్లనువదించిరి:

కం. ద్రోపదికి బాండుపుత్రులు
బావలు మఱదులను మఱియు భర్తలు నగుదుర్
భావుకుడు గాడెపుడు సహ
దేవుడదేవరుడు చూ యుధిష్ఠిరు డెపుడున్. (బందరు శతావధానము.)

దీనినే శ్రీ రాజశేఖర వేంకటశేషకవు లిట్లనువదించిరి:

కం. పతులై దగు రగుదురు యమ
సుతుడు మఱది గాడు, మాద్రిసుతులందు గని
ష్ఠతనయుడు బావగా డా
పతులు కడమవా రగుదురు బావలు మఱదుల్. (అవధాన సారము.)

ఇందు ద్రౌపది పేరు కనరాదు. కాని, కొఱతలేదు.

ప్రబోధచంద్రోదయ శ్లోకమునకు శ్రీ తిరుపతి వేంకటకవు లిరువురు చెఱియొక తెనుగుపద్యము చెప్పిరి.

శ్లో. లబ్ధంలబ్ధ మిదంచ లభ్య మధికం తస్మాలలభ్యం తతో
లబ్ధం చాపర మిత్యనారత మహో లబ్ధం ధనం ధ్యాయసి
నైతద్వేత్సి పునర్భవంత మచిరా దాశాపిశాచీ బలాత్
సర్వాగ్రాస మియం గ్రసిష్యతి మహా లోభాంధకారావృతమ్
(ప్రబోధ చంద్రోదయము 4-21)

శ్రీ తిరుపతిశాస్త్రిగారి పద్యము:

చ ఇది లభియించెనింక లభియించు లభించినదాని వద్దిచే
నదనము సేతునంచు మదియందు సదా ధనమున్ జపించు నీ
కిది తెలియంగలే దకట హెచ్చిన యాశ పిశాచిరీతి నీ
కుమరు నశింపజేయు జుమి కూకటివేళ్ళతోడ మూర్ఖుడా!

శ్రీ వేంకటశాస్త్రిగారి పద్యము:

ఉ. చేకుఱె చేకుఱంగలదు చేకుఱికట్టి ధనంబు బెంచినన్
జేకుఱు నింతకన్నను విశేషముగా ధనమంచు లోభమున్
జేకొనియున్న నిన్ను నతిశీఘ్రముగా నొకపెట్ట మ్రింగగా
నాకొనియున్న దయ్యమని, యాశ నెఱుంగ వదేమి మూర్ఖుడా!

కాళిదాసుని—

ధూమజ్యోతి స్సలిలమరుతాం సన్నిపాతః క్వ మేఘః
సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః
ఇత్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యక స్తం యయాచే
కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు (మేఘసందేశం. పూ. 6)

—శ్లోకమునకు శ్రీ వేలూరివారి పద్యము:

మ. పొగకున్‌జ్యోతికి వాయునీరములకున్ బుంజంబుగానొప్పు నీ
మొగు లేదెక్కడ మాంసలేంద్రియత నొప్పుంబ్రాణిచే బంపగా
దగు వార్తాతతియంచు లెక్కగొన కంతన్ వేడె యక్షుండు నె
వ్వగ గాముల్ బళిరే జడాజడములన్ స్వాభావదీనుల్‌గదా!

(అవధాన భారతి)

శ్లో. కావ్యం కరోమి నహి చారుతరం కరోమి
యత్నా త్కరోమి యది చారుతరం కరోమి
భూపాల మౌళి మణిరంజిత పాదపీఠ
హే సాహసాంక కవయామి వయామి యామి. (భోజరాజ చరిత్ర)

ఈ శ్లోకమునకు శ్రీ కాశీవారి పద్యము -

ఉ. నేనొనరింతు గబ్బమును నేర్పున జెప్పగ జాల నావిలో
బూని పచింతునేని రసపుష్టి గలట్టులు చెప్పనేర్తు నో
మానవనాథమౌళిమణిమండిత హాటకపాదపీఠ యో
యీ నవసాహసాంక కవయింతు వయింతు నయింతు నింటికిన్.

(అవధాన యాత్ర)

శ్లో. సంధ్యావందన భద్రమస్తు భవతే, భోస్స్నాన తుభ్యం నమో
భో దేవాః పితరశ్చ తర్పణవిధౌ నాహం క్షమః క్షమ్యతామ్
యత్ర క్వాపి సిషీద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః
స్మారం స్మార మఘం హరామి తదలం మన్యే కిమన్యేన మే?

ఈ కృష్ణకర్ణామృతశ్లోకమునకు పిసుపాటివారి పద్యము -

శా. స్నానంబా యిదె నీకు వందనము, సంధ్యా నీకు గల్యాణ స
మ్మానం బోపితృదేవులార యిదె యుష్మత్తర్పణంబందునన్
నే నత్యంతము శక్తిహీనుడను మన్నింపుండి మా శ్రీహరి
ధ్యానంబే నను ధన్యునిన్ జలుపు నన్యంబింక నాకేటికిన్?

శ్లో. 'గుణాః పూజాస్థానం గుణిషు నచ లింగం నచ వయః' అన్న భవభూతి శిఖరిణీ చరణమునకు శ్రీ వేంకట రామకృష్ణకవుల కందము -

కం. గుణములు పూజాస్థానము
గుణులకు లింగంబు వయసు గననేటికి ద
ద్గుణములు చక్కని వైనన్
బ్రణతి యొనర్పంగవచ్చు బాదంబులకున్.

శ్లోకమునకు బద్యము జెప్పినట్లే పద్యమునకు శ్లోకము జెప్పుటయు గలదు

శ్రీనాథుని-

కం. వేరీ ధరణిపు లల్లయ
వీరక్ష్మాపతికి సాటి వితరణగరిమన్
ధారాధర ధారాధర
ధారాధర వాహదాన ధారానిధికిన్. (కాశీఖండము. పీఠిక. 47)

అను కందము గొని, శ్రీ వేలూరివా రదేభంధమున వనేచందమున జెప్పిరి

భాష గీర్వాణము:

ధారాధర ధారాధర
ధారాధరవాహదాన ధారానిధయే
అల్లయ పీరక్షామ్మపా
లాయ కియాన్ భూధవోస్య ఇహలోకే.

తిరుపతి వేంకటేశ్వరు లొక యింగ్లీషు కృతిలోని కల్పనను **శిఖరిణీ** వృత్తమున సంస్కృతమున వక్కాణించిరి:

శ్లో॥ స్వకీయై ర్ముక్తాద్యై ర్విరచయతి వేలా నవవధూ
శుభాలంకారం తత్క్రము సమనుకూలం నకిముత
ఇతి ద్రష్టుం గత్వా పరిచరతి వీచీమయకరైః
పునర్యాతాయాతై శ్చలతి జలధిః కాముక ఇవ.

ఈ క్రింది యాంగ్లపు పంక్తులను శ్రీ వేలూరివారు పద్యమున బలికిరి.

**"As a miser boards money so should you save ideas And the safety vault for ideals is not unreliable memory ; it is a system - a system that can neither fag nor forget."**

శా॥ ఎట్టో లుబ్ధుడు కూడబెట్టుగతి నీ వీహాదులన్ గూడగా
బెట్టం జూడు, క్రమంపు ధారణ మెయిన్ బ్రేరేపు మాపైని నె
ప్పట్టున్ నాశమినొందుచుండ దిదియే ప్రాబల్యకా! అయ్యదే
కట్టుంబాటు పొకాలబోదు మఱపంగాబోదు నిక్కమ్ముగన్.

అవధానమునందలి యీ భాషాంతరీకరణవిధానము మక్కికి మక్కిగాగాక, భావ ప్రధానముగా నడుచును సుప్రసిద్ధ శ్లోకము లనువదించునపుడు నూటికి దొంబదిపాళ్ళు మూలమును బోలియుండును. అశ్రుతములు, సందిగ్ధార్థములు, క్లిష్టములు నగు శ్లోకములు ఛాయామాత్రముగ ననూదితము లగును. సమాస స్నిగ్ధవృత్తము సదృశవృత్తమున యతిప్రాసస్థానక్లుప్త కించిచ్ఛబ్ద పరివృత్తిచే యథాతథముగ నిలువగలదు.

## అన్యాపదేశ పద్యములు.

అవధాన సభలో ఎవరికో తగులవలెనని, దేనిమీదనో పెట్టి, కవి యొక్క పద్యము విసర వచ్చును. పృచ్ఛకుడే అట్టి తలంపుతో నడుగ వచ్చును. ఇట్టి పద్యములకు ఎవరు లక్ష్యభూతులో వారాసభలో నుండినపుడు ఆ పద్యముల విలువ చెప్ప నలవికాదు.

తిరుపతి వేంకటేశ్వరుల వేమవరాగ్రహార శతావధానమున 'చీకుముల్లు' గురించి చెప్పిన సీసపద్య మన్యాపదేశపద్యమే. ఎత్తుగీతియందు అవధానుల అలు కాలిమంట నడునెత్తికెక్కినది. చూడుడు:

సీ. నిన్ను గాల్చిన గాని నీ బుద్ధి మానవు
          చీ యేమనందునే చీకుముల్ల !
   దొంగరీతిని దూరి దొరక కుందువు గదే
          చీ యేమనందునే చీకుముల్ల !
   పొరలోపలం జేరి పోటు గూర్చెదు గదే
          చీ యేమనందునే చీకుముల్ల !
   పద మాశ్రయించియు బాధ పెట్టెదు గదే
          చీ యేమనందునే చీకుముల్ల !

   నిన్ను మర్యాదగా జూచునేని యెట్టి
   దట్టు డేనియు నీదు కోతలకు లోగు
   చెప్పుదెబ్బకు దప్ప నీ చెడ్డగుణము
   చీకదు సుమీ! యిసీ యిసీ! చీకుముల్ల! (శతావధాన సారము)

పిఠాపురపు శతావధానమున శ్రీ వేంకట రామకృష్ణకవులు 'లక్షణవిరుద్ధముగ జెప్పు కవి'ని గురించి చెప్పిన శార్దూలము:

ప్రాసంబున్ యతియున్ విరుద్ధగతి శబ్దంబున్ ప్రయోగించుచున్
మీసంబుల్ వడిపెట్టి మాకుపమ మేమేయంచు నెందుం దుర
భ్యాసంబొప్పగనుండువారు కవులై పద్యంబులన్ జెప్పినన్
వాసింగన్న కవీశ్వరుల్ సభలలో వర్ణింతురే, వారలన్?

(వేంకట రామకృష్ణ గ్రంథమాల)

మీసలు దుందుడుకొప్పగ బెంచి, వేశ్యాలౌల్యమున మించి వర్తించు వ్యక్తు లెవ్వరో యీనాడు మన యూహ కందకపోవచ్చు కాని, తత్రత్యులగు సభ్యులకు పట్టియిచ్చినట్లు తెలిసియుండును.

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి గుంటూరు కాలేజీ శతావధానమున 'అప్పు డక్కడ నుండిన గ్రుడ్లగూబ' గుఱించి సీసము జెప్పబడినది:

సీ. శతవధాన విధాన సంధాన మందున
సపశకున మటంచు నాగినాడ,
కన్ను గానక మంచి తెన్ను జూడగ లేక
యటునిటు దిరుగుట యరసినాడ;
గబ్బికంపుల పెంపు గన్పింప తెక్కల
ఝాడంగ దిరుగుట యరసినాడ,
ఈ గూటిలో నుండి ఆ గూటి మీదికి
నలవోక యెగురుట యరసినాడ

గడ్డమున్ మీసముల్ లేని కౌశికుండ !
కవిత చెప్పగలేని ఘూకవివరుండ !
చూడగా వచ్చినాడవా? నేడిచటికి
గుటిల రుతముల దూబ ! యో గ్రుడ్లగూబ !

ప్ర తి ప ద్య ము లు

సుప్రసిద్ధ పూర్వకవి పద్యము నిచ్చి తద్భిన్నవృత్తమున ప్రతిపద్యము జెప్ప గోరుటయు నటనట జరుగుచుండును.

మనుచరిత్రము నందలి— (2-41)

ఉ. ఇంతలు కన్నులుండ దెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర యే
కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించు లా
గింతియ కాక నీవెఱుగవే మును వచ్చిన త్రోవచొప్పు? నీ
కింత భయమ్ములే కడుగ నెల్లిదమైతిమి మాట లేటికిన్.

అను కవితామతల్లికి పద్యమునకు, ఉత్పలమునకు, శ్రీ కొప్పరపు సోదర కవులు చెప్పిన కంద మిది-

కం. ఇంతలు కనులుండగ బ్ర
శ్నింతువు వచ్చిన పథంబు జెప్పుమనుచు శు
ద్ధాంతసతుల నిటు పల్కుట
యెంతకొ, యిది వ్యాజమనుచు నే దలచు జమీ!

సీ. తత నితంబాభోగ ధవళాంశుకములోని
యంగదట్టపు గావిరంగువలన
శశికాంత మణిపీఠి జాఱువారగ గాయ
లుత్తుంగ కుచపాళి నత్తమిల్ల
దరుణాంగుళీధూత తంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు నటింప
నాలాపగతి జొక్కి యఱమోడ్పు గనుదోయి
రతిపారవశ్య విభ్రమము దెలుప

బ్రౌఢి బలికించు గీతప్రబంధములకు
గ్రమ కరపంకరుహ రత్నకటక ఝణఝ
ణధ్వని స్ఫూర్తి తాళమానములు గొలుప
నింపు దళుకొత్త వీణ వాయింపుచుండి (మనుచరిత్ర. 2-27)

అను సీసమునకు శ్రీ వేలూరివారు చెప్పిన కవిరాజ విరాజితము—
పిఱుదుల నిండిన తెల్లని వల్వల పెచ్చగు నెఱ్ఱని రంగున జం
దురు నెఱజాతిని గాయలు గబ్బల దోపగ బ్రేళుల మీటిన తం
తిరి ధ్వని జిల్బిలి పాటల తేటల తీరుగ ముద్దుల జూపగ న
బ్బురపు వరూధిని వీణను బాడగ బొంచుచు జూచెను విప్రు డొగిన్.
(అవధాన భారతి)

ఆ.వె గంగగోవుపాలు గంటెడైనను జాలు
గడవడైననేల ఖరము పాలు?
భక్తి గలుగు కూడు పట్టెడైనను జాలు
విశ్వదాభిరామ వినురవేమ.

అన్న వేమన్న ఆటవెలదికి సుబ్బన్న ప్రతిపద్యము శార్దూలము:

శా ఏలా గాడిదపాలు దుత్తెడయినన్ హేయంబగున్ గంటెడే
చాలున్ సద్గుణసేవ్యమైన కపిలాస్తన్యంబు భావింపగా
జాలున్ బట్టెడు భక్తితో నొసగు భిస్సాపిండ మో విశ్వద
శ్రీలోలా! యభిరామ! ప్రేమ! వినరా! చిత్సార! సన్మందిరా!
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

అల్పవిషయము-బృహత్పద్యము:

బృహద్విషయము-అల్పపద్యము:

పరమాణువును పర్వతీకరించి చెప్పుట, పర్వతమును అణ్వాకరించి చెప్పుట కవులకు క్రొత్త విద్య కాదు కాని, తటాలున నందికొని, కంసాలివలె వస్తువును కోరిన అచ్చునబోసి యిచ్చుట అవధాన సభలో కష్టమని చెప్పక తప్పదు.

వసుచరిత్రకారుడు వర్ణించిన 'ధూళి' సీసమున నెన్ని యొయ్యారములు వోయినదో చూడుడు-

సీ ఎదలపై బొదలు పయ్యెదలు జాఱగ బాఱు
బిబ్బోలకు ముసుంగు లబ్బజేసె,
ఘనభేరికాధ్వనుల్ విని గుంచియలు ప్రేంక
ణాలు మల్కలకు గోపిలు చేసె,
నుడుగని విభ్రాంతి దడగాళ్ళుపడ నిల్చు
ఖానలు డాగ జీకటులు జేసె,
గడలేని కాందిశీకత వేగు తమ కుర్వి
జడధు లెల్లను గాలినడక సేసె

ననుచు శిరములు దాల్చి రెప్పని సమగ్ర
సైన్య ధృత ధూళి జకితులై చను సహాద
కుతుపశాహి నిజామాది కుతలపతులు
తండు నృపమాత్రుడే రామధరణివిభుడు.

ఇది ప్రబంధ పద్యము.

'కేతకీ పరాగము' వర్ణించిన శ్రీ వేంకట రామకృష్ణకవుల అవధాన పద్యము తిలకింపుడు-

సీ. ధవళమై గంధప్రధానమై ధారణి
నిమ్ముగ దావుల గ్రుమ్మరించు
గంటకంబుల నెట్లొ కడచి వచ్చిన తేటి
దొంగల కనులు బోవంగజేయు
దనతోడ నారామమున నున్న చెట్లకు
గనుల కెంపగు చూపు గలుగజేయు
సంపంగి పూదేనె సందెవాచ్చెడు మన్మ
థునకు విభూతియై తనరుచుండు

కేతకీపుష్పరజము తర్కించిచూడ
గాంతి సౌరభముల సహకారమంజ
రీ పరాగంబు కన్న గరిష్ఠ మనుచు
నిర్వచింపగవచ్చు వర్ణింపవచ్చు. (వేంకట రామకృష్ణ గ్రంథమాల)

శ్రీతిరుపతి వేంకటేశ్వరులు మహాస్రగ్ధరా వృత్తమున దోమకాలు వర్ణించిరి:

ఎలమిన్ నారీతి గానం బెవరు సలుపరే రేని గాత్రాంబురాశిన్
జెలువున్ గాపించుచుండున్ జెలువల లలితశ్రీల సొంపారు సెజ్జన్
లలి నిట్టాన దప్పితాళపతరగతిపై లాస్యముంజేసె దోసీ!
ఇల నీ కాలెంత? నీ సంగ్రహ గమనపు టింకలు దానెంత? దోమా!
(శతావధాన సారము)

దోమ క్షుద్రప్రాణి. దాని కాలెంత? సూక్ష్మాతిసూక్ష్మము. అట్టి మశక చరణము వర్ణించుటకు మహాస్రగ్ధరావృత్తము దత్తము. ఇక్కడి వృత్తౌచిత్యము కొనియాడదగినదే. 'వీరస్య భుజదండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్' అన్నారు కదా! స్రగ్ధరకు మహాస్రగ్ధరకు పెద్ద తేడా లేదు. దోమకు ముంగాళ్ళే భుజదండములు. నిశాచరవీర మశక భుజదండ వర్ణన విశేషమది.

తిరుపతి వేంకటేశ్వరులు మశకమును వర్ణించిరి పాదమును వర్ణింపలేదు. బలిదానధారకు నొగ్గిన వామహస్తమును పోతనకవి- 'ఆదిన్ శ్రీపతి కొప్పుపై దనువుపై నంసోత్తరీయంబుపై బాదాబ్జంబులపై గపోలతటిపై బాలిండ్లపై నూత్న మర్యాదన్ జెందుకరంబు' అన్నట్లు మశకచరణమును వర్ణించి యుండిన ముద్దుగా నుండెడిది. అదెట్లన-

తరుణీభాస్వత్కపోలస్థలమున దిలకోదాత్త పాలమ్మునన్ బం
ధుర వక్షోజాగ్రజాగ్ర త్తుహినకిరణ కస్తూరికాధూళిపాళిన్
బరితో గంభీరనాభిన్ జఘన తలమునన్ బాణిపద్మమ్మునన్ గ్రు
మ్మరుటన్ శయ్యాగ్రపాళిన్ మశకచరణమున్ మాన్యమై ధన్యమయ్యెన్.
(శతావధాన ప్రబంధము ది. ఖం.)

శ్రీ కొప్పరపు సోదరకవులు చెప్పిన 'చీపురుకట్ట' సీస మొక విలక్షణ చమత్కారము కలది:

సీ. మలినంబు బాపి నిర్మలత జూపుట జేసి
యల్ల గంగాదేవి యనగవచ్చు,
నఖిల ప్రదేశములందు దోచుట జేసి
యల పరమాత్మయే యనగవచ్చు,
నిత్యాభిషేకంబు నెమ్మిగాంచుట జేసి
యల జలస్థిత లింగ మనగవచ్చు,
స్త్రీకరగ్రహణము చెలిమి నందుట జేసి
యల పురుషోత్తము డనగ వచ్చు

ననుచు నెట్లట్లొ పొగడగా నయ్యెగాదె
యదియు సింగారపుంగట్ట యనుట జేసి
కాక యద్దాని జీపురు కట్టయనిన
నింతగా వర్ణనము సేయ నెపడు దలచు.

శ్రీ పిశుపాటివారు చీపురు కట్టను కందమున వర్ణించిరి.

కం. శృంగారపుగట్టా! నిను
బంగారపుగట్ట వనుచు బలికెద, లేకు
న్నం గడు బుణ్యాత్ములు బలె
నంగనల కరాంబుజంబులం దాడుదువే ?

నల్లసిరా చుక్క: సీసము:

సీ. తరుణీకపోలమధ్యమునందు శుభవేళ
సొబగొందు మసిబొట్టు చుక్కవోలె
సకల జగజ్జన సంతోషకారణ
చంద్రబింబగత లాంఛనము మాడ్కి
రమణీయ సత్కావ్య కమనీయపద్య సం
గత శబ్దదోషవికార మట్లు
శృతిగొను నుద్యోగి బ్రతుకపత్రమునందు
మన్నింపగారాని మార్కువోలె

విమలజలరాశి నుదయించు విషము వోలె
గమల యురమున మృగనాభి కందు వోలె
మీది కొలికెడు కాల మషీదరాంక
రేఖ చిత్రవిస్ఫూర్తి వర్తిల్లు నవుర! (శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

విస్తరించి చెప్పుట కంటె కుదించి చెప్పుట మఱియు గష్టము. కందపద్యమున దశావతారవర్ణనము కావింపవలెనన్న చిన్నపని కాదు. పద్యశరీరము చిన్నది. ప్రతిపాదమున బ్రాసము, ద్వితీయ చతుర్థపాదములందు యతి పోగా మిగిలెడి తావెంత?

ఆ యింతలోనే యవతారములు పదింటి నిమిడింపవలెను.

కం. వనచర చతుష్టయము హా
మనుడును రామత్రయంబు మహితుడు బుద్ధుం
డును గల్కియు ననగా వి
ష్ణుని యవతారములు పదియు శోభిలుచుండున్. (అవధాన సారము)

'వనం కానన నీరయోః' 'రామః జామదగ్న్యే బల రాఘవయోశ్చ.' వనచతుష్టయమున జలచరద్వయము మత్స్యకూర్మములు. కాననచరద్వయమున వరాహసింహములు. రామత్రయము భృగురామ రఘురామ యదురాములు.

షట్చక్రవర్తులు: కందము:
ధర నలుడు హరిశ్చంద్రుడు
పురుకుత్సుండును బురూరవుడు సగరుడు దు
ర్భరుడైన కార్తవీర్యుడు
వఱలుట దగె మున్ను చక్రవర్తిప్రథచేన్. (కొప్పరపు సోదరకవులు.)

దశావతారములందువలె బర్యాయపదము లీపద్యమున బొసగించుటకు వీలు లేదు. ప్రాసము కొఱకు 'ధర', 'దుర్భరుడైన' అను పదములు మాత్రము చొప్పింపబడినవి. క్రమము తప్పించియైన ఛందోనుకూలతబట్టి నామధేయములు చెప్పవచ్చును. షట్చక్రవర్తిక్రమ మిట్లు ప్రచారమున నున్నది:

'హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సః పురూరవాః
సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః.'

అచ్చ తెలుగు పద్యములు, శ్లోకములు

శివస్తుతి. అచ్చతెనుగు. సీసము.

సీ. ముక్కంటి పండుల మెక్కువానికి దండ్రి
వై వెండికొండపై నలరువాడ!
గట్టురాపట్టి కేల్పట్టి చాలకపైన
ముత్తోవ ప్రిమ్మరి మోయువాడ!

పెనుకంటి మఱుఁటలోపలను మఁప్పోటి ర
క్కసుల జూపె యొసప్పె కాలువాడ!
నెత్తిపై జిన్ని క్రొన్నెలపూవు వెలయంగ
బాపచుట్టలతోడ బరగువాడ!

విసము గుత్తుక బట్టుచు వెలయువాడ!
యిమ్ముగా బుజ్జ బిచ్చము నెత్తువాడ!
మిత్తులకు నెల్ల మిత్తిపై మెఱయువాడ
నిండుఁ దయజూడు మము వెండికొండఁబేడ! (బందరు శతావధానము.)

ఇందలి 'దయ' తత్సమశబ్దము. అయినను దుదియందై పట్టింపుకు రాలేదు.

లచ్చి. ఉత్పలమాల. అచ్చతెనుగు.

చిల్కవజీరువాడు గయిసేయ దొడం బురుడించి యేనుగుల్
కుల్కుచు దొంతముల్ పయి దగుల్కొన మేటి కడాని కుండలన్
జిల్కుచు నీరు పెన్మిటియు జెల్వుగ జెంతన పొల్చియుండు నా
కుల్కుమిటారి లచ్చి బురికొల్పెద నా మది నాడియుండగన్.

(అవధాన భారతి.)

వేణుగోపాలుడు. అచ్చతెనుగు.

ఆ వె. వ్రేపెలంత లెపుడు వేవేలు గొలువంగ
బిల్లగ్రోవి నల్లనల్ల నూదు
కొనుచు వేడ్క మీఱగను నాటలాడెడి
గొల్లపిల్లవాని గొల్తు మేము. (శతావధాన సారము)

సభావర్ణన. సంస్కృతము. పంచచామరము.

సభావిభాతి సజ్జనప్రభాసితాంతరాశికా
ప్రభూత్తమప్రసేవనప్రభూత సర్వమంగళా
శతావధానకారిభి స్సుతాత్మతత్త్వవిత్తమైః
ప్రతారిఁకైః పురాణికైః కృతాంతిభి ర్మహాత్మభిః.

(అగిరిపల్లె శతావధానము.)

తుఫాను. సంస్కృతము. స్రగ్ధరావృత్తము.

ఆత్యాభీలానిలేన ప్రచలదురుమహోభంగసంగే సముద్రే
గ్రామా స్తత్తీరసంస్థా విలయముపగతాః కించ వృక్షాశ్చ భగ్నాః
పశ్చా న్నౌకా స్సమస్తా అపి జలమధితా మగ్నతా మాపు రుచ్చై
స్సర్వేషాః కష్ట మాసీ త్సుఖమితితు పరం ద్యోసుమప్రాయ మాసీత్.
(శతావధాన సారము)

లక్ష్మీః ఆర్యా.

పారావారతనూజాం
జాయాం శౌరేః స్మరస్య జనయిత్రీమ్
వందే దృఢయా భక్త్యా
బృందారకవందితాంఘ్రినీరేజామ్. (వేంకట రామకృష్ణ గ్రంథమాల.)

తత్కాల రాజకీయ సాంఘిక విషయ పద్యములు

హూణు లీదేశమునకు వచ్చిన రీతి:

సీ. భిక్షుపాదాంబుజ ప్రక్షేపణన్యాయ
మున మొద లీదేశమునకు వచ్చి,
క్రమముగా గొంతదేశము వర్తకమునకై
మైత్రి కల్మిని నాక్రమణ మొనర్చి,
యటుమీద మఱికొంత యార్జించి యద్దాన
స్వల్పమ్ముగా సేన సంగ్రహించి,
పిమ్మట గొందఱ బృథ్వీశుల నడంచి
యచ్చటచ్చట గోట లాక్రమించి

క్రమముగా నెల్ల భూమి వశముగ జేసి
సర్వరాజన్యులును బన్ను సంగ నిప్పు
డేలుచున్నారు మనదేశ మెల్లయెడల
హూణు లెంతటి కార్యప్రవీణులో కద! (శతావధాన సారము.)

ఎడ్వర్డు చక్రవర్తి:

మ. ఘను డత్యంతకళావిదుండు రుచిరాకారుండు శాంతాత్మకుం
డనఘుం డెంతయు దానశీలుడు సితాస్యస్వచ్ఛ వంశ్యుండు స
జ్జనమాన్యుండు సమస్తరాజమకుటీసంలగ్న రత్నప్రభా
కనదంఘ్రిప్రతిభాసమానుడయి వేడ్కం జెందు నెడ్వర్డిలన్.

(శతావధాన సారము.)

ఇంగ్లీషు విద్య:

మ. తిరిపెంబెత్తెడివాని నెయ్యది మహాదేవేంద్రునిం జేయునో
పరనీచాన్వయజాతు నెయ్యది మహావంశోత్తముం జేయునో
ధరణిన్ వైదికునైన నెయ్యది తగన్ దా హూణుగా జేయునో
వరశోభాకర మట్టి హూణకళ నే వర్ణింపగా నేర్తునే?

(శతావధాన సారము.)

బాసుగారి చట్టము:

మ. కలికిన్ గంటికి ప్రీతిగొల్పునెడ వేడ్కన్ దేనినేనిన్ నరుం
డెలమిన్ గైకొనవచ్చు. దానిపయి నెందే బేర్మివో నప్పు ద
క్కలికిన్ పీడగ వచ్చు, నొండొకట భాగ్యంబున్న విశ్వాస్తతో
గలియన్ వచ్చును. 'బాసుచట్ట' మురరీకారంబు గావించుచో.

(శతావధాన సారము.)

జపాన్ రష్యా యుద్ధము: రథోద్ధతావృత్తము:
వర్తతే ఖలు జపానుభూపతే
రష్యావనికాపతే రవిశ్రియై
సంయుగోఽయ మసమానకక్షయా.

వృద్ధి రధ్యతు జపాను భూపతేః (శతాధాన సారము)

వీరేశలింగము పంతులుగారు చేయించు విధవావివాహములను గురించి:

సీ. మా దబ్బు నెదగ్రొబ్బె మా ప్రబుద్ధు డటంచు
మంగలివాండ్రు తన్నుం గుణింప
పెండ్లములకు వండి పెట్టగా సుఖియించు
వార లెల్లరు తన్ను దూఱుచుండ
విద్యార్థులును మెట్ట వేదాంతులును గూడి
తన్ను నేవేళ నిందను నొనర్ప
మును చచ్చినట్టి మగని తద్దినంబెట్టు
లని బుధవరులు నాదొనరజేయ

నన్నిటికి నోర్చి విధవలౌ నంగనలకు
భ్రూణహత్యలు జరుగక పోవుగాక
యంచు బెండ్లిండ్లు సేయ యత్నించుచుండె
కందుకూరి వీరేశలింగ ప్రధాని. (శతావధాన సారము )

స్త్రీల పునర్వివాహము:

ఉ. ధారుణి నీకలిన్ విన యథావిధి గాగలయట్టి పెండ్లి కా
ధారములేక మానవులు తగ్గిసమగ్గిస లాడుచుండగా
నూఱులు వేలు లక్షలును నూతనశుల్కము హెచ్చి యింక నే
తీరున నెవ్వరే ననుమతింత్రు వితంతు సుతంతుధారణన్.

(బందరు శతావధానము.)

కట్నాలు పెరిగి, అసలు వివాహమేకాని కన్య లెందరో నిలబడియున్నారు. వీరి నుపేక్షించి, వితంతువులకు తంతువులు కల్పింపజూచుట న్యాయము కాదని ఆచార్యులవారి అభిప్రాయము.

అసహాయోద్యమము భారతముతో బోల్చి సీసము:

సీ. అపత్కారంబు కిలాపత్సమస్యయే
        దుష్టచతుష్టయద్యూతసరణి
పాంచాలమానినీ పరిభవస్ఫూర్తియే
        పాంచాల నృపసుతాపరిభవంబు
ప్రకట భారతమహీస్వాతంత్ర్యలాభంబె
        తమకు రావలసిన ధరణితలము
చెఱసాలలందు జొచ్చియు గృశించుటయె క
        ర్కశగహనావాస కష్టసమితి

యవల దౌర్జన్యరహిత విఖ్యాత మగుచు
మహితమౌ నసహాయోద్యమము గుఱించి
యిట్టిదని వివరింపగా నెవరి తరము
ధీరవరులార! యది పెద్ద భారతంబు (అవధాన సారము.)

గాంధి సుగుణములు:

సీ. ఎవరేమి చేసిన నవరోధ మొనరింప
        కుండగా సహియించియుండు బొకటి
ఎవరేమి చెప్పిన వ్యసనితంబుగ, దన
        కుండుచిత్తము మార్చకుండు టొకటి
ఎవరెట్లు చూచిన నీసడింపనుచు లే
        కుండగా దరిజేర్చుచుండు టొకటి
ఎవరెట్లు పోయిన లవమేనియు నసత్య
        ముందుత్రోవకు బోవకుండు టొకటి

హైందవులలోన గలహంబు లంకురించు
చుండ నుపవాసములు చేయుచుండు టొకటి
గాంధి యందిట్టి గుణములు గలవు గాన
నాతడు మహాత్ముడని యందు రార్యులెల్ల.

(పిశుపాటి చిదంబరశాస్త్రి గారు.)

గాంధి మహాత్ముడు:

ఉ. తెచ్చె స్వరాజ్య మీభరతదేశజనావళికి గొప్ప ప్రాభవం
బిచ్చె మహాత్ము డాపిదప నెల్లమతమ్ముల నొక్కకొల్కికిన్
దెచ్చుటకై ప్రయాసపడి తీర్చగ జాలక తెల్లవోయె, దా
వచ్చినకార్య మాయె, భగవంతుడు పిల్వగ బోయె గాంధియున్.
(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం )

భారత త్రివర్ణపతాక పట్టుకొని, వదలక, లాఠీదెబ్బలు తిన్న కుమారి యిందిరా ప్రియదర్శిని: శార్దూలవిక్రీడితవృత్తము:

శా. లాటీగైకొని యిందిరాతరుణి డొల్లన్ నేల దాడింప త
త్కోటిన్ ఘట్టితశీర్షయై యొదిగె జక్షుల్ రెండు ఘూర్ణిల్ల, నా
రాటంబందియు వీడబోవదు త్రివర్ణశ్రీధ్వజమ్మున్, భట
వ్యాటోపమ్ము గణింతురే? నిజధరా స్వాతంత్ర్య రక్షాపరుల్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

గగరిన్ గగనయాత్ర:

మ. అగణేయ ప్రతిభాప్రభావులగు రష్యాదేశ శాస్త్రజ్ఞు లూ
ర్ధ్వగతిం బోవు తెఱంగు గన్గొని సముద్యత్సాధనప్రోద్ధతిన్
గగరిన్నామకు రోదసీకుహరమున్ గాలింపగా బంపి రా
విగతక్షోభుడు తిర్గివచ్చె నవురా విశ్వస్తుత ప్రక్రియన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

పాకిస్థాన్ భారతదేశముపై దండెత్తి పొందిన ఘోర పరాజయము:

శా పాకిస్థాన వరూధినీజలధి శుంభద్భారతక్షోణి వే
లా కూలంకషభంగి బొంగి పయికిన్ లంఘించి తా భారత
వ్యాకస్సైనిక కుంభసంభవ ముఖాచాంతిక్రియా నష్టమై
వీకంబాసి యడంగె, బంకహృదయోద్వృత్తుల్ పిసాళింతురే ?
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

ఆంధ్రప్రదేశ్: ఐకస్థిత్యము:

ఉ. నాణెముగాగనుండె సుమనస్త్రయ మొక్క గుళుచ్ఛమై తెలం
గాణము నాంధ్రసీమ ప్రముఖస్థితి రాయలసీమ నాగ, వి
న్నాణము వాయు దప్పు చనినన్ గళయుం జెడు, గాన, మైత్రి ని
శ్రేణిక జేసి పూర్ణనిబిరీసరుచిన్ మనుటొప్పు నొక్కటన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

రోదసీమండలమున బయనించు రాకెట్: స్రగ్ధరావృత్తము:

నానామేఘాళి దూలన్ భయదరయమునన్ జండచండప్రకార
ధ్వానోదగ్రమ్ముగన్ సత్పథమున జను నుద్దండ రాకెట్ విధమ్మున్
జానుందెల్గుంబెదంగుల్ చకచకితముగా స్రగ్ధరావృత్త బంధో
చ్యూనక్రీడన్ వచింపన్ సుజనవినుతమై శోభిలున్ సత్సభోర్విన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం )

ఆర్టీసీ బస్సుల నిర్వాహము:

సీ. కర్మణ్యభుగ్భద్రకల్యాణ మనుపేర
భద్రాకరణశిక్ష ప్రజకు గలిగె
ఘోరప్రచండాన గొండెక్కుచుండె బస్
చార్జీలు నష్టాల సాకుతోడ
చార్జీల వెంబడి సరకుల ధరలు పె
రుగుచుండె బ్రదుకు బరువగుచుండె
ప్రజలను కాకులన్ బడగొట్టి యుద్యోగు
లను గ్రద్దలను సాకు టయ్యె నేడు

దోస మెఱిగియు రోసముతోడ గండ
రించి మంగల కత్తిని మ్రింగినట్లు
దొరతనమువారి చేతలు తోచుచుండె
ఆర్టీసీ బస్సు దారి యరిష్టకారి. (శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

కర్మణ్యభుగ్భృశ = కార్మికులు భద్రాకరణము = క్షౌరము.

జనతాపార్టీ ప్రవాహము :

శా. లోకంబంతయు నేకమైనగతి గల్లోలమ్ము లుప్పొంగి యు
ద్రేకించెన్ జనతాప్రవాహము రయోదీర్ణప్రజాప్రౌఢి జీ
కాకై యుత్తరభారతక్షితి లయంబందెన్ వెసన్ గాంగ్రె, సా
రేకల్ దక్షిణభారతక్షితిని వక్రించెన్ గడున్ దూరమై.

(శతావధాన ప్రబంధము. ప్ర ఖం.)

పరిమిత కుటుంబము మేలు :

సీ. చెఱకువింటి వజీరు కఱకుగత్తి యనంగ
దరుణభావ నఖంపచ రుచిరాంగ
మంగళరూప సంపన్మనోహరమూర్తి
దన కీడుజోడైన ధవుని జెంది
తద్భుజక్రోడ సితాంతపరిక్షుణ్ణ
యై గులగులయై సుఖానుభూతి
ఫల మాత్మసారసర్వ మపత్యమున్ గను
దత్సంఖ్య మితిమీఱ దల్లడిల్లు

సుంత విభునొద్ద నిదురింప జూడ గదల
నీదు కదచంటి యెదచంటి యేడ్పు వెక్క
పరిమితకుటుంబయౌ కృశోదరి యొకర్తు
మాఱగొను నిర్విరోధ సంసారసుఖము (శతావధానప్రబంధము ప్ర.ఖం )

శాస్త్రీయ పద్యములు

నిర్గుణబ్రహ్మము: ఉత్పలము:

లోకములన్ సృజించుచును లొంగడు సృష్టికి నేరిచేతికిన్
లోకములన్ హరించుచును లొంగడు చావున కేరిచేతికిన్
లోకము, లోకి, లోకగుడు, లోకవిలక్షణమైనవాడు, సు
శ్లోకుడు నయ్యె బ్రహ్మ మిల జూడగలారికి నిర్గుణుండగున్.

(బందరు శతావధానము.)

అద్వైతము: ఉపజాతి:

మృషా ప్రపంచ స్స్వయమేవ చాత్మా
సమస్తవస్తుష్వపి చాత్మనైక్యమ్
వదంతి యచ్ఛంకరపాదగుప్తా
స్సమగ్ర మద్వైత మిదం యతీంద్రాః. (శతావధాన సారము.)

ద్వైతమతము: మత్తకోకిల:

జీవుడున్ మరియాత్మయున్ వెసజేరుటన్న పులక్కి యా
దేవుడుండెడి చోటికిన్ దమ దేహమే చను దివ్యమై
యీ వసుంధర యెల్ల నిత్య మనేక జీవన లీ
త్రోవ ద్వైతమతమ్మనం గల త్రోవ పండిత మాన్యమున్.
(శతావధాన సారము.)

విశిష్టాద్వైత సిద్ధాంతః మందాక్రాంతా:

భక్తిర్ముఖ్యా నిగమవిహితే కర్మజాలే నిరాస్థా
సర్వత్ర శ్రీహరిపదసరోజాతబద్ధా ప్రపత్తిః
స్వప్న స్సత్య స్సగుణవిషయా బుద్ధి రర్చా సమగ్రా
లోకే రామానుజ మిదం సర్వత స్సుప్రసిద్ధమ్. (శతావధాన సారము)

సృష్టికి పూర్వ మేమున్నది?

అద్వైతపరముగ నుత్పలమాల:

సున్నయె నుండె నాది నని శూన్యమటంచును వేదరాశిలో
నున్నదిగాన జూడనిక నొంకును లేదనవచ్చు సృష్టికిన్.
ము, న్నది నిర్గుణమ్ము గుణపూర్వము పూజ్యము సత్తసత్తసం
భిన్న మటంచు, నంతయును వేదమునంగన గోచరంబగున్.
(బందరు శతావధానము.)

ఇందిరాగాంధి జాతక ప్రభావము: శార్దూలవిక్రీడితము:

జన్మించెం గటకాఖ్యలగ్నమున భాస్వద్భాగ్యరాశిన్ ధరా
జన్మం దారయ నేత్రభాగవతుడై శాసించె భూచక్ర మె
ల్ల న్మాద్యద్గతి నిందిరాసుదతి లీలన్ దద్విభుత్వంబునన్
సన్మానంబును బొందకున్నె ప్రజయుచ్చైస్సౌఖ్య పర్యాప్తిగా.

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

గురుగ్రహ ప్రభావము: శార్దూలవిక్రీడితము:

చూచెన్ భార్గవు జీవుడన్న ఘటియించున్ సత్కృతిన్ దద్గృహ
వ్యాచిక్రంస వహించెనన్న మతియున్ భద్రప్రదుండౌ రమా
రోచిష్ణుండగు విష్ణువున్ గురువుగా రూపింతు రౌటన్ శుభ
ప్రాచుర్యంబది నీవ కూర్తువు కృపావాసా! వృషాద్రిప్రభూ!

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

పై రెండు పద్యములు జ్యోతిశ్శాస్త్రవిషయగంధులు

నాసికావర్ణనము: సీసము:

సీ. నాసిక దీర్ఘమై భాసిల్లుచుండిన
మగువ తాగోరిన మగని బొందు
నాసిక వ్రట్టుపై భాసిల్లుచుండిన
సతి యాధికారికప్రతిభ గొఱలు,
నాసిక శుకరీతి భాసిల్లుచుండిన
భామిని సుఖలీల బరిఢవిల్లు,
నాసిక చప్పిడై భాసిల్లుచుండిన
వికటస్వభావయై సకియ పొగులు,

ప్రాగుపార్జితపుణ్యసౌభాగ్యయైన
లేమ నాసిక గంధఫలి వలె వెలయు,
నని చికిత్సదీర్చికొనిన యంతమాత్ర
జక్కదనమబ్బునేమొ, ప్రశస్తిరాదు. (శతావధాన ప్రబంధము ద్వి. ఖం.)

ముక్కు చక్కగా నుండిన మేలు కలుగునని సాముద్రిక శాస్త్రము. ప్లాస్టిక్ సర్జరి వలన ముక్కు చక్కజేసికొన్నచో అందము రావచ్చు గాని, అదృష్టము కలిసిరాదు

పద్మినీజాతి స్త్రీ :

కం. తెలుపగు చీరలు కట్టున్
సలుపున్ బతిభక్తి మిగుల సద్గుణ గరిమన్
బొలుచున్ స్త్రీజనమునకున్
దిలకంబై యొందు బద్మినీభామ భువిన్. (శతావధాన సారము)

ఉపరతి:

కం. ఘనవితతి చంద్రు గప్పెను
గనకలతన్ బూలు పూసె గనకకనత్కుం
ద నవసుమం బదరె నళియు
గనకము దరి జేరె గాంత కాంతుని గవయన్. (శతావధాన సారము.)
ఇవి కామశాస్త్ర సంబంధి విషయములు.

నృపవర్ణనము:

కం. కొందఱు పచాద్యజంతం
బందురు మఱికొంద ఱర్మ ఆద్యంతంబే
యందురు మే ముభయంబని
యందుము నీ నామధేయ మానందనృపా ! (నానారాజ సందర్శనము)
ఇది శబ్ద శాస్త్ర సంబంధి విషయము

పకోడి:

ఉత్సాహవృత్తము:
సెనగపిండి ఉల్లిపాయ చిన్నిమిర్పకాయలున్
జొనిపి యందు నల్లమింత చొనిపి ముద్ద చేసియున్
అనలతప్తమైన నేతియందు వైచి వేచినన్
౦ను బకోడి యనెడి పేర జక్కనైన ఖాద్యమై. (శతావధాన సారము )
ఇవి పాకశాస్త్ర సంబంధి విషయము.

మంత్రతంత్ర సంబంధి విషయములును పృచ్ఛకు లడుగుదురు. పరిచితి కలవారు చెప్పుదురు. లేనివారు శుద్ధముగా అవి మాకెట్లు తెలియునని నిరాకరింతురు. కొందఱు జాణలు అయోమయపు టల్లికతో జెప్పి తప్పించుకొందురు.

## ఆ శీ ర్వా ద ప ద్య ము లు

శివకేశవులు. అచ్చతెనుగు. సీసము.

తాల్చె నెవ్వాడు కెందమ్మి దండంబలె
నెదుఱొమ్ముపై సిరులిచ్చు చాన,
మ్రింగె నెవ్వాడు నేరెడిపండు చందాన
కడలిలో బుట్టిన కాఱువిసము,
పూనె నెవ్వడు వెన్నముద్ద కుద్దిగ గేల
దెల్ల సంచుల నించు నల్లసంకు,
అనె నెవ్వడు మల్లె యలరుగుత్తుల పేరు
పోల్కిగా మెడనిండ బున్కదండ,

వే వెలుంగుల దొరయును రే వెలుంగు
నెవని కన్నులు నిప్పుగన్నెవని కెక్కు
డట్టి మున్నీటి యల్లుడు నట్టి మంచు
గొండ యల్లుడు మీకు గోర్కుల నొసంగు. (శతావధాన సారము)

వధూవరులకు వేంకటేశ్వరుని యాశీర్వాదము:

ఉ. కోరిన కోరికల్ జనులకున్ గడుదీక్ష నొసంగి వారిచే
సారతరార్థమున్ గొను విశారదు డీశుడు వేంకటేశు డి
చ్చారతి నీవధూవరుల సంపద లిచ్చి, చిరాయువిచ్చి, యా
పూరితసౌఖ్యమిచ్చి సతమున్ దయ చిప్పిల బ్రోచు గావుతన్.
(అవధాన సారము.)

విద్యార్థులకు నాశీర్వాదము: పంచచామరము:

పరీక్ష కేగు నోకళార్థి బాలులార! కూర్మి మీ
గురుల్ రచించు దీవెనల్ తగుం గదా విశిష్టముల్
మతేల మాదృశ ప్రయుక్త మంగళోక్తి, ధీధురం
ధరత్వమున్ జిరాయు రూర్జితత్వ మంది యొప్పుడీ !

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

ఆంజనేయుడు:

ఉ. ఎవ్వని నమ్మి దేశముల కెంతయుబోయి జయంబు గంటిమో
యెవ్వని నమ్మి యీ సభ నహీనధృతిన్ జరిగించు చుంటిమో
యెవ్వని నమ్మి యేమిట నొకింతయు సందియ మందకుంటిమో
యవ్వరకీర్తిశాలి పవనాత్మజు డేలుత, మిమ్ము మమ్మునున్!

(కొప్పరపు సోదరకవులు.)

## సంకీర్ణ పద్యములు

మిత్రుడు:

కం. ప్రతిఫల మపేక్ష సేయక
ప్రతికార్యమ్మునకు దోడుపడు గష్టసుఖా
న్వితు గాంచి తాదృశుండగు
హితునకు దుల్యుండు గలడె యెందు వెదకినన్. (శతావధాన సారము.)

సత్యము :

చం. తప మొకదేల? పెక్కులగు దానములేల? యనేకతీర్థముల్
నెపమున బోయి క్రుంకిడగ నేల? యనేకపురాణజాలముల్
చపలత జూడనేల? బహుశాస్త్రములన్ బఠియింప నేల? స
త్యపు పెల గుర్తెటింగొన మహాత్ములకూరక యేల, జన్మముల్?

(శతావధాన సారము.)

వృక్షజాతి ప్రజాసేవ :

మ. తమ జీవించెడి స్వల్పకాలమున నృత్యంబాడుచున్ దిగ్దిగం
తములన్ సౌరభపూరముల్ జిలుకు నేత్రప్రీతి సంధించు బు
ష్పములున్ గాయలు పండ్లు కట్టె లొసగున్ బ్రాణాత్యయంబంది స్వా
ర్థము లోకార్థ మొసంగి కన్మొగుచు నౌరా, వృక్షజాతుల్ ధరన్!
(శతావధాన ప్రబంధము ప్ర. ఖం.)

విద్య :

కం. పరమానందప్రాప్తియు
ఖరదుఃఖ నివృత్తియున్ నెగడ జేసెడి సుం
దరవిద్య విద్య యనబడు,
బెఱ విద్యలు లౌకికంపు భృతియిడు విద్యల్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

పునర్జన్మ మాన్పుకొనుట కుపాయము :

సీ. యోగ్యతగా గాల మొక్కరీతిని బుచ్చి
సంసార మొకభంగి సాగజేసి
యనివార్యగతి గర్మజనితమ్ములై వచ్చు
కష్టసుఖమ్ముల కలిమి గనియు
బద్మపత్రము నీట బరిధవిల్లెడి రీతి
సకలకార్యమ్ముల జక్కజేసి
తన మన మెవ్వేళ దత్త్వమసీతి వా
క్యార్థమ్మునందు దా నతుకజేసి

యెవడు చరియించు నాత దహీను డతడె
యోగి యవ్వాని కిహమున నొక్కడేసి
లేదు కష్టమ్ము సంతతామోదు డతడె
వానికి బునర్జనియు లేదు వాస్తవ మిది. (శతావధాన సారము.)

అన్నదాన ప్రశంస :

శా. దానమ్ముల్ వివిధమ్ములుండినను సద్దానమ్ము [illegible] నా
త్మానందం బొనగూర్పజాలునది యన్నార్థులకున్ [illegible]
తేనిం దెచ్చి యొసంగినన్ మనము తృప్తింజెందగాబోము. దే
రేనిం దృప్తిని గాంతు రన్నమున నే కిద్దాని శ్లాఘ పరో:

(శతావధాన సారము)

త్రిమతములు: కందము :

ద్వైతము లబ్ధసుఖద మ
ద్వైతము తస్కర సుఖప్రదంబు, విశిష్టా
ద్వైతము యాత్రిక సుఖదము
భూతలమున మొత్తమునకు మూడున్ మెఱుగే (ఒంగోలు శతావధానము.)

ద్వైతమతము లబ్ధులకు అద్వైత మతము తస్కరులకు విశిష్టాద్వైత మతము యాత్రికులకు సుఖప్రదమని చెప్పి నవ్వించుచునే తత్త్వావబోధము గావించుట యిందవధాని చూపిన చమత్కారము

అవధాని యభిమాన కవి :

ఉ. ఒక్కడు శబ్దమాధురికి నొక్కరు దర్థగభీరతాప్తికిన్
జొక్కెడు, జిత్రబంధముల చొప్పునకున్ దలయూచు నొక్కడే
చక్కి రసోదయంబగునొ సంస్కృతి చిత్తులు సూరివర్యు లా
చక్కి రమింత్రు, నా మది యెసంగు గవిత్వయసక్త వృత్తియై

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

స్వార్థపరత :

చ. సుకృతము దుష్కృతంబనుచు జూడగ నీదిసుమంతయేని యె
ట్టి కృతులు సేయుటందును గడింది మగంటిమి జూపుచుండు నిం
దకు జడియంగనీయదు సదా ధనతత్పరతా పిశాచి దీ
నికి గల దుర్గుణంబులు గణింపగరావు బహూదస్తు లేటికిన్.

(శతావధాన సారము)

ముసలి యెద్దును గటికివాని కమ్ముట:

సీ. అవసరంబగునప్డు వ్యవసాయ మొనరింప
నటితి కాయలు కాయునట్లు దున్ని,
వీపుపై నింతింత పెద్దకాయలు కాయ
మోటైన గోనెలు మోసి మోసి,
బాడిగెక్కు వటంచు బదిమంది నెక్కించి
పరువు లెత్తింపగా బండి లాగి
తోట లోపల బెట్ల తోపుల బాదుల
ముంచునట్లుగ నీళ్ళ మోట లాగి,
కాలవశమున బనిసేయ జాలకున్న
ముసలి యెద్దును గటకటా! మోటురైతు
కటికి వానికి నొకని కక్కటిక లేక
విక్రయించెను దుష్టనీతిక్రముండు. (శతావధాన సారము.)

సోమరితనము :

ఆ.వె. చదువు మట్టుపడును సంస్కృతి చెడిపోవు
సంపదలు తొలంగు సౌఖ్య ముడుగు
గౌరవంబు వోవు గావున సోమరి
తనము కన్న హీనదశయు గలదె? (శతావధాన సారము.)

దురభ్యాసములు పనికి రావు:

సీ. లండనుదేశంబునుండి తెప్పించిన
బ్రాంది బ్రాదావెడు మహానందులార!
పొడుము పీల్చుట కన్న పొగచుట్ట త్రావు టే
ధర్మం బటనెడు నుదారులార!
పొగను ద్రావుట కన్న పొడుము పీల్చుట మేలు
నాగ బల్కెడు మహాభోగులార!
కలిమి హెచ్చించు త్రికాసిల్పు సిగరెట్లు
కాల్చుచుండెడు నోయఖండులార!

గంజ ద్రాగగ నెంచు నోగుంజలార !
తగ బొగాకును నమలెడు ధన్యులార !
నా మతంబున నివి వ్యసనంబు లప్పుడు
తగవు తగవయ్య ! మీకివి తగవు తగవు. (అవధాన భారతి.)

మఱపుగల శిష్యుని గూర్చి గురువుగారి మెచ్చు:

శా. ఔరా! శిష్యుడ! యెంత చేసితివి? విద్యస్నీకు సద్దానా
ధారంబై తగునంచు జెప్పితిని, నీ ధన్యత్వ మేమందు, నా
కీరీతిన్ గురుదక్షిణార్థమయి నీ వేనాటి దా నాటనే
ధారాదత్త మొనర్చితే యని యుపాధ్యాయుండు మెచ్చో యనన్.
(బందరు శతావధానము.)

యౌవనావస్థ:

చం. సుకృతపుబుద్ధి మూలబడు సుందరియే సుఖమంచు దోచు దు
ష్ట కృతులె యాగమమ్ములగు జారులే నయబోధకమ్ములౌ
నకటకటా! యొకానొకని కగ్గలమైతగు జవ్వనంబునం
దొకటికి బుద్ధి మార్పడకయుండు బురాకృత పుణ్యసంపదన్.
(శతావధాన సారము.)

జరావస్థ:

ఉ. చూచినయంతమాత్రమున సుందరులెల్ల హసింత్రు పిల్లలున్
గోచిని బట్టి లాగుదురు కొందరు 'తాత' యటంచు గేరి దో
బూచుల నాడ బూనుదురుపో! జర మూడిన మీద నక్కటా!
యేచవి గానుపింపదు మఱెయ్యదియున్ సుఖమీయదేరికిన్.
(శతావధాన సారము.)

పోలీసు జవాను :

కం. యమదూత లెట్టిరో యెఱు
గ మనెడి లోపమ్ము దీర్పగా పోలీస్వా
రి మహి ప్రభువు లేర్పఱచిరి
కుమతులకే వారు పీరు గూర్తురు బాధల్. (శతావధాన సారము)

అనుమానముగల ముదుసలిమగడు భార్యతో నెట్లు కాపురము సేయునో

సీసపద్యము :

తన యింట నెంత తీఱని చుట్ట మున్నను
        వెలది బాయక వెంటవెంట నడచు,
పసపు కుంకుమ మంచి వస్త్రముల్ దాల్చిన
        మెఱుగులా? యని నెత్తిమీద బొడుచు,
పొరుగింటి చెలి పనిబూని మాటాడిన
        పెనుశంకచే నాల్క పీకికొనును,
నొకవేళ దలవాకిటికి నొకించుక రాగ
        నెవని కోస మటంచు నీసడించు.

జెంబు గొనిపోవ బైకాపు చెలిని బంపు
నమ్మగారింట కైనను నంప వెఱచు
గులుకు బెళుకుల చెలి గట్టుకొనిన స్పర్ధ
భర్త జీవిత మది విషప్రాయ మయ్యె. (అవధాన సారము.)

గర్వము గలవాడు గాడిద. మత్తకోకిల :

మానవుం డెవడేనియుం దనమానసమ్మున గర్వమున్
బూనినన్ దనకెంత తెల్వియు బొల్పు గొల్పును గల్గినన్
గాని, వానిని గాడ్దె యంచనగావలెన్ మది గొంకకే
వానికైనను గర్వమన్నది వంచనన్ ఘటియింపదే. (శతావధాన సారము.)

ఇంగ్లీషు - తెలుగు భాషలు :

చం. పలుకుల పొందు వాక్యముల పద్ధతి కాదని సుంత వేఱుగన్
బలికిన వ్రాసినన్ జనులు పక్కున నవ్వుదు రింగిలీషునన్
దెలుగున నేమిజేసిను దిట్టరు నవ్వరు, దేశ భాషకున్
విలువ దొలంగె, గక్కుఱితి విద్యల యేపు జెలంగె భారతీ!

(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం)

బైసికిల్ :

శా. నీకుం గోరదు గడ్డి నడ్గ దొకకాన్నే నుల్వాలన్ వేడ దే
వారే నెక్కిన గ్రిందదోయ దొకడున్ బజ్జన్ ఛటుండుంటి చే
కూరంగా వల చెందు బైస్కిలుకున్ గోపం బొకింతేని లే
దౌరా! వాజికి సాటియైన యిది విశ్వామిత్ర సృష్టంబొకో!

(శతావధాన సారము)

వరశుల్క ప్రహసనము :

ఉ. ఖాయము గాదు పెండ్లియిది కట్నపు గాసులు ముట్టలేదు రా
రాయని రెట్టబట్టికొని ప్రక్కకులాగెడు దండ్రి, పీటపై
దీయని గాటపున్ వలపు దేనియ జొక్కెడు నవ్వరుండు ల
జ్జాయతి దెల్లబోవు వధు వయ్యెడ నేమని చెప్పనయ్యెడున్.

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

అత్తకోడండ్ర పోట్లాట :

సీ. పాచిపెంటను ద్రోసి బాగుచేసిన నేల
పాడుచేసి తిదేమి పాపమమ్మ,
నా పాడు కాదువో నీ పాడె యిది నీదు
తాత సొమ్మా యేమి ధర్మమమ్మ,
ఆ కొంపయేమి నీ యబ్బ కట్టించెనా?
నా సొమ్ము కాదటే నంగనాచి
నా కొంపయో లేక నీ కొంపయో రేపు
కలుగు నీ పాట్లు కుక్కల కటంచు
ఒకట దప్పులె యుండిన నుండకున్న
గోకి పోరాడు నత్తయు గోడలున్న
కాపురంబెట్లు కుదురు గాగలదు? గాన
నాడువాండ్రకు విద్యె యత్యవసరంబు. (బందరు శతావధానము.)

'నా పాడు కాదు, నీ పాడె' యనుటలో పాడు + ఏ = పాడే అనియేకాక, పాడె = శవవాహనము అనెడి యర్థాంతరస్ఫూర్తియు నేర్పడి రంధికి దారితీయు చున్నది.

గజ్జి :

సీ. తనుదాన వలచి వచ్చిన కామినింబోలె
నాలింగనప్రౌఢి నలరియుండు,
కట్యధోదేశ సంకటకారియై రహః
కలనావిశేష సంకలన బెరయు,
గడచి రాగను నఖక్షత మాచరింపగ
గించి దుత్కంపాభికీర్ణమగును,
నౌషసకాల సోన్మేష పరిస్ఫూర్తి
బొంపిరివోవగ బొటమరించు,

సమయమందున గని పెట్టి సలుపు జేసి
తీపు దీయుచునుండు దానేపుమీఱి
రసికురాలగు భార్య యారజము మీఱి
గజ్జి వంకాయ బజ్జికి గాళ్ల గజ్జి. (అవధాన భారతి)

న్యాయవాదులు :

సీ. గెలియనట్టిదియైన గెల్చు నటంచును
లా జూచి కల్పనలను ఘటించి
తప్పుచెప్పు మటన్న దప్పుచెప్పని వారి
నోటి కబద్ధాలు నూఱిపోసి
జెడ్జిగారికి నేను జెప్పుమాటలు పథ్య
ములు సుమీయని వాని మోసపుచ్చి
రేపు ఫీజిచ్చెద మాపిచ్చెద నటన్న
గాదు తెమ్మని ముందుగానె కొనియు

వ్యాజ్య మొకవేళ బోయిన వాని సాక్షి
మీద నెపమిడి, గెల్చిన మీద బెట్టి
కొని నటింతురు ప్లీడరుల్ కొంద ఱిలను
న్యాయవాదుల మంచు నన్యాయలీల. (శతావధాన సారము.)

వేశ్యలు :

సీ. రంగుమీఱెడు గాగరాలచే బూలచే
లేని సింగారమ్ము మేననూను
మీసాలపై దేనెతో సమానంబైన
మాటలచే జారు మనము ద్రొబ్బు
సంసారమున జ్ఞాని సంచరించెడు రీతి
జారులతోడ దా సంచరించు
జనులందఱును గూడ జారపురుషులైన
లోకోపకృతియందు లోననెంచు

జారు ధనమెల్ల ద్రొబ్బి ఫకీరు జేసి
మరల వాడరుదేర నమ్మ నుసికొల్పి
తాను గనుపట్టకయె వాని బో నడంచు
జెప్ప తలనొప్పి వేశ్యల చెడుగుణములు (శతావధాన సారము.)

ఏరోప్లేన్ :

శా. సారాభ్రాధ్వము నిర్గమించి ఝషపుచ్ఛశ్రీచ్ఛటాచ్ఛాయ లెం
తో రమ్యంబుగ దోప జూపఱకు దద్ద్యోవాహినీతీర డిం
డీరవ్రాతము ప్రస్థలద్గతి సముద్దీనాంశుపై వచ్చె నా
నేరోప్లేన్ చనుచుండె దాని విభవం బెవ్వాడు వర్ణించెడున్.
(శతావధాన ప్రబంధము-ప్ర ౩౦ )

వాయువిమానము. (బెలూన్) :

శా. ఆకాశంబునయందు బాఱునొక దివ్యాబ్జంబొ, భూమింగనన్
వీకన్ టెక్కలు దాల్చి వేగగతిమై వీతెంచు నాశ్చర్యమో
నాకంబో గ్రహరాజమో యెఱుంగ బెన్నక్షత్రమో పక్షిరాట్
లోకంబో యనగా బెలూనొకటి తా దోతెంచె గంటే సఖా!

(అవధాన భారతి)

మోటారు కారు. కవిరాజవిరాజితవృత్తము :

కలభము చక్కగ గాళులు సాచును గాననసీమ శయించు గతిన్
శలభము దివ్వెల జ్వాలల గాంచుచు సవ్వడిమై వడి బాఱు క్రియన్
గలభషణంబులనున్ ఘనకంబు లొనర్చెడు రీతిగా గాన నగున్
నిలిచిన బాఱిన గూసిన నెంతయు నీటగు మోటరుకారు భువిన్.

(అవధాన భారతి.)

మఱమనుష్యుడు కవిత చెప్పుట :

ఉ. నూతన యంత్రముల్ మఱమనుష్యుల నేడు బహుప్రకార సం
ఖ్యాత విలక్షణక్రియలయందు సమర్థత గాంచి మించెడున్
రీతు లలంకృతుల్ ధ్వనులు వృత్తివిశేషము లొప్ప జొక్కపుం
గైత రచించి పెట్టునొ యఖండ రసోపహితమ్ముగా నికన్.

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖం.)

అగ్గిపెట్టె :

కం. ప్రతిదినము నగ్గి కంచున్
సతి ప్రతిగేహంబు దిరుగ జను పని తప్పెన్
మతిమంతు లగ్గిపెట్టెను
గతిగా గల్పించుటన్ సుఖం బలరారెన్. (శతావధాన సారము.)

నస్యము :

సీ. పడిసెమ్ము పట్టినప్పటివేళ నీటిని
హరియింప నెద్ది దివ్యౌషధంబు
హరికథల్ వినువేళ నరుదెంచు నిద్రయన్
వ్యాధికై యెద్ది తుపాకి దెబ్బ
మఱచిపోయినయట్టి మాట తెల్పుటకునై
యెయ్యది దేవీనిభృతవరంబు
రాజరాజులనైన రమణ యాచన సేయ
జేయగా నెద్ది జేజేల చెట్టు

గట్టి లంకాకు కమ్మగా గాచి నూతి
సుధయు హయ్యంగవీనంబు జొనిపి పొగపు
పెట్టి బొబ్బిలికాయలో వేసినట్టి
పొడుము బీల్చని వార లేపుడమి గలరె? (శతావధాన సారము.)

రాత్రివేళ నడవిలో దిరుగు శార్దూలము. స్రగ్ధరావృత్తము:
క్రూరత్వంబెల్ల దోపం గుటిలముఖమునన్ ఘోరదంష్ట్రాకరాళ
స్ఫారక్ష్వేళాప్రధృష్య ప్రసరవిహృతి సంభారగాంభీర్యమై కాం
తారక్షోణిన్ నిశిన్ దుర్దమగతి దిరుగున్ బ్రౌఢశార్దూలరేఖా
శ్రీ రాజిల్లున్ దటిద్రంజితగతి మృగరాజిక్షుధాహేతువృత్తిన్.
(శతావధాన ప్రబంధము. ప్ర. ఖం.)

తేలు:
కం. తన సహజగుణము కతనన్
బనిగొని యెద్దానినేని పడగుట్టెడి తే
లునకున్ ఖలునకు భేదము
గనగొనిన నొకింతయేని గనుపడదు నృపా! (శతావధాన సారము.)

నల్లి:
కం ఉల్లాస మెంత కల్గిన
నల్లి! నీవున్న యెడల నరునకు నిద్రా
భ్యుల్లసనంబది సున్నయె
తల్లి గలుగు వేశ్య దగులు తరుణు సుఖగతిన్.
(శతావధాన సారము.)

కోతిచేష్టలు :
చెట్లమీదకు నెక్కి చిటిపొటి గంతులు
వైచుచు ఫలముల పాడుసేయు
వెక్కిరించుచునున్న తిక్కకుఱ్ఱల జూచి
పండ్లిగిలించి కోపమ్ము జూపు

నెవ్వడయిన దన్ను నొవ్వగా గొట్టిన
జివ్వన గోరుల చేత బరుకు
నిండ్లమీదకు నెక్కి యెగిరి గంతులు వైచి
పెంకులెల్లను ద్రోగు పెట్టునొకట
కోతిచేష్టలు మఱియును గొన్నియికను
గలవు వానిని జెప్పంగ గ్రంథ మొకటి
గావలయు గాన విరమింతు గాంక్షతోడ
వీనిని గ్రహించి సంతోష విధిని మనుము. (శతావధాన సారము.)

ధనుర్మాసమున వైష్ణవ కలకలము :

సీ. ప్రొద్దు ప్రొద్దున లేచి పోయెరా పోయెరా
యని వీధులంబడి యరుగువారు
తెల్లవాఱకమున్నె చెల్లెరా చెల్లెరా
యని దేవళంబున కరుగువారు
అరుణోదయముననే యయిపోయె నయిపోయె
నని గుండియలు కొట్టుకొనెడివారు
ప్రత్యూష మాయెరా ప్రత్యూష మాయెరా
యని కేకవేయుచు జనెడివారు
విచ్చుకత్తుల రీతిగా బెచ్చుపెరిగి
వాసి మీఱిన యా ధనుర్మాసమందు
అట్లు పులిహోర మొదలగునట్టి తిండ్లు
తినుట కిరీతి వైష్ణవుల్ తిరుగుచుండ్రు (పిశుపాటివారు)

అరటిచెట్టు :

సీ. కాయలు కూరకే కాక పండ్లకు నుప
యోగించు, నాకులు నొక్క భోజ
నమునకెయౌ, దొప్పలు మఱి యయ్యవి లేని
యప్పుడు విస్తరులయ్యు నుపచ

రించు, దూటయు నావనించి పచ్చడి చేసి
కొనసౌను, దుంపయు గొన్ని యౌష
ధములకు ననుపాన క్రమమున నుపయోగ
దశచెందు గాన గదళి కెనయగు

తరువు గేస్తున కికలేదు, ధరణి నిదియు
దియ్యనీటి కూపమ్ము, గేదెయును గాదె
గలుగు గేస్తులయింటి కెక్కాలమందు
బందుగులు వచ్చినను గౌరవమ్ము జరగు. (శతావధాన సారము.)

పచ్చిమిరపకాయ :

సీ. ఎద్దాని సంబంధ మేలమి గల్గిన మాత్ర
గూర లెల్లను మంచి గుణము గనునొ
కొత్తిమిరిని నూరుకొని తిన్న నెయ్యది
కంటె దన్నము తిరుగలుగ జేయు
నెద్దాని శిశుజాల మెఱుగక చేపట్టి
కనులు నల్పగ మంట గలుగ జేయు
నెద్ది తా గ్రమముగా నెదిగి పండిన మీద
బోటి కెమ్మోవితో సాటియగునొ

నూటి దేనిని బుల్లనై మీఱు మెంతి
పెరుగులో గూర్ప స్వర్గమః నెఱుగజేయు
నరుల కెల్లను, నా పచ్చి మిరపకాయ
మహితభక్తిని నేను నమస్కరింతు. (శతావధాన సారము )

గోగుగూర పచ్చడి :

సీ. ఇది మహాలేహ్యమం చెదలోన భావించి
చక్కగా హూణులు మెక్కుచుండ
ఇది ప్రాణపనమంచు నెదలోన భావించి
భారతీయులు భద్రపఱచుచుండ

ఇది మహానిధియంచు నెదలోన భావించి
యన్యదేశస్థు లల్లాడుచుండ
ఇది వర్ణనీయమం చెదలోన భావించి
కవులు వర్ణన సేయ గడగుచుండ
అన్ని వ్యంజనములలోన వన్నెకెక్కి
కుండలో మాగియుండిన గోగుకూర
పచ్చడి వెలింగెడిని నొకపటిని దాని
దినిన నాతని సౌఖ్యంబు దేవుడెఱుగు (పిఠాపాటివారు.)

అవధానమును జూడవచ్చిన యిద్దరు మోటువాంధ్ర సంభాషణము:

సీ. అగుదాన మంట రోరబ్బరో యిద్దరు
సినబాపనయ్యలు సేస్తరంట
అగుదాన మన సుద్దులా? యేంటిరా? సెప్పు
వాకింక బలకొట్టువార లెవరు?
అది కా దసీ' యెవ్వ రడిగినగాని క
విత్తంబు సెప్పి మెప్పింతురంట
కాటేరి కతకాడ కైతగాండ్లందరు
సిల్లిగవ్వకు నైన సెల్లిరారు
ఏమి లేకుండినను బెద్దలెల్ల యిట్లు
కనుగొనగ వత్తురా' యైన మనము గూడ
తాళి సూస్త మటంచవధాన సభకు
పామరులు మాట లాడుచు వచ్చుచుంద్రు. (అవధాన సారము)

రసజ్ఞులు లేని సభలో నవధానము చేయు కవిహృదయము:

ఉ. ఎన్ని విధంబులన్ గళల నెల్ల రసార్ద్రిత రంగరించినన్
మన్నన జూపనేరని యమాయికు చిత్తము నొత్తిగింప నే
తెన్నగునోయటంచును మతించెడి కోమలివోలె ప్రాతిభ
క్లిన్నసభం గనుంగొని చలించు జుమీ కవి యాత్మలోపలన్.
(పెండ్లిపందిరి: శ్రీ అవధానము చంద్రశేఖరశర్మగారు)

అవధాన ప్రశస్తి:

మ. చివురుంజొంపము పూవుపిందెపసనుం బొల్పొందెపి చిత్తోత్కృష్టప
చ్ఛ విమన్మంగళవృత్తముల్ వెలయగా సాహిత్యలోకమ్మునం
దవధానామర భూరుహం బెసగు సర్వార్థప్రదంబౌచు సూ
రి వరుల్ తిర్పతి వేంకటేశ్వర కవుల్ సృష్టింప లీలాగతిన్.
(శతావధాన ప్రబంధము ప.౫౦.)

ఇవి అష్టావధాన శతావధాన సభలందు ప్రశ్నలకు సమాధానముగా నవధానులు వ్రాక్రుచ్చిన వివిధ విషయముగల పద్యగుచ్ఛములు.

అవధాని సర్వజ్ఞుడా?

ఉపనిషద్రహస్యము లడిగినచో దత్పరిచితి కలవాడు చెప్పగలడు. పురాణ కథాసందర్భము లడిగినచో నందరు నన్నియు దెలిసియుండరు. షోడశ శ్రాద్ధ కర్మవిశేషము సీసమున వివరింపుమని కోరినచో పురోహితవృత్తి కల యవధాని యైనచో ఆ పని చేయగలడు. కానివాడు నాకు దెలియ దనును. తెలియదని ప్రశ్నమును దిరస్కరింపడు. తనకు తెలియదని శుద్ధముగా ఛందఃఫణితితో జెప్పును. అదియే దానికి సమాధానము.

శ్రీ వెంకటరామకృష్ణకవులు రాజసందర్శనము చేసి-

'చాల బరిశ్రమంబొకట సల్పిన వారము శాస్త్రపద్ధతిన్ ...
మూలము ముట్టగా గవనమున్గని యారసినారము ..'

అనియు-

'లాతుల రీతి మమ్మను దలంచుట న్యాయము గాదు, మాదు వి
ద్యాతిశయమ్ము మాసుకవితారసబోధుకు జూపి లోక వి
ఖ్యాతి వహింప వచ్చితిమి ...'

అనియు స్వోత్కర్షము జాటుకొన్నవారు. అవధాన సభలో 'జీవేశ్వర సంబంధము' గురించి ప్రశ్నింపగా వీరు చెప్పిన పద్యమిది-

కం. జీవేశ్వర సంబంధము
భావింపగ దర్కశాస్త్రపండితులకు వి
ద్యావైశద్యము కతమున
దీవిన్ దెలియంగ వచ్చెడిన్ భూపాలా!

అనగా ఈ ప్రశ్నమునకు సమాధానము తార్కికులు చెప్పవలసినదే, మా చేత గాదని యర్థము.

మఱొకచో విశ్వేశ్వరు గర్భగుడి వర్ణింపగోరగా-

కం. పోలగ విశ్వేశ్వరు గ
ర్భాలయమును మున్ను చూచి వచ్చినవారల్
లీలన్ వర్ణింపంగా
జాలుదు రద్దాని జెప్ప శక్యం బగునే?

అని చెప్పిరి. అంతే సమాధానము.

పోనిండు. 1. తర్కశాస్త్రము చదువ లేదు. 2. విశ్వేశ్వరస్వామి గర్భ గుడి చూడలేదు. 'వీణా స్వరూప' మభివర్ణింప గోరగా సమాధాన మెట్లు చెప్పిరో చూడుడు:

కం. వీణా స్వరూప మెన్నగ
వీణా గానంబు బొగడ వేడుకతోడన్
వైణికుల నభినుతింపగ
వాణియె యసమానురాలు వసుధాధీశా!

అడిగినది వీణాస్వరూప వర్ణనము. చెప్పినది-వీణాస్వరూపమును, వీణా గానమును, వైణికులను ఎన్నుటకు, బొగడుటకు, అభినుతించుటకు వాణీదేవి దిగి రావలె- అని. అవధానము పూర్తియైనది.

వీణాస్వరూపము నిజముగా వారికి దెలియదా?
వేమన పద్యాలలో ఒక ప్రహేళిక కనబడును

ఆ. వె. కాయమీద ప్రాను ఘనముగా నుండును
ప్రానుమీద దీగ మలయుచుండు
దీగ మీద ప్రేళ్ళు త్రిపురతాండవ మాడు
విశ్వదాభిరామ వినుర వేమ

ఇది వీణాస్వరూప వర్ణనము. బహిరంగము.

శ్రీ విశ్వనాథ సత్యనారాయగారు వీణను గురించి వ్రాసిన పంక్తులు- 'ఇది హృదయము. ఇది నాభి ఈ సప్తతంత్రులు సప్తధాతువులు. ఇవి యిరువది నాల్గు మెట్లు. ఇవియే చతుర్వింశతి ధాతువులు వీని నన్నింటి నంటిపెట్టుకొని జీవుడున్నాడు. దేహికి బాపభావ మెట్లో వీణాస్వనములో నపశ్రుతి యట్లు. దేహికి బుణ్యభావన యెట్లో వీణలో మధుర శ్రుతి యట్లు.' (స్వర్గానికి నిచ్చెనలు.)

వీణాస్వరూప మిక్కడను జెప్పబడినది. ఈ రీతిగా వివరించియుండిన బాగుండెడిది. తత్కాలమున వారికి తోచినది వారు చెప్పివేసిరి.

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు 'స్కూలు' నిట్లు వర్ణించిరి:

కం. పలుమందికి నుపయోగం
బొలయ ననకపల్లెలోన నొప్పారు మ్యుని
స్పలువారి స్కూలు దానం
గల గురువులు బాలకులును గడు సాధుమతుల్.

పద్య మెంత చప్పగ నున్నదో చెప్పవలసిన పనిలేదు. అదేమి వేద పాఠశాలయా? గురుకులమా? కాదు కనుకనే బిల్వజరచన నెరపిరా? ఎట్లు చెప్పినను బృచ్ఛకుడు తలయొగ్గి వ్రాసికొని కూర్చుండవలసినదే.

ఉన్నంతలో తిరుపతి వేంకటేశ్వరుల పద్యములు చక్కగ నుండును ఈ మాట వారే సగర్వముగ జెప్పికొనిరి

చం ఇతరకవుల్ ప్రయాసపడి యెంచి రచించిన నూటికెన్ని పె
ద్దతనము గాంచి చిత్తమును దన్పునొ, మే మవధాన సంగత
స్థితి గని యాశుగా రచన చేసిన పద్యములందు జూచినన్
శతమున కన్నిపద్యములు చక్కగనుండు నసంశయమ్ముగన్.

(శతావధాన సారము.)

'అడిగేవానికి చెప్పేవాడు లోకువ' అని లోకోక్తి. కాని, అవధాని పృచ్ఛకున కెప్పుడును లోకువ కాడు. తనకు దెలిసినంత, తత్కాలమున తన బుద్ధికి తోచినంత పద్యబంధమున జెప్పి చేయి కడిగికొనును విషయ మసమగ్రమని కాని, శయ్యయందు శైథిల్యము కలదని కాని, పద్యము సొగసుగ లేదనిగాని, పృచ్ఛకుడన గూడదు కనుకనే యొకపాటి పద్యరచనా శక్తియు, ధారణయుగల వ్యక్తులందఱు నవధానరంగ మెక్కుట జరుగుచున్నది.

—: ౦ :—

# అప్రస్తుత ప్రసంగము

అష్టావధానమున అప్రస్తుతప్రసంగ మొక ప్రస్తుతాంగము. పృచ్ఛకులందరు నడుగవలసిన దడిగి కూర్చుందురు. వారి వలె, అప్రస్తుత ప్రసంగి యూరక కూర్చుండడు అడుగడుగున పానకమున పుడకవలె నడ్డుపడుచుండును. అవధాని నిమీలిత నయనుడై కవనము యోజించుకొనుచున్నాడో, నోరుదెఱచి పద్యము వాచించు చున్నాడో యితని కక్కఱ లేదు. తన భాగవతము విప్పుటకే తా గక్కుఱితి పడును నిండు సరస్సులో నొక రాయి విసరినచో జలతరంగ వలయములు పుట్టునట్లు నిండు సభలో నితడొక మాట విసరినచో హాస తరంగ వలయములు పుట్టును.

ధనంజయుడు 'హాస్యకృచ్చ విదూషకః' అన్నాడు.

అష్టావధానమున అప్రస్తుత ప్రసంగి విదూషకుడు. హాస్యకారుడు.

విశ్వనాథ కవిరాజు 'వికృతాకార వాగ్వేషచేష్టాదే ర్కుహకా ద్భవేత్ హాసో హాస స్థాయిభావః' అన్నాడు.

వికృతమైన ఆకారము, వాక్కు, వేషము, చేష్ట - వీనివలన హాస్య ముద్భవించుచున్నది. విదూషకుడు తనయం దీనాలుగు ధర్మములు పండించుకొని, వినోద పాత్ర మగుచున్నాడు అప్రస్తుత ప్రసంగి కేవలవాగ్వ్యాప్తి నాశ్రయించి, తద్వికృతిచేత హాస్యము నొలికింప దొరకొనువాడే ఆకార వేష చేష్టాదుల ప్రయోగమున కవధాన సభాంగణము రంగము కాదు కదా!

హాస్యము శృంగారము నుండి పుట్టును : తదన్యము నుండియు బుట్టును. కాని, శృంగారమునుండి పుట్టెడి హాస్యము మనోహరముగ నుండును. కావుననే భరతముని 'శృంగారాద్ధి భవే ద్ధాస్యః' యనెను.

1౨)

మన యక్షగానకవులు శృంగారజన్య హాస్యము విశంకటముగా ప్రయోగించిరి.

బాపన ముత్తైదువల ముచ్చట్లు ఇట్లున్నవి:

'రావే ఓ కాసల్నాటి తిమ్మక్కా!'

'ఇదిగో వస్తుందాననె పేరూరి కామక్కా! వింటివోషే జందేల బుచ్చక్కా!'

'ఆదేందే ఓ బారసాల సూరక్కా ?'

'వస్తివోషే పుల్లగూర పేరక్కా! మన సముద్రనగరను చెంగమ్మవారికి పెండ్లి చేస్తున్నారష. పాటలు పాడిన ముత్తైదువల కల్లా కట్న మిస్తున్నారష. పుచ్చుకుందాం వచ్చే రొషే.'

'అందుకే కాదుషే వచ్చింది. ఓసెమ్మ వింటివోషే, మావారు ఏమేమో ఏషేషో యేందేందో అంచుండారే.... ...'

'ఏమంచుండారే? ఓసెమ్మ మావారు ఇందుకు మాత్రం ముసలి వారట. ఎట్లైనా నన్ను గడిచిపెట్టుమని పోరుక తించుండారే.'

'ఓశమ్మ—అట్లా అనకువే పురుషుండే దైవంబు పురుషుండే తండ్రి. పురుషం డానాపాలి పురుషోత్తముండు అన్నాడే ఓశమ్మ. అటు గనకనే మావారిని బిడ్డకన్నా విశేషంగా పోషింతునే.'

'మీవారని బిడ్డకన్నా విశేషంగా పోషింతునంటివే, అట్లైతే ఇరుగువారూ పొరుగువారూ ఏంగావాలే నీకు ఓశమ్మ ? మీవార్ని మావార్ని మార్చుకొందామటే? ఓశమ్మ నీకు నడుమేల పట్టుకొనెనే?' (హేమాబ్జనాయికా స్వయంవరము.)

ఇవి శృంగారజన్య హాస్యము.

తిమ్మక్క, బుచ్చక్క, పుల్లగూర పేరక్క - ఈ పేళ్లు శృంగారసంబంధములేని హాస్యమునకు పుట్టినిండ్లయ్యె. బూబొండ్లపట్లవర్తిల్లుట జేసి, దానికి జేరువగుచున్నవి.

శృంగారస్పర్శలేని హాస్యమునకు రెండుదాహృతులు :

ఒకడు సకలభాషలు సకలవిద్యలు నేర్చితినని విఱ్ఱవీగుచుండును. వాస్తవస్వరూపము పండితు లెఱుగుదురు వాడు వచ్చినపుడు పండితులిట్లు పలుకుదురు:

'గురోర్గిరః పంచదినా న్యధీత్య వేదాంతశాస్త్రాణి దినత్రయంచ
అమీ సమాఘ్రాయచ తర్కవాదాన్ సమాగతాః కుక్కుటమిశ్రపాదాః'

అయిదురోజులలో పూర్వమీమాంసాశాస్త్రము, మూన్నాళ్లలో వేదాంత శాస్త్రాలు పాఱజూచి, తర్కశాస్త్రము మూచూచి, కుక్కుటమిశ్రపాదులవారు విచ్చేసి రనుట యెగతాళి. ఇన్నియు జదువుటకు, అనగా నేర్చుకొనుటకు, ఏ డ్రు పూండ్లు పట్టును. ఇక్కడ కుక్కుటశబ్ద మపహాసనార్థమున ప్రయుక్తము.

పరమేశ్వరుని గుఱించి-

'స్వయం పంచముఖః పుత్రౌ గజానన షడాననౌ
దిగంబరః కథం జీవే దన్నపూర్ణా నచే ద్గృహే.'

తాను పంచవక్త్రుడు, కొడుకులు-ఒకడు ఏనుగుమొగమువాడు, మఱొక డాఱుమొగములవాడు-తిండిపోతులు. గేస్తు దిగంబరుడు, కట్ట బట్ట లేని దరిద్రుడు. గృహిణి అన్నపూర్ణ కనుక బ్రదుకుచున్నారు.

అవధానవిదూషకుడు ఉభయహాస్యనిష్ణాతుడు.

అతని హాస్యోక్తి కొకసందర్భముగాని క్రమముగాని యుండవు.

'విదూషక స్త్వేకపదాం సూత్రధారస్మితావహామ్
అసంబద్ధ కథాప్రాయాం కుర్యా త్కథనికా తతః.'

(నాట్యశాస్త్రము.)

అన్న భరతాచార్యు నాదేశ మితనికి వర్తించును. విదూషకుని అసంబద్ధ కథా ప్రసంగము సూత్రధారునకు స్మితావహ మైనట్లు ఇతని యసంబద్ధ కథా ప్రసంగము అవధానికి స్మితావహమే,

అమెరికా అధ్యక్షుడు అబ్రహామ్‌లింకన్ తన బల్లమీద జోకుల పుస్తకములు పెట్టుకొని యుండెడివాడట. బహువిషయవైయగ్ర్యముచే తల దిమ్మెక్కినపుడెల్ల కాసేపు జోకులు చదివికొని నిర్వృతి బొందెడివాడట. అప్రస్తుత ప్రసంగి మాట మంతి లేక, బెల్లము కొట్టిన గుండ్రాయివలె గూర్చుండియుండిన అవధాని కుత్సాహము కలిసిరాదు. సభయు చప్పబడును. అతనితోడి కాలక్షేప మవధానికి ఆహ్లాదనమే యగును.

అప్రస్తుత ప్రసంగము శాస్త్రవిచారగోష్ఠికాదు. సకలపురాణకథా పరిజ్ఞాన పరీక్ష కాదు. హాస్యప్రధాన లౌకికాలౌకిక సామాన్యగోష్ఠి.

పృచ్ఛకుడు పాతాళ ప్రశ్నలు వేయుట, అవధాని తల పట్టుకుని గాఢ యోచనాధీనుడై దిక్కుతోపక యల్లాడుట యుండదు. అతని ప్రశ్నజల్పనమున కితని సమాధాన జల్పనము 'తురకదాసరికి ఈతమజ్జిగ' యన్నట్లుండును

శాస్త్రీయ విషయములు, మంత్ర తంత్ర రహస్యములు అడుగ గూడదని యెంత కట్టడి చేసినను గొంద రడుగుచునే యుందురు అవధాని చెప్పుచునే యుండును.

అవధాని నిరుకటమున బెట్టు ప్రశ్నము లయిదు రకములు కలవు.

1. అవధాని సంబంధి వైయక్తిక ప్రశ్నములు.

అవధానియొక్క వ్యంగ్యతాదులో (మెల్లకన్ను, తొఱ్ఱిపండ్లు, పెద్దకడుపు, గెంటుకాలు ఇత్యాదులు) గృహచ్ఛిద్రములో, ధూమపానాది దురభ్యాసములో యెత్తి పొడుచుచు నడుగుట.

2. సభ్య సంబంధి వైయక్తిక ప్రశ్నములు. అధ్యక్ష పృచ్ఛక నిర్వాహక సభ్యజనమున నెవరినో యొకరిని వ్రేలెత్తి చూపి వెక్కిరించుచు నడుగుట.

3 అసభ్య ప్రశ్నములు. ముఖ్యముగా స్త్రీలు తలవంచికొనునంత వెగటుగా సిగ్గు విడిచి విచ్చలవిడిగా నడుగుట.

4. రాజకీయ ప్రశ్నలు. ప్రభుత్వము, ప్రతిపక్ష భేదములు, వీనిని విమర్శించుచు నడుగుట.

5. సాంఘికాచార హేళన ప్రశ్నములు. హిందూ క్రైస్తవ మహమ్మదీయ మత సాంఘికాచార వ్యవహారముల నవహేళన చేయుచు నడుగుట.

అవధాని యిట్టి ప్రశ్నముల నెంతో జాగరూకతతో నెదుర్కొని, సుకుమారముగా 'పాము చావని, ఐడియ విఱుగని' మెలపున సమాధాన మొసంగవలసి యుండును.

## ఉక్తిప్రత్యుక్తి పద్ధతి

అప్రస్తుత ప్రసంగి :- మీకెన్ని భాషలు వచ్చునో కాస్త సెలవిస్తారా?

**అవధాని** :- మా గురువుగారికి ఎన్ని భాషలు వచ్చు?

అ. ప్ర : పద్నాలుగు అని అంటున్నారు.

**అవ** : ఆ మాట వింటున్నారు గదా!

అ.ప్ర. : నమ్మమంటారా?

**అవ** : నమ్మి చెడినవారులేరు.

అ ప్ర : అది దేవుని విషయంలో. మీ ప్రకటన ఒక లోకోక్తి వలె ఉంది.

**అవ** : అదేదో చెప్పండి. (అవధాని పద్యవిషయములు తనలో యోజించి కొనుచుండును.)

అ.ప్ర : నీళ్ళలో గేదె ఉంది. పెద్ద పెద్ద కొమ్ములు మాత్రం కనిపిస్తున్నాయి. అది వట్టిదో, చూడిదో, పాడిదో, గొడ్డుదో తెలియదు. బేరం చెపుతున్నారు. సరిగా మీ వ్యవహారం అట్లుంది. కవులు వ్రాసేవి అసత్య కల్పనలు, చేసేవి అసత్య ప్రకటనలు, మీకు కోపం రాకపోతే ఒక మాట అడుగుతాను.

**అవ** : అడగండి. మీకూ కోపం రాకపోతే నేనూ ఒక మాట అంటాను.

అ.ప్ర : అదో కోపం వచ్చింది. తప్పుంటే క్షమించండి. పద్నాలుగు భాషలు వచ్చునంటున్నారే, ఆ భాషల పేర్లు చెపుతారా?

అవ : గుండెలుంటే గురువుగారినే అడగండి.

అ ప్ర : అబ్బా! దుర్వాసుడు.

**అవ** : కవులు దుర్వాసులు కారు బట్టలకు అత్తరు రాచుకొంటారు.

అ ప్ర : దుర్వాసుడంటే మలినవస్త్రం వాడనే అర్థం చేస్తిరా? కవులు ద్విజిహ్వులు, కుటిలగతులు

**అవ** : వంకరటింకరగా నడిచేది, కఱచేదీ మీరే.

అ.ప్ర : నాకు కోఱలు లేవు (అతనికి ముందటి పండ్లుండవు సభలో నవ్వులు.)

అప : చాలా సేపయింది అలసినట్లున్నారు. మంచితీర్థం పుచ్చుకోండి.

అ ప్ర : పుచ్చుకొనే గిచ్చుకొనే అలవాట్లు కవులకే.

అవ : ఆ యర్థం ఎవరికి స్ఫురిస్తుందో వారికే ఆ యలవాటు ఉంటుంది. మంచినీళ్ళు త్రాగండి.

అ ప్ర : మీకు మేమే నీళ్ళు త్రావిస్తాము.

అవ : తెలుస్తుంది కదా, యెవరు నీళ్ళు త్రాగేది.

ఈత రానివాడు బావిలో పడినచో నీళ్ళు త్రావును. మునిగిపోవును. త్రేతా యుగములో వాలి దశకంఠుని చంకలో నిఱికించుకొని, సప్త సాగరములలో ముంచి నీళ్ళు త్రావించినాడు ఆ కథనుబట్టి లోకములో 'ఏడిపించి యేడు చెఱువుల నీళ్ళు త్రాగించినాడ'ను నుడి పుట్టినది. ఆ నుడి ననుసంధింపవలెనని పృచ్ఛకుని ప్రయత్నము.

అ.ప్ర. :- జందె మెందుకు వేసుకొంటారో చెప్పగలరా?

అవ :- 'యజ్ఞోపవీతం హి నామ బ్రాహ్మణస్య మహదుపకరణద్రవ్యమ్.'

'ఏతేన మాపయతి భిత్తిషు కర్మమార్గ
మేతేన మోచయతి భూషణసంప్రయోగాన్
ఉద్ఘాటకో భవతి యన్త్రదృఢే కపాటే
దష్టస్య కీట భుజగైః పరివేష్టనంచ ' (మృచ్ఛకటికము)

అ ప్ర :- మీరు దొంగలు.

అవ :- 'భుజంగ ఏవ జానీతే భుజంగచరణం సఖే!'

అ ప్ర :- మసల్మానులకు పిలక ఉండదు. ఏల?

అవ :- ఉండదని యెవ రన్నారు?

అ.ప్ర :- నేనే.

అవ :- గ్రుడ్డి స్వామీ! మసల్మానులు కూడ పిలక ధరిస్తారు. చూడండి. ఎఱ్ఱటోపి, దాని వెనుక నల్లదారాల కుచ్చు వేలాడుతూ ఉంటుంది. అదే పిలక.

పానకములో పుడక

అవధాని ఆశుకవిత జెప్పుచుండగా పద్యము నడుమ నప్రస్తుతప్రసంగి అడ్డగాలిడుట పానకమున బుడక వంటిది.

పోలీసునకు పట్టుపడిన నెఱజాణయైన యభిసారికను గుఱించి యాశువుగా జెప్పగోరగా, నొకపృచ్ఛకున కవధాని పద్యము జెప్పుచున్నాడు.

చం. 'జడియుచు చెట్లనీడ నభిసారిక డాగిన జూచి, యూరెకుం
డొడిసి కరమ్ము పట్టికొని, యీడెను పీక ... '

ఇంతలో అప్రస్తుతప్రసంగి జోక్యము చేసికొని, 'అయ్యా! ఆగండి. తమ రెప్పుడైనా పోలీసులకు పట్టుబడినారా?' అని ప్రశ్నించును. అతని కేదోయొక సమాధానము చెప్పి అతనిని వదలించికొని, వెనుదిరిగి చూచుసరికి, ఆకాశము మెఱసిన మెఱపుదీగవలె సాగిన పద్య మెందాక వచ్చినదో, యెక్కడ నిల్చినదో తనబడదు. అడ్డగింపకుండినచో ఆ ధార అట్లే సాగిపోయెడిది. ఇపుడు పునఃపాకము చేయుట- అనగా క్రొత్త పద్యము రచించుట- కష్టము కాదు. కాని, ఆ పని చేయ గూడదు పూర్వప్రోక్తపద్యపూర్వార్ధము స్మృతిపథమునకు దెచ్చికొని, దానినే సక్రమముగా బూర్తి చేయవలెను.

అభిసారిక మ్రాకుల నీడలో డాగినది పోలీసు పట్టుకొని పీక ఊదినాడు తరువాత ఏమి జరిగినది?

'హుటాహుటిన్ భటుల్ పడి బయవెత్తి వచ్చి. రల పైదలి ఫక్కున నవ్వి భార్యపై గడుసుదనంబు జూపెదు మగండవు పొమ్మనె, నెంత జాణయో!'

ఆలుమగల నడుమ, గృహచ్ఛిద్రము లెన్నోయుండును. పోలీసు గూడా గృహస్థుడే ఇది యతని యింటిగుట్టు. రట్టు చేయవగదని యతనితోడి భటులతని దోడికొని, ఆమెను విడిపించి వెళ్ళిరని పద్యభావము.

అప్రస్తుతప్రసంగి :— 1 సొంతము యోజించుకొని గుర్తు పెట్టుకొని తెచ్చినవి. 2. ప్రకరణానుప్రసక్తములైనవి 3. సభ్యులందజేసినవి — సకలవిధ ప్రశ్నలు కలిపికొట్టుచుండును. అవధాని మౌని కాక, యేదోయొక యొదుపుతోడి సమాధానము చెప్పుచుండవలెను.

అప్రస్తుతప్రసంగి సభ్యులందజేసెడి ప్రశ్నలకు చేయి చాపుచు వచ్చిన, తత్ప్రశ్నపరంపర హనుమంతుని తోకయగును. అయినను పరవాలేదు కాని, అసభ్య ప్రశ్న లపక్వబుద్ధులగు బాల వృద్ధులు లాలసలో వ్రాసి కాగితము చేతికిత్తురు. మఱికొందరు సమస్య లిత్తురు ఇది సమస్య కదా ? అనిన, అవును. అవధానుల కిదేమి లెక్క? యందురు స్వీకరించిన ఒక చిక్కు. తిరస్కరించిన ఒక చిక్కు. అప్రస్తుత ప్రసంగి సదస్యదత్త ప్రశ్న సమస్య లందికొనుట సమంజసముకాదు. అది యతని పార్శ్వక్యమునకే దెబ్బ.

అవధాని సమాధానము లెట్లుండవలెను ?

అవధాని తన మాటకారితనము చూపింపవలెనని చేట భారతము చెప్పుట వాచాలతయగును. సంభాషణము సాగదీసినచో వృథా కాలవ్యయమగును. ఒక చిన్న మాటతో ఎదుటి వ్యక్తి మొగాన గుప్పున రంగుపొడి చల్లినట్లు సమాధానము గుప్పవలెను. సభ్యులు గొల్లున నవ్వుదురు. పృచ్ఛకుడు ఆ మాట త్రిప్పికొట్టుటకు గాని, మఱి నోరెత్తుటకు గాని వీలుగాని విధముగా గుప్పవలెను. అది సమాధానము. ఇట్టి సమయోచిత చతురోక్తిస్ఫూర్తి లేని యవధాని రాణింపడు.

ఇది యొక కళ కాని కళ అనగా మానవుడు ప్రయత్న పూర్వకముగా సాధించెడి విద్య కాదన్న మాట

Edward Sullivan (1852-1928) ఈ చతురోక్తి విలను Artless Art అనెను.

**"A good repartee is the saying of some thing on the spur of the moment which, by the unanimous consent of its hearers, leaves the person replied to practically destitute of further speach by way of defence".**

"ఛీ కుక్కా ! అంటే యే మక్కా !" యన్నదట. ఇదొక తెనుగు సామెత 'కుక్కా' యన్నది తిట్టు నీచురాలని యర్థము. ఆవేశము పట్టజాలక యన్నమాట. దానికి జవాబు ఆర్ద్రమైన ప్రేమతోడి 'అక్కా' యన్న బాంధవ్య వ్యంజకమైన సంబుద్ధి. అక్క సహోదరియైనపుడు వయసుచేత పెద్దది. కానపుడు గుణముచేత పెద్దది. 'కుక్కా' యని తిట్టిన వ్యక్తిని 'ఆకుక్క యొక్క అక్కా !' యని మాఱు తిట్టుటయేయైనను ఇదెంతో మృదువుగా నున్నది ఈ మాట విన్న ఆ యక్క మొగ మింత చేసికొని తలవంచికొనవలసినదే. తెలివిగలదియైనచో దానునొన్న దొకటి యైనది యొకటి-యీ పరిణతికి ముసిముసినవ్వు నవ్వెను.

ఆ విద్వదంగనాబాల ప్రతీతార్థమగు నిట్టి యప్రస్తుత ప్రసంగము అష్టావధాన సభకు జీవకళ గూర్చు విలక్షణాంగము.

--: o :--

# వ్యస్తాక్షరి

'ఓం నమో నారాయణాయ.' ఇదొక వాక్యము

ఇందలి యక్షరము లొక క్రమమున నన్వితములై అర్థసహితము లై యున్నవి. 'ఓమ్' ప్రథమాక్షరము. 'య' యష్టమాక్షరము.

పృచ్ఛకుడు ప్రతి వర్ణమునకు దద్వర్ణాగ్రభాగమున గ్రమసంఖ్య వేసిపెట్టి కొనును అవధాని పద్యరచనాదికార్యవ్యగ్రత పాటించువేళ కనిపెట్టి 6/రా అనెడి కాగితపుదునుక చేతికిచ్చి చూడనిచ్చి, వాపసు తీసికొనును. తరువాత అట్లె వేచి యుండి, 3/మో అనెడి కాగితపుదునుక వెలికి దీయును తర్వాత 7/నా అనెడి కాగితపుదునుక జూపును. ఆమీద నెపుడో 1/ఓమ్ అనెకి కాగితపుదునుక జూపును. ఇప్పటికి నాలుగు అక్షరములే వచ్చినవి. 'ఓమ్' అనగానే అది అష్టాక్షరీమంత్ర మని అవధానికి సగముననే వ్యస్తాక్షరివాక్యస్వరూపము గోచరించును.

కొందరు MAY GOD BLESS YOU అన్న ఆంగ్లేయవాక్య మిత్తురు పదుమూడక్కరములలో నాలేదక్కరములు వ్యస్తప్రోక్తము లగునప్పటికి వాక్య స్వరూపము ఆంగ్లవాసనగలవాడైనచో అవధానికి అవగతమగును.

లేదు. అశ్రుతపూర్వమైన వాక్యమేదో యిత్తురు అపుడో! అపుడు పదార్థ వాక్యాన్వయక్రమము - అక్షరశిరస్సంఖ్య దిక్కు.

దిక్కులేని వాక్యము, అర్థములేని పదములు, భాషకాని భాష యిత్తురు అపుడెట్లు? అపుడు అక్షరశిరస్సంఖ్య, మేధాదక్షిణామూర్తి దిక్కు

అష్టభాషలయందు వ్యస్తాక్షరి వాక్యగుచ్ఛములు తద్గుచ్ఛసంఖ్యాక్రమమున జోడించికొని అవలీలగా జెప్పజాలు మేధాశాలియైన శ్రీ మాడభూషి వేంకటా చార్యుల వారికి. అష్టావధానప్రదత్తైకభాషావ్యస్తాక్షరి 'లీల గుడి మ్రింగువానికి లింగ మెంత' యన్నట్లుండెను.

శ్రీ మాడభూషివారి పద్ధతి జూచి, వారి యాధ్యక్ష్యముననే యష్టావధాన మొనర్చి యభినందితులైన పిఠాపురపు దేవులపల్లి సోదరకవుల వ్యస్తాక్షరి నిర్వ హణప్రతిభ అంతటిది కాకపోయినను అబ్బురము గొలుపునదే.

'టోల్, ఫర్, ది, బ్రేవ్, ది, బ్రేవ్, దటార్, నోమోర్, ఆల్, సంక్, బినీత్, ది, వేవ్, క్లోస్‌లీ, దెఋర్, నేటివ్, షోర్'

("Toll for the brave, the brave that are no more. All sunk beneath the wave closely their native shore")

మీది మ్లేచ్ఛవాగ్గుచ్ఛకవ్యస్తాక్షరి శ్రీ దేవులపల్లి సోదరులు 8-11-1896 దినమున మైలాపూరులో జరిగిన యష్టావధానమున జెప్పిరి.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు జర్మన్ భాషా పద బంధమును, ద్రావిడా ద్యన్యభాషా వృత్తములను గైకొని చెప్పిరి.

జర్మన్ భాషలో నీయబడిన వ్యస్తాక్షరి.

1. యిష్ 2 పైజ్ 3 నిష్‌ట్ 4 వాన్ 5 సోల్ 6 యెస్ 7 బిడాయి టెన్లు 8 డాస్ 9 యిష్ 10 యిష్ 11 సో 12 ట్రవరిష్ 13 బిస్ 14 అయెన్ 15 మెర్కెన్ 16 హౌస్ 17 యెల్టెన్ 18 లైటెన్ 19 డాస్ 20 కంపెట్ 21 నూర్ 22 జౌన్ 23 డెన్.

బహుభాషా సంకర శార్దూలవిక్రీడితవృత్త వ్యస్తాక్షరి:

'యూయం, తత్ర, సిడౌన్, తథాపి, వెరివెల్, తస్మా, న్మమాయా, శశీ
నోగోసార్, మదరాసుకాయకరితం హింగేందు బాయేందునమ్
సింగతూర్వరయ, సింగకూద, విడుదల్, నీవాడ నంటింగదా
కిస్వాస్తే మయి బోత్రహం, ఆజి సునో తక్సీర్ నమేరే ఉపర్.'

(18-9-1888. బందరు)

ఈ పద్యమున ఛందము కొంత సహకారి కావచ్చు. కాని, బహుభాషా సాంకర్యము చీదర గొల్పును.

శ్రీ ముత్తు అయ్యరుగారు అచ్చముగా ద్రావిడ భాషాబంధమున రచింపబడిన యొక నూతన "శ్లోకము" నిచ్చిరట. తెలుగు కవుల చెవుల కిదియు గటువుగనే కనబడును.

'అట్టావదానిగళ్ శెయ్యవల్లే మెన్ద్రవై పుహుందు
తట్టామలే శిలర్ తత్తళిప్పార్ విల్లితన్ శరంబోల్
ఎట్టేపుహుంద్రు పిన్నె టెట్టెట్టింగివరై యొప్ప
ముట్టాడు శెయ్యవల్లారిల్లై యేయింద మొయిజిలత్తై'

అర్థాన్వయక్రమరహిత వాక్యతతి ధారణయందు నిల్పికొనుట కష్టము.

మఱి మన యవధాను లెట్లు సాధించిరి? ఈ సాధనము గుఱించి ప్రకర ణాంతరమున జర్చింపబడినది

వ్యస్తాక్షరి ధారణాశక్తి పరీక్షకు శాణోపలము.

లోకరూఢిగన్న ఆభాణకములు, ప్రసిద్ధ పూర్వకవి పద్య గద్య ఖండములు నిచ్చినచో నేయిబ్బందియు నుండదు. సగము ముప్పాతిక వర్ణములు చేతికి వచ్చి నంతనే తెలిసిపోవును అడ్డదిడ్డపు వాక్యములు, అర్థములేని పదములు కూర్చి యిచ్చుట - అన్య భాషాఫణితు లిచ్చుట రెండును సమానమే.

నిర్వహణక్రమము :— ఒక పర్యాయ మొక వర్ణము లేదా యొక పదము, సంఖ్యా సహితముగా నవధాని కీయవలెను. ఇచ్చుట యనగా దత్తము చేయుట. నోటిః జెప్పవచ్చు కాని, 'చ' అని చెప్పినచో, హ్రస్వమా? దీర్ఘమా? దంత్యమా? తాలవ్యమా? పరుషమా? స్థిరమా? ఇన్ని ప్రశ్నలు వేసి తదుక్తవర్ణస్వరూపము నిర్ణయించికొని. స్వీకరింపవలసి వచ్చును. కనుక పృచ్ఛకు డొకపని చేయును. తా నీయవలచిన వ్యస్తాక్షర ఖండము ఏకైక వర్ణముగ గాని, యేకైక పదముగ గాని విభజించి యెన్ని విభాగము లేర్పడునో అన్ని పత్ర ఖండములు సిద్ధపఱచి కొని, వాని మీద ససంఖ్యముగా దేయవర్ణమో దేయపదమో వ్రాసి పెట్టికొని, అన్నిటిని గలిపి, క్రమము తప్పించి, ఒక్కొక్క పత్రఖండ మొకొక్కసారి, సమయము చూచి, అవధాని చేతి కిచ్చుచుండును. అవధాని జూచి గ్రహించి, తత్పత్ర ఖండము తిరిగి యప్పుడే పృచ్ఛకున కిచ్చివేయుచుండును.

దృష్టిలేని యంధు లష్టావధానము చేయునపుడు శ్రుతపఱచుటయే కాని, కాగితపు దునుకలు చూపించుట యుండదు

శ్రవణేంద్రియముతో గ్రహించి, మెదడున నిల్పికొనుట కంటె, చక్షు రింద్రియముచే గ్రహించి మెదడున నచ్చు గ్రుద్దికొనుట లాభదాయకమైన విషయము.

గ్రుడ్డివారి కిసౌకర్య ముండదనుకొనుట గ్రుడ్డితనము.. అంధులు చక్షుశ్శ్రవోలక్షణ విశిష్టులు.

—: ౦ :—

# వారకథనము

## ఇంగ్లీషు తారీఖులకు వారములు కనిపెట్టు విధానము

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| బి. సి. | 3001 | 3101 | 3201 | | | | |
| | 2301 | 2401 | 2501 | 2601 | 2701 | 2801 | 2901 |
| | 1601 | 1701 | 1801 | 1901 | 2001 | 2101 | 2201 |
| | 901 | 1001 | 1101 | 1201 | 1301 | 1401 | 1501 |
| | 201 | 301 | 401 | 501 | 601 | 701 | 801 |
| | | | | | | 1 | 101 |
| ఎ. డి. | 500 | 400 | 300 | 200 | 100 | 0 | |
| | 1200 | 1100 | 1000 | 900 | 800 | 700 | 600 |
| | | | 1700 | 1600 | 1500 | 1400 | 1300 |
| | 1600 | 1901 | | 1800 | | 1700 | |
| | 2000 | 2300 | | 2200 | | 2100 | |

## రెండవ పట్టిక: చిల్లర సంఖ్యలకు ధ్రువములు

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | (0) |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | 4 | 5 | 6 | |
| 7 | | 8 | 9 | 10 | 11 | | |
| 12 | 13 | 14 | 15 | | 16 | 17 | |
| 18 | 19 | | 20 | 21 | 22 | 23 | |
| | 24 | 25 | 26 | 27 | | 28 | |
| 29 | 30 | 31 | | 32 | 33 | 34 | |
| 35 | | 36 | 37 | 38 | 39 | | |
| 40 | 41 | 42 | 43 | | 44 | 45 | |
| 46 | 47 | | 48 | 49 | 50 | 51 | |
| | 52 | 53 | 54 | 55 | | 56 | |
| 57 | 58 | 59 | | 60 | 61 | 62 | |
| 63 | | 64 | 65 | 66 | 67 | | |
| 68 | 69 | 70 | 71 | | 72 | 73 | |
| 74 | 75 | | 76 | 77 | 78 | 79 | |
| | 80 | 81 | 82 | 83 | | 84 | |
| 85 | 86 | 87 | | 88 | 89 | 90 | |
| 91 | | 92 | 93 | 94 | 95 | | |
| 96 | 97 | 98 | 99 | | | | |

### మూడవ పట్టిక: మాసములకు

| | 1. | 2 | 3. | 4 | 5 | 6 | 7. (0) |
|---|---|---|---|---|---|---|---|
| సామాన్య వత్సరమునకు | ఆగష్టు | ఫిబ్రవరి | జూన్ | సెప్టెంబర్ | ఏప్రిల్ | జనవరి | మే |
| | | మార్చి | | డిసెంబర్ | జులై | అక్టోబర్ | |
| లీపుకు. | ఫిబ్రవరి | నవంబరు | | | జనవరి | | |

క్రీస్తుపూర్వపు సంవత్సరములకు గాని, క్రీస్తు తరువాతి సంవత్సరములకు గాని, పై పట్టికలనుబట్టి, శీర్షికాంకములను గలిపికొని, వారసంఖ్యయగు నేడింట భాగించినచో మిగిలెడి శేషాంకమునుబట్టి ప్రథమారాకాదిగా భాన్వాదివాసరములు నిర్ణయింప నగును శేషము సున్న మిగిలినను, ఏడు మిగిలినను శనివారమని తెలిసికొనవలెను.

4-10-1976 తేదికి వారము గనుగొనుట-

| | | |
|---|---|---|
| 1900 లకు శీర్షాంకము | .... | 2 |
| 76 చిల్లరకు .... | .... | 4 |
| అక్టోబరుకు | .... | 6 |
| తేది | .... | 4 |
| మొత్తము | .... | 16 |

పదునారును వారసంఖ్యతో అనగా ఏడుతో భాగింపగా శేషము రెండు వచ్చును. వారములలో మొదటిది ఆదివారము, రెండవది సోమవారము. కనుక, 1976 సంవత్సరము అక్టోబరు నెల నాలుగవ తేది సోమవారమని చెప్పవలెను.

మునుపు పేర్కొనిన పట్టికలు మూడును అవధానికి కంఠపాఠముగా నుండవలెను. అంకెలు కూడుట భాగించుట మనసులోనే చేసికొనవలెను. ఎక్కడ ఇసుమంత పొరపాటు ఘటిల్లినను వారము తప్పును.

అభ్యాసముచే దీనిని సాధింప వచ్చును. చాల తేలిక.

ఈ పద్ధతి 'జ్యోతిష విద్యాప్రకాశిక' యందు ప్రస్ఫుటముగా వివరింపబడినది.

——: o :——

# పుష్పగణనము - ఘంటాగణనము

అవధానమునకు గుర్తులుండునని శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారనిరట. వారు విశేషించి వైదిక వాఙ్మయ పరిశోధకులగుట, వేదావధానులకు వర్ణస్వరావధాన సంబంధియగు నొక చిట్టా యుండునన్న రహస్యమెఱిగి మన యవధానులకు దాదృశ్యమైన చిట్టా యుండునని భావించియుందురు.

కొందరవధానులే 'మాకు గొన్ని గుర్తులున్న'వన్నారు. అట్టివారి గుర్తుల గుఱించి ప్రకరణాంతరమున జర్చింపబడినది.

మాడభూషివంటివారు మేధిష్ఠులైన పండిత శ్రేష్ఠులు. వారికే గుర్తులు నక్కఱలేదని వారు సాధించిన మహా కార్యము లెఱిగినవారు గుర్తింపగలరు. సాధారణావధానులకు గుర్తులుండు నను మాట ఒక్క పుష్ప ఘంటాగణన విషయమున మాత్రము పాక్షికముగా నంగీకరింప వచ్చును.

ఘంటాధ్వని సంఖ్య మనసున నిల్పుట కష్టము. ఎంత నిలుపుకొందమని యత్నించినను అది నీటిమీది వ్రాతవలె, ఏర్పడి యేర్పడినంతనే యంతర్హించుచుండును. ప్రయత్నము ఫలించు వైన మఱుపడదు. అందుచేత గొందరవధానులొక మార్గము గనిపెట్టిరి. అశ్విన్యాది నక్షత్రము లిరువదియేడున్నవి కదా! ఒక పువ్వు వైచినపుడు లేదా ఒక గంట మ్రోగినపుడు 'అశ్విని' అని గుర్తుపెట్టుకొని, మనసులోనే, రెండవగంట మ్రోగినపుడు 'భరణి'యని గుర్తుపెట్టుకొని యీ క్రమమున నిరువదియేడు పూర్తికాగానే తిరిగి యశ్వినితో మొదలుపెట్టి లెక్కింతురు. మద్దురుపులీ పద్ధతి పాటించిరి. మఱికొందరు మేషాది ద్వాదశరాశి చక్రమును దీసికొందురు. రాశి చక్రమును మనసులో జూచుకొనుచు, మొదటి గంట మ్రోగినపుడు 'మేషరాశి'యని అయిదవ గంట మ్రోగినపుడు 'సింహరాశి' యని, పదునొకండవ గంట మ్రోగినపుడు 'కుంభరాశి' యని గుర్తుపెట్టుకొనుచు, పండ్రెండు కాగానే తిరిగి మేషరాశికి వచ్చి లెక్కింతురు. నక్షత్రము మీదగాని, రాశిమీదగాని దృష్టినిల్పుటకు కొంత యాదరువుండును. నక్షత్రము బట్టి, రాశిని బట్టి తత్తత్సంఖ్య లూహించుకొనవచ్చు గుర్తులనగా నివియే గుర్తులు.

పుష్పగణన విషయమునగూడ నిదే పద్ధతి. పువ్వులతో నవధాని నపు డప్పుడు కొట్టుచుందురు. ఆ దెబ్బల నవధాని లెక్కపెట్టుకొనుచుండును.

ఘంటాధ్వని శ్రవణేంద్రియ గోచరము కాగా, పుష్పతాడనము త్వగింద్రియ గోచరమగును ముసుపటి పండితులు నిష్కంచుకులు. నేటి పండితులు చొక్కాలు, కోటులు ధరింతురు. చొక్కామీద గాని, కోటుమీదగాని విసరి విరి వేసినచో దాని తాకు స్పృష్టత్వచము కాజాలదు. కనుక పుష్పతాడన మీనాడు ప్రచారమున లేదు.

పూర్వమవధానులు సేలువలు కప్పుకొని తిరిగెడివారు. సభలో సేలువ తీసి నడుమునకు జుట్టుకొనెడివారు. ప్రష్టలు పృష్ఠదేశమున పువ్వులు రువ్వుట వారికి సువిస్పష్టముగా దెలిసెడిది.

అవధాని యోచనామగ్నుడై యున్న వేళ గంట కొట్టినచో ఒక్కొకవేళ తద్ధ్వని యతని మనసున కెక్కకపోవుటయు సంభవింపవచ్చును. యోచనాగాఢత యటువంటిది. వీపున బుష్పముతో గొట్టినచో యోచనాముద్ర సడలును. నిద్ర పోవువాడు గూడ పూ మొగ్గతో గొట్టినచో దిగ్గున లేచును. పరధ్యానమునున్న వానిని వెన్నుదట్టి పిలుచుట కలదు కదా!

గంటలు లెక్కించుట కంటె పువ్వులు లెక్కించుట సులభము.

తక్కిన సారస్వతవిషయముల తప్పొప్పులు కచ్చితముగా లెక్కింప గలవారుండరు. కాని, పూలు వేయుట, గంట కొట్టుట సభలోనున్న చిన్న పెద్ద లందరు లెక్కింపగలరు. సరిగా చెప్పినా, తప్పినా గుర్తింతురు.

సంఖ్యా ఒండు రెండు అటో యిటో చెప్పినను మన్నింపదగునని శ్రీ చెళ్ల పిళ్లవా రొక యుదారపుమాట చెప్పిరి.

—: ० :—

# శాస్త్రార్థము

శాస్త్రార్థ విచార స్వరూపము శ్రీ కాశీ కృష్ణాచార్యులవారి అవధానమునుండి దిఙ్మాత్ర ముదాహరింతును

పృచ్ఛకుడు-'అయ్యా! 'మొల్కచనుంగవ' యను ప్రయోగము వ్యాకరణ విరుద్ధము. వ్యాకరణప్రకారము పదమధ్య 'లు రు డు'ల ఉకారలోపము వైకల్పికము. ఉదాహరణము - కలుపు కల్పు. చేరుచు చేర్చు, కడుపు కడ్పు, ఇచట 'మొలక' శబ్దమే కాని, 'మొలుక' శబ్దము కాదు. కనుక 'మొల్క' అను ప్రయోగము తప్పు అని పూర్వ పక్షము.

ఆచార్యులవారి యుక్తి :

'ప్రాయేణ వైయాకరణాః పిశాచాః ప్రయోగమంత్రైర్ని ర్వాపయితవ్యాః'

వెలగ - వెల్గ యని నరసింహకవి ప్రయోగించెను. మొలక మొల్కయని యగసాలె భద్రయ ప్రయోగించెను పైయిద్దరి కవుల సాక్ష్యము విచారించి, నాపై మోపిన యభియోగము తొలగింపుడు.

ఇంకొక శాస్త్రార్థము అష్టావధాన సందర్భమున జరిగినది కాకున్నను సంస్కృత భాషా మాధుర్యము నెఱిగించుటకై ఆచార్యులవా రుట్టంకించిరి.

'అయి! అవధాని మహాశయ! భవద్రచితపద్యే లక్ష్మీనరసింహ నఖానాం బాలచంద్ర తౌల్యం వర్ణితం ఖలు? త దసమంజసమ్. కుత ఇత్యుక్తే, తేషామేవ నఖానాం పూర్వార్ధే వజ్రసామ్య ముక్తమ్. తేన హేతునా, నరసింహ నఖరేషు తైక్ష్ణ్యకాఠిన్యే వర్ణితే ఇతి జ్ఞాయతే ఉత్తరార్ధే తు బాలచంద్రాంకుర సామ్యకథనేన, శైత్యమార్దవే వర్ణితే ఇతి జ్ఞాయతే. తత్కథం వ్యధికరణధర్మాణాం సామానాధికరణ్యమ్? ఇత్యయం పూర్వపక్షః

భోస్సహృదయ శిఖామణే! ... శ్రూయతామత్ర సిద్ధాంతవాక్యాన్యస్మదీయాని.

అయి! మహాభాగ! వ్యధికరణానామపి ధర్మాణాం దేశకాలభేదేన సామానాధికరణ్యం సంగచ్ఛత ఏవ. యథా సంయోగ తదభావయోః ఏకస్మిన్నేవ వృక్షే అగ్రావచ్ఛేదేన కపి సంయోగః, మూలావచ్ఛేదేన తదభావశ్చ. దృశ్యతే. వ్యధికరుణా వపి తథా.

20) —:०:—

# సహపఠనము

చతుష్షష్టికళలలో 'సంపాఠ్య' మనఁబడునదే సహపఠనము.

'తత్ర పూర్వధారిత మేకో గ్రంథం పఠతి. ద్వితీయ స్తమేవ అశ్రుత పూర్వం తేనసహ తధైవ పఠతి.' (జయమంగళ టీక)

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మహమ్మదీయు డొకాయన ఖొరాను చదువుచుండగా ఆయన ప్రక్కన గూర్చుండి స్వరము గలిపి, సహపఠనము గావించి మెప్పువడసి రట.

ఈ విద్య యెట్టి దనగా, గాయకుడు వింత కల్పనలతో పద్యమో పాటయో పాడుచుండగా జంత్రవాద్యము దానితో జోడించుట వంటిది.

—: o :—

# ఆకాశ పురాణము

ఆకాశపుపురాణము పంచలక్షణవిలక్షణమగు పురాణము కాదు.

పృచ్ఛకు దేదేనొక ప్రసిద్ధకథ సూచించి, దానిపై పురాణము నల్లి చెప్పుమని కోరును. అప్పుడవధాని యాశుగా పద్యము లల్లి పురాణధోరణి గొని చెప్పును. కథాకథనపథమున నవధాని కేయడ్డంకులు నుండవు. స్వచ్ఛందవిహారము సేయవచ్చు. ఆకాశమున బయనించు విమాన మెట్లు బోయినను బోవచ్చును గదా! ఇదియు నట్లే. అందుకే దీనికి ఆకాశపురాణమని పేరు పెట్టిరి.

శ్రీ తిరుపతి వేంకటకవులు ఆకాశపురాణమున కుదాహరణముగా శ్రీ వేంకటగిరి రాజావారి రామేశ్వరయాత్ర ప్రకటించిరి. రాజావారు బహుక్షేత్రములు దర్శించినట్లు, బహుతీర్థములు సేవించినట్లు చెప్పిరి. అయ్యె యూళ్ళపేళ్లు తత్కాల కల్ప్యమానపద్య చ్ఛందోనుకూలముగా వారు కల్పించికొన్నవియె. అందులకే 'ఇందలి పుణ్యస్థలముల పేళ్లకు మేముత్తరవాదులము కాము' అని ముందే విన్నవించుకొన్నారు. ఈ పురాణమున - 'అచ్చట', 'మఱియు నచ్చట', 'అయ్యెడ', 'ఇదియునుంగాక' వంటి యనుసంధానవచనములు, సీసములు, గీతములు, కందము లన్నియు గలిసి, మొత్తము నలుబదియాఱువర కున్నవి. వృత్తములు- చంపకోత్పలాదులు- లేవు. ఉన్న సీసము లన్నియు దేవతాస్తుతి నమస్కృతి పర్యాప్తములు.

శ్రీ కాశీ కృష్ణాచార్యులవా రుదాహరించిన పామూరి ఆకాశపురాణమున నాఱు పద్యములు, నొకవచనము వెరసి యేడున్నవి. విషయము వారి పామూరి రాక మాత్రమే.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు వానమామలాష్టావధానమున దైవప్రార్థనముతోసహ ఏడు పద్యములే సెలవిచ్చిరి.

ఆకాశపురాణమునకు పద్యగద్యసంఖ్యానియమ ముండదు. సమయమునకు దగురీతి పురాణము పెంచుటయు ద్రుంచుటయు నుండును.

వాస్తవస్థితి పరికించినచో ఆకాశపురాణము జంటకవుల సొత్తనిపించును. ఒంటి కవి చెప్పినచో అంత రక్తి కట్టదు తానే పాడుట తానే డోలు వాయించుట వలె నుండును జంటకవులలో వాగ్మియైనవాడు వ్యాఖ్యానించుచుండును. వేఱొకడు గ్రంథమును జూచి చదివినట్లు సద్యఃపద్యగద్యకల్పనము కావించుచు జదువు చుండును. ఒక పద్యముకాగానే 'తదనంతరంబ' యని యాగును. ఆగి యాగక మునుపే, రెండవవాడు వ్యాఖ్యాన మారంభించును ఉన్నది లేనిది పద్యమును పిండి రసము దీసి చమత్కారము పండించును. ఈలోగా మొదటివాడు కథా కల్పనతోబాటు, గొంతుకయు సవరించుకొని, పద్య మెత్తికొనును. పురాణవక్త యిష్టుల బొగడవచ్చు, అనిష్టుల దెగడవచ్చు. వ్యాఖ్యాత మఱింత చిదుగవచ్చు, పొదుగవచ్చు.

ఆకాశపురాణము ఇటు అవధానులకు, అటు సభ్యులకు వినోదవ్యాపారమే.

అష్టావధానమున నొక ప్రసిద్ధకథ గ్రహించి, సాంగోపాంగముగా నిర్వహించుట కలదు. దాని కుదాహరణముగా మహమ్మదీయుల వివాహమహోత్సవ వేదికయందు జెప్పబడిన ముదుమాల సిద్దయ చరిత్రము చూడదగు.

ముదుమాల సిద్దయ చరిత్రము:

కం. జగములు సృజించు నెవ్వడు
జగములు పోషించు నెవడు సమయ మెఱిగి యీ
జగములు హరించు నెవ డా
జగదీశ్వరు నాద్యు నెంతు స్వాంతమునందున్.

వ॥ అని దైవస్తుతి గావించి నా వచింపంబూను ముదుమాల సిద్దయ చరిత్రంబునకుం గథాక్రమం బెట్టిదనిన-

కం. ఆదమ బీబీ సతిగా
దూదేకుల పీరుసాబు దొడ్డగృహస్థుం
డై దైవభక్తిపరుడై
యాదట ముదుమాల గ్రామమందు వసించున్.

ఆ. వె. పీరు ధీరు డింట బీసుకట్టియ వోలె
గోడ కానుకొనియె గొఱత దోచి
కొఱత యేమి లేదు కొడుకులు లేరని
వంశవృక్ష మిగురు పట్టదనియు.

వ॥ ఇట్లు చింతించుచు బీరుదంపతులు-

కం మందులు మ్రాకులు దినుచుం
బొందుగ మంత్రములు యంత్రములు పెట్టె యా
క్రింపించుచు నీళ్లల మా
ద్రిం ద్రవ్యము కర్చు చేసిరి సుతాపేక్షన్.

చం. తలపగ నింటనొంటగల తైలము మాయము గాగ బిబ్బికిన్
నెల మసలెన్ గరం బరుచి నెక్కొనె గర్భము నిక్కె, సంపదల్
తొలగ పకీరు చందమున దోచు గృహస్థుడు పీరుసాబు, తొ
య్యలి యుదరమ్మునందు నిధి యబ్బునటంచును బొంగెనుబ్బునన్

వ॥ అంత-

తే.గీ. తల్లి జవ్వన మనెడి యుద్యానవనికి
గంద్రగొడ్డలియై పుట్టె ఘనశిరుండు
నాళవేష్టిత గాత్రుడై నాతులెల
ప్రేళ్ళు పిసికికొనుచు జూడ బిడ్డ డొకడు.

తే గీ జందెమును వేసికొని పుట్టె జానలార
వీడు తొలిజన్మమునయందు ద్విజుడొ యే మొ!
కాదు. సిద్దికా బచ్చా మృగాదు వనిరి
చేరి మాటాడు చుట్టపు బేరటాండ్రు.

వ॥ ఇట్లు చూలకోదక కులంబున నుద్భవించిన స్తనంధయుండు క్రమ ప్రవర్ధ మానుండగుచుండ, నజ్జకక్కపచంటి చండివాని నక్కున జేర్చుకొని. 'కొడుక!

నీయెత్తు బంగారు పోసి నిన్ను గొంటిమి నీవు పుట్టక మునుపు ఈ యింట నెక్కడ జూచినను బంగారే. అది దాయాదులకు జెందగూడదను నుద్దేశంబున సాధులకు సన్న్యాసులకు ధార వోసితిమి ఇపుడు మాకు మిగిలినది నీవే. నీవే మా బంగారు కొండ' వని ముద్దాడుచు మురియుచుండె.

తే గీ. వీధిలో నాడుకొనుచునుండ బిల్లవాని
జూచి సాముద్రికు డొకండు చోద్యమ-ది
వీడు సిద్ధయోగీంద్రుడై పేరు గాంచు
గవియు గాగల దని చెప్పె నువిదతోడ.

వ॥ ఆది బిబ్బీ యుబ్బి తబ్బిబ్బై నేనింక నేమియు బనిసేయ నక్కఱలేదు. నా కొడుకు కొక్కడే యందఱ నుద్ధరించునని కూర్చుండియుండె.

ఆ.వె. దూది యేకి యేకి ధూళి దోగుచు నోలి
వృద్ధుడయ్యె నంత బీరుసాబు,
పిల్లవాడు పెరిగి పెద్దవాడై చేతి
కందిరాడు వాని చంద మరుదు.

సీ. ఒకనాడు సన్న్యాసి నికరంబు వెంబడి
తలవంచికొని యూరు దాటిపోవు
మూలికల్గొని కల్వమున నూఱు నొకనాడు
రసవాది సాధుల ప్రక్క జేరి
ఒకనాడు తంబుర నూని యేలలు పాడి
పాడి చొక్కుచు సోలి వ్రాలు నేల
గంజాయి చిలుమున గదియించి యొకనాడు
గురువుల కందిచ్చు బరమభక్తి

పింజరి కొలాన బొదమియు బీరుసాబు
మతము ద్రొక్కక యేవేని బ్రతుకుదెరువు
కొఱకు బాటుపడక నిరంతరము గాగ
యోగసిద్ధుల వెదకుచు నుండె వాడు.

వ॥ బాతువుల గ్రుడ్లను కోడి పొదిగి పిల్లలు సేయు కోడి పేడదిబ్బ లెక్కి చిదిగి పిల్లల బిల్చు. పిల్లలు నీళ్ల గుంటలో దూకి గతుకుచుబోవు తల్లి త్రోవ తల్లిది: పిల్లల త్రోవ పిల్లలది కోడి పొదిగిన బాతు పిల్లవలె నప్పింజారి పోరడు, కని పెంచిన పితరుల బాసి తిరుగుచు, కందిమల్లయ పల్లెయందు వీర బ్రహ్మంబను గురూత్తముండు గలండని విని, యింట జెప్పకుండ వెడలిపోయె. పోయి-

తే గీ కందిమల్లయ పల్లెలో సుందరతర
మందిరాంతరమందు గోవిందమ దన
దాతొడఁజేర్చికొని. ముచ్చటల్ వచించు
రాజయోగి సన్నిధి కేగి యోజ నిలువ.

వ॥ మందిర మూలస్తంభంబుల మాడ్కి నిల్చియున్న గోవిందయ్య, ఓంకారయ్య, శివరామయ్య, పోతులూరయ్య యనబడు వీరయ్య నలుగురు కొడుకులలో జిన్నవాడు పోతులూరయ్య మండిపడి చేసన్న వాని బ్రక్కకు బిల్చి, దవ్వల నిల్పి, 'ఓరీ! నీదేకులము ? ఏల వచ్చితివి? చెప్పు' మని గద్దింప, సిద్ధ బాలుం డెగదిగ జూచి, 'ఏ కులమని వివరమడిగితే యేమని దెలుపుదు లోకులకు, పలుగాకులకు, దుర్మార్గులకు, ఈ దుష్టులకు .... ......... . ..

'ఇంటిలోపల కల్లు గట్టికొని, మంటలోపల రాట్నం బెట్టుక, కంటిలోపల కదురు బెట్టుకొని, ముక్కులోపల ఏకు బెట్టుకొని. చెవిలో బారా చేతికి దీసుక. నారాయణయను నరము తీసుకొని. అష్టాక్షరి యను తడక వేసుకొని, పంచాక్షరి యను పలక దీసుకొని, తకథిమి గుబదెబ గుబదెబ యేకిన కులమే నా కులము. ఇక నా రాకకు గతంబెఱింగించెద నాలకింపు' మని పెడమొగము బెట్టి బిరుసుగ నుత్తర మిచ్చు వాని యున్మత్త వైఖరి సహింపనోపక పోతులూరయ్య, 'ఓరీ పింజారీ! గంజాయి తల కెక్కెనదా' ? అని మెడబట్టి గెంటింప నంకించు తఱి లోపలనున్న బ్రహ్మగురుండు వాని తత్త్వ వాక్యములు విన్నవాడై చుట్ట చేత బట్టుకొని లేచి వచ్చి-

తే గీ. నాయనా' వీడు మనవాడు త్రోయవలదు
సిద్ధపదమును గోరి విచ్చేసినాడు,
బ్రహ్మకులజుడు పరిశుద్ధ భావపదుడు
లౌకికుడు కాడు సుమ్మని కేకరించె

తే.గీ, అదియ సందని యెంచి వీరయ్య కొడుకు
పట్టె వీరయ్య పాదముల్ గట్టిగ, 'అరె!
సిద్ధుడవు నిన్నెఱింగితి శిష్య! లెమ్ము
రమ్మ'ని గురుండు వాని శిరమ్ము నిమిరె.

వ॥ ఇంతలో గోవిందమ్మ వచ్చి, తన కాళ్ళకు మ్రొక్కిన సిద్ధుని కనికరించి, 'వీడు నా పంచమపుత్రుం' డని మన్నించె. అంత వీరయగురుండు-

పంచచామరము :

విభూతి పూసి బొట్టు పెట్టి వింతకూర్మి చెంగలిం
ప భక్తుడైన సిద్ధు శిష్యవర్యుగా గ్రహించి, త
త్త్వ భవ్యబోధ జేసి వాని బంధముక్తు జేసె, పా
పభంజనుండు స్వాంఘ్రిరక్తభక్తరంజనుం డొగిన్.

వ॥ మఱియు 'సిద్ధబోధం' బను గ్రంథంబు రచించె.

తే గీ. జాళ్ళు అప్పలకును మ్రొక్కరా దటంచు
దండిగా దనలో దేవు డుండె నంచు
తనువు తా గాదటంచు దత్త్వ మెఱిగించె
గురువరుం డనుభవపురస్సరముగాగ.

వ॥ అటుపై హేతువాదులగు కలియుగజనులు మౌర్ఖ్యంబున నేత్రాదివిషయ గోచరంబు గాని చిత్కళావిశేషంబు చూపింపుమని గేళి సేయుదురు గాన, అట్టి దుర్జనుల దర్శించి వశీకరించుకొను తెఱం గెరింగియుండవలెనని, యిల్లు వాకిలి, యాలు పిల్ల, కుంద కుదురులేని యేకాకి సిద్దయకు సరహస్యంబులగు మంత్ర తంత్రప్రయోగంబు లెరిగింప, నన్నిట నారితేరి సిద్ధయ దిట్టయయ్యె.

కం. ఆట బీరుదంపతులు మి
    క్కుటమగు పుత్రవిరహమున గుందుచు గురుపై
    బటపట పండ్లు గొఱుకుచు వి
    కటముగ దిట్టుచు నవాబు కడకుం జనుచున్

వ॥ కడపలో నవాబు కోర్టులో దావా వేసిరి. అది యెటువలె ననిన-కంది మల్లయపల్లె వీరయ్య యనబడు కంసాలిగురువు, బంగారువంటి మా కొడుకు సిద్ది మతికి వేదాంతపు దంకము వేసి యతికి, పన్నెలు చిన్నెలు మార్చి, తనయొద్ద గూర్చుండ బెట్టికొని, మా నోట మన్ను గొట్టినాడు. దేవరవారు విచారించి మా కొడుకును మా కిప్పింపవలసినదని అది విని నవాబు భగ్గున మండి, ముందుగా సిద్దిని బట్టుకొని రండని భటుల బంపిన తక్షణంబ చని వారు సిద్దయను రాజసముఖమున నిలిపిరి.

తే. గీ నల్ల కంకులగుండు చందాన నిల్చి
    రాజునకు దండపెట్టు మర్యాద మాని
    చూడ్కి లోపలికి మరల్చి శూన్యవృత్తి
    గదలకుండు సిద్దయ జూచి కడపతేడు.

తే. గీ. ఏమిరా! కండ కావర, మేల చేతు
    లెత్తి మ్రొక్కవు నా కన నిట్టు లనియె.
    గురుడు గాక, నా మ్రొక్కును గొని భరింప
    జాల డితరుడు పగిలి పిచ్చలగు జుమ్ము.

వ॥ అనవుడు నవాబు 'గండశిల దెప్పింతు. మ్రొక్కి దానిని పగిలింతువా? లేకున్న నీ గుండు పగులు' ననియె. సిద్దయ సరే యనియె. గుండు వచ్చె. దండ జేరి సిద్ధుండు-

కం. గుతి జూచి 'సద్గురో' యని
    కరములు పైకెత్తి మ్రొక్కి కలయగ జల్లెన్
    గురు డిచ్చిన బూడిద, జె
    చ్చెర బటపట విచ్చి గుండు చెడి సున్నముగాన్.

వ॥ గుండుతోబాటు నవాబు గుండె గూడ బగిలె సిద్దయ్య యందల మెక్కె. జనములు గుంపులు గుంపులై యిసుక చల్లిన నేల రాలకుండ వచ్చి మూగి యానందతాండవ మాడుచు-

శా. వీడా? వీరయశిష్యుడై సభలలో వింతల్ ప్రదర్శించెడిన్
వీడా? ముక్తివధూకుచద్వయి పయిన్ గేల్దమ్మి నాడించెడిన్
వీడా? యేలలు పాటలుం బదములున్ నిర్మించి విన్పించెడిన్
బాడబ్యంబు నధఃకరింపగ గలిన్ దా బుట్టెబో దిట్టయై.

వ॥ అని యిట్లు వివిధజనమ్ము లెగజూచుచు బలుకుచుండ, దత్ప్రతిష్ఠ విని, తజ్జననీజనకు లేతెంచి, తనయుని వైభవము గాంచి మోకరిల్లిరి. ఇట్లు గురుప్రతిష్ఠ కోటికెక్కించి తిరిగి వచ్చిన శిష్యుని గౌగిలించికొని, వీరగురుండు తన విద్య లన్నియు మూలముః మ్మట్ట నెఱింగించి యుండునంత వర్షర్తు వరుదెంచె.

తే గీ బ్రహ్మము త్ర్యశీతి వృద్ధుడై పండి, బండి
నడుపగా నేల? యిక జాలు, నడుపుకొనుడు
కనుగలిగి మీరు మీరని యనునయించి
స్వజనుల, సమాధి గననెంచె స్వాంతమందు.

తే గీ. సిద్దయను జూచి, నాయనా! సిద్ధ! యడవి
పూల తేనెలు పిండితి ముంతకెత్తి
బిడ్డలకు ద్రావ బోసితి వృద్ధు డైతి
బూవు లిక నీవ తేవలెబో! వనాళి.

వ॥ అనినంత, తలవంచికొని సిద్ధయ బుట్ట తీసికొని పూలకు బోయె దారిలో గాలి వాన చిక్కించికొని యిబ్బంది పెట్టగా ప్రయాసపడి పూలు కోసికొని, మగిడివచ్చుసరికి గురుడు సమాధిగతుండై యుండె. అది యెఱింగి సిద్దయ్య వెకిలినవ్వు నవ్వి, పువ్వులు వెదచల్లి-

తే. గీ. గురుడ! నాకంటె మూర్ఖుండు ధరణి లేడు
పూలు తెమ్మంటివని యెంచి మోసపోతి,
అంతరార్థ మెఱుగలేని యధము డైతి
నీకు దగు శిష్యుడను గాను నిజము, తండ్రి!

వ॥ తండ్రీ! నా మొగాన నీ పాదుకలైన పాఱవేయగూడదా? అని యేడ్చుచుండ చిలుకపచ్చ చీర కట్టుకొని, మొగమున బసుపుకుంకుమలు కలకలలాడ, గాజులు మట్టెలు గలుగల్లురన సాక్షాదిందిరాదేవి చందమున గోవిందమ్మ కదలి వచ్చి, సిద్ధుని కటాక్షించి, 'నాయనా! యివిగో పాదుకలు. గురుడు నీకిమ్మని సెలవిచ్చి నాడు. చేకొని యింటికి బొమ్ము. పెండ్లి చేసికొని రాజయోగము సాధింపుము. ఇది గుర్వాజ్ఞ!' యనె. సిద్ధుండు మహాప్రసాదంబని పాదుకలు స్వీకరించి, 'అమ్మా! నాయన మీకేమిచ్చినాడు?' అని యడిగె గోవిందమ్మ 'నేనేమియు నడుగలేదు. చిన్నవాడు పోతులూరయ్య గొల్లున నేడ్చుచు, 'మాకేమియు పనిపాటలు చేతగావు. నీవు పోయిన మేమెట్లు బ్రతుకగలము తండ్రీ?' యని కాళ్ల పట్టుకొనగా గురుండు మందగంభీరస్వరంబున 'మీరేమియు శ్రమపడ నక్కఱలేదు. నా సమాధి చూపెట్టు కొనియుండుడు చాలు. నా వంశపరంపరకు కలియుగాంతము వరకు రాజభోగ వసంతముగా గాలము గడచును' అని యనుగ్రహించి, కన్ను మూసెనని, గురు నిర్యాణోదంత మెఱిగింప, జెమ్మగిల్లు కన్నులతో సిద్ధయ్య గురుసమాధికి బ్రణ మిల్లి, పాదుకలు కన్నుల కద్దుకొని, చని, గృహస్థుండై ధన్యుండయ్యె- అని యిట్లు మితోక్తి మధురమ్ముగా-

తే.గీ. కందిమల్లయపల్లె కర్మందిమౌళి
వీరగురు శిష్యముఖ్యుడై వెలసె నెవడు
అట్టి సిద్ధయ చరితమ్ము నాశుఫణితి
నంబరపురాణ లీల సుబ్బన్న పలికె.

వ॥ కోకటగ్రామాష్టావధానప్రోక్తమైన యాకాశపురాణము సమాప్తము.

(శతావధాన ప్రబంధము. ద్వి. ఖండము.)

—: o :—

# పు రా ణ ము

'పురాణం పంచలక్షణమ్'. అష్టాదశ పురాణములలో భారత భాగవత పురాణములే సుపరిక్షుణ్ణములు.

'పురాణ గాథలన్ దుర మొనరన్ నెదుర్కొని యర్థము సెప్పి' మెప్పింతు మని శ్రీ తిరుపతి వేంకటేశ్వరులనిరి 'దుర' మని నిర్దేశించుటచే యుద్ధపంచకమని, యుద్ధమనిన భారత యుద్ధమని యూహింపవచ్చును.

ఏ వేదాంతగహన వచనమో, యే యుత్ప్రేక్షాద్యలంకారసంకుల ప్రకృతి వర్ణన సంబంధి పద్యసముచ్చయమో, యే భగవత్స్తుతిరూప చిత్రబంధశ్లేష పద్య దండకాది విస్తరమో చదువగూడదని స్పష్టపఱచిరని కూడ దెలిసికొనవచ్చును.

అష్టావధానమున పురాణ పఠన మొక లాంఛనము పౌరాణికుడేదో ఘట్టము జదువును. అదేమి మత్స్య పురాణము కాదు, మార్కండేయ పురాణము కాదు. బ్రహ్మాండ బ్రహ్మవైవర్త వామన వారాహ పురాణములు కావు. భారతము. అందును యుద్ధ పర్వము. కొట్టిన పిండి. పృచ్ఛకు డెక్కడ ఎత్తికొన్నాడన్న యభిజ్ఞ యున్న జాలు. జాలు వెంట కథ పట్టుకొని పోవచ్చు. అవధానికి లెక్క లేదు. కాని, సభ్యులకు లెక్కయే. పురాణ పఠనవేళ భయానక బీభత్స రౌద్రాది రసములయందు జొక్కి వినుచుందురు. పురాణశ్రవణ ఫలము సభ్యులకు పూర్ణముగా దక్కును. పురాణ వివరణశ్రమ మవధానికి గలుగదు అవధాని కది యానుషంగిక వ్యాపారమే కాని, ప్రధాన వ్యాపారము కాదు. కవిత్వ నిర్మాణమే యతని ప్రధాన వ్యాపారము తెలిసిన కథ కనుక, కనులు మూసికొని చెప్పుకొనుచు బోవుచుండును. అతని దృష్టి కవితారచనాలగ్నమై యుండును.

ఏదో పురాణము దంకబెట్టికొని వచ్చి, యెక్కడనో మారుమూల దీసి, యూరు పేరు లేని పద్యము నెత్తిచదివి, 'అవధానిగారూ! ఇహిహి! ఇది యే పురాణము? ఏ ఘట్టము? ఏ కథ? సెలవిం'డని పృచ్ఛించినచో అవధాని తనకు

పరిచితమైన పురాణ కథలోని పద్యమైనచో చెప్పగలడు కానిచో చెప్పలేడు సకల పురాణ సకల కథా ప్రపంచము కరతలామలకముగా నుండెడి పౌరాణికుడైనను ఏక పద్య శ్రవణమాత్రమున తత్కథాసందర్భాదు లెఱుగుట కష్టము. అవధాన సభా పురాణ కథా ప్రయోజన మది కాదు.

నిషేధాక్షర వ్యస్తాక్షరాది శుష్క జటిల విషయము లరసి విసిగి వేసరు సభ్యులకు పురాణకథారసావగాహన మొక హాయితోడి సుఖలీల దాయియం దొక క్షణకాలము చొక్కి నవోత్సాహకందళిత హృదయారవిందు లగుదురు.

'కావ్యపాఠ' మనగా రఘువంశాది నిత్యపాఠప్రవచన యూధ కావ్యపాఠమై నట్టులే పురాణ మనగా భారత భాగవతాది సుప్రసిద్ధ పురాణ గ్రంథము.

దుర మొనరన్ బఠింపగ నెవర్కొని యర్థము సెప్పుటయేకాదు, సరస కథా ఘట్టములు ఆదిసభారణ్య విరాటోద్యోగాది పర్వతముల నుండి, భాగవతము నుండి తీసి పఠించుటయు కలదు

రామాయణ కథ నిషిద్ధము కాదు. కాని, దాని నంతగా నెన్నికొనరు. కారణము - తెనుగున పురాణ ప్రవచన యోగ్యమైన రామాయణ కావ్యము వెలువడి యుండక పోవుటయే.

—: o :—

# న్యస్తాక్షరి లేక నిర్దిష్టాక్షరి

పృచ్ఛకుడు వరించిన వృత్తమున, నిర్దిష్టస్థానములందు, దత్తములయిన యక్షరములు న్యస్తము గావించి, కోరిన విషయము జెప్పుట న్యస్తాక్షరి దీనినే నిర్దిష్టాక్షరి యనియు నందురు.

ఈ న్యస్తాక్షరి దత్తాక్షరి వంటిదే కదా యనవచ్చు. దానికి దీనికి పోలిక లున్నవి కాని, దీనిలో క్లేశ మధికము. దత్తాక్షరిలో దత్తాక్షరము లెక్కడ పొసగిన నక్కడ పొసగించి కొనవచ్చు. దీనిలో దశమాక్షర మనిన దశమాక్షరమే పంచమాక్షరమనిన పంచమాక్షరమే.

న్యస్తాక్షరి ప్రశ్న మిట్లుండును

వర్ణ్యవిషయము మురారిజీ ప్రధాని యగుట. వృత్తము ఉత్పలమాల ప్రథమ చరణమున దశమాక్షరము 'ష్వ', ఏకాదశాక్షరము 'క్ష'. ద్వితీయ చరణమున ద్వితీయాక్షరము 'గ్ర', అష్టాదశాక్షరము 'క్లే'. తృతీయచరణమున ప్రథమాక్షరము 'భీ' అష్టమాక్షరము 'క్ల'. చతుర్థచరణమున దశమాక్షరము 'ధా', వింశతి తమాక్షరము 'గో'.

ఇట్లు కోరినచో నిర్వహించుట సుసాధము గాదు.

ఏల యన వర్ణ్యవిషయ మాధునిక మగుటచే, పురాణదేవతాస్తుత్యాది సందర్భము లందువలె, క్లిష్ట శ్లిష్ట శబ్దములు కూర్చి సరదుకొనుటకు వీలు తక్కువ.

ద్వితీయపాద ద్వితీయాక్షరము 'గ్ర' నిర్దేశించుట పద్యప్రాసాక్షరము రేఫశ్లిష్ట గకారము నిర్దేశించుటయే.

ప్రథమపాద దశమాక్షరము 'ష్వ' ఇదొక సమస్య. ఉత్పలమాలలో దశ మాక్షరము గురువు. నవమాక్షరము లఘువు. ఇష్వ, విష్వ శబ్దములు వచ్చుటకు

పీలులేదు. 'ష్వ' తో మొదలగు పదములే యుండవలెను అట్టివి లేవు. పదవది 'ష్వ'. పదునొకండవది 'క్ష'. కాగా 'ష్వక్ష' పదము కావలెను. దీని కర్థ మున్నదా? పైగా ష్వవర్ణము యతిస్థానమున నున్నది. కనుక దానికి సరిపడు మిత్రవర్ణముతో, గ్రప్రాసముతో బద్య మారంభింపవలెను. అన్ని నిర్బంధముల కగ్గమై రూపు దిద్దుకొన్న పద్య మిది.

ఉ. వ్యగ్రమతుల్ జగజ్జనులు ష్వక్షతబోధ సముత్థితుల్ ప్రచం
డాగ్రహరంజితాస్యు లొక యగ్నివిధమ్మున రేగి, క్లేశమున్
భీగ్రథితమ్ము నోర్చి శ్లథవృత్తుల పైకొని గెల్పుగూర్ప బ్ర
త్యగ్రమురారి భాసిలె బ్రధానిపదమ్మున నేడు వీడుగో!

(శతావధాన ప్రబంధము ద్వి. ఖం.)

షః = విద్వాంసుడు ష + అక్షతబోధ = ష్వక్షతబోధ. అనగా జయ ప్రకాశ నారాయణచరణుల వంటి విజ్ఞుల యవితథబోధ. తక్కినవి సాధారణములే.

నిరాటంకముగా నిర్దిష్టాక్షరి నడిపించుటకు వీలు కలిగించు ప్రశ్నములు నుండును. అవి యెట్టివనిన - ద్రౌపదీ స్వయంవర, సభావర్ణనము, చంపకమాలికా వృత్తము. ప్రథమపాదమున 5 వ యక్షరము 'రా'. 12 వది 'ద'. ద్వితీయ పాదమున 11 వది 'జే', 20 వది 'త్ర'. తృతీయపాదమున 1 వది 'బ', 21 వది 'వీ'. చతుర్థపాదమున 6 వది 'చ్చ', 15 వది 'ఢ'. ఈ ప్రకార మిచ్చి నపుడు పద్యము నల్లేరుపై బండివలె నడచును.

చ. అల ధృతరాష్ట్రనందనులు యాదవవీరులు బ్రాహ్మణాకృతిన్
బెలగెడు పాండునందనులు జేడియ ద్రౌపది మత్స్యయంత్రమున్
బలుమఱు జూచుచున్ గుటక వైచుచునుండగ బార్థుతుండు వీ
రులగని హెచ్చరించె ధ్వని రోదసి నిండ గుణంబు మీటుచున్.

(శతావధానము ప్రబంధము. ద్వి. ఖం )

చరణమునకు రెండు వర్ణములు కాక యొక వర్ణమే యిచ్చిన. పని మఱియు దేలిక యగును.

—: o :—

# ఛందోభాషణము

ఛందోభాషణమునకు లక్ష్యముగా శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రిగారీశ్లోకము ప్రకటించిరి.

పృచ్ఛకు డడుగుటయు, నవధాని బదులు నుడువుటయు ఛందోబద్ధపణితి క్రమముగా నుండును.

పృచ్ఛక :- దృష్టం కిం భవతా చిదంబరకవే?
కవి :- కిం నామ?
పృచ్ఛక :- తీవ్రం భయమ్.
కవి :- దృష్టం జ్ఞాతి భయమ్
పృచ్ఛక :- తథా.
కవి :- త దధికం నాస్త్యేవ లోకే భయమ్.
పృచ్ఛక :- కస్మాత్ ?
కవి :- తే తు న మర్షయంతి కుటిలాః
పృచ్ఛక :- కమ్ ?
కవి :- సాధకమ్.
పృచ్ఛక :- కం పునః ?
కవి :- విద్యావంతమ్.
పృచ్ఛక :- అథ ?
కవి :- ప్రధానమ్.
పృచ్ఛక :- అపరమ్ ?
కవి :- ఖ్యాతమ్.
పృచ్ఛక :- తతః ?
కవి :- ధార్మికమ్. (అవధానాదర్శః)

జ్ఞాతులు పరమదుష్టులు విద్యావంతుడు, ప్రఖ్యాతుడు, ధార్మికుడు అయిన వ్యక్తిని నిష్కారణద్వేషముతో, ఈసుతో ద్రొక్కజూతురు. యథార్థము చెప్పిరి.

పూర్వకవులలో నడిదము సూరకవి ఛందోభాషణము చేసెడివాడని ప్రతీతి. చాటువులలో ప్రశ్నోత్తర రూపమున నొక కందము కనబడుచున్నది.

ప్రశ్న - ఈరెయ్యది ?
ఉత్తరము - చీపురుపలి.
ప్రశ్న - పేరో ?
ఉత్తరము - సూరకవి.
ప్రశ్న - ఇంటిపేరు ?
ఉత్తరము - అడిదమువార్.
ప్రశ్న - మీరాజు ?
ఉత్తరము - విజయరామ మహారాజు.
ప్రశ్న - అతడేమి సరసుడా ?
ఉత్తరము - భోజు డయా !

ఈ కందపద్య 'ముత్తరాలంకార' నిబద్ధమే కావచ్చు. పద్ధతి సూచించుట కుదాహరించితి.

ఇట్టి ధోరణి యవధానమున వినోదప్రదముగా నుండును.
అవధాని యేదో యోజించికొనుచుండువేళ కనిపెట్టి పృచ్ఛకుడు-

'ఆలస్యంబుగ నిద్రలేచితివా? ఆహారంబు లోపించెనో? యేలా? పద్యము జెప్ప మాంద్య మవధానీ!' అని సోల్లుంఠనముగా పద్యము నెత్తి నడుమ వదలి వేయును. అతడారంభించిన పద్యము శార్దూల విక్రీడిత వృత్తమని గ్రహించి, యవధాని తదనురోధముగా - 'మాంద్యమున్ గింద్యమున్ హేలాకల్పిత సత్ప్రబంధులకు మా కేలాగునం గల్గెడున్ జాలుంజాలు, శశమ్ము లడ్డు పడినన్ శార్దూలముల్ నిల్చునే? అని పూరించును.

ప్రశ్నోత్తరచాకచక్యము ప్రదర్శించుటకు సీస పద్యములు బాగుండును.

పృచ్ఛకుడు :- సీ. భోజన మెక్కడ బొసగెనో యవధాని?
అవధాని :- పూటకూటింటనో బుధవరేణ్య!
పృచ్ఛ :- రేపును నిల్తురా, యీ పురమ్మున?
అవ :- రసజ్ఞుల దయయున్నచో నిలువగలను.
పృచ్ఛ :- ద్రవ్య మేమాత్రము దక్కించికొందురో?
అవ :- శ్రీదేవి కరుణచే రాలినంత.
పృచ్ఛ :- ఆడుదురా. అసత్యమును మీరెపుడైన?
అవ :- ఒరులకు నపకృతి జరుగకుండ.
పృచ్ఛ :- త్రాపుదురె మీర లలవాటు తప్పకుండ?
అవ :- త్రావకున్న గావ్యకథాసుధ ఫల మున్నె?
పృచ్ఛ :- బళిర! మెచ్చితి విజయమ్ము బడయు మన్న!
అవ :- సహృదయ! కృతజ్ఞతాంజలి సంఘటింతు.

ఇది ప్రశ్నోత్తర విస్తరమైన సీస పద్యము.

పృచ్ఛకు డొక పద్యము నుడివిన, నాటక రంగమునందు వలె, అవధాని యొక పద్యము నుడువవచ్చు ఎవరు మొదలించిన పద్యము వారే తుదిముట్ట పూర్తిగా జెప్పుట సులభము. ఉన్నట్లుండి పృచ్ఛకుడు- 'అవులే నాకు రహస్య మెల్ల విదితంబయ్యెన్' అని పండ్లిగిలించును అపుడు అవధాని తొణకక బెణకక- 'బళా! మంచివాడవు నీకేమి చిదంబరస్థుంము జాడల్ దోచెనా?' అని యెకసకియ ముగా నను. పృచ్ఛకుడందికొని, 'కాదు, కాదు విలోకించితి దొంగచాటున నెదేదో తొంగి వీక్షించుటల్' అని వదలును. అవధాని- 'కవితాదీక్షితు లంతరంగ నయనుల్ గారే? దెపల్ చూతురే?' అని సమాధానించును. ఇది పరుస.

ఇట్లు ఛందోభాషణ మష్టావధానమున రక్తి కట్టును.

—: ○ :—

# కావ్యపాఠము

'రఘువంశమ్మునలో నొక విద్యార్థికి నొక్క శ్లోకము క్రమముగా బాఠము చెప్పబడినది' అని కావ్యపాఠము గురించి, శతావధానసారానుబంధమున వివరింపబడినది.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు దీనినే కావ్యోక్తి యనిరి.

ప్రాయశః అష్టావధానమున రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశ, కిరాతార్జునీయ, శిశుపాలవధ కావ్యపంచకము పాఠ్యముగా గైకొందురు.

అందును గాళిదాసీయ కావ్యత్రయమునే ముఖ్యముగా గైకొందురు వానియందును రఘువంశ కుమారసంభవకావ్యములను. అందును ప్రథమ ద్వితీయ సర్గలను గైకొందురు తృతీయ సర్గ దాటి పోవుట యరుదు.

ఈ శ్లోకము లింటియొద్ద విద్యార్థులకు చెప్పిచెప్పి గట్టిపడినవై యుండును. సభలో పృచ్ఛకుని చట్టుగా భావించి లీలగా విప్పి చెప్పివేయుదురు.

ఏ ద్వ్యర్థికావ్యమో తెచ్చి వ్యాస ఘట్టము లెత్తి చదువుట, వ్యాఖ్యానించుట యుండదు.

సుప్రసిద్ధ కావ్యశ్లోకములు చదివి, పదచ్ఛేదము, అర్థము, ఆకాంక్ష, శబ్దరూప సమాసములు, వ్యాఖ్య చెప్పబడును.

—:o:—

# చిత్రకథ

ఆకాశపురాణము పద్యగద్యాత్మకముగా నుండును. చిత్రకథ శుద్ధముగా గద్యబంధము. విధిలో రచనకన్న కల్పనకే ప్రాధాన్యము తడవ కొకింత చొప్పున నాలుగు తడవలలో బూర్తి చేయబడును.

హాస్యభరితమైన శ్రీ కాశీ కృష్ణాచార్యులవారి చిత్రకథ యుదాహరణీయము.

**కథారంభము**

మున్షీగారు :- ఏమమ్మా! పిచ్చక్కా! రేపు దొరగారు జమాబందీకి గాను చీరాల మకాం వేసికొన్నారు. వారితోబాటు నేను గూడ చీరాలకు వెళ్లవలెను. వారు ఏడుగంటలకే చీరాల చేరుదురట. వంట చేసి పెట్టుటకు నాతో గూడ నీవు వచ్చెదవా?

పిచ్చక్క :- మహాప్రభో! తమ సెలవయితే రావటాని కేమభ్యంతరమ్? అలాగే వస్తాను. కానీ-

మున్షీ :- కానీ అన్నావేమిటి? కానీని అర్థణాను. అదేమిటో చెప్పు దబ్బున.

పిచ్చక్క :- ఏమీ లేదండి. ఇంటి దగ్గర కంటె సర్కార్యాల్లో పని యెక్కువ ఉంటుంది గదా, దాంతోబాటు నాకు కష్టమున్నూ ఎక్కువే కదా! అదే నాకు సందేహం, తమకు తెలియని దేమున్నది?

మున్షీ :- తమకు తెలియని దేముందంటావు? నీవలెనే నేనున్నూ పూర్వ సువాసినినై యెవరింట్లోనైనా వంటకు కుదిరినా ననుకొన్నావా? యేమిటి? ఆ కష్టమే మిటో దానికి పరిహార మేమిటో నీవే చెప్పు.

పిచ్చక్క :- చిత్తం మనవి చేస్తేలేదండి. ఈ కొద్ది జీతముతో నేనంత కష్ట పడలేనేమో నని భయ మండి.

మున్షీ :- నీవెన్నడైనా జమ బందీ సర్క్యూటులో నెవరితోనైనా వెళ్లావా?

పిచ్చక్క :- నేనెన్నడూ వెళ్లలేదండి, అలా వెళ్లేదానను గూడ కాను. ఏమో యింత 'లంకాయోగం' పాడుకుంటూ, దేముడి దీపం పెట్టుకుంటూ, మీబోటి వారి యండ జేరి రామా కృష్ణా యనుకొంటూ కాలక్షేపం చేస్తూ వుండేదాన్ని కాని, మఱోటి కాదండి.

మున్షీ :- అందుచేతనే జమాబందీసర్క్యూటు విషయమై నీకు బొత్తుగా తెలియటం లేదు. చెప్పుతా విను. మాబోటివాళ్ల దగ్గరనుండే వంటవాళ్లకుగాని, నీళ్ల వాళ్లకు గాని జీతాలూ నాతాలూ ఉండవు. తెలిసిందా? కాని వాళ్లు మమ్మును సంతోష పెట్టుచుండవలె.

పిచ్చక్క :- అదేమిటండి, అలా సెలవిస్తారు! జీతనాతాల్లేకుండా మన్ను కొట్టుకొని మంచినీళ్లు తాగుతారా యేమిటండి?

మున్షీ:- ఆ తిరుగుడే నీకు తెలియదు. యేమిటంటే-జమాబందీ సర్క్యూటంటే మా యిళ్లల్లో ఉండే నౌకర్లకు బంగారపు పంటనుకో. తెలిసిందా? నీవొకమాఱు నాతో సర్క్యూటు వస్తే, నన్ను నెలజీత మడుగనే అడుగవు ఇది దీని రహస్యము సుమా!

పిచ్చక్క:- అయితే వస్తానండి తరువాత తమ చిత్తము. నా ప్రాప్తము

మున్షీ :- మనము ఈ రాత్రి తొమ్మిదిగంటలకు బోంచేసుకొని, బయలుదేరి తెల్లవారుసరికి దొరగారి కంటె ముందే చీరాల చేరవలె సుమా! నీవు గుఱ్ఱమెక్కి రాగలవా?

పిచ్చక్క :- అయ్యో! నా సిగ్గు చిమడా. నా పెళ్ళిలో నా ఊరేగింపు గుఱ్ఱము మీదనే పేలాలు వేగిందండి. అపుడు తాషా మరపా సాయిబు, ఒక్క పెట్టున తుఱ్ఱుమని వాయించే సరికి గుఱ్ఱం బెదరి, మమ్మును పడేసి, పెళ్ళి

కొడుకును బెడాబడా తొక్కించదండి మొండిముండను నన్ను తొక్కరాదూ-దాని తోనే పదహారోజుల పండుగ లోగానే మావారు పరంపదించారు నేను మాత్రం ఇట్లా మొండి బ్రతుకు బతికి యున్నానండి. అప్పటినుంచీ నాకు గుఱ్ఱమంటే చచ్చే భయమండి

మున్షీ :- అవున్లే నాదే పొరపాటు యాభైయేళ్ళ పూర్వసువాసినిని గుఱ్ఱ మెక్కించడ మేమిటి? మా యింట్లో సవారీ ఉన్నది గాని, యిక నీవు దాని మీదరా పోనీ.

పిచ్చక్క :- అయ్యో! నా కర్మం కాలా బోయీలు ఓం ఓం అని సవారీ మోసుకొ పోతూంటే, 'యెవరా సవారీలో' అని యెవరయినా అడిగితే నాకు చచ్చిన చావు కాదండీ!

మున్షీ:- అవును. అదీ నిజమే. ఆ. మఱచిపోయినాను మీ తమ్ముడొక డుండాలెగా? వాడి పేరేమి?

పిచ్చక్క :- వాడిపేరు వెఱ్ఱయ్యండి.

మున్షీ:- వాడీ ప్రయాణంలో పనికి వస్తాడా?

పిచ్చ:- ఆ. తప్పకుండా పనికి వస్తాడు. ఇట్లాంటి సమయాల్లో వాడే మీ బోటివారి దగ్గర నుండాలి.

మున్షీ :- అయితే చాలా బాగావుంది. మేము సవారీ మీద వెళ్ళుతామ్. వెఱ్ఱయ్య గుఱ్రం మీద వస్తాడు.

పిచ్చ:- వస్తాడు - కానీ .. ....

మున్షీ :- మళ్ళీ కానీ పెట్టావేమిటి ?

పిచ్చ:- వాడీ కొద్ది జీతమున కొప్పుకుంటాడో, ఒప్పుకోడో అని అనుమానం.

మున్షీ :- నేనిందాక చెప్పితినిగా, జమాబందీ సందర్భ మంతా.

పిచ్చి:- చెప్పారుగాని, 'యిది దీని రహస్యం' అని ఒకమాట చెప్పారు. అందుకోసమని నా కనుమానం.

మున్షీ :- అయితే నీ జీతం వాడి కిప్పిస్తాన్లే.

పిచ్చి :- ఇప్పిస్తారు గాని, స్వల్ప జీతమని యేడుస్తాడేమో!

మున్షీ :- వాడి తెలివి తేటలు. పనిపాటలు చూడవద్దూ ?

పిచ్చి :- అబ్బో! అఖండుడండి ఒక్కమాఱు చూస్తే మీరు వాన్ని వదలరు. మహా చురుకైనవాడు. జీతం వృద్ధి విషయంలోనే తమరేమయినా సెలవీయవలె.

మున్షీ :- ఓసి పిచ్చిదానా! అట్లా భయపడతా వేమమ్మా? వాడు పనిచేసి, మమ్మును మెప్పించి, మేము సంతోష సమయంలో నున్నపుడు జ్ఞాపకం చేసుకొంటే అపుడు జీతం వృద్ధి మాట ఆలోచిస్తాము.

పిచ్చి :- చిత్తం అయితే నేను వెళుతానండి.

మున్షీ :- ఆ వెట్టియ్యతో చెప్పు. రాత్రి తొమ్మిదింటికే బయల్దేరి యిక్కడికి వస్తే గుఱ్ఱం సిద్ధంగా ఉంటుంది. నిద్రకు బద్ధకించక వెంటనే బయల్దేరి పొమ్మను. మాకంటె వెట్టియ్య ముందుగా చీరాల చేరవలె ఆక్కడ కరణం అంధోజీరావును కలుసుకొమ్మను. ఆతడు బస వగైరాలు యావత్తు సప్లయి చేస్తాడు

పిచ్చి :- అదంతా నాకు తెలియదు. మీ దగ్గరకు పంపుతాను మీ రేచెప్పి కట్టుదిట్టము చేసుకోండి వాడును కొత్తవాడు

మున్షీ :- సరే, యేడ్చినట్లే ఉంది అయితే ముందు పంపించు.

.... .... ....

(వెట్టియ్య మన్షీగారి యొద్దకు వచ్చినాడు )

మున్షీ :- ఏమోయి వెల్లియ్యా, మాతో సర్క్యూటు వస్తావా ?
వెల్లియ్యా :- ఆ వస్తానండి.

మున్షీ :- నీవు త్వరగా భోంచేసి, వెంటనే మా గుఱ్ఱం మీద నెక్కి రేపు తెల్లవారక మునుపే చీరాల చేరవలె.

వెల్లియ్య :- ఏం గుఱ్ఱమండి ?

మున్షీ :- ఓయబ్బో! బేతాళుడు లాగున్నాడు ఏం గుఱ్ఱమని అడుగుతాడు మన గుఱ్ఱమా- చిన్నది, పొట్టిది. పీడా? తాటిచెట్టంత యున్నాడు-అని యనుకొనుచు, ఏం గుఱ్ఱమని అడుగుతావేమోయి? అని వెల్లియ్య నడిగాడు.

వెల్లియ్య :- చిన్నప్పుడు సంకుమూరి గుఱ్ఱాలమీద స్వారి చేసే వాణ్ణండి. తమ గుఱ్ఱమెటువంటిదో అని అడిగానండి.

.... .... .... (అవధాన యాత్ర.)

ఈ రీతిగా అష్టావధానము పూర్తియగు లోగా కథ పూర్తియగులాగున చెప్పబడును. కథ స్వకపోలకల్పితము.

—: o :—

# శతావధానము

చతుర్విధకవిత్వ భేదములలో ఆశుకవిత్వ మాద్యము.
ఆశుకవిత్వ భేదములలో శతావధానము ప్రధానము.

గీర్వాణవాఙ్మయమున చతుర్విధకవిత్వ ప్రసక్తియే లేదు కనుక, శతావధాన ప్రక్రియలేదని వేఱుగ చెప్పవలసిన పనిలేదు.

శతావధానము తెలుగువారు తీర్చిన విలక్షణ విద్యావిధానము.

కాకతిప్రతాపరుద్రునిచే కనకాభిషేక సత్కారము పొందిన తెలుగువాడు కొలచెల్మ మల్లినాథుడు - శతావధానవిఖ్యాతుడు. ఇతడు వ్యాఖ్యాతృచక్రవర్తియగు మల్లినాథసూరి పితామహుడు.

'కొలచెల్మాన్వయాబ్ధీందు ర్మల్లినాథో మహాయశాః
శతావధాన విఖ్యాతో వీరరుద్రాభివర్షితః.'
(శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మీగడతరకలు.)

ఆంధ్రుల సొత్తు నాదగు శతావధాన ప్రక్రియ కితడు మూలపురుషుడని పరిశోధకుల దృఢమైన యభిప్రాయము. (మల్లినాథసూరి జీవితము. రచనలు)

ప్రతాపరుద్రప్రభు రాజ్యకాలము క్రీ.శ. 1295 - 1323.

'నెల్లూరి తిరుకాళ మనుజవిభుని సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెఱసి, మహిమ గాంచిన పెద్దయామాత్య సుకవి' శతావధాన ప్రసిద్ధుడు కాడు కాని, 'యెవ్వ దేయవధాన మెఱుగు, నయ్యవధానమున వానికించుక ముల్లు సూప నేర్తు' ననిన వాడని యతని మనుమడు జక్కనచే విక్రమార్క చరిత్రమున బేర్కొన బడినవాడు. ఈచో బ్రసక్తుడయిన తిరుకాళమనుజ విభుడు క్రీ.శ. 1285 ప్రాంతస్థుడు.

పెద్దయ స్వభావము పోట్లగిత్త వంటిది- కాలుద్రవ్వి అంతె గొట్టుట. ఈతని యతిలోక విద్య లనేకములు ఒక సీసమాలిక యందు జక్కనయే వివరించెను.

సీసమాలిక :

సంస్కృత ప్రాకృత శౌరసేన్యాదుల
        ఘటికలో నొక శతకంబు జెప్ప
ప్రహసన ప్రకరణ భాణాది బహువిధ
        రూపకంబులయందు రూఢిమెఱయ
జక్ర చతుర్భద్ర చతురుత్తరాదిక
        క్షుద్ర కావ్యములు పెక్కులు రచింప
నాంధ్రకవిత్వంబునందు బ్రబంధంబు
        మేలుగా దజ్జ్ఞులు మెచ్చ జెప్ప
నిమ్ముల నేరీతి నేధాతువుల నేమి
        రసమునన్నైన వర్ణనము సేయ
సరి యేకసంధా ద్విసంధా త్రిసంధల
        దొడరిన బోరిబోరి గడవ జదువ
నెవ్వ దేయవధాన మెఱుగు నయ్యవధాన
        మున వాని కించుక ముల్లు సూప
వృత్తకందము గందవృత్తంబునుం జతు
        ష్కందంబు మొదలుగాగలుగు గర్భ
కావ్యవర్గము జెప్పగా బ్రబంధంబులు
        గ్రొత్తలు పుట్టించుకొని లిఖింప
గా, నక్షరచ్యుతకంబు మాత్రాచ్యుత
        కంబు బంధచ్యుతకంబు నామ
గోప్యంబులును గ్రియాగోప్యంబులను భావ
        గోప్యంబులును జెప్ప గోష్ఠియందు
బద్యంబు గీతికార్పటి నొగి జదువంగ
        నెల్ల విద్యల సంచు లెఱుగ నేర్తు
ననుచు .......ప్రసిద్ధి బొందెనట. (విక్రమార్క చరిత్రము. 1-20)

పై సీసమాలిక వలన ఆనాటి తెలుగు పండితుల కసరత్తు లెట్టివో మనకు తెలియుచున్నవి.

1 అష్టభాషలలో నేభాషయందైనను గడియలో నొకశతకము జెప్పుట.
2. దశవిధ రూపక రచనయందు రూఢి జూపుట.
3. చక్రవాళ, చతుర్భద్ర, చతురుత్తర, భోగావళి, బిరుదావళి, తారావళి ప్రభృతి క్షుద్రకావ్యము లనేకములు గూర్చుట.
4. ఆంధ్రప్రబంధములు రచించుట.
5. కోరిన వర్ణనము సేయుట.
6. ఏకసంథా ద్విసంథా త్రిసంథా పఠనము.
7. ఎవ్వ దేయవధాన మెఱుగు నయ్యవధానమున వాని కించుక ముల్లు సూపగలుగుట.

పూర్వకాలమున ఒకొక్క డొకొక్క యవధానము ప్రత్యేక శ్రద్ధతో సాధించి ప్రదర్శించెడివారు. అది వైయక్తికమయిన యభిరుచికి, శక్తికి నికషముగా నుండెడిది.

8. గర్భకవిత్వము జెప్పుట.
9. కల్పితకథా ప్రబంధములు వ్రాయుట.
10. చిత్రకవిత్వము జెప్పుట.
11. పద్యము గీతికార్భటిన్ జదువుట.

ఇవి పెద్దయ పెద్దతనము నిరూపించు విద్యలు.
గోష్ఠియందు పద్యము జదువుటయు నొక కళయే.

నరసభూపాలీయకర్త 'ప్రబంధ పఠన రచనా ధురంధరుడ'నని చెప్పి కొనెను.

'గీతీ శీఘ్రీ శిరఃకంపీ యథాలిఖితవాచకః
అనర్థజ్ఞః అల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః'

అని పాణినీయ శిక్ష. 32వ శ్లోకము

రాగము సాగదీసి అక్షరములు మ్రింగువాడు, తొందరపడువాడు, తల యూపువాడు, అక్షరస్థాలిత్యాది లేఖకప్రమాదము లెఱిగి సవరించికొనక యున్న దున్నట్లు చదువువాడు, అర్థజ్ఞానము లేనివాడు, హీనస్వరము - కీలుగొంతువాడు, ఈ యార్గురు పాఠకాధములు. తద్భిన్నులు పాఠకోత్తములు.

కాకతీయ రాజ్యమున వెలసిన ప్రాక్తన శాసనములందు ఈశ్వరసూరి కృతములైన చిత్రబంధ రచనలు కనబడును. ఈశ్వరసూరి మన పెద్దయసూరి సమకాలికుడు.

HYDERABAD ARCHAEOLOGICAL SERIES No. 13-
Inscriptions No 52, 51, 50.

దానములలో గుప్తదానము శ్రేష్ఠము. దానశాసన పద్యములు చిత్రబంధ గర్భకవిత్వ భూయిష్ఠములు తజ్జ్ఞులకే అవి బోధపడును. గ్రుడ్డివానికి దీపము వలె, జనసామాన్యమున కట్టి చిత్రములు ఉండియు లేనివి. గుప్తదానశీలు రగు భూపతులు కోరి యీ పని చేయుచుండిరా? కాదు, ఆ కాలమే వాక్చిత్రములకు గొడుగు పట్టినది. శాసనస్థ పద్య మొక పజిల్. దానిని బుద్ధిబలముచే విప్పి, కర్తృదాతృ నామాదికము లు కనుగొనవలెనని లోక ముత్కంఠపడును. ఈ రీతిగా దానశాసనములకు పద్యగత వైచిత్ర్యమునుబట్టి ప్రచారము గలుగుచుండెను. మడికి సింగన సంగ్రహించిన నీతి తారావళీ పద్యము తత్కాల జనసామాన్య కవితాభి రుచికి నిదర్శనము.

కం. పలుకుల తీపును సరసము
చెలువము నడబెడగు బంధచిత్రము సొబగున్
గలకలన జూప వలదే
కలకంఠియు బోలె గవిత కందనమంత్రీ! (సకలనీతి సమ్మతము. 1-30)

ఇటువంటి చిత్రకవితలు చూపువారే 'అవధానములు' చూపుచుండిరి. వెన్నెలకంటి అన్నయ్య షోడశకుమారచరితమున-

సీ. అష్టభాషల మధురాశు విస్తర చిత్ర
కవితలు చెప్ప సత్కవులు మెచ్చ
నూతనరీతుల ధాతువిభ్రమమున
రసములు మెఱయ పర్ణకము వాడు
ఏ పురాణంబుల నేకథ యడిగినన్
దడబాటులేక యేర్పడగ జెప్పు
నోలి నవధానములు వేనవేలు జూపు
నవధరింపు మీకీరంబు నవనినాథ!

(షోడశకుమార చరితము. 6-18)

ఇచటి కీరప్రజ్ఞలు కేవల బాణభట్ట కావ్యకాసారమున వచ్చిన కమలములు కావు. కాదంబరీశుకము 'విదిత సకలశాస్త్రార్థః పురాణేతిహాస కథాలాప నిపుణః ... కావ్యనాటకాఖ్యాయికాఖ్యానక ప్రభృతీనా మపరిమితానాం సుభాషితానా మధ్యేతా స్వయంచకర్తా పరహాసాలాప పేశలః ..ద్యూతవ్యాపారే ప్రగల్భః, అవధాని విద్యాప్రవీణ కాదు.

చిలుకమీద బెట్టి అన్నయ్య వ్రాసిన విశేషము లన్నియు ఆనాడు విద్వల్లోకమున జెల్లుచుండిన క్రీడలే.

ఈ యవధానము లేవి? వాని స్వరూపస్వభావము లెట్టివి? అవి యెన్ని?

పేరు, రూపు, మితి మూటిని నిర్దేశించి శాస్త్రీకరించినవారు లేరు. ఎవరి యుపజ్ఞకొలది వారు అపూర్వమార్గము ద్రొక్కి క్రొత్తలు కల్పించి అవధానములు ప్రదర్శించుట పరిపాటియై యుండెను. అట్టిచో వానికొక కట్టుబాటెట్లుండును? 'వేనవేలు' అనుమాటకు లెక్కలేనన్ని యని యర్థము.

ఆంధ్ర కౌముదీకర్త మండ లక్ష్మీనరసింహకవి 'ధన్యః సహస్రావధానీ హ్యష్టభాషావిశారదః.' ఇతని వ్యాసంగ మెట్టిది?

GOVT. ORIENTAL MANUSCRIPTS LIBRARY,
MADRAS. D. No. 1223.

మఱికొంద రవధానుల మహిమ లనుశీలింతము.

భట్టుమూర్తి. (1500 - 1580)

సీ. శతలేఖినీపద్య సంధాన ధౌరేయు
ఘటికాశతగ్రంథకరణధుర్యు
ఆశుప్రబంధ బంధాభిజ్ఞు నోష్ఠ్య ని
రోష్ఠ్యజ్ఞు నచల జిహ్వోక్తినిపుణు
దత్సమభాషావితానజ్ఞు బహుపద్య
సాధిత వ్యస్తాక్షరీధురీణు
నేకసంధోచితశ్లోక భాషాకృత్య
చతురు నోష్ఠ్యనిరోష్ఠ్యసంకరజ్ఞు
నమిత యమకాశు ధీప్రబంధాంక సింగ
రాజసుత........ (నరసభూపాలీయము 1-18)

చరిగొండ ధర్మన్న (1500-1560)

మ శతలేఖిన్యవధానపద్యరచనాసంధా సురత్రాణ చి
హ్నితనామా! చరిగొండ ధర్మసుకవీ! నీవాగ్విలాసంబు లా
శితకంఠోజ్జ్వల జూటకోటర కుటీ శీతాంశురేఖాసుధా
న్విత గంగాకనకాబ్జ నిర్భరరసావిర్భూత మాధుర్యముల్.
(చిత్రభారతము అవతారిక - 17.)

ఈ ధర్మన్న శతలేఖి న్యవధాన సురత్రాణ బిరుదముతోబాటు 'నవఘంట సురత్రాణ' బిరుదము కూడ వహించినవాడు.

(చిత్రభారతము. ఆశ్వాసాంత గద్యము)

మఱింగంటి సింగరాచార్యుడు (1550-1591)
'శతఘంటావధాన ప్రసిద్ధ సాహిత్య సారస్వతాష్టకవితాష్టభాషావిశేషుడు.'
(దశరథరాజనందన చరిత్ర. ఆశ్వాసాంతగద్యము.)

మఱింగంటి జగన్నాథసూరి. (తదగ్రజుడు)
నేబతి కృష్ణమంత్రి తన రాజనీతి రత్నాకరమునందు ఈ కవి నిట్లు స్తుతించెను:

మ. గురుమూర్ధన్యు శతావధాన బిరుదాంకున్ ద్రావిడామ్నాయ త
త్త్వ రసజ్ఞున్ బటు సంస్కృతాంధ్రరచనాదక్షున్ హయాధీశ కం
ధరసంలబ్ధ సువర్ణవృష్టియుతు గర్ణాటక్షమాభృత్సభాం
తరపూజ్యున్ మరుకంటి వేంగళ జగన్నాథార్యు గీర్తించెదన్.
(ఆచార్య బి. రామరాజుగారిచే నుదాహృతము.)

'వినుత శతఘంట బిరుదాంక విజయుడైన'
(ప్రబంధాంధ్ర శిరోమణి సీతాకల్యాణము. 1-56)

'సరస శతపద్య లేఖినీ విరచనోక్తి
గల జగన్నాథసూరి.... (దశరథరాజనందన చరిత్ర. 1-30)

మధురవాణి (1600-1631)

'తత్రాద్య ఘటికార్ధ నిర్మిత శతశ్లోకీ
'ప్రస్తారాభినవాత్త వృత్త కవితాధాటీ కథాశుక్రియా'
'వీణావాద కళావినోద సమయే ధృత్వా సమస్యాః శతం
పద్యస్సంసది సాధుపూరయతి యా దత్తాః కవీంద్రోత్తమైః'
'చాతుర్య మేతి కవితాసు చతుర్విధాసు
మేధాం వ్యనక్తి బహుధా వివిధావధానే.' (శ్రీరామాయణసార కావ్యము.)

రామభద్రాంబ (1600-1630)

'శతలేఖినీ సమయలేఖినీ

అష్టభాషాకల్పిత చతుర్విధకవితావిరాజిత సాహిత్య సామ్రాజ్యభద్ర పీఠారూఢ.' (రఘునాథాభ్యుదయము)

'ఘటికాశత గ్రంథ ఘటనోత్కట నవీన
పాండిత్యగరిమలు భళి యనంగ'
(చెంగల్వ కాళకవికృత రాజగోపాలవిలాస గ్రంథావతారిక.)

పసుపులేటి రంగాజమ్మ (1638-1678)

'విచిత్రతతర పత్రికాశత లిఖిత వాచికార్థావగాహన ప్రవీణయు, తత్ప్రతి పత్రికాశతస్వహస్తలేఖన ప్రశస్తకీర్తియు, అతులితాష్టభాషాకవితా సర్వంకష మనీషా విశేష శారదయు'. (ఉషాపరిణయ గద్య)

కృష్ణాజమ్మ (1638 - 1678)

చెంగల్వ కాళకవి రామభద్రాంబకు కృష్ణాజమ్మకు ఇద్దరికిని గురువే:

సీ ఘటికాశతగ్రంథ ఘటనోత్కట నవీన
పాండిత్య గరిమలు భళియనంగ
అయ్య దినముల రామభద్రాంబవారు
నేడు కృష్ణాజి కవితచే నేర్పు మెఱసి....' (రాజగోపాల విలాసము)

మఱియు కృష్ణాజమ్మ ప్రతిభ యిట్లభివర్ణింపబడెను:

'ప్రస్తారసంఖ్యను పదుమూడుకోటుల పదిరెండులక్షల పదేడువేల నెన్నూఱును వింశతియు నాఱువృత్తములందు నీవృత్తమునకు నీవర్ణన సమస్య గూర్చుమన్న నా వృత్తమునకు సమస్యను రచించి, యందుకు శ్లోకంబు లాఘవుగా జెప్పి, యవి తెనుగున పద్యము చేసి, యిరువదారు ఛందము లెఱిగి కవిత జెప్పి ఘనత గాంచినది.' (శారదాధ్వజము.)

కాళహస్తికవి (1700 ప్రాంతస్థుడు)

కాళహస్తికవి శిష్యుడు వేంకటాచలకవి దేశికస్తుతి చేసిన విధము:

సీ అష్టభాషామహితాశుప్రబంధ ని
ర్మితిచాతురీధుర్య, శతసహస్ర
లేఖినీలేఖ్య కలిత కవిత్వాపాద
నాహృత వ్యస్తాక్షరాది చతురు
జలజిహ్వకాచలాచల జిహ్వకాచల
జిహ్వకారచనా విశేష నిపుణు
నోష్ఠ్య నిరోష్ఠ్య పర్ణోదీర్ఘ కల్పను
గరిన త్రిపాదసంఘటనకుశలు

నఖిల లక్షణ లక్ష్య సిద్ధాంత పాణి
నీయ కాణాద కాపిలానేక తంత్ర
కోవిదుని రేవురి కులాబ్ధి కుముదబంధు
జెలగి మది గాళహస్తి దేశికు భజింతు.

(మిత్రవిందా పరిణయము.)

గుడారు వేంకదాసు:

సీ. బహుళ సందర్భాప్త భాషాప్రధాన దు
ష్ప్రాపిస దుష్కరబంధ భావగద్య
పదమైత్రి రసజాతి పద్య శబ్దశ్లేష
దురవగాహార్థ విస్తర నిగూఢ
ఘటికా ప్రబంధ హృద్గత సమస్యాగీత
తాయ నావీన నాటకవిభేద
భరత కళాశాస్త్ర పాదార్థగు ప్త్యను
లోమ విలోమాచలోష్ఠజిహ్వ

సదుపమాలంకృతి కవిత్వ సాంఖ్యయోగ
మంత్ర షట్తంత్ర తత్తంత్ర యంత్రపార
గంతృ విజ్ఞాననిధి విజ్జగమున గవులు
నీ సరెవ్వరు? వేంకటదాస సుకృతి!

(ప్రబంధరాజ శిరోభూషణ ప్రకృష్ట బలరామచరిత్ర.)

రేటూరి రంగరాజు :

సీ. వ్యస్తాక్షరీధుర్య విస్తీర్ణ భావంబు
క్రమక సంఖ్యాఖ్యాన కౌశలంబు
నారోహణావరోహణ లేఖన ప్రౌఢి
యగ్రపద్య గ్రహణాభిరక్తి

యనవలోకిత శారికాభిఖేలన రీతి
పర సమస్యా పూర్తి వైభవంబు
సముదగ్ర శిక్షిత చతురంగ బలకేళి
కా విలాసము నేకకాలముననె

యలర బ్రకటింపనేర్తు నష్టావధాన
కలిత శతలేఖినీ పద్య గద్యశక్తి
బాటి మీఱితి వంధ్ర కర్ణాట చోళ
రాజసభలందు రేటూరి రంగరాజ! (భానుమతీ పరిణయము.)

న్యాయికంటె మాదనామాత్యుడు (1730 ప్రాంతస్థుడు)

సీ. నిరుపమ నవలేఖినీ పద్య ఘటనాఢ్యు
దత చతుర్విధ కవిత్వప్రసిద్ధు
సంచితాజ్గోపన హల్గోపన ధురీణు
ప్రస్తాక్షరీ గ్రహణాభిరాము
సోష్ఠ్య నిరోష్ఠ్య విస్ఫురిత కల్పనదక్షు
విలసితేచ్ఛావర్ణకలన ధుర్యు
నచల జిహ్వోక్తిరచనావిచక్షణు
నేకైకవచన కావ్యకృత్ప్రభావు

సముచితాష్టావధాన నిష్ఠాగరిష్ఠు
నదరు బడగలనాటి కన్నడ కులీను
సకల విద్వజ్జనవిధేయు సాధుహృదయు
మహితగుణధన్యు మాదనామాత్యు సన్ను.
(వీరభూపాలీయము. కర్ణాటకాంధ్ర సాహిత్య చరిత్ర.)

చరిగొండ ధర్మన్న 'నవఘంట సురత్రాణ' బిరుదశాలి. కాగా, మాదన్న 'నవలేఖినీ పద్యఘటనాఢ్యుడు', ఆంధ్ర రతిరహస్య గ్రంథకర్త యెఱ్ఱయ 'అష్టభాషా కవితా ప్రవీణ' 'నవఘంట సురత్రాణ' బిరుదములు గద్యమున వ్రాసికొనెను

నెల్లూరి రాఘవకవి (1717 ప్రాంతస్థుడు)

కం. నానావిధావధానము
లా నృపనీతియును భరత మాహాత్మ్యముల్
మానుగ నిచ్చాలిపియున్
మానితముగ గల్గు గోపనంబును మఱియున్.

సీ శతలేఖినీపద్య సంధాన చాతురీ
ఘటికా శతగ్రంథకరణ పటిమ
ఆశుప్రబంధ బంధాది క్రియారూఢి
సంకరోష్ఠ్య నిరోష్ఠ్య చాటుకలన
విస్తర మాధుర్య వివిధ చిత్రస్ఫూర్తి
పాదమాత్రాన్య త్రిపాదఘటన
వ్యస్తాక్షర విమిశ్ర బహుపద్య గుంఫన
మచలజిహ్వాదిక ప్రచుర రచన
బహుజన మనోంతరస్థితి బహువిధార్థ
బహుసమస్యాప్రపూర్తియు బహువిభేద
సకల విషమ సమస్యాది సంవిధాన
మమర గూర్తును నెఱి రాఘవాఖ్య కవిని.

(యాదవ రాఘవ పాండవీయము. 1-26,29.)

గణపవరపు వెంకటకవి(1620-1660)

కం. అమితాశువు మధురము చి
త్రము విస్తారము చతుర్విధ కవితలను జి
త్రముగను వింశత్యవధా
నములన్ ఘటియించు లక్షణ కవివరుండన్.

(ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము. 43వ పద్యము.)

శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి (1790-1870)
'అభినవ భట్టమూర్తి బిరుదాంకుడు.'

(ఆంధ్ర సంస్థానములు-సాహిత్య పోషణము)

అకలంకము కృష్ణకవి:

ఇతడు శకుంతలా పరిణయ గ్రంథకర్త. ఇతని గ్రంథమునకు పిల్ల వసు చరిత్ర యను పేరు వచ్చెను. ఇతడు శతావధానము చేసెడివాడు.

(అవధాన మంజరి. తొలిపలుకులు)

పై గ్రాంథిక సాక్ష్యములనుబట్టి తెలుగునాట దాదాపు పదమూడవ శతాబ్ది నుండి శతావధానాది ప్రక్రియలు వేరూని విస్తరించినవని తలపవచ్చును.

'వాఙ్మయధురంధరుడు నారాయణభట్టు అష్టాదశావధారణ చక్రవర్తి యట. అవధారణ శబ్దార్థము నిర్ధారణము చేసి అవధాన ప్రక్రియకు అది మొదలని పరిశీలక పండితు లెవరేని యన్నచో తెలుగువారి యానందము సహస్ర గుణము' అని శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి ఆశంస.

(శతావధాన ప్రబంధము. పీఠిక.)

అది నిజమైనచో నావ ప్రక్రియంటె తెలుగున అవధాన కళయే ముందు బుట్టిన దనవలసి వచ్చును. నారాయణ పండితుని అవధారణస్ఫూర్తి అష్టాదశపురాణవక్త్ర ప్రవర్తి.

చరిత్ర కందని పరిధిలో వ్యాఖ్యాతృ చక్రవర్తి మల్లినాథసూరి పితామహుడే శతావధాన ప్రక్రియాకీర్తి.

ఇందాక అష్టనవశతసహస్రఘంటా లేఖిన్యవధానుల నామధేయములు, బిరుదములు, వ్యాసంగములు తెలిసికొంటిమి ఇక వారి అవధాన విధానము లెట్టివో స్పష్టముగా తెలిసికొనవలసియున్నది.

చతుర్విధకవిత్వములలో నాశుకవిత్వం మొదటిది. ఘటికాశతగ్రంథకల్పనాదికములు ఆశుకవితా సంబంధవిషయములు అవధానవిద్యలును తద్గతవిశేషములే.

ఆంధ్రకవితాపితామహుడు అల్లసాని పెద్దన్న చతుర్విధకవితా నిర్వాహకుడని చెప్పికొనెను ఆ కాలపు కవుల భట్టుమూర్తి చతుర్విధకవితా విశేషములను వివరించి, తా నేయే విద్యలందు ప్రగల్భుడో పద్యముఖమున చెప్పికొనెను.

మధురవాణి 'చాతుర్విధ్యమేతి కవితాసు చతుర్విధాసు' అని చెప్పికొన్నది. దానితో దృష్టిపదక 'తత్రాప్యష్ట ఘటికార్థనిర్మిత శతశ్లోకీ' అనియు జెప్పికొన్నది. ఏలయన, 'ఘటికాశత గ్రంథకల్పన' చతుర్విధకవితా నిర్వాహక సామాన్య విద్య. ఈమె ఘటికార్థకాలముననే శత గ్రంథకల్పన చేయగలదు అది అందరికి శక్యము కాదు. కనుకనే తత్రాద్యర్ధశబ్దము ప్రయోగించినది.

గ్రంథమనగా అనుష్టుభశ్లోకము 'గ్రంథో ద్వాత్రింశదక్షరీ' అని త్రికాండ శేషము. అట్టి గ్రంథములు, లేదా తత్సమానప్రమాణ పద్యములు గడియకు నూఱు నుడువగలవాడు ఘటికాసద్యశ్శతగ్రంథకల్పనుడు. ఘటిక గడియ. గడియ యనగా నిరువదినాలుగు నిమిషములు. అడిదము సూరకవి గడియకు నూఱుపద్యములు చెప్పుచుండెడివాడట మధురవాణి పన్నెండు నిమిషములలోనే నూఱు శ్లోకములు, లేదా, పద్యములు చెప్పగలిగెను. అనగా గంటకు నయిదు వందల పద్యాలు.

మఱియొక విశేషము-'మేధాం వ్యనక్తి వివిధావధానే' అన్న చరణమునం దున్నది.

విజయరాఘవశౌరి అన్నిట 'అవధాని' యట.

(విజయరాఘవ చంద్రికావిహారము)

అన్నిట ననగా మధురవాణ్యాదులు పేర్కొన్న సకల విద్యలయందు 'అవధాని'.

గణపవరపు వేంకటకవి 'చతుర్విధకవితలను వింశత్యవధానములన్ ఘటియించు లక్షణకవి.' ఇరువది యవధానములతో చతుర్విధ కవితలను నిర్వహించుట యీయన సాధించిన విశేషము.

చతుర్విధకవిత్వ ప్రసిద్ధుడైన న్యాయకంటి మాదన్న 'నిరుపమ నవలేఖినీ పద్య ఘటనాఢ్యుడు సమ చిత్రాష్టావధాన నిష్ఠాగరిష్ఠుడు'

ఇక్కడ నవలేఖినీపద్యఘటనము, అష్టావధానము ఏకవ్యాపారము క్రింద జమ కట్టదగిన విద్యలు కావు.

అష్టావధాన మష్టలేఖిని కాదు సరికదా, నవలేఖిని శతలేఖిని కంటె ఏకనవతిలేఖినీ సంఖ్య తక్కువదియు గాదు. నవలేఖిని నిరుపమప్రక్రియ కనుకనే 'శతలేఖిన్యవధాన పద్యరచనా సంధా సురత్రాణు' డైన చరిగొండ ధర్మన్న 'నవఘంట సురత్రాణుక' నని గద్యమున వ్రాసికొన్నాడు. 'నవలేఖిని' 'శతలేఖిని'కి తీసిపోని విలక్షణవిద్య.

రేటూరి రంగరాజు 'అష్టావ ధాన కలిత శతలేఖినీపద్య గద్యశక్తి' రాట్సభ లందు ప్రదర్శించినవాడట.

అష్టావధాన మనగా ఆ కాలమున అష్టభాషావధానము.

రేటూరి రంగరాజు అష్టభాషావధానముతోడి శతలేఖినీ పద్యగద్య శక్తి చూపెను. ప్రాకృతాద్యష్టభాష లతనికి కరతలామలకములై యుండెను.

'నవలేఖినీ పద్యఘటనము' 'శతలేఖినీ పద్యఘటనము' కన్న మిన్న.

లక్షణ దీపిక- 'నవఘంట లిఖిత మేకైక మిష్టార్థ దేవతాపర నానావిధ వృత్తభేదనిర్మిత రచనార్థ సమర్థత' అని నవలేఖినీ లక్షణము సూచించినది.

తొమ్మండ్రు వ్రాయసకాండ్రు రిష్టార్థదేవతా పరముగా తలకొక పద్యము జెప్పగోరుదురు. చెప్పిన విషయమును వ్రాసికొని, తద్విషయమే తద్భిన్నవృత్త మున జెప్పగోరుదురు. ఈ రీతిగా నొకొక్కరు పదిపదేను రకముల వృత్తములలో మార్చి మార్చి చెప్పగోరుదురు. ప్రష్టలు తొమ్మిదిమంది యైనను పద్యములు తొంబది కావచ్చు; నూటముప్పదియైన కావచ్చు: ఇన్నూఱు కావచ్చు ఈ ప్రక్రియ వక్తృచ్ఛందశ్శిల్ప మర్మజ్ఞతకు, సద్యః పద్యనిర్మాణచతురతకు గీటురాయి.

నవప్రష్టృపృష్ట నవప్రకార దేవతాత్మక విషయ విశిష్ట నానావిధవృత్త నిర్మాణ సంబంధి రచనార్థసామర్థ్యము ప్రదర్శించుటయే కాని, తత్తద్వృత్త సంచయము ధీసంపుటియందు ధరించి, సభాంతమున నప్పజెప్పి మేధాశక్తి ప్రదర్శించుట లేదు.

### ఘటికాశత గ్రంథకరణము

గడియకు నూ అనుష్టుప్పులు కాని, వృత్తములు విరళముగా, కందగీతాది పద్యములు కాని చెప్పుట ఘటికాశత గ్రంథకరణము.

రఘునాథరాయల కొలువున రచయిత్రియగు రామభద్రాంబ 'సమయ తెలిని' విద్యయందు సమర్థురాలు.

ఈ పద్యములు లిఖించుటకు వీలుకానంత వడిగా నుడువబడును. ఇరువది నాలుగునిమసముల కాలమున నూఱు జరుగవలె గదా! ఎక్కువ పడినను పడవచ్చు, పద్యములు తక్కువ పడగూడదు.

పందెపు గుఱ్ఱమువలె పరుగెత్తుటయే శతగ్రంథకవి పని.

### శతలేఖినీపద్య సంధానము

సభారంగమున నూఱుగంటములు లిఖించుట కనువుగా పద్యములు చెప్పుట శతలేఖినీ పద్య సంధానము. శతలేఖినీ లేఖ్య శతపద్య సంధానము. కవి పద్య సంధాత. లేఖకు లెవరు ? నూర్వురు ఒకే పద్యమును ఒకే సమయమున వ్రాసి కొందురా ? అయినచో నూరువు రెందుకు ? ఎవరి పద్యమును వారు వ్రాసికొందు రన్నచో ఒక్కొక్క రొకొక్క విషయము పద్యము కట్టి చెప్పవలెనని ముందుగనే కోరినవారై యుండవలెను. అపు డాలేఖకులు పృచ్ఛకు లగుదురు కాగా, ఆకు గంటము పుచ్చుకొని, కూర్చుండి అడిగెడివారికి, వ్రాసికొనదగుపాటి వడితో యోజించి పద్యము జెప్పుట శతలేఖినీ పద్య సంధానము.

యాదవరాఘవపాండవీయకృతికర్త పేర్కొనిన 'బహుజన మనోఽంతర స్థిత బహువిధార్థ బహుళసమస్యాప్రపూర్తియు, బహువిభేద సకలవిషమసమస్యాది సంవిధానము', ప్రబంధరాజశిరోభూషణ ప్రకృష్ట బలరామచరిత్ర కృతికర్త పేర్కొనిన 'హృద్గత సమస్య' పరిశీలించినచో, ప్రాశ్నికులు నానావిషయము లడుగుటయు, అవధాని వానికి సమాధానముగా పద్యములు చెప్పుటయు నుండెనని తేటపడును.

పృచ్ఛకుడు కోరిన పద్యమంతయు నొకేమాఱు చెప్పబడునా? చరణక్రమమున జెప్పబడునా? చరణక్రమమున జెప్పుట యైనచో నాలుగు చుట్లు తిరుగవలెను. ఒకేమాఱు చెప్పివేసినచో మఱి బెడదయుండదు. చరణశః చెప్పుట మొదలు పెట్టినచో పూర్వోక్తచరణములు ఉత్తరోత్తరచరణములతో ననుసంధించు వేళ ధారణాశక్తి కీలకశక్తి యగును. చిక్కు తటస్థించును. పద్యమంతయు నొక్కగ్రుక్కలో నొకేమాఱు చెప్పివేసినను, చెప్పివేసిన దానిని క్రమముగా సభాంతమున నప్ప జెప్పవలెనన్నచో ఈ చిక్కు మఱింత జటిల మగును. చిల్లరగా గాని, మొత్తముగా గాని చెప్పిన పద్యమును దిరిగి యథాతథముగా అప్పగించుట ఆనాడు లేదు.

మల్లినాథ శతావధానినుండి శిష్టు కృష్ణమూర్తి వరకు నడిచిన యవధాన ప్రక్రియ కేవల చిత్రకవితావిచ్ఛిత్తివిశేషములతో, సంగీతపు మెట్లతో సాగిపోయెడిదని, ధారణాశక్తిప్రధానముగా నడిచినది కాదని నిశ్చప్రచముగా జెప్పవచ్చును.

ఈ సందర్భమున శేషాద్రిరమణకవుల 'అవధాన మంజరి' తొలిపలుకు లుదాహరణీయములు.

'శతావధానమునందు పూర్వము నూఱుమందికి జరణక్రమముగా పద్యములు చెప్పుట లేదనియు, అష్టావధానమునందువలె జిన్నచిన్న కార్యములు జరుపువారనియు, అట్టివారిలో రేపల్లి సంస్థానాధిపతుల ప్రాపంచిన 'శకుంతలాపరిణయ' రచయితయగు కృష్ణకవి ముఖ్యుడని మా తండ్రిగారు చెప్పువారు.'

(అవధానమంజరి. తొలిపలుకులు. 1-12-1926)

తిరుపతి వేంకటేశ్వర కవులు మూడవ సంవత్సరము గద్వాలకు బోయినపుడు తాతాచార్యులను దాక్షిణాత్య గీర్వాణపండితుడు తారసపడెను. ఆ మహనీయుడు తన 'శతావధాన విద్య' రాజసభలో ప్రదర్శించెను. దానిని జూచి తిరుపతి వేంకటేశ్వరు లీపద్యము జెప్పిరి:

ఉ. ఈ పనినే పచింతురు కవీశ్వరు లష్టవధానమంచు మా
వైపున, దాక్షిణాత్యు లిది వాకొనచుంద్రు శతావధానమం
చేపుదలిర్చ, నూర్వురకు నెంతయు ధాటి చెలంగ జెప్పగా
దా? పలుకన్నలెన్ శతవధాన మటంచును రామభూవరా!

(నానారాజ సందర్శనము)

పృచ్ఛకులు నూరగురకు ధారాళముగా పద్యములు చెప్పినదే శతావధాన మెట్లగునని వేంకటశాస్త్రిగారి ప్రశ్న.

తాతాచార్యుల శతావధానపద్ధతి శేషాద్రిరమణకవులు తెలిపిన ప్రాత కాలపు శతావధాన పద్ధతికి దగ్గరి చుట్టము కాబోలు. ఆ గీర్వాణపండితుడు దాక్షిణాత్యుడు. తత్కాల త్రిలింగదేశ విద్యమాన శతావధాన ప్రక్రియావైలక్షణ్య మెఱుగడు. తత్ర్పదర్శిత శతావధానమున కవిత్వము, తరణీమధ్యము వలె, దృశ్యాదృశ్యము. చిల్లర విషయములు, చమత్క్రియలు మెండు. తిరుపతి వేంకటేశ్వరుల కది అష్టావధానము వలె గోచరించినది

పూర్వకవులలో భట్టుమూర్తి 'ఏకసంధోచితశ్లోకభాషాకృత్య చతురుడు.' ఆక్కయ తాత పెద్దయ 'సరి యేకసంధా ద్విసంధా త్రిసంధల దొడరెన బొరిబొరి గడవ జదువ' నేర్చినవాడు.

నెల్లూరి వీరరాఘవకవి తన నేర్చిన విద్యలన్నియు పట్టికకట్టి వ్రాక్రుచ్చెను.

కాని, ఆ పట్టికలో ఏకసంధాగ్రహణాదులు లేవు. మఱి పలువురు పలు విషయములందు దమకుగల ప్రజ్ఞ ప్రకటముగా జాటుకొనిరి. కాని, ధారణాసంబంధి యగు నేకసంధాగ్రాహిత్వము గుఱించి చాటుకొనక తూష్ణీంభావము వహించిరి. ఏకసంధా గ్రాహకులతోబాటు, తచ్ఛక్తి చాలని వీరును శతలేఖిన్యవధాను లెట్లయిరి? ప్రతి స్వల్ప విషయము పట్టికలో జేర్చి ప్రగల్భముగా జెప్పికొను స్వభావము గల భట్టుమూర్తి ప్రభృతులు పాదము పాదము చొప్పున నాలు గావృత్తులలో నూఱుగురకు వారు కోరిన వృత్తాదులు పూర్తిచేసి, క్రమము దప్పకుండ సభాంతమున నెవరి పద్యము వారికి నప్పగించు జవాబుదారి కలిగిన ధారణాప్రధాన ప్రక్రియా

స్వరూపము సవికత్థనముగా ప్రకటించికొనకుండెడివారా? ఆ పని చేయక పోవుటయే ఆ ప్రక్రియ ధారణా ప్రధానము కాదనుటకు ప్రబల నిదర్శనము.

అటులైనచో దాని నాశుకవిత్వ మనవలెగాని శతలేఖిన్యవధానమని యేల యనవలెనని ప్రశ్నింప వచ్చు. ఆశుకవితకు ఆఘాటములుండవు. సీతాకల్యాణమో, ద్రౌపదీస్వయంవరమో మొదలించి, యేపద్యము దొరలిన ఆపద్యము దొరలించుచు, ఆకాశమున పక్షి వలె, ఆశుకవి అనర్గళవిహారము సేయును. 'ఘటికాశతగ్రంథ కరణధుర్యులు' ఈ కోవకు జెందుదురు.

పృచ్ఛకశతకముచే గంధర్వగోళముగానుండు మహాసభా ముఖమున నిల్చి, ప్రష్టమనోఽభీష్టము గ్రహించి, తత్క్షణము పద్యము నొడువుచు, వ్రాసికొననిచ్చి, పునఃపునికముగా జరివి యలరించుచు, ఆపలి పృచ్ఛకు నడిగి అతడు కోరిన పద్యము వాకొనుచు, వివాదగ్రస్తవిషయము వివరించి సమాధానపఱచుచు, శతలేఖిన్యవధాని సర్వజ్ఞతా ముద్ర దాల్చి సభ నాకట్టుకొనును

విద్వత్సభారంగ మెట్లుండునో 'సాహితీ సమరాంగణ సార్వభౌముని' పద్యము ప్రత్యక్షీకరించెదని

సీ అందులో నొకమేటి కభికుఖుడై యాత
డడిన వన్నియును మున్ననువదించి,
తొడరి యన్నిటికన్ని దూషణంబులు వేగ
పడక తత్సభ యొడబడగ బల్కి
ప్రక్కమాటల నెన్న కొక్కొక మాటనె
నిగ్రహస్థాన మనుగ్రహించి
క్రందుగా రేగినం గలగ కందఱ దీర్చి
నిలిపి యమ్మొదలివానికినె మగిడి-

కం. నీవేమంటివి రమ్మం
చావలి వానికిని మగిడి యట్లనె వానిన్
గావించి యొక డొకడురా
దా విప్రుడు వాదసరణి నందఱ గెలిచెన్.

(ఆముక్త మాల్యద. ఆ. 3 ప. 6, 7.)

శాస్త్ర వాద సభ, కవిత్వ వినోద సభ రెంటికి భేదము లేదా? ఉన్నది కాని, సామ్యము కూడ లేకపోలేదు. అక్కడ జిగీషతో అడిగిన నిక్కడ జిజ్ఞాసతో నడుగుదురు. చెప్పవలసిన బాధ్యత ఉభయత్ర కలదు

ఊరక బంతిలో లడ్డువములవలె పద్యములు వడ్డించుచు, తిరిగి చూడక పోవుట యైనచో, ఆ పని యొకపాటి ఛందోధార, శబ్దార్థజ్ఞానము, కావ్య పురాణ పరిచయము గల యే కవి పడిన ఆ కవి చేయగలడే ఏమున్నదబ్బా యనుకొన గూడదు.

ఒకనికి ఆట వెలదిలో చేయి తిరిగి యుండును. ఒకనికి కందమున ధార పరుగెత్తును. ఒకనికి చంపకమున మోజు. ఒకనికి మత్తేభమనిన నుల్లాసము. ఒకనికి సీసమనిన సంతోషము. వీరికి తద్భిన్న వృత్తము లంతగా రుచింపవు. అనగా వానిని జెప్పవలసి వచ్చినపుడు నాలుక పీకికొనినగాని నడక కలిసిరాదు. ఒకడింటిలో పద్యము చెప్పగలడు. రచ్చలో - చచ్చినను - వానికి పద్యము రాదు. ఒకడు వానికి తోచినది మాత్రమే హుటాహుటిగా జెప్పగలడు. పలానా విషయము జెప్పుమని నిర్దేశించితిమా, చత్రాయివలె నిలబడిపోవును. ఒకడు మెచ్చుకొనుచు దలయూపుచున్నచో ఎన్ని పద్యములైన చెప్పుచుండును. పెదవి విఱిచి 'తప్పు' అని ఆక్షేపించిరేని క్రిందు మీదై యాగిపోవును. విపరీతపు సమస్య యిచ్చి పూరింప గోరినచో పైత్యము ప్రకోపించి యొకడు మెడపట్లకు దిగును. కాబట్టి, సభలో నిలిచి, యడిగిన పద్యము నుడువగలుగుట అందఱకు నలవియగు విద్య గాదు. కొండవంటి వ్యుత్పత్తియు, కత్తి వంటి ప్రతిభయు గలిగి, యే పద్య మడిగిన ఆ పద్యము, ఏ వృత్తమడిగిన ఆ వృత్తము విశృంఖలముగా జెప్పి మెప్పింపజాలువాడే శతలేఖిన్యవధాని.

ప్రాచీనకాల శతలేఖిన్యవధాను లందఱు ఏతాదృశవిద్యాచతుర్ముఖులు.

అర్వాచీనులలో అభినవ భట్టుమూర్తి బిరుదము బొందిన 'అష్టకకుమ్మహీశ్వర సభాంతర సన్నుత కీర్తిశాలి' శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు ఆ కోవకు జెందిన కవి. (హైమవతీ పరిణయ పీఠిక)

ఈయన యేకసంధాగ్రాహి. నెల్లూరి రాఘవ కవి కాదు. ఇద్దరును శతలేఖి న్యవధానులే. శతలేఖినీ పద్య సంధాతకు ధారణాశక్తి అక్కర లేదు.

'అష్ట భాషా సరస్వతి' బిరుదము వహించిన ఆంధ్రకౌముది కృతికర్త శ్రీ మండ లక్ష్మీనరసింహకవి 'సహస్రావధాని.'

(అనుశీలనము అష్టఘంటావధాన పరమేశ్వరకృత వరాహ పురాణము:)

కాళహస్తికవి 'శతసహస్రలేఖినీలేఖ్య కలిత కవిత్వాపాదన చతురుడు.'

నృసింహకవి సహస్రావధానియైన కాళహస్తికవి లక్షావధాని లక్ష లేఖిను లకు కవిత్వము కల్పించి చెప్పుట సాధ్యమా ?

'శతసహస్రలేఖిని' యనగా శతలేఖినియు, సహస్రలేఖినియు అనుకొంద మన్న, సహస్రావధానియైనవాడు శతావధానినని చెప్పికొనవలసిన యక్కఱ యేమి? నృసింహకవి లక్షలేఖిన్యవధానియే

దైవముదిన్నె సంస్థానమున ఆధునికులు, శ్రీజంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సహస్రావధానము గావించిరి. వెయ్యి దళసరి పత్రములు వారి యొద్ద నుండెను. వాని కొకప్రక్క పద్యమో గద్యమో బొమ్మయో యేదో యొకటి వ్రాయబడి యుండెను. రెండవ ప్రక్క ఖాళిగా నుండెను ఆ వెయ్యి అట్టలు శాస్త్రిగారు సభ్యుల చేతికిచ్చి వాని కొకప్రక్క సంఖ్యలు వేయించిరి. సభ్యులు అట్టలను బాగుగా కలిపి, తమకు తోచిన క్రమమున తాము సంఖ్యలు వేసి శాస్త్రిగారి కిచ్చిరి. శాస్త్రిగారాయ ట్టలను దీసికొని యేకాంతస్థలమునకు బోయి, ఒక్కరోజంతయు వానిని జూచికొను చుండిరి. మరుసటి రోజున సభాంగణమునకు వచ్చి, వెయ్యి యట్టలను సభ్యులకు సమర్పించి కూర్చుండిరి సభ్యు లేయట్టనైనను సరే, తీసి దాని నెంబరు చెప్పినచో వారు అట్టకావలి ప్రక్కనున్న విశేషము జెప్పగలిగిరి. తద్విశేషము పద్య రూప మున జెప్పగోరినవారికి కందమో, గీతమో అనువుగ జెప్పిరి. పద్యము కోరనివారికి గద్యము జెప్పిరి ఇది శాస్త్రిగారు కావించిన సహస్రావధాన క్రమము చెప్పిన పద్యము తిరిగి యప్పజెప్పినది లేదు. అడిగెడివారు విధిగా వెయ్యిమంది యుండ నక్కఱ లేదు పదుగురుండినను అట్టలకట్ట సహస్రము కనుక, అది సహస్రా వధానము.

పూర్వకాలపు శతలేఖిని, సహస్రలేఖిని, లక్షలేఖిని ప్రతిభలు పంచిబెట్టి సంఖ్యనుబట్టి విషయము గ్రహించి, విస్తరించి పద్యములు చెప్పెడి పద్ధతితో నడిచినవి కావు. లేఖినీపాణియై యుపవిష్టుడై వ్రాసికొను పృచ్ఛకుడు కోరిన విషయము కోరిన వృత్తమున జెప్పి యొప్పించు పద్ధతితో నడిచినవి. ఒప్పించుట యనగా సమ్మతింపజేయుట. వ్రాయసకాడడిగినదానికి, అవధాని నుడివినదానికి సంబంధము లేనిచో నిలువబెట్టి పృచ్ఛించుతురు దాటిపోనీయరు. అంతకు మించి వేఱొక నిర్బంధముండదు కనుకనే శతసహస్రలేఖిని కవిత్వాపాదనాదికార్యములు శక్యము లైనవి.

ధారణా ప్రధానమైన అవధాన విద్య విధిగా శ్రీమదభినవ పండితరాయ బిరుద భూషితులగు మాడభూషి వేంకటాచార్యులవారితోనే యారబ్ధమైన దనవచ్చును.

ఆచార్యుల వారి బిరుద గద్యము చూడుడు:

'శ్రీమన్మాడభూషివంశ కలశాంబుధి రాకాసుధాకరాయమాన శ్రీ నరసింహాచార్య తనూభవుండును, తర్క వ్యాకరణ మీమాంసా జ్యోతిష కూలంకష మనీషా విశేషుడు, ప్రాకృత వైకృత శౌరసేనీ మాగధీ పైశాచీ ప్రముఖ భాషా వ్యాకరణ పరిజ్ఞానచణుడు. ఆంధ్ర గీర్వాణోభయ భాషా ప్రబంధ రచనా విచక్షణుడు, సమధిక సంగీత సాహిత్య సర్వస్వుడు. శతలేఖినీ పద్య సంధాన ధురంధరుడు. అష్టముఖాష్టభాషా వ్యస్తాక్షరీ విద్యానవద్యుడు. ఏకకాల సందర్శితాష్టావధాన ప్రకారుడు, ద్విచారి పద సహిత పరిగ్రహీతానులోమ ప్రతిలోమాది బహువిచిత్ర ప్రకార పరితాంధ్ర గీర్వాణవృత్త ప్రబంధుడు'

'శాస్త్రచతుష్క ప్రసంగ క్రియాదక్షు'డైన యీ పండితుడు,
'చతుర్విధ కవితాసామగ్రీసమగ్రు'డైన యీ కవి,
'లలిత సంగీత కళారసజ్ఞు'డైన యీ జాణ,

'ఏకసంధాగ్రహణనిపుణమతి'యైన యీ కోవిదుడు రాడాస్థాన రంగమున నిల్చి, శతావధాన కార్యము నిర్వహించుట మావారో యెవరెంత ధన్యులో!

(భరతాభ్యుదయము.)

ఆచార్యులవారి అసాధారణ శక్తులలో 'ద్విवారపఠనమాత్ర పరిగృహీతానులోమప్రతిలోమాది బహువిచిత్ర ప్రకార పఠితాంధ్రగీర్వాణ వృత్త ప్రబంధత్వము' అత్యద్భుత శక్తి. ఒకసారి విన్నవృత్తము అనులోమముగా పఠింపగలుగుట విచిత్ర విషయమే అయినను, ఆ పనిచేయగల మేధావులచట నచట గోచరింతురు. కాని రెండుమాఱులు విన్నంతనే ఆ వృత్తమును ప్రతిలోమముగా- అనగా క్రిందినుండి మీదికి - పఠింపగల మేధావులు మృగ్యులు

21-2-1872 సంవత్సరమున అగిరిపల్లెలో జరిగిన విద్వత్సభలో పిఠాపుర ప్రభువు ముచ్చటపడి కోరగా, నూజివీటి ఆస్థాన పౌరాణికుడు, రంగారాయచరిత్రలోని సీసపద్యము నినుమాఱు వినిపింపగా, ఆచార్యులవారు అనులోమముగా పురాణఫక్కిలో పఠించి, ప్రతిలోమముగా- తోకబట్టికొని త్రాచుబామును తలక్రిందులుగా పైకెత్తి నిలిపినట్లు - పఠించి సభ్యులనాశ్చర్య చకితులజేసిరి. ఆ పద్యమిది:

సీ. ప్రచండషోడశీకృత్ క్షితిమండలోచిత
            ప్రాజ్యరాజ్య రమా ధురంధరుండు
    దానధారాధౌత ధరణీసుపర్వాను
            సాంద్ర దారిద్ర్య నిషద్వరుండు
    సంగీత సాహిత్య సరస విద్యారప
            రసికతా మహిత సారస్వతుండు
    సామంత భూపాల సంప్రేషితద్విప
            దాన కర్దమిత సద్మాజిరుండు

    పద్మనాయక కుముదునీ బాంధవుండు
    దర్పితారాతి రాజన్య దర్ప మథన
    రాజితాటోపకేళి మఱ్ఱాజు వంశ
    పద్మవనహేళి రామ భూపాలమౌళి.

వెనుకటి శతలేఖిన్యవధానుల కిట్టి ప్రజ్ఞ లేదు ఆచార్యులవారి మేధాపకము తత్తాదృశము.

సభలో తత్‌క్షణమే ఆ తెనుగుసీస పద్యము నందలి భావము నొక గీర్వాణ శ్లోక రూపమున రచింప గోరగా, ఆచార్యులవా రీ స్రగ్ధరావృత్తము జెప్పిరి:

'ధాత్రీభారోద్వహః క్ష్మాసురవిభవగుణోద్ధాననోదానలక్ష్మ్యాః
సంగీతోత్సాహితీ సుప్రథితరసికతాసిద్ధసారస్వతోయమ్
సామంతప్రేషితేభవ్రజమదసలిలార్ద్రాంగణో వైరిహారీ
శ్రీకొండ్రాయభూపో జయతు గుడకుభృత్యస్మిన్ మల్రాజవంశః.'

వీరు తెలుగు పద్యము కంటె సంస్కృత శ్లోకము లలితముగ నిర్మింప గలరు. పద్యములు చెప్పుచు. చెప్పుచు రసావేశము పొంగినపుడు అప్రయత్నముగ శ్లోక మందికొందురు. మఱి కీర్తనలు, జోలలు, రాగతాళ విశేషములతో రచించు టయు వీరికి సరదా. అవధాన సభలలో ఈ ప్రక్రియ రాణించుననని వేఱుగా జెప్ప నక్కఱ లేదు. విశేష వృత్తములు, వచనములు శ్లోకములు, దండకములు, కీర్తనలు, జోలలు, బోరు కలుగ, ప్రబంధమంతయు వైకుంఠపాళము చేసిరి వీరి సాహిత్యము యక్షగానగంధి. అదియే సభారంజనమునకు అనువగు విద్య.

తరువాత ఈ విద్య నుచ్చస్థితికి దెచ్చినవారు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు. సహపాఠి శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారిని సర్ధ్వంచుచుగా గొని. శతావధానము లనేకములు సలిపిరి

తిరుపతి శాస్త్రిగారిని పృథక్కరించి వేంకటశాస్త్రిగారికే కథానాయకత్వ మిచ్చి వ్రాయుట న్యాయము కాదు ఏలయన, తిరుపతి శాస్త్రిగారు నామమాత్రపు కవి కారు. కొండ. సభలో వేంకటశాస్త్రిగారికి పెత్తన మిచ్చి యూరకుండు వ్యక్తియు కారు.

'ఒక చరణం బతండు మఱియొక్కటి నేను మఱొక్క టాతడున్
సకల కవీంద్ర సంతతులు సమ్మతిచే దలలూచి మెచ్చగా
బ్రకటితరాజభారత దసరన్ రచియించఁగనేర్తు మయ్య!'

(నానారాజ సందర్శనము.)

అని, ఇరువు బాధ్యత యిరువురు సమానముగా వహించువారే అయినచో వేంకటశాస్త్రిగారినే యేల ముందుగా బెర్కొ_వలసి వచ్చెను ? సభారంగము సజీవముగా కళకళలాడించు చాతుర్యము వేంకటశాస్త్రిగారి హస్తగతవిద్య.

శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారిట్లు వ్రాసిరి:

'విసుగు పుట్టకుండా (శతావధాన) సభ జరుగుచున్నంతసేపూ వెంకటశాస్త్రి గారు ప్రాస్తావిక శ్లోకాలు, తమ చాటువులూ వినిపిస్తూ సభారంజనం చేస్తూనే ఉండేవారు.' (ఆంధ్రపత్రిక. విరోధి సంవత్సరాది సంచిక )

ఈ విషయము తిరుపతిశాస్త్రిగారే అంగీకరించిరి. ఒకసారి తిరుపతిశాస్త్రి గారి నొకరినే వెళ్ళి అవధానము చేసి రమ్మని వంకటశాస్త్రిగారు కోరగా, తిరుపతి శాస్త్రిగారిచ్చిన సమాధాన మిది - 'నేను వెడతాను. అవధానాదికమున్నూ చేస్తాను. ఎవరో వైదికప్పేరంటాలు వచ్చి వెళ్ళిందంటారు. కనక నువ్వు వచ్చేదాక వెళ్ళేది లేదు.' (నేనూ — మా తిరుపతి )

తిరుపతిశాస్త్రిగారు కావ్యకవి. వేంకటశాస్త్రిగారు సభాకవి
'అత్యద్భుతంబైన యవధానవిద్యకు
ప్రభవకారణమైన ప్రతిభవాడు' వెంకటశాస్త్రిగారే.
(సౌందరనంద కృతిసమర్పణ పద్యములు.)

పద్య విద్యయందు తిరుపతిశాస్త్రిగారికి సాటి తిరుపతిశాస్త్రిగారే.
సభారంజనవిద్యయందు వేంకటశాస్త్రిగారికి సాటి వేంకటశాస్త్రిగారే.

అట్టి తిరుపతి వేంకటకవులు స్వోపజ్ఞకమే యని పలుకదగినంత తేజస్వంతముగా శతావధాన విద్య నెచ్చి దిద్ది, శారదాపీఠ మధిష్ఠించి, జగద్గురుడైన శంకర భగవత్పాదులవలె, మేధిష్ఠులై చిరయశః ప్రతిష్ఠులైరి.

తత్కవియుగపద్ధతియే నేటికి నుపాదేయమైనది.

బందరుపురమున శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు కావించిన సంపూర్ణశతావధానము జూచి వేంకటశాస్త్రిగారు ప్రశంసించుట తత్రత్యులైన పండితుల కొకవిశేష

ముగా భాసించినది. తత్సన్నివేశమును శ్రీ మంగళగిరి కృష్ణద్వైపాయనాచార్యుల వారిట్లు కొండాడిరి.

'యస్యావధానసమయే కవిలోకమాన్యః
శ్రీ చెళ్లపిళ్ల వర వేంకట సత్కవీంద్రః
సోఽయం ముహుః శతావధాని కులాగ్రగణ్యః
సాధ్వి త్యభాషి కిము తం భువి వర్ణయామి.'

అవధానవిషయమున తిరుపతి వేంకటేశ్వరుల వాక్ప్రమాణ్య మట్టిది.

శ తా వ ధా న ల క్ష ణ ము

'తత్ర న్మానవ మానసాద్భుతతమం వృత్తం తథా వస్తు చ
స్వీకృత్య ప్రథమం శతాయ సరయం తత్పాద మేకం వదేత్
భూయః కైర్న చ బోధితః క్రమవశా త్పాదత్రయం కీర్తయేత్
ఏతన్నామ శతావధాన మధచే త్పద్యాని సంకీర్తయేత్.
(శతావధానసారోపోద్ఘాతము.)

అని శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు శతావధానమునకు లక్షణ మేర్పఱచి కొనిరి. ఒకచో ఈ లక్షణమునే విపరించి తెనుగున జెప్పిరి.

'వందమంది కో

ర్కెలు మదినూని వారలు వరించిన వృత్తములన్ గ్రహించి, వా
రల కొకపాదమున్ నొడివి వ్రాసిన పిమ్మట దక్కపాదముల్
కలయగ జెప్పి, పిమ్మట నఖండముగాగను నూఱుపద్యముల్
బలువిడి నప్పగించు పని' (నానారాజ సందర్శనము.)

శ తా వ ధా న ప్ర శ్న ము లు.

మల్లెమొగ్గలతో గట్టిన హారము మనోహరముగా నుండును. దానిలో జెత్తెడు బెత్తె డెడముగా మరువకపత్రిక గుచ్ఛములు పెట్టి కట్టినచో మఱియు

మనోహరముగా నుండును. వింత వన్నెల చిన్నెల విరు లక్కడక్కడ గ్రుచ్చుచు బోయినచో నిక జెప్పనక్కఱ లేదుగదా! శతావధానహారమున వర్ణన పద్యములు మల్లెమొగ్గలు, సమస్యలు మరువకదళములు, దత్తపదులు, భాషాంతరీకరణములు, అచ్చతెలుగులు, సంస్కృత శ్లోకములు, గ్రామ్యభాషణములు, శ్లేషలు, నిరోష్ఠ్యములు, శబ్దాలంకారములు, అర్థాలంకారములు వింతవన్నెల చిన్నెల విరులు.

శతావధానము వర్ణనపద్యప్రధానము. అన్నియు నచ్చముగా వర్ణన పద్యములే యుండినచో నవధానము చప్పగా నుండునేమోయని పదో పదేనో సమస్యలంగీకరించిరి. యథావకాశముగా తక్కిన వాక్చిత్రము లంగీకరించిరి. అంతేకాని, వర్ణనమున కంటె భిన్నమైన పద్యవిశేషము లుండి తీరవలెనన్న నియమము లేదు.

శతావధాన ప్రశ్నప్రణాళిక యెట్లుండునో మాదిరికి, కీ. శే. ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవి శ్రీ కాశీ కృష్ణాచార్యులవారి బందరు శతావధాన ప్రశ్నములు వరుసగా నుదాహరింతును.

| | | |
|---|---|---|
| ప్రథమము | - | బాలసూర్యకిరణవ్యాప్త పర్వతఝురము. |
| ద్వితీయము | - | స్వార్థపరిత్యాగము. |
| తృతీయము | - | సమస్య. |
| చతుర్థము | - | యోగనిద్ర. |
| పంచమము | - | సంగీత సాహిత్యములలో ఏది గౌరవార్హము? |
| షష్ఠము | - | లక్ష్మీపార్వతీ సంవాదము. |
| సప్తమము | - | నిర్గుణ బ్రహ్మము. |
| అష్టమము | - | రైలు వచ్చిన పిమ్మట బందరు. |
| నవమము | - | శివస్తవము (అచ్చ తెనుగు) |
| దశమము | - | శ్లోకమునకు తెనుగు పద్యము. |
| ఏకాదశము | - | సమస్య. |
| ద్వాదశము | - | అవధానిగారి మనస్సు. |
| త్రయోదశము | - | సమస్య. |

| | | |
|---|---|---|
| చతుర్దశము | - | పరీక్ష తప్పిన విద్యార్థులు. |
| పంచదశము | - | స్త్రీల పునర్వివాహము. |
| షోడశము | - | అత్త కోడండ్ర పోట్లాట. |
| సప్తదశము | - | మల్లెపువ్వు. |
| అష్టాదశము | - | మండి యారిన అగ్గిపుల్ల. |
| నవదశమము | - | రాబర్ట్ సన్‌పేట కోనేరు. |
| వింశము | - | జ్ఞానమును దీపముతో బోల్చుట. |
| ఏకవింశము | - | సంధ్యారాగము. |
| ద్వావింశము | - | అతివృష్టి. |
| త్రయోవింశము | - | హైందవుల యైకమత్యము. |
| చతుర్వింశము | - | తమవారిని విడిచి యితరుల పిల్లలను నాటకములలో వేసములు వేయించు వారిని గూర్చి. |
| పంచవింశము | - | బందరు జాతీయ కళాశాల. |
| షడ్వింశము | - | ఒకరిచ్చిన వర్ణన. |
| సప్తవింశము | - | ఒకరిచ్చిన వర్ణన. |
| అష్టావింశము | - | ఒకరిచ్చిన వర్ణన. |
| నవవింశము | - | బందరు టౌన్‌హాలు. |
| త్రింశము | - | కాలమును నదీప్రవాహముతో బోల్చుట. |
| ఏకత్రింశము | - | ఒకరిచ్చిన వర్ణన. |
| ద్వాత్రింశము | - | ఒకరిచ్చిన వర్ణన. |
| త్రయస్త్రింశము | - | రాత్రి పాఠశాల. |
| చతుస్త్రింశము | - | సూది మొన. |
| పంచత్రింశము | - | దత్తపది. కీర, వైర, హార, భార ప్రాస స్థానము లందుంచి విరహ వర్ణన. |
| షట్త్రింశము | - | అవధానిగారి మెడలోని పూలదండ. |
| సప్తత్రింశము | - | కర్ణశాపములు. |

అష్టాత్రింశము - ఒకరిచ్చిన కల్పన.
నవత్రింశము - ఒక శ్లోకమునకు తెనుగు పద్యము.
చత్వారింశము - ఒకరిచ్చిన కల్పన.
ఏకచత్వారింశము - హయగ్రీవస్తుతి
ద్విచత్వారింశము - నౌకాయానము, తుఫాను.
త్రిచత్వారింశము - మేధాదక్షిణామూర్తి.
చతుశ్చత్వారింశము - చల్లబజారు.
పంచచత్వారింశము - ఒకరిచ్చిన కల్పన.
షట్చత్వారింశము - సమస్య.
సప్తచత్వారింశము - రాజభక్తి, కర్ణదృష్టాంతము.
అష్టచత్వారింశము - బొమ్మజెముడు హంసతూలికాసామ్యము.
ఏకోనపంచాశము - ఒకరిచ్చిన కల్పన.
పంచాశము - ఒకరిచ్చిన వర్ణన.
ఏకపంచాశము - ఆంగ్లేయ ప్రభుత్వము.
ద్వాపంచాశము - చీపురుపుల్ల.
త్రయఃపంచాశము - గులాబీపువ్వు స్త్రీసామ్యము.
చతుష్పంచాశము - కనుబొమ్మలు.
పంచపంచాశము - మఱపుగల శిష్యుని గూర్చి గురువుగారి మొఱ.
షట్పంచాశము - విద్యార్థి జీవితము.
సప్తపంచాశము - కుంభకర్ణుని నిద్ర.
అష్టపంచాశము - అగ్రాసనాధిపతి
ఊనషష్టితమము - సభలో దినిన ఫలము యొక్క రుచి.
షష్టితమము - క్రాపింగులోని లాభనష్టములు.
ఏకషష్టము - కొద్ది జీతగాండ్ర కష్టము.
ద్విషష్టము - సృష్టికి పూర్వమేమున్నది ? అద్వైతపరముగ.
త్రిషష్టము - జగమెఱిగిన బ్రాహ్మణునకు జందెంబేలా అనుదాని భావము

చతుష్షష్టము - శ్లోకమునకు తెనుగు పద్యము.
పంచషష్టము - ఒకరిచ్చిన వర్ణన.
షట్షష్టము - సింహాచలముపై నీటి ధారలు.
సప్తషష్టము - నఖలిఖిత చిత్రపటము.
అష్టాషష్టము - త్రిమతములలో నేది ప్రస్తుతకాలానుగుణము?
ఏకాన్నసప్తతితమము - ఆటవెలదిపైన ఆటవెలది.
సప్తతితమము - భక్తుడు.
ఏకసప్తతము - నూత్నపద్ధతుల జేయుడనిచెప్పి తాజేయని వాని గూర్చి.
ద్వాసప్తతము - పసిపాపల పెండ్లి.
త్రయస్సప్తతము - పద్మనాభస్వామి.
చతుస్సప్తతము - సరస్సులో ప్రతిఫలించెడు చంద్రుడు.
పంచసప్తతము - ఇంద్రధనుస్సు.
షట్సప్తతము - శ్లోకమునకు తెలుగు పద్యము.
సప్తసప్తతము - సూర్యవర్ణన.
అష్టసప్తతము - నల్లిదొరగారి ప్రభుత్వము.
నవసప్తతము - ఈస్ట్ ఈజ్ ఈస్ట్ అండ్ వెస్ట్ ఈజ్ వెస్ట్ అండ్ దె నెవర్ మీట్.
అశీతితమము - ప్రభాతము.
ఏకాశీతము - డిల్లీలో దర్బారు మందిరము.
ద్వ్యశీతము - కవిరాజులు.
త్ర్యశీతము - దంభజ్ఞాని.
చతురశీతము - పోకచెక్క.
పంచాశీతము - గంగను స్త్రీతో పోల్చుట.
షడశీతము - గ్యాసులైటు గ్లాసు.
సప్తాశీతము - ఇసుకరేణువు.
అష్టాశీతము - గుంటూరు పెద్దకొళాయి.
నవాశీతము - భారతము.

| | |
|---|---|
| నవతితమము | - ఒకరిచ్చిన వర్ణన. |
| ఏకనవతము | - గజరక్షణార్థమై వచ్చిన కృష్ణుడు. |
| ద్వానవతము | - చాణక్య రాక్షస జయాపజయావస్థలు. |
| త్రయోనవతము | - బుట్టాయిపేట పెండాలు. |
| చతుర్నవతము | - అభిమన్యు కర్ణులు చచ్చినపుడు పాండవ కౌరవ సంతోష దుఃఖములు. |
| పంచనవతము | - ఆత్మస్తుతి పరనింద యొనర్చువా రెట్టివారు? |
| షణ్ణవతము | - లేళ్ళు మేయుచున్న పచ్చిక బయళ్ళు. |
| సప్తనవతము | - శివకేశవస్తుతి· శ్లేష: ఆర్యా. |
| అష్టనవతము | - కలిచర్య. |
| నవనవతము | - చాడీకోరు. |
| శతతమము | - ఒక వృత్తములోని వర్ణన నింకొక వృత్తములోనికి మార్చుట. |

పై నూఱిటిలో నాలుగు సమస్యలు, నాలుగు శ్లోకానువాదములు, ఒక దత్తపది, ఒక అచ్చతెలుగు పద్యము నున్నవి. మఱి సంస్కృత శ్లోకములు లెక్కించినచో పదునెనిమిది కలవు.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు తమ ప్రప్రథమ శతావధానమున సగము శ్లోకములు సగము పద్యములు సరిగా తూచినట్లు చెప్పిరి. సమస్యాదుల ప్రసక్తి లేదు. (తిరుపతికవుల సాహిత్య సమీక్ష. భారతి. సెప్టెంబరు 1966.)

శ్రీ కొప్పరపు సోదరకవులు తెలుగు సమస్య లెక్కువ చెప్పిరి.

పద్యములు సమస్యలే కాక, శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు రాగ స్వర లయ సహితముగా పాడుచు కీర్తనలు సంధించిరి.

చమత్కారజనకమైన యీ వైవిధ్యము కవ్యధీనము. దీనికొక కట్టుబాటు లేదు.

### శతావధాన నిర్వహణము

'అవధాన సభయందు పృచ్ఛకులు బంతులుదీరి కూర్చుండియుందురు ఒకరి తరువాత నొకరు తమ ప్రశ్నముల నిత్తురు ఇత్తురనగా కాగితమున వ్రాసి

కాదు, నోటితో జెప్పుదురు. ఏదైన వస్తువొసగి పద్యము నిర్మింపగోరుదురు లేదా, సమస్య నొసగి పూరింపుమందురు. వర్ణనము, వర్ణనము కానిచో సమస్య- ఇదే శతావధాన విధానము.'

(ఆంధ్రప్రభ కళాసాహిత్య విజ్ఞాన వేదిక: 21-1-1968 మదీయ వ్యాసము.)

ప్రశ్నమునకు సమాధానముగా నవధాని యొకేసారి పద్యమంతయు జెప్పడు. నాలుగు సారులుగా జెప్పి పూర్తిచేయును. పృచ్ఛకుడు తన ప్రశ్నమును మొదటి సారి మాత్రమే చెప్పును ద్వితీయావృత్తిలో పెదవి విప్పడు చెప్పినది వ్రాసి కొనును. తృతీయచతుర్థావృత్తులలోను అంతియ అంతయు పూర్తిచేసి సక్రమముగా అప్పగించు బాధ్యత అవధానిదే.

వర్ణనలు సమస్యాదులు సమపాళముగా నుండవలెనను నియమము లేదు. పానకమున మిఱియపు బలుకులవలె, అక్కడక్కడ నుండిన బాగుండునని సమస్యయో దత్తపదియో, శ్లోకానువాదమో అచ్చతెనుగుపద్యమో అలవోక చెప్ప గల చొరవ కలవారు చెప్పుదురు కొంద రీగొడవల జోలికి బోక, శుద్ధముగా వర్ణన పద్యములే చెప్పి చెయి కడిగికొందురు. ఏమైన నూఱుపద్యములు చెప్పవలెను. శతావధాని యనిపించుకొనుట కింతమాత్రము చాలును పైపెచ్చు సమస్యాపూరణాది వినోద క్రియలన్నియు మెఱమెచ్చులకే.

సంపూర్ణ శతావధానము సలక్షణముగా జేయుటకు మూడు నాలుగు దినములు పట్టును. ప్రాయశః దినమున కొక చరణము చొప్పున నాలుగు దినములలో నాలుగు చరణములు పూర్తి చేయుదురు సీస పద్యములుండినచో ఎత్తు గీతులను గూడ నాల్గవ చరణముతోబాటు పూర్తిచేయుదురు.

అయిదవ దినమున అప్పగింతలు, విజయి యయిన యవధానికి సమ్మాన సత్కారములు, సభ హాళా హాళిగా నుండును సభానిర్వాహకసంఘ పక్షమున సమ్మాన పత్రములు, పూలదండలు, దాంకవములు. రొక్కము సమర్పించుట జరుగును. పృచ్ఛక విద్వజ్జనము ప్రశంసాపద్యములు చదువుట, కొందరు సభ్య మహాశయులుత్సాహముతో డబ్బు చదివించుట, వస్త్రము లిప్పించుట, పుష్పమా లలు కైసేయుట, కరతాళములు చఱచుట జరగును శతావధానవిజయగర్వమున

మెఱయు నవధానికి తత్కాలమున మెఱపు లె నాశుకవితాఝరి పరుగువారి సభా మంటపి నాశ్చర్యపూరమున ముంచివేయును అప్పటి ఆకవితాధారయొక్క వడియు వాడియు ననిర్వచనీయములు. ఈ సమ్మాన సభాకార్యక్రమము చాల ప్రొద్దు పోవు దనుక సాగును. ఈ కాలము అవధానరచనాకాలమున జేరదు. అసలైదవ దినమే లెక్కలో వేసికొనరు. కొందరు నాల్గవ దినముననే పద్యము లన్నియు నప్ప గింతురు అట్టిచో సమ్మాన కార్యక్రమ మయిదవ దినమున జరుగును.

శతావధానము జరిగెడి నాలుగు రోజులలో తొలిరోజు సమ్మర్దముగా నుండును ఉపక్రమించి, యవదాని యొకొక్క పృచ్ఛకున కభిముఖుడై నిల్చి, తత్ప్రశ్నము గొని, అది యస్పష్టముగా నుండినచో వివరింపగోరి, అసంగతముగా నుండినచో సవరింపగోరి, అసభ్యముగా నుండినచో సభాధ్యక్షునకు నివేదించి తదీయ నిర్ణయము గైకొని, తెలిసియో తెలియకయో యెవరైన చిత్రబంధగర్భకవి త్వాదులడిగినచో, అవధానమున నటువంటి దుర్ఘట విషయము లడుగగూడదని తెలియబఱచి, మొప్పెలు కొందరు వ్యర్థవివాదపురొంపిలో దింపి, దానిని కడిగి కొని యవతలకు బోవుటకు వీలుకాని పరిస్థితి కల్పించినచో, కసరుకొనక, చీకాకు పడక చికిముడిపడక, నెమ్మదిగా సరదుకొని, టైము చూచికొని పని చేయవలసి యుండును కనుక ఎంత జాగరూకత వహించినను ఆలస్యము తప్పదు.

తొలిదినమున నెంత క్లేశమున కవకాశముండునో', అంత సుఖమునకు నవ కాశముండును. అడిగినవాని మొగాన ఆకుకందక పోకకు పొందక, యేదే నొక చరణ మల్లి పారవైచి వెళ్లవచ్చు.దానిని మలిదినమున పాకమునకు దెచ్చికొనవచ్చు. ఉదాహరణమున కొకపృచ్ఛకుడు అవధానియొక్క జ్యోతిశ్శాస్త్రపరిజ్ఞానము పరీ క్షింపదలచి, 'శకటయోగ మనగా నెట్లుండు' నని పృచ్ఛించె ననుకొందము. అవ ధాని తజ్జ్ఞుడు కాడనుకొందము. అపుడతడు 'అది నాకు దెలియ'దని తెల్ల మొగము వేయనక్కఱలేదు. ఇదిగో సమాధానము వ్రాసికొనుడని గంభీరముగా-

'శకట యోగము చెల్లు బ్రఖ్య స్తరీతి'

అని యొక తేటగీతి పాదము చెప్పితప్పికొనవచ్చు. ఇంటికి బోయిన పిదప, ఆ రేయి, 'బృహజ్జాతక' గ్రంథము చూచి, 'తన్వ స్తగేషు శకటమ్' అనుట బట్టి ముచ్చటగా కడమ మూడు దినములు మూడు పాదములుగా నిట్లు చెప్పనగును.

'గృహము లన్నియు గూడి లగ్నమునయందు
సప్తమమునందు నిల్చుట సంభవించె
నేని పండితవర్య ! గ్రహింపుమయ్య ! '

ప్రథమపాదమున ప్రశ్న స్వరూపము మాత్రము కూర్చబడినది. ద్వితీయ పాదములందు విషయము వివరింపబడినది చతుర్థపాదమున నూరక సంబోధ నాదులు నింపబడినవి పండితవర్య యనెడి సంబుద్ధికి బదు లతని నామధేయము నైన నిఱికింపవచ్చును

అభేద్య రహస్యములగు నయోమయపు సమస్యలనుగూడ నిదే పద్ధతిచే లొంగగొట్టికొన వచ్చును. కనుక తొలిదినమున వానికై తికమకపడి తలగోకికొన పనిలేదు యథోపజోషముగా ప్రథమపాదము నీడ్చివేయుటయే కర్తవ్యము.

రెండవదినమును గుఱించి చెప్పవలెనన్న అదియొక గండమని చెప్పవలెను. ఆ గండము గడిచి బయటబడుటకు సభలో నేకైక సాధనము ధారణాశక్తి. పృచ్ఛకుని ముఖము జూచినంతనే యతదేమి యడిగియుండెనో, అతనికి తానేమి చెప్పియుండెనో ఆకళింతకు దెచ్చికొనవలెను. దానినిబట్టి రెండవ చరణము జెప్పవలెను చెప్పెనా శతావధాని విజయియయినటు లానాడే ప్రకటింపవచ్చును.

తరువాత మూడవ దినము, నాలుగవదినము అనాయాస కాలక్షేపదినములు. ధారణ స్థిరపడియుండును పద్యము యొక్క ఉత్తరార్ధము మనసున రూపు దిద్దుకొనియుండును అలవోక సిద్ధపదార్థము లొయ్యారముగా వడ్డించుచు బోవు చున్నటులుండునే కాని, ప్రవాహమున కెదురీదుచున్నటులుండదు.

శతావధానము మూడు రోజులలోనే పూర్తిచేయువారు తొలిరోజున నొక చరణము, మలిరోజున నొకచరణము జెప్పి, మూడవ రోజున రెండు చరణములు చెప్పి, అప్పుడే అప్పగింతురు గూడ. మూడవరోజున పద్యోత్తరార్థము నొక్క గ్రుక్కలో జెప్పుట కష్టముగాదు. అప్పటి కా పద్యము సకలావయవ పూర్ణమై యవధాని మనఃపేటికయందు సిద్ధముగ నుండును.

వర్ణనలు, సమస్యలు, అనువాదములు, శ్లోకములు, అచ్చతెనుగులు, మఱేవియైనను, శతావధానమున జెప్పినవి నూటికి నూఱు విధిగా అప్పుజెప్ప వలెను.

## శతావధాన కాలపరిమితి

సంపూర్ణ శతావధానము నిర్వహించుటకు నాలుగు దినములు పట్టును. దినమునకు నాలుగు గంటల చొప్పున వేసికొన్నచో పదునాలుగు గంటల కాల మగును. 'విజ్ఞానసర్వస్వ' నిర్ణయమిది.

తిరుపతి వేంకటేశ్వరులు నూజివీడులో సంపూర్ణ శతావధానము 'దినత్రయ కాలేన' పూర్తిచేసిరని సంస్థాన పండితుల వ్రాతవలన దెలియుచున్నది.

ఎన్ని గంటలు పట్టెనో తెలుపలేదు గాని, 'గంటలు పదిపైని పట్టునె?' యని గద్వాల పండితులాక్షేపించిరని, శ్రీ తిరుపతి వెంకటేశ్వరులే చెప్పిన చంపకమాలిక బట్టి పది పదేను గంటలు పట్టియుండునని యూహింపవచ్చును.

కాశీ కృష్ణాచార్యులవారు నాలుగు దినములలో బదునేడు గంటల కాల పరిమితిలో నిర్వహించిరని, తత్సభాధ్యక్షులు శ్రీ జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారు వ్రాసిరి. (బందరు శతావధానము)

వేంకట రామకృష్ణకవు లొకసారి రాజాజ్ఞ మీఱజాలక అతికష్టముతో రెండు దినములలో పది గంటలలోనే చేసిరట మామూలుగానైనచో వారికి-

'నాలుగు నైదు గంటలు దినంబునకుం బనిసేయ నెంతయుం
దాలిమితోడ నీశతవధానము మూడుదినాలు పట్టు ... ...'

(శ్రీ వేంకటరామకృష్ణ గ్రంథమాల.)

అన్నారు కనుక పంద్రెండు పదునైదు గంటలు పట్టవచ్చు ననుకొనవచ్చు

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు నాలుగు దినములలో నిరువది నాలుగు గంటల కాలపరిమితిలో జేసిరట. (గుంటూరు కాలేజీ శతావధానము.)

'అవధాన దర్పణ'కారుడు నాలుగు దినములలో నిరువది నాలుగు గంటలు దీసికొనిరి

శ్రీ వేమూరి శ్రీరామశాస్త్రిగారు బరోడా మహారాజ సన్నిధిలో పదునాలుగు గంటలలో నిర్వహించిరట. దినసంఖ్య దెలుపలేదు అది గీర్వాణము
(విక్రమ సింహపుర మండల సర్వస్వము.)

శ్రీ కొప్పరపు సోదర కవులు సంపూర్ణ శతావధాన మెన్ని దినములలో చేసిరో దాని కెన్ని గంటలు పట్టెనో తెలుపలేదు. కాని, పాదాధిక శతావధానము బాపట్లలో 33 మందికి 11 గంటల 50 నిమిషములలోను, విశదలలో 42 మందికి 10 గంటల 30 నిమిషములలోను వాలాయము నిర్వహించినట్లు ప్రకటించిరి.
(కొప్పరపు సోదర కవుల శతావధానములు 1,2 భాగములు )

సగటున లెక్కించినచో 80 మందికి 22 గంటల 20 నిమిషములు పట్టినందున, కొప్పరపుగవులకు, 100 మందికి 27 గంటల 55 నిమిషములు - దాదాపు 28 గంటలు పట్టియుండవచ్చునని యూహింపవలసి యున్నది.

పట్టుమని, వాదప్రతివాదములకు, అప్రస్తుత ప్రసంగములకు, వ్యాఖ్యలకు దావీయక, హుటాహుటి సాగించినచో, నాలుగు వరుసలు చెప్పి యొప్పించుటకు పది గంటలు కూడ అక్కఱ యుండదు మఱియు దక్కువ కాలమున బూర్తి చేయవచ్చు. ఓపికలేని సభ్యులు దిక్కృదగ్ధనముగా సంపూర్ణ శతావధాన మొకే దినమున జూపింపగోరుదురు అదియు జేయవచ్చు.

సర్వాంగ సుందరముగా సంపూర్ణ శతావధానము కావించుటకు ఇరువది నాల్గు గంటలు పట్టును ఈ విషయము శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రిగారు ఖండితముగ జెప్పిరి.

'శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు మొద లీనాటి దనుక నవధాను లెల్లరు దినమునకు 8 గంటల చొప్పున మూడు దినములలో - అనగా 24 గంటలలో - సంపూర్ణ శతావధానము గావించుచున్నారు.'
(శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రిగారి జీవిత చరిత్ర )

సగుణము సాలంకారము అగు పద్యము నల్లుట యొక శిల్పి యొక మంచి సుగ్గడితపు వస్త్రమును నేయుట వంటిది చొప్పదంటు పద్యము లల్లుట 'షష్ఠి పంచెలు' నేయుట వంటిది. పని యొప్పిదమునుబట్టి మొదటిదానికి నెక్కువ కాలము, రెండవదానికి తక్కువకాలము పట్టును.

## అ త్యా ద్భు త శ తా వ ధా న ము

వేంకట రామకృష్ణ కవులు 'అత్యద్భుత శతావధాన' మను నొక నూతన ప్రక్రియ నవలంబించి, యొకేదినమున నాలుగగంటల వ్యవధిలోనే దానిని పూర్తి చేసిరి.

పృచ్ఛకులు సీసము, తరువోజ, లయగ్రాహి వంటి పెద్ద పెద్ద పద్యము లడుగ గూడదని ముందుగనే కట్టడచేసి, పద్యమంతయు నొకేసారి చెప్పివేసి, వ్రాసికొననిచ్చి, ధారణ స్థిరపఱచికొనుటకు మఱొకసారి స్వోక్తపద్యమును వల్లించి, పరిక్రమించుచు తుదిముట్ట నూఱుగురకు నూఱుపద్యములు చెప్పి పూర్తి చేసి, అధ్యక్షుడు కోరిన పద్యములను మాత్రమే, అప్పజెప్పిరి అనగా-1 పద్యము, 12 పద్యము, 30 పద్యము, 74 పద్యము, 81 పద్యము, 99 పద్యము, 100 పద్యము అని కోరిన సంఖ్యగల పద్యము

(శ్రీ వేంకట రామకృష్ణ గ్రంథమాల)

కాలదైర్ఘ్యము నోర్వలేక విసుగు జెందెడి మహారాజుల కొఱకు వారిపద్ధతి చేపట్టి సంపూర్ణశతావధానము ప్రదర్శించిరి కాని, తరువాత వారెవ్వరును దీనిని జేపట్టినట్టులు కనుపట్టదు ప్రభువులకుగూడ దీనిపట్ల రుచి కలుగలేదు. అందు చేత వేంకట రామకృష్ణకవులును దీనిని వదలి, సాధారణ శతావధానములనే కావించిరి.

వేంకట రామకృష్ణ కవుల యీ యత్యద్భుత శతావధానమునకు, తిరుపతి వేంకటేశ్వరుల మొట్టమొదటి కాకినాడ శతావధానమునకు కొంత దగ్గరి చుట్ట ఱికము కలదు

తిరుపతి వేంకటేశ్వరులు ప్రథమ దినమున ప్రథమపాదము-పృచ్ఛక శతకమునకు - జెప్పి నాటి కార్యక్రమము పూర్తిచేసిరి. కాని, సభ్యులు వారి నింటికి బోనీయ లేదు. ఇంటికిబోయి యిరువురు సంప్రతించుకొనుచు, పద్యములన్ని పూరించుకొందురని, వారికట్టి యవకాశ మీయరాదని. ప్రొద్దుపోయినను వారినక్కడనే నిలిపి 'మధ్యమధ్య గొన్నిటి బూర్తిన్ బొనరించెదరే? యనుటయు, బొనరించెద మనిరి సభ్యపుంగవు లలరన్. పదపడి, పది, పదునై, దిరువదియొక్కటి, మూడు, నూఱు, పదునాలుగు, తొంబది, యేబదియా ననుచున్ మొదలును దుది లేక, యడుగ మొదలిడి రెలమిన్. వరుసలేదు, మున్ను పంక్తిని గూర్చున్న వారు లేరు, బుద్ధిబలమొ లేక దైవబలమొ కాని, తత్తచ్చరణపూర్తి నిలిపి మించి రెల్ల జనులు మెచ్చ. అంత సభవార లెల్లరనంతానందంబు కలిమి ఆహారవ మాశాంతములు నిండ, తచ్చరణాంతమ్ములు సోకమ్రొక్కి యని రిప్పగిదిన్: ఓ యనఘులార! నర నారాయణు లనవలయు మిమ్ము బ్రాకృతు లిట్టుల్ సేయగ నేర్తురె?'

(జాతక చర్య. పూర్వార్ధము.)

ఇది యత్యద్భుత శతావధానము కాదా ?

## అర్ధశతావధానము:
## పాద శతావధానము

ఎనిమిది మంది పృచ్ఛకులున్నచో అది అష్టావధానము.
నూరుమంది పృచ్ఛకులున్నచో అది శతావధానము.
అంతేకాని పృచ్ఛక సంఖ్య యెనిమిది దాటిన అది శతావధానము కాదు.

మ. పది మందిన్ నియమించి పృచ్ఛకులుగా పద్యమ్ములన్ జెప్పి యి
య్యదియే పొందు శతావధానమనినన్ హాస్యాస్పదంబైన యె
ల్లిదపుంజైద మగున్ .. (శతావధాన ప్రబంధము ప్ర ఖం)

నూజివీటి సంస్థానాధిపతుల సౌధమున జరిగిన మహా సభలో పీఠికాపుర సంస్థానాధిపతి లేచి, మాడభూషి వేంకటాచార్యులవారితో 'ఆర్యా! మీ శతలేఖినీ పద్య ప్రబంధ నిబంధన చమత్కారంబు జూడ గుతూహలంబగుచున్న' దనిరట. ఆచార్యులవా రంగీకరించి. శతావధానమున కుపక్రమించిరి. పృచ్ఛకుల కొకొక్కరి కొకొక్క చరణము చొప్పున చెప్పికొనుచు బోవుచుండిరి. సంఖ్య యేబది పూర్తియై

యేఱది యొకటపది జరుగుచుండగా సభవారు 'ఆర్యా! మీరిట్లు సహస్రమునైన జెప్పగలరు. కావున నింతటితో జాలించి పద్యములు పూరింపు'డని కోరిరి. ఆచార్యులవా రట్లేచేసిరి.

అగిరిపల్లెలో అర్ధశతావధానము కావించిన ఆచార్యులవారిని అతిరథశ్రేష్ఠుడని నిర్ణయించి, సహస్రరూప్యసహితముగా జాంబూనదాంబర తాంబూలాదులు సమర్పించి తత్ప్రభువులు సత్కరించిరి.

విజయనగరమున తిరుపతి వేంకటేశ్వరులు పాతిక మందికే చేసిరి. సభాధ్యక్షులు అంతే చాలుననిరి. వారు వల్లె యనిరి.

**"Twenty five gentlemen were selected"- Telugu Harp 20-9-1895.**

అర్ధ శతావధానము లేదా పాద శతావధానము సభ్యుల యోరిమి చాలమికి తారకాణలే కాని, అవధాని నేరిమి చాలమికి తారకాణలు కావు.

ఒక విమానము వంద మందిని తీసికొని వెళ్లగలదు దానిలో నూ టాసనములున్నవి. యాత్రికులు నూరుగు రుండవచ్చును. ఏబదుగు రుండవచ్చును. ఇరువదియేగు రుండవచ్చును. మరియు తక్కువమంది యుండవచ్చును. ఉన్నవారి నెక్కించికొని విమానము ప్రయాణించును.

శతావధానియు సభను బట్టి పృచ్ఛకు లెందరు గూర్చుండిన నందరికి జెప్పును.

పృచ్ఛక సంఖ్య తగ్గినచో అవధాన కాల దైర్ఘ్యము తగ్గును.

ఎందరు పృచ్ఛకులున్న అన్ని పద్యము లుండును.

కనీసము పద్యమునకు పది నిముసములు కావలసివచ్చును. ఎట్లన, ప్రశ్నము విని గ్రహించుటకు రెండు నిముసములు. ఒకొక్క పృచ్ఛకుడు చిన్న ఉపన్యాసమే చేయును. తటాలున ప్రశ్నము చెప్పడు. ఒక పద్య చరణము చెప్పుటకు రెండు నిముసముల చొప్పున నాలుగు వరుసలలో నాలుగు చరణములు చెప్పుటకు నెనిమిది నిముసములు: వెరసి పది నిముసములని చెళ్లపిళ్లవారి అంచనా.

—: o :—

# అవధాని

'స్వాస్థ్యం ప్రతిభాభ్యాసో భక్తి ర్విద్వత్కథా బహుశ్రుతతా
స్మృతిదార్ఢ్య మనిర్వేదశ్చ మాతరోఽష్టౌ కవిత్వస్య.'

(కావ్య మీమాంస. 10-1)

స్వాస్థ్యము, ప్రతిభ, అభ్యాసము, భక్తి, విద్వత్కథ, బహుశ్రుతత, స్మృతిదార్ఢ్యము, అనిర్వేదము - యెనిమిది కవిత్వ జనయిత్రు లన్నాడు రాజశేఖరుడు.

1. స్వాస్థ్యము: నిలుకడ. ఆరోగ్యము కుదురుపాటు.

2. ప్రతిభ: నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞ.

3 అభ్యాసము: ప్రతి దినము కనీసము ఒక జాముసేపు విద్యావసథమున గూర్చుండి కావ్యవిద్యోపవిద్యలు పరిశీలించుట, కావ్యగోష్ఠి; ప్రశ్నోత్తరభేదనము, కావ్య సమస్యాపూరణము, ధారణమాతృకా చిత్రయోగాది క్రియానుష్ఠానము గావించుట అభ్యాసము. విద్యోపవిద్యానిరంతరపరిశీలన ఫలము ప్రతిభా హేతు ప్రత్యగ్ర సంస్కారము.

4. సరస్వతీరూపగురుభక్తియే భక్తి: భక్తిగలిగి, గురుముఖమున విద్యోపవిద్యలు సంగ్రహింపవలెను. విద్యలు - వ్యాకరణము అభిధానకోశము ఛందోవిచితి. అలంకార తంత్రాదులు: ఉపవిద్యలు చతుష్షష్టి కళలు

5 విద్వత్కథ: పక్షప్రతిపక్షోపన్యాసములచేత జరుపబడు విచారణ కథ యందురు. ఇది విదగ్ధ వాదగోష్ఠి.

6. బహుశ్రుతత: సుజనోపజీవ్య కవిసన్నిధి వలన దేశవార్త వలన, లోక యాత్ర వలన బాహుశ్రుత్యలాభము కలుగును.

7. స్మృతిదార్ఢ్యము: మఱపు లేమి అనుభూతివిషయ నిత్యోపస్థితి.

8. అనిర్వేదము: తన్ను దా జిన్నపుచ్చికొనమి.

విద్యోపవిద్యలు గ్రహించి, విద్వత్కథ లెఱిగి, బాహుశ్రుత్యసంపన్నుడైన ప్రతిభాశాలి యెవడో వాడు కవి.

అభ్యాసము కొఱవడినను, స్మృతి సడలినను, నిర్వేదము పొడమినను, స్వస్థత చెడినను కవిత రాదు.

శ్రీ చెళ్లపిళ్లవారు మీది విషయములు స్పృశింపుచు నొక యుత్పలమాలిక జెప్పిరి

'శ్రీ వెలయంగ సత్కవిత జెప్పెడివాడన బండితుండునుం
గావలె, లౌకికోత్తరుడు గావలె, బుద్ధివిశేషధుర్యుడుం
గావలె, భోగి యోగియును గావలె, గొంటెలలోన గొంటెయుం
గావలె, మంచి చెడ్డలనకన్ సకలమ్ము నెఱుంగ గావలెన్.'

(నానారాజ సందర్శనము.)

అని. ఇన్ని యగచాట్లుబడి కవయింపగడగువారందరు గణుతి కెక్కుదురా? యనిన, 'నూటి కొక్కడు చక్కని ధాటి గల్గి, సరస కవనమ్ము జెప్పెడి చతురుడుండు' అన్నారు. చక్కని ధాటి యనునది జీవలక్షణసంబంధి. దీనినే శైలి యందురు. రమణీయమైన శైలితోడి సరస కవితా రచనా చతురిమ అందరికి అబ్బదు. నూఱుగురలో నొక్కని కబ్బును.

'అట్టి వారలలో వేయి కమరు నొకడు
శతవధానాదికమ్మును సలుపు జాణ.'

కవిత్వ వ్యాసంగము కావించు పెద్దమనుష్యులలో నూటి కొకడు చక్కని కవి కాగా, అట్టి చక్కని కవులలో వేయి కొకడు జాణయైన అవధాని తేలుచున్నాడు.

అవధాని సర్వదా శుచియై యుండవలెను. ఈ శౌచము, వాక్శౌచము, మనశ్శౌచము, శరీరశౌచము అని త్రివిధము వ్యాకరణాది శాస్త్రాభ్యాసము వాక్శౌచకారణము. యోగ వేదాంతాది శాస్త్రాభ్యాసము మనశ్శౌచకారణము పెరిగిన గోళ్లు తీసివేసికొనుట, చందనాదులైన చర్చ లంగీకరించుట, అనల్పాణ మహోక్ష సుగంధి పుష్పధారణాదులు శరీరశౌచకారణములు. (కావ్య మీమాంస )

శుచిశీలనము సరస్వతిని వశీకరించికొనగలుగునని యార్యోక్తి.

ఇట్లు శుచిమంతుడైన కవి సభావేదిక నలంకరించి, అవధాన కార్యము నిర్వహించుచున్నాడు.

శ్రీ రాజశేఖర వేంకటశేషకవులు అవధానికి ధకారత్రయ మవసర మనిరి.

ధారా, ధారణా, ధైర్యములు ధకారత్రయము.

'కవి మనస్సున విషయము గోచరించి, భావస్ఫురణము కలిగి, రసవత్పదజాల మనర్గళ ధారాప్రవాహమున ఛందోబద్ధమై వెలువడుటయే ధార. పృచ్ఛకు లడిగిన ప్రశ్నములను వాని క్రమమును దాను వచించిన పద్యములను వృత్తవైవిధ్యముతో ప్రాసభేదములతో బుద్ధియందు ధరింపగలుగుట ధారణ మూడవది ధైర్యము ఇది లేనివా డవధానమునకే కాదేకార్యమునకైన పనికి రాడు. సమస్త బలములందును మానవునకు ధైర్యము మాతృస్తన్యము వంటిది ధైర్యహీనుని సభాప్రాంగణమునకు దీసికొనిపోయిన దేహ మాపాదమస్తకము వడకెత్తి ఖట్టపేలికల వలె కాళ్లు తూగాడి చూపు మందగించును. పృచ్ఛకులు సారస్వతవిషయములు ప్రశ్నించుటకు మాఱుగా ఆరోగ్య ప్రశ్నములతో కవిని దేర్చవలసినవా రగుదురు. తన దుస్థితి నెఱిగించుటకైన శబ్దజాలము లభింపక మ్రాన్పడిన యాతనికి సభ భయమై కంపము పంకమై యందుండి లేచిపోవుటకు గూడ నితరుల సాయ మవసర మగుట తప్పదు. రణరంగమున భేరీభాంకరణముల మధ్య నిలిపిన నిట్టిట్లు సుంతయైన తుంపెసలాడని యేకాగ్రమనోధైర్యములు గలిగి యనర్గళప్రవాహమున కైత సాగింపగల యవధానికి విద్వదాస్థానము మల్లెపూదోటవలె క్రీడాస్థానమై తనరారక పోదు.

పై గుణములకు దోడు ప్రసన్న మనోహరమైన మూర్తియు, మంగళ గళరావ సంపదయు నలరారిన మఱింత సుఖదాయకము.

(విజ్ఞప్తి. అవధాన సారము.)

ఏడుపు మొగము తగదు. నగుమొగము రాణించును.

'హీనస్వరం ఇల్లాలు ఇంటికి చేటు' అని సామెత అవధాని హీనస్వరము వాడు సభకు చేటు. మంగళ గళధ్వని మంచిది. ఒకింతయైన సంగీతచ్ఛాయ యుండవలెను. తడియాఱిన పొడిగొంతుకతో, ఎండిన పుల్ల విఱిచినట్లు పద్యము చదివినచో సభ రక్తి కట్టదు. అవధానిచ్ఛందోవాణి మలయానిల తరంగముల తుఱంగలించు మధుర వేణుగానవేణి వలె మనోహరమై సభ నావర్జించికొనవలెను.

—: o :—

# వ్యసనములు

సన్న్యాసులు గంజాయిని జ్ఞానపత్రి యందురు. దాని ధూమము సేవించి, తాత్త్విక సాహిత్యము రచించిన పెద్దలెందరో కలరు. గంజాయి చాల ఘాటైన పదార్థము ఒడలెరుగని శివము దెప్పించు శక్తియు దానికి గలదు. అందుచేత శిష్ట సంసారులు దాని జోలికి బోవుట యరుదై యుండెను. అది గమనించిన బ్రహ్మ దేవుడు ఘాటు తగ్గించి జ్ఞానపత్ర కుటుంబమున ధూమపత్రము సృజించెను. ఇది చుట్టయై, బీడియై సిగరెట్టయి వెలుగుటయే కాక, నశ్యమై పండితుల తల కెక్కినది. నస్యము మరగిన పండితులు సభాముఖమున నస్యము సేవించుట కనుమతించిరి అంతేకాదు-

ఉ. నస్యము శీతమత్తగజ నాశనహేతు విచారధీర పం
చాస్యము, సుప్తిరోగ నిబిడాంధతమః పటలార్కబింబ సా
దృశ్యము, వేదశాస్త్ర పటు దివ్య సుపండిత వాగ్విచిత్ర సా
రస్యము రాజవశ్య మహిరాణ్మణి కైన నుతింప శక్యమే?

(చాటుపద్య రత్నాకరము.)

అని దానికొక శ్లాఘాపీఠమిచ్చిరి. నస్యమున కలవాటుపడకుండ నుండ వలెను. పడెనా, అది లేనిది బండి నడవదు. ఒక వ్యంగ్య చిత్రకారుడు ప్రకటించిన యభిప్రాయము చూడుడు.

'సమయానికి ముక్కుపొడుం డబ్బా కనిపించక అష్టావధానం అభానుపాలు చేశా.' (కార్టూను. ఆంధ్రపత్రిక. 11-12-1977.)

నస్య మెంతపని చేయునో దాని కొకింత యూనముగనో సమానముగనో బీడి, సిగరెట్టు పొగగూడ పనిచేయును.

కొందఱికి కాఫీ లేకున్న తలపోటు పుట్టును. కొందరికి తఱచుగ నాల్క తడియాఱుచుండును. మాటిమాటికి మంచినీళ్ళు పుచ్చుకొనుచుందురు. జలపానము నిషిద్ధము కాదు కాని, యే నిదాఘవేళనో, దగ్గు పొడిచికొనివచ్చు సమయముననో తప్ప తక్కిన యదనులయం దదియు వికారముగనే యుండును.

పొగత్రాగుటవంటి బలవత్తర వ్యసనముల యొత్తిడి గమనించిన పెద్దలు అట్టివానికి లేచిపోయి చాటున సేవించివచ్చుట కనుమతించిరి. కొందరు పౌరాణి కులు, హరిదాసులు, గాయకులు ఆ పనియే చేయుచున్నారు

అవధాని మూత్ర విసర్జనార్థమో మఱియొకదానికో చాటునకుగాని, మఱుగు నకుగాని పోయిరావలెనని యడిగినపుడు, వాని కర్మమునకు వగచుట తప్ప సభాధ్యక్షుడును వారింపజాలడు. ఈ చాటునకు బోయి వచ్చు వ్యాపారము పౌరాణికాదుల విషయమున పట్టింపుకు రాదు. అవధాని విషయమున పట్టింపుకు వచ్చును. పరీక్ష వ్రాసెడి విద్యార్థికి చీటికి మాటికి లేచి చాటుకుబోయి వచ్చుట యెట్టిదో, యిదియు నట్టిదని యనుమానింతురు. కనుక సభాదినములందు ఆరోగ్యము కాపాడుకొనుట మంచిది. దుర్వ్యసనములకు ఎంత దూరముగ నుండిన అంత మంచిదని వేఱుగ జెప్పనక్కఱ లేదు.

## ధారణావిషయము

ఒక పృచ్ఛకు డడిగిన విషయము గ్రహించి ఒక పద్యచరణము వచించి, తదుపరి పృచ్ఛకు డడిగెడి విషయము గ్రహించు సమయమున వెనుకకు దిరిగి, 'అయ్యా! తమ రడిగిన విషయ మిదే కదా! ఏదీ, నే నొడివిన ఆ చరణము కొంచె మనుడు!' అని పూర్వపృచ్ఛకుల నడుగగూడదు అది తప్పు ఉత్తర చరణము చెప్పబోవునపుడు పూర్వ చరణము గాని, తదంత్య పదమును గాని యెత్తి యీ గోరుటయే కాదు, దాని రాబట్టుటకయి కుయుక్తులు పన్నుటయు తప్పే.

భోక్తల కంటబడకుండ, మహానసమందిరమున వంట చేయబడునట్లు, పద్యము ప్రష్టల చెవిని బడకుండ మనోమందిరమున రచింపబడవలయును. తల త్రిప్పుచు వెనుక ముందుల కూగుచు బిగ్గరగా నోరెత్తి పాడుచు, పద్యపాదము తయారు చేయుట వెగటుగా నుండును. పూర్వ చరణములను చర్వణరోమంథ

దశలకు దెచ్చికొని బిగ్గరగా నర్వాచీనచరణమును దానిలో కలిపికొట్టుటయు నసహ్యమే.

ఉద్వేగముతో గొంద రవధానులు పృచ్ఛకులకు ద్వితీయ చరణమో, తృతీయాంఘ్రియో, చతుర్థపాదమో చెప్పదలచి. తచ్చరణము మనోఽంతరమున పరిస్ఫురితమైనంతనే విషయాంతరచంక్రమణము చేసి, దానిని మఱతురు. పూర్వ పరిస్ఫురితచరణము నపుడే పృచ్ఛకునకు జెప్పివేసితి మనుకొందురు. సభాంతరమున నిట్టివి వివాద హేతువు లగును.

చెప్పకయే చెప్పితినని తలచుట కుద్వేగమే కారణము
కాళిదాసు డీసంగతి చక్కగా ప్రదర్శించెను:
'అనుయాస్య న్మునితనయాం సహసా వినయేన వారితప్రసరః
స్థానా దనుచ్చలన్నపి గత్వేవ పునః ప్రతినివృత్తః'
(శాకుంతలము 1-27)

దుష్యంతు డెక్కడున్నవా డక్కడనే యున్నాడు. వెళ్ళి వచ్చితి. నను కొనుచున్నాడు. అవధాని ఉద్విగ్నుడు కాగూడదు.

### ధారణ చాలనివారి అగచాట్లు

'దేశమాత' పత్రిక 1911 సం. నవంబరు 15 తేది సంచికలో నిట్లు ప్రకటించినవి: 'అవధాని ప్రక్కన అవధాన పద్యములు పూర్ణముగ వ్రాయువా రుందురు వారు ఎఱ్ఱ పెన్సిలుతో తాళఫల ప్రమాణములగు నక్కరములతో వ్రాయుచుందురు ప్రథమ చరణము సులభముగ జెప్పివేసి ద్వితీయ చరణము చెప్పవలసి వచ్చుసరికి ఒకసారి క్రేగంట, ప్రక్కలోని వ్రాయసగాని 'యెఱ్ఱ పెన్సిల్‌వ్రాత' చూచుట. అదియు జాలనిచో సైగ చేసి మంచినీళ్ళు త్రాపు నెపమున తెరచాటునకు బోవుట-వ్రాయసకా డనుసరించుట, పని నవరించుకొని రంగమునకు వచ్చుట ధారణ చాలని యవధానుల యగచాట్లు ఇట్టి ప్రవృత్తి అభి శంసనీయము.

## అవధాన రూపకము

అది రంగస్థలము వారు పృచ్ఛకులు ఇత డవధాని. వారికి దాను వ్రాసి యిచ్చి, యడుగుడని చెప్పియుండిన విషయములనే కాగితము చూచి యడుగు దురు. ఇతడింటికడ కూర్చికొని వచ్చిన పద్యములే చెప్పును. అమాయికులగు సద స్యులు హర్షింతురు బిరుదము లిత్తురు. సంభావింతురు భువనవిజయ నాటకప్రదర్శనమును దలపించు నిట్టి యవధానరూపకము సర్వత్ర చెల్లదు నాటకము బయట బడునను భయముచే అట్టివారు పౌనఃపున్యంగా రంగమెక్కరు. ఎక్కకున్న నేమి? వచ్చిన యవధాని బిరుద మెక్కడకు బోవును ?

## పురః ప్రసాదనము

అవధాన మొనర్పబోయి, ఆయూరి కవిపండితుల నుపచారపురస్సరముగా సందర్శించి వారి దయ నాశ్రయించుట తప్పుకాదు కాని, తన జయాపజయములు తత్పురః ప్రసాదనవ్యాపార సాఫల్యవైఫల్యముల మీద నాధారపడుచికొని నడచుట యొప్పు కాదు. భారతయుద్ధరంగమున ధర్మరాజు కవచఖడ్గాదులు విడిచి పుచ్చి కరములు మోడ్చి, నడిచి భీష్మాదుల యొద్దకేగి నమస్కరించి వచ్చెను. ధర్మజునితో భీష్ము డేమనెను? 'అక్కట! నీ విట్లు సనుదేక తక్కిన శాపమిత్తు, వచ్చితి మేలయ్యె, వైరుల నిర్జింపు మిదిగాకయును పరమెద్దియైన నడుగుము' అనెను.

(శ్రీమదాంధ్ర మహాభారతము. భీష్మపర్వము. 1-157 )

ఇక్కడ పురఃప్రసాదనవ్యాపారము జరుపకపోయియుండిన గలిగియుండెడి కీడు, జరిపినదాని వలన గలిగిన మేలు, భయమును సంతోషమును బుట్టింపజాలి యున్నవి. అవధాని ధర్మజుని మతము ద్రొక్కుటయే లగ్గు గదా! సమర్థుడైన వాడును బొగరున పూజ్యపూజావ్యతిక్రమణ దోషమునబడి చెడుట నిజమే. కాని, యవధాని తన పోయిన చోట నెల్ల విచారించికొని, యింటింటికేగి పండితుల దర్శించి వచ్చుట, విద్యార్థులు పరీక్షాధికారుల యిండ్లకు బోయి వచ్చుటవలె నుండును అవధాని సభారంభమున పెద్దలకు సభలోనే నమస్కరించి, తత్ప్రసాదము బడయవచ్చును ఇది సముదాచారము.

—:o:—

# సభావర్ణనము

నిరక్షరాస్యుఁడగు పామరగ్రామణి యొకడు కూర్చుండి మాటాడుచుండగా, వాని చుట్టు పదిమంది బెల్లమునకు మూగిన యీగల వలె జేరి వినుచుందురు. త్రోవ బోవువారు తమ పనులు మఱచి ముగ్ధులై నిల్తురు. అతని మాట అంత రుచిగా నుండునా? అతడు చెప్పెడి విషయ మంత వింతయైనదా? ఈ విద్య చదువుతో రాదు. అభ్యాసముతో రాదు. జన్మతో లభ్యము.

సభావర్ణన విద్య శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి అరచేతిలోని విద్య. శాస్త్రి గారితోడి పరిచితి కలవా రిట్లందురు

'శాస్త్రిగారు అమితభాషి. ఆయన మాట్లాడుతున్నంతసేపూ వినాలనే ఉంటుంది. లోకవ్యవహారాన్నీ, పూర్వానుభవాలనూ, పూర్వకవిత నవీనకవిత్వాలనూ జోడించి సరసంగా మాట్లాడతారు లౌక్యులలో లౌక్యుడు. ఎదిరిని ఏ పద్ధతి చేసైన చిత్తు చేయాలనే వ్యక్తి పట్టువల సందర్భాలలో మృగరాజధైర్యం, నక్క-జిత్తులను గూడ అవలంబిస్తారు.

'పద్యాలను, హాస్యాన్ని, పిట్టకథలను, ఘటనలను గానాన్ని మిళావు చేసి పంచామృతం వంటి ఉపన్యాసాన్ని సభ్యులకు అందజేస్తారు. శాస్త్రిగారు పద్యాన్ని పాడినట్లుగా అనేకమంది పాడడానికి ప్రయత్నించేవారు మొదట ఆయనకుందే కంచు గంట లాంటి కంఠం ఉండవలె గదా!'

(నా వాఙ్మయమిత్రులు: శ్రీ దేకుమళ్ళ కామేశ్వరరావుగారు )

విశేషించి శ్రీ చెళ్లపిళ్లవారు పద్యము చదువుట గుఱించి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగా రిట్లుపన్యసించిరి:

'శ్రీ వెంకటశాస్త్రిగారు పద్యము చదువుట యనగా శ్రోతలను ముగ్ధులను జేయుట. ఆ రాగము, ఆ విఱుపు, ఆ ఉదాత్తానుదాత్తములు, వారి కంఠమాధు

ర్యము, వారి మహాస్వాతిత్వము - ఇవి యన్నియు కలిసి శ్రోతలను తలక్రిందులు చేయుచుండెడివి

(సాహిత్యోపన్యాసకులు - 10: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి)

పృచ్ఛకుల నడలగొట్టి సభ నాకట్టుకొనే ఐంద్రజాలికప్రతిభ శాస్త్రిగారి సొత్తు దానిని గురించి శాస్త్రిగారే వివరించవలెను

'అవధానం చేసేవాడికి ఒక్క కవిత్వంతోటే కాదు, ధారణాశక్తి తోటే కాదు, కాపురం తుది నెగ్గేది. చాలా శక్తులు వుండాలి. సభికులలో ఏ ఒకరిద్దరో తప్ప తక్కిన యావన్మందిన్నీ అవధానికి సుముఖులుగా వుండాలి అవధాని యెడల పృచ్ఛకులకు భయం కూడా వుండాలి. అడిగే ప్రశ్నలలో చాలా వరకు ఏవో అవకతవకలతోటే వుంటాయి. అలాటి ప్రశ్నలు మృదువుగానే ఖండించి, విశేషించి మనస్సు నొచ్చకుండా పృచ్ఛకున్ని మందలించడంలో అద్భుతమైన చాకచక్యం వుండాలి దాన్ని నేను ప్రాక్టికల్‌గా చూపించగలను గాని, వ్యాఖ్యానించలేను అది అనిర్వాచ్యంగా వుంటుంది అదే ప్రతిభ అంటారు. సర్వాతీతమైన ధారణ శక్తిన్నీ, ఆశుకవితా శక్తిన్నీ వున్నమీదట ఆయీ ప్రతిభ వుండాలి అవధానికి మొత్తం సభలో ఏ కొందరో తప్ప, యావన్మందిన్నీ అవధాని పక్షంలో ఉండేటట్లు చేసుకోవాలి అల్పసంఖ్యాకులు విరోధులైనా అప్పుడు చిక్కుండదు.'

(ఆంధ్రవాణి. 30-3-1946.)

శాస్త్రిగారి చివరి పలుకులు పరిగణేయములు వారు ఆ రీతిగా సభను మెప్పించుకొనెడివారు

'అవధాన దర్పణ'కారుడు 1913 సంవత్సరముననే ప్రకటించిన మాటలు వెటకారముగా గనిపించినను సభ నావర్జించుకొను టెంత ప్రధానమో వెల్లడించుచున్నవి ఆ మాటలివి :

'శతావధాన మన్నది నా మొగమందే పుట్టిన దని డంబముగొట్టు మహాపురుషుండైనను ఐదుగురు తనకు వ్యతిరేకముగా సభలో నున్నట్లు తెలియగనే చచ్చును. మనస్సుచెదిరిన తోడనే పూర్వము పడని తొటుకులుకూడ పద్యముల నావహించును.' (అవధాన దర్పణము. పుట 20.)

ప్రౌఢులైన శతావధానులు శత్రు సభయని జంకరు. మిత్రసభలో ఆడుకొనుచు బాడుకొనుచు అలవోక విహరించువాడు శత్రుసభలో శతాక్షుడై జాగ్రత్తతో నుండును. నరసాపురావధాన సభారంభమున తిరుపతి శాస్త్రిగారు చెప్పిన సీసపద్యము తిరుపతి వేంకటేశ్వరుల విద్యాపీఠమునకు తార్కాణము.

సీ. స్నేహితుల్ పిలిపించి చేయించు సభ కంటె
    శాత్రవ సభయె యశఃప్రదంబు,
జయము గోరెడి సభాసదులకంటెను బరా
    జయము గోరెడి సభాసదులె హితులు,
సమ్మాన మొనరించు సజ్జనావళి కంటె
    బడదిట్టువారె యాప్త వ్రజంబు,
నీరస ప్రశ్నముల్ గోరువారలకన్న
    కఠిన సంప్రశ్నకుల్ కరము హితులు,

మాకనుచు నెంచు లోక సమ్మతులె కాని
శత్రుసభయంచు మదిలోన జంకి పాఱు
వంచక శతావధానుల పంచలోని
వారు తిరుపతి వేంకటేశ్వరులు కారు. (శతావధాన సారము. పుట 95)

వ్యక్తిగతద్వేషము కవిత్వద్వేషముగా పరిణమించి, పదపదమున చెలరేగి కావలసి తప్పువట్టుట జరగునేని అది సభకాదు. అట్టిచో రసానందము మెడపట్ల యందో, సిగపట్ల యందో పర్యవసించును.

అందుచేత మన పెద్దలు సభావర్జనము ప్రధానమగు కర్తముగా భావించిరి.

సభాసదులను స్వాధీనపఱచుకొనుటకు అధర్వవేదమున రెండు సూక్తము లున్నవి. రెండవ కాండమునందలి యిరువది యేడవ సూక్తమున 'పాతా' అను వనస్పతితో ప్రతిపక్షులను జయించు విధము చెప్పబడియున్నది. ఏడవ కాండము నందలి పన్నెండవ సూక్తమున సభ్యుల శక్తిని, బుద్ధిని వశీకరించుకొను విధము చెప్పబడినది.

శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారి తెలుగుసేత వలన 12వ సూక్తస్వరూప మెఱుగ నగును.

1. ప్రజాపతికి గూతులైన సభయు సమితియు నేకమనస్కలై నన్ను రక్షించుచుందురు గాక. నాకు గానవచ్చినవాడెల్ల నా కనుకూలుడగుగాక! ఓ తండ్రులారా! సభలో నేను చారువచనములు పలికెదను.

2. సభా! నీ పేరు 'నరిష్టా' (అలంఘనీయ)యని యెఱుగుదును. ఈ సభలోని సభాసదు లందరును నాతో ఏకీభవింతురు గాక !

3. ఇందలి సభాసదులయొక్క వర్చస్సును, విజ్ఞానమును నేను తీసికొనుచున్నాను. ఈ సభయందలి యందరలోను ఇంద్రా! నన్ను భాగ్యవంతుని (జయవంతుని) జేయుము.

4. ఓ సభాసదులారా! మీ మనసు ఇతరత్ర ఆసక్తమైయున్నను; మా వైపునకు ద్రిప్పెదము. అది నాయందు రమించు గాక! (అథర్వ వేదము.)

—: o :—

# పృచ్ఛకుడు

చాణక్య నీతిసారమున లేఖక లక్షణ మిట్లు చెప్పబడినది:

'సకృదుక్త గృహీతార్థో లఘుహస్తో జితేంద్రియః
శబ్దశాస్త్రపరిజ్ఞాతా ఏష లేఖక ఇష్యతే' (చాణక్యనీతిసారః-104)

ఒక్కసారి చెప్పినంతనే గ్రహించి వ్రాయువాడు, లఘుహస్తుడు, (దొడ్డ చేతివాడు కాడు) జితేంద్రియుడు, వ్యాకరణ మెఱిగినవాడు లేఖకుడట లేఖకు డనగా వ్రాయసకాడు. చెప్పినది చెప్పినట్లు వ్రాసికొనిపోవుటయే వ్రాయసకాని పని. చెవిటివాడు పనికిరాడు. మొద్దువ్రేళ్ళవాడు పనికిరాడు. శబ్దశాస్త్రపరిజ్ఞానము లేని వాడు పనికిరాడు. సరే. ఇంద్రియ జయము లేనివాడు గూడ పనికిరాడా? 'జితేంద్రియుడన్న విశేణము సామాన్య విశేషణము కాదు. సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతుడు. రాగభయక్రోధాది మనోదోషములు లేని స్థితప్రజ్ఞుడు అట్టివారు దొరకుదురా? దొరికిన నెంతమంది దొరుకుదురు? అని కాదు మనము చూడవలసినది. అజితేంద్రియుని మనస్సు శృంగారాది రసప్రసక్తి వచ్చినపుడు వాని యాటుపోటులకు జిక్కి నిలిచి సుడివడి మూఢమగుచు తటస్థించును: తరువాతి విషయ మతడు వ్రాసికొనలేక పోవచ్చు, కనుక పని కుంటుపడును. అట్టి ఘట్టములలో మనసు నిలద్రొక్కుకొని లిఖింపగలవాడు కావలెనని మాత్రమే.

లేఖకుడే యవధాన సభయందు బృచ్ఛకు డనబడుచున్నాడు.

పృచ్ఛకుని సహృదయత్వమే జితేంద్రియత్వము. అదిలేని పృచ్ఛకుడు శల్యుడై, 'చెప్పులోని ఱాయి చెవిలోని జోరీగ'యై అవధానికి జీకాకు గూర్చును. సభ్యుల దృష్టిలో అవధాని పలుచబడిపోవలెనని యతని యారాటము. అట్టి పృచ్ఛక వృశ్చిక మహాశయుల నొకొకప్పుడు సహింపలేక సభ్యులే లేచి మందలించుటయు జరుగుచుండును.

అవధాని నెటులైన కించపఱుపవలెనని, గిల్లికజ్జాలు పెట్టికొను స్వభావము కల మిడిమిడి జ్ఞానపు బృచ్ఛకుల ధైర్యమునకు బ్రౌఢులైన యవధాను లొక యౌషధము గనిపెట్టిరి. కావలసి యయోమయపు దోవ్రవ దొక్కి, తాజెప్పెడి పద్యమునందు దోషమున్నదని భ్రమపడి ప్రతిపక్షిని పప్పులో కాలు వేయనిచ్చి, జుట్టు పట్టుకొందురు అపుడు వెక్కిరింపబోయి వెల్లకిలబడిన పృచ్ఛకుడు నవ్వుల పాలగును. అవధాని కీర్తి మిన్నంటును 'ఏ మహాత్ములు గల్గ భూమీశ సభలతో కవులకు నధికవిఖ్యాతి గలిగె' అని శతలేఖినీపద్యసంధాన ధౌరేయు డీజాతి పృచ్ఛకుల నుద్దేశించియే వాక్రుచ్చెను వీరు సహృదయులు కారు

సహృదయ పృచ్ఛకుడు చిత్రబంధ కవిత్వము లవధాన సభలో వచింప గోరడు అవధానకార్యము నిర్వహించు మానవున కది యసాధ్యము. తిరుపతి వేంకటకవులీ విషయము నొక యుత్పలమాలిక యందు సోపపత్తికముగా నుగ్గడించిరి.

'మతిస్థానము గాసిపెట్టు నవధానముదం దెటు లాచతుర్విధా
నూన కవిత్వముల్ సలుప నూకొనుటౌ? నని శంకనొందకె
ట్లైనను బంధచిత్ర కవితాదులు సెప్పుమటందు రక్కటా!
సూనము తన్మరందరసచోర మధువ్రత పాదఘాతమున్
మానుగ సైచునంచనెడి మాటలు వింతుము కాని యెచ్చటన్
గానము దుష్టపక్షిపదఘాతము సైచు నటన్న మాట, లు
త్తానశయాను బొమ్మన నధర్మముగా బరువెత్తినట్టు బం
ధాన గవిత్వ మల్లు మవధానము నందన మర్త్యకోటి నె
వ్వానికి శక్యమౌను?' (నానారాజ సందర్శనము.)

పృచ్ఛకుడు నిలిచి ముక్తసరిగా తన ప్రశ్నమును చదివి కూర్చుండవలెను. ఉపోద్ఘాతము పెంచి, పెద్దప్రౌఢ్యుపన్యసింపగూడదు. మాటాడవలెనను పేరాసయో, స్వోత్కర్షము చాటుకొనవలెనను తీటయో, కొందరు ప్రశ్న చేతబట్టుకొని యుపన్యాసమున కుపక్రమింతురు. అధ్యక్షుడు హెచ్చరించుచుండును. కాని, ఆ హెచ్చరిక యెనుబోతుమీది వాన యగును. కాగా, వృధా కాలవ్యయమయి, అవధాని పద్యము చెప్పుటకు దీసికొనెడి కాలము క్రింద ఈ కాలము గూడ

లెక్కింపబడి, అవధానికి నష్టము కలుగును. పృచ్ఛకు డిచ్చు ప్రశ్నము అల్పాక్షరము అసందిగ్ధార్థమునై సూత్రప్రాయముగా నుండవలెను

ఒక పృచ్ఛకుడు మఱొక పృచ్ఛకుని విషయమున జోక్యము కల్పించుకొనుట తగదు. 'అది సరిగా నున్నట్లు లేదే! చూచుకొను' డని ప్రక్కవ్యక్తితో గాని, అవధానితోగాని యనుట కొందరకు సరదా. వీరికి సమాధానము చెప్పవచ్చు-నోరు దెఱచి అడిగినారు గనుక. ఇంకొక విచిత్రజాతి వ్యక్తులుందురు. నాటకములోవలె, అపవారిత సంభాషణము చేయుదురు చేచాటున నేదో మాటాడుదురు. ఆ మాట లితరులకు వినిపించవు. ఇతడు వ్రాసికొనుచున్న పద్యము జూపి, పెదవి విఱుచును. అతడు చూచి 'అవు' నని తల యూపును. 'పోనీ! మనకెందు' కని యితడు హస్తాభినయము చేసి, నెమ్మదిగా గూర్చుండును. ఈ వ్యవహారము సామాజికుల గుండెలలో అనుమానపు టాయి వేయును. అసలు విషయ మేమియు నుండదు. అసూయ.

అవధాన మధ్యమున గొందరు గడ్డు ప్రశ్న లడిగి లేవిడి పట్టించుటకు వత్తురు. శ్రీ కాశీ కృష్ణాచార్యులవారి నొక వృద్ధ పండితుడు పట్టుకొని వదలలేదు. దిక్కు తోపనపుడెల్ల దైవప్రార్థనము చేయుట కృష్ణాచార్యులవారి యాచారము. అపుడొక కందము చెప్పిరి. ఓపిక చాలని యాముదుకడు చివాఱున 'ఈ పద్యాలు గిద్యాలు మాకు పనిలేదు. సమాధానము మీకు తోచకపోతే తోచకపోవచ్చు. కావయునంటే మేమే చెబుతామ్ మీ యవధాన సముద్రమును దాటి యొడ్డు ఐడండి చూతామ్ మీరెక్కడికి పోతారు. మేమెక్కడికి పోతామ్?' అన్నాడట

(అవధానయాత్ర. పుట ౧౧౬.)

ఆ తొప్పుట, ఆ తప్పులు పట్టుట, ఆ యెగతాళి చేయుట చూచి, గుండె దిగజాఱి డీల్పడిపోని యవధాని శిరోమణు లెందరుందురు! తీరా విచారించినచో ఆ వాదమున పస యుండదు. వట్టి దూఱర.

పృచ్ఛకులలో హిత శత్రువులు కొందరుందురు. ఆవధాని వారి వంకకు మొగము త్రిప్పగూడదు త్రిప్పెనా, దిక్కుతోచక చూచుచున్నాడని భావించి తత్కాల ప్రశ్నస్వరూపమో పద్యచరణమో మెల్లగా అందిత్తురు. తాము వ్రాసికొనుచుందురు గదా! తటాలున వారి వల్లింతురు. అట్టివారిలో నిజముగా జాలిగుండె

గలవా రేముప్పాతిక మంది యుందురు. పాతిక మంది తమ యౌదార్యము చేతనే యవధాని గట్టెక్కగలిగెనని సామాజికుల మనస్సులో నొక దురభిప్రాయపు మొలక నాటుటకే యత్నించువారుందురు. వీరు 'ఊరకుండు'డని దండము పెట్టినను ఊరకుండరు అప్పుడే వారి ధౌర్త్యము బయటబడును.

ఒక పృచ్ఛకు డొక సమస్య వ్రాసికొని వచ్చి యిచ్చును. అవధాని పూరించును. ఒక సమస్య నెన్ని విధములనైన బూరింపవచ్చును. పృచ్ఛకు డేతీరున బూరింపవలెనని తన మనసులో నూహించెనో ఆ తీరుననే అవధాని పూరింపవలసిన యక్కఱలేదు. కాని, ఒక పృచ్ఛకుడు చప్పరించును. చప్పరించినను బోనీయ వచ్చును. అది సరిపడ దనును ఇదిగో, నేనాశువుగా నర్ధరాత్రమున మా యింటి కంకటిపై బండుకొని పూరించితినని వింగళించును. తా వ్రాసికొని తీసికొని వచ్చిన కాగితము వెలికిదీసి చదివి వినిపించి, తానే వ్యాఖ్యానించును. పద్యమంతయు తప్పుల తడక. ఎటు బొసగదు. ఐనను అత డార్భాటము జూపును. పండితులను లెక్క సేయడు అతని పాటకు తాళము తట్టువా రతని వెంబడి కొందరుందురు. కాగా ఒక యపఖ్యాతి రేఖ మిగులును. అత డింతటితో నూరకుండడు. ఈ విషయము వార్తా పత్రికల కెక్కించును. అవధాని పద్యము, తన పద్యము రెండు నొకచో బ్రకటించి చర్చించినచో సంతోషమే ఆ పని చేయడు తన పద్యము మాత్రమే ప్రకటించుకొనును, తనదే పైచేయి కావలెనని. ఈ వికటపు బృచ్ఛకుల కేపేరు పెట్టవలెనో తెలియదు.

ఉ. వత్తురు కూరుచుందురు పలుప్రశ్నము లిత్తురు చెప్పబూన ద
ప్పెత్తుదు రద్ది వద్దనిన నిస్సి దళక్కని కేరడింతు రీ
సత్తములైన పృచ్ఛకులు జల్లెడ జేసిరి నీ శరీర మీ
యుత్తము లెట్లు చేయుదు రొకో! మఱి జూచెదనో వధానమా!
(అవధాన భారతి)

అందుకే పృచ్ఛకుడు సహృదయుడై యుండవలెనని చెప్పబడెను 'హృదయ సంవాదభాజః సహృదయాః'. (అభినవ గుప్తపాదులు)

—: o :—

# అవధాన సమాధి

ఒక సంపన్న గృహస్థు డున్నాడు. అతని యింట సకల వస్తుసామగ్రి యున్నది కళత్ర పుత్ర భృత్యాదులు విధేయులు. అతడు గృహాంతర్వితర్ది మీద నుపవిష్టుడై యున్నాడు. అప్పుడొక యతిథి వచ్చెను తక్షణమే గృహస్థుడు భార్య వంక జూచెను. ఇంటివాడు బాగుగ యిమ్మనుచుండెను. గృహస్థుడు పుత్రుని వంక జూచెను. వాకిట బిచ్చగా డఱచెను గృహస్థుడు భృత్యుని వంక జూచెను. అంతే. అరుగు దిగలేదు శ్రమ పడలేదు అతిథి సపర్య, శకటమున్కు మిచ్చుట, బిచ్చము వేయుట భ్రూసంజ్ఞామాత్రమున జరిగెను

అవధాని గృహస్థుడు మేధామండలము గృహము విద్య వస్తుసామగ్రి. ప్రతిభా వ్యుత్పత్తిసాధనలు కళత్రపుత్రభృత్యులు. అంతర్వితర్ది సమాధి.

ఇట్టి స్థితిని **ALPHA RHYTHM STATE** అని హూణ మహాభిష గ్వ్రేషభులనుచున్నారు. యోగుల మనస్సు, మహా కవుల మనస్సు ఈ యవస్థను బొంది సమస్త విషయములు గ్రహింపగలదు ఏతత్సమాధి సర్వజ్ఞతా విశిష్టముగా నుండును

శ్రీ శంకర భగవత్పాదాది మహాపురుషులు సర్వజ్ఞతా విశిష్టులు. శివానంద లహరిలో భగవత్పాదు లిట్లు వర్ణించిరి:

> 'గాంభీర్యం పరిఖాపదం ఘనధృతిః ప్రాకార ఉద్యద్గుణ
> స్తోమ శ్చాప్తబలం ఘనేంద్రియచయో ద్వారాణి దేహస్థితః
> విద్యావస్తుసమృద్ధి రిత్యఖిల సామగ్రీసమేతే సదా
> దుర్గాతిప్రియదేవ ! మామక మనోదుర్గే నివాసం కురు.'

(శివానందలహరి. శ్లో. 42.)

భగవత్పాదుల మనోదుర్గము విద్యావస్తు సమృద్ధము. అచటినుంచి వస్తు వేదియు ప్రసక్తము కాదు కనుకనే కేరళ క్ష్మాపాలుని నాటకత్రయము యథాశ్రుతముగ గ్రమ్మర జెప్పజాలిరి.

జననాదిగా బాల్యయౌవనదశాంతరములందు భగవత్పాదు లెందరి గోలలు వినియుందురో, యెందరి తిట్లు వినియుందురో, యెందరి పొగడికలు వినియుందురో! తిరునాళ్ళలో మహాజనసమ్మర్దమున రేగిన దుమ్ముతో, మూగిన సంకులధ్వని ప్రపంచముతో లోగిన వియన్మండలము వలె వారి మెదడు నానావిషయశ్లిష్టమై యుండదా? అట్లున్నచో దానిని గసవుదిబ్బ యనవలదా? అట్టి దిబ్బనుండి ప్రాక్కృత విషయపరమార్థము నెట్లు పునరుద్ధరింప శక్యమగునని ప్రశ్న కలుగక మానదు. ఈ ప్రశ్నకు సమాధానము డాక్టరు బి. రామమూర్తిగారు చేసిన యుపన్యాసమున కలదు.

'పనికి మాలిన చెత్త చెదారము కేంద్రనాడీమండల హర్మ్యమున జేరుటకు వీలులేదు సభ్యేతరుల నడ్డగించు దౌవారికులవలె INHIBITORY CELLS సర్వనాడీమండలవ్యాప్తములై యుండును.'

**(The inagural Lecture in the Series, Organised by the British Council, on Brain and its Functions.)**

**THE HINDU, November 14, 1976.**

ఇక్కడి ఏది పారవేయవలసిన చెత్త? ఏది దాచుకొనవలసిన బంగారము? అనెడి ప్రశ్న తలయెత్తును. సమాధానము — మన కనిష్టమైనది చెత్త: ఇష్టమైనది బంగారము.

అవధాని చిత్త మసలు విషయమునందు లగ్నమై యుండును. అప్రస్తుత ప్రసంగాదు లానుషంగికములు. దాని స్థితి కవి భంగకారులు కావు. శ్రీ విద్యారణ్యస్వామి చరణుల దృష్టాంతశ్లోక మరయుడు:

'పరవ్యసనినీ నారీ వ్యగ్రాపి గృహకర్మణి
తదేవాస్వాదయ త్యంతః పరసంగరసాయనమ్'

(వేదాంత పంచదశి ధ్యానదీపప్రకరణము 84 శ్లో.)

ఆ యిల్లాలు కన్నులు మూసికొని కూర్చుండి యుండలేదు ఇంటి పనులు చేసికొనుచునేయున్నది ఐనను తనలో తాను పరసంగరసాస్వాదసుఖ మనుభవించు చున్నది గృహకృత్యముల జంజాటము ఆ పరవ్యసనినియొక్క సమాధిని భంగింప లేదు.

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు 'శతఘంట కవనమ్ము సల్పు సంగతియన్న కరతలామలకమ్ము గాదె మాకు?' అని లీలావిహారము సలుపగలుగుట వారి **ALPHA RYTHM** అవస్థ పొందిన పరిణతు లగుటచే సంభవించెను.

ఒకసారి శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు శాస్త్రిగారి నడిగిరట. 'నిలిచియె వేయిపద్యములు .... ... చెప్పనేర్తు' మన్నారు గదా, అదెట్లు సాధ్యము? అన్ని పద్యములు ధారణలో నిల్చునా?' అని శాస్త్రిగారి జవాబు సామాన్య దృష్టికి విచిత్రముగా దోచును చూడుడు:

'ఔను. అందులో బడాయి యేమీ లేదు. వేయి పద్యాలు గూడ ధారణ పట్టగలమనే ధైర్యం ఉండేది ఆ రోజుల్లో. అందులో కష్టవిశేషం కూడ లేదు. నూఱు పద్యాలు చెప్పేటప్పుడు మనసును పది గదుల క్రింద విభాగించి, ఒక్కొక్క గదిలో పది పద్యాలు వేస్తాను మొదటి పది చరణాలు చెప్పిన మీదట ఒక్కసారి సింహావలోకనం చేస్తే పది చరణాలూ కనుల ముందు కనిపించేవి. అంతట ఆ గది మూసి వేసేవాణ్ణి ఇలా పది గదులు నిండిన పిమ్మట మొదటిగది మళ్లా తెరిచి చూస్తే పదిపాదాలూ చెక్కుచెదరకుండా కనిపించేవి రెండో చరణాలు పదీ పూర్తిచేసి, సింహావలోకనం చేసి ఆ గది మళ్లా మూసివేసి పై గదులకు వెళ్లేవాణ్ణి. కనుక సహస్రావధానికైనా ఇదే ప్రక్రియ. అప్పుడు ఒకొక్క గదిలో నూటేసి పాదాలు వేసి, తలుపు మూస్తాను మొత్తం పది గదులే అవుతవి కనుక భయం లేదు. పది వేసినా, పాతిక వేసినా, నూఱు వేసినా, అవి అన్నీ ఒక్క గది క్రిందనే లెక్క.'

(శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు. ఆంధ్రపత్రిక.
విరోధి సంవత్సరాది సంచిక.)

ఆ సాహితీగృహస్థునకు తమ పది గదులలో తాము పడవేసిన సామగ్రి స్వాధీనమైయుండును.

నెపోలియన్ చక్రవర్తి సరిగా నిట్లే అన్నాడు: 'నా మనస్సులో వేర్వేరు గదులున్నాయి. దేని పనిపడినపుడు దాన్ని తెరుస్తూ ఉంటాను.'

—: o :—

# ఆరోగ్యము

తిరుపతి వేంకటేశ్వరులు ఇరువురు జోరుకోడెలై యిరువదేండ్ల ప్రాయము నుండి యవధాన శకటము నలవోక లాగుచుండిరి. పదేండ్లు నిరాఘాటముగా బండి నల్లేరుపై నడిచెను. తరువాత తిరుపతిశాస్త్రిగారు పోలవరపు జమీందారుగారి యొద్ద పండితపద మలంకరించిరి. తదారభ్య సభల కిద్దరు కలిసి వెళ్ళుట కాటంకము కలిగెను తిరుపతిశాస్త్రిగారు 'సభనా డరుదెంచెద, తంతివార్త నంపుడు' మనిరట. ఈ మాట వేంకటశాస్త్రిగారికి వెటకారముగా దోచెను తోచి, 'ఈవు రాకయున్న నేనొక్కఁడనె యవధానమాచరింపలేనయేని, అట్లైన తంతివార్త నంపించు గాకని మనమునందు దలచి' రట. నూజివీటికి వేంకటశాస్త్రిగా రొకరే 'యేగి యచట నూర్వు రేకత్ర గూర్చుండగా వధాన మొకడె కడిమి చేసె' నట.

(జాతకచర్య పూర్వార్ధము 549, 550, 574)

ఇది సుత వేంకటశాస్త్రిగారికి ఎక్కడ బెడిసినదో తలత్రిప్పు మొదలయ్యెను. తిరుపతి శాస్త్రిగారి పుత్రు లిట్లు వ్రాసిరి:

'నూజివీటి సంపూర్ణ శతావధానము తరువాత వెంకటశాస్త్రిగారికి తలత్రిప్పొకటి పట్టుకొన్నది మొదటిపాద మెట్లో చెప్పి లేదనిపించుకొనువారు. తరువాయి నిర్వహించుకొను భారమంతయు నాన్నగారే వహించువారు. నాన్నగారి కిది యలవాటైనది.' (తిరుపతికవి జీవితసంగ్రహము. పుట ౨౫.)

గంటకు మూడు నాలు గైదు పందల పద్యములు చెప్పుచు నాశుకవిచక్రవర్తు లనిపించుకొన్న శ్రీ కొప్పరపు సోదర కవులలో వేంకట సుబ్బారాయకవిగా రగ్రజులు. వారి కథ యిట్లున్నది:

'కొప్పరపు వెంకట సుబ్బారాయకవిగారు శక్తికి మించిన పని చేసిరి. అమృతాంజనము డబ్బాను ప్రక్కనుంచుకొనియే వ్రాయుచుండెడివారు ఆక్కాతన మెదడు కరగినది. దృష్టిమాంద్య మేర్పడినది. గ్రంథరచనకు తీరని వ్యాఘాత

మేర్పడినది. దశ తొలగినది. నలుపదియాతేండ్ల నతిప్రాయమునవే నాకమున కరిగిరి.'

(కొప్పరపు సోదరకవుల శతావధానములు. ప్రథమభాగము.కవి పరిచయము.)

అత్యధిక పరిశ్రమము తలనొప్పికి, దృష్టిమాంద్యమునకు, మరణమునకు కారణమగుచున్నది.

వేంకటశాస్త్రిగారిని పట్టుకొన్న శిరఃకంప మెట్టిదో వారి పద్యమే చక్కగా ప్రదర్శింపగలదు.

'గిఱగిఱ గిఱ్ఱగిఱ్ఱ గిఱగిర్గిర గిఱ్ఱని గిఱ్ఱు గిఱ్ఱుగా
దిరిగెడి శీర్ష మేగతిని దేవి! వధాన మొనర్ప నేర్తు నం
చరయక నీ కటాక్షమని యాదరువుంచుట జేసి సాహస
స్ఫురణకు బూనినాడ గృప పొంపిరివో భరియింపు మింపుగన్'

(వేమవరాగ్రహార శతావధానము.)

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి యనుభవము గూడ చూడదగి నది.

'అష్టావధానము ముగిసిన తరువాత తలనొప్పి వచ్చి, ఆ రాత్రి నేనెంతో బాధపడితిని. తరువాత నెంద రెన్నివిధముల బ్రార్థించినను మేదస్సునకు వేదనా కరమైన యష్టావధానమును మానితిని.' (స్వీయ చరిత్రము. పుట 92)

ఏ చెట్టుకు దగిన గాలి ఆ చెట్టుకు అప్పటి పంతులుగారి వయసు 'పహిలా పచ్చీసు' (25 సం. లేక 26 సం) ఇట్టి వ్యక్తులు 35 సంవత్సరముల ప్రాయము దాటినచో చేయజాలరు

'ఏతావతా ఏండ్లు పైబడిన కొలది ధారణాశక్తి తగ్గడమూ, ధారణను మరీ కాస్తా కాపాడుకుంటే ఆరోగ్యానికి అపకారం కలగడమూ, తల త్రిప్పడూ తప్పని సరి' అన్నారు వేలూరివారు (ఆంధ్రవార పత్రిక స్వర్ణోత్సవ సంచిక)

హూణ పండితాభిప్రాయము గూడ నిదియే :

"Memory-efficiency primarily depends upon physical conditions, permanent and temporary." (J. LOUIS ORTON)

'జ్వరపడియున్న హేతువున సాయము నీకొనరింపజాలనో
తిరుపతిశాస్త్రి!' అన్న శ్రీ వెంకటశాస్త్రిగారి పద్యము తాత్కాలికానారోగ్య సంభవమైన నిస్సహాయస్థితి నెఱిగించుచున్నది

'పుష్టే శరీరే ధిషణాపి పుష్టా.'

'శరీర బలావలేపము, ధీయువతీమణీహృదయదీప్తి'........ ఈ ద్వితీయా నుకూల్యము' చూచుకొని యవధానము చేయవలెను.

ఆరోగ్యవంతుని మనస్సు వసంతోద్యానము వలె రమణీయభావపల్లవోల్లాస మయి యుండును. అత దేపని పట్టుకొన్నను జయాభ్యుదయముగా సాగిపోవును.

ప్రాయపుబొగరు కలంతకాలము కనిపింపదు గాని, అది తరుగుకొలంది కనిపింప దొడగును. శ్రమ కనిపించినంతనే అవధానకార్యవ్యాసంగము విరమించుట లగ్గు. అనగా అవధానము చేయుచు జేయుచు నడుమ విడిచివేయవలెనని కాదు. అవధాన సభలు మానుకొనవలెను. ఈ యను వెఱుగక తల మోటించినచో శిరో బాధ తప్పదు.

—: o :—

మేర్పడినది. దశ తొలగినది. నలుపదియాతేండ్ల నతిప్రాయమననే నాకమున కరిగిరి.'

(కొప్పరపు సోదరకవుల శతావధానములు. ప్రథమభాగము.కవి పరిచయము.)

అత్యధిక పరిశ్రమము తలనొప్పికి, దృష్టిమాంద్యమునకు, మరణమునకు కారణమగుచున్నది.

వేంకటశాస్త్రిగారిని పట్టుకొన్న శిరఃకంప మెట్టిదో వారి పద్యమే చక్కగా ప్రదర్శింపగలదు.

'గిఱగిఱ గిఱ్ఱగిఱ్ఱ గిఱగిర్రిర గిఱ్ఱని గిఱ్ఱు గిఱ్ఱుగా
దిరిగెడి శీర్ష మేగతిని దేవి! వధాన మొనర్ప నేర్తు నం
చర యక నీ కటాక్షమని యాదరువుంచుట జేసి సాహస
స్ఫురణకు బూనినాడ గృప పొంపిరివో భరియింపు మింపుగన్'

(వేమవరాగ్రహార శతావధానము.)

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి యనుభవము గూడ చూడదగి నది.

'అష్టావధానము ముగిసిన తరువాత తలనొప్పి వచ్చి, ఆ రాత్రి నేనెంతో బాధపడితిని. తరువాత నెంద రెన్నివిధముల బ్రార్థించినను మేదస్సునకు వేదనా కరమైన యష్టావధానమును మానితిని.' (స్వీయ చరిత్రము. పుట 92)

ఏ చెట్టుకు దగిన గాలి ఆ చెట్టుకు అప్పటి పంతులుగారి వయసు 'పహిలా పచ్చీసు' (25 సం. లేక 26 సం) ఇట్టి వ్యక్తులు 35 సంవత్సరముల ప్రాయము దాటినచో చేయజాలరు

'ఏతావతా ఏండ్లు పైబడిన కొలది ధారణాశక్తి తగ్గడమూ, ధారణను మఱి కాస్తా కాపాడుకుంటే ఆరోగ్యానికి అపకారం కలగడమూ, తల త్రిప్పడూ తప్పని సరి' అన్నారు వేలూరివారు (ఆంధ్రవార పత్రిక స్వర్ణోత్సవ సంచిక)

హూణ పండితాభిప్రాయము గూడ నిదియే :

"Memory-efficiency primarily depends upon physical conditions, permanent and temporary." (J. LOUIS ORTON)

శ్రీ కాశీవారదేమాటను ప్రపంచించి, 'సూర్యుదుదయించి మధ్యాహ్నము వరకు క్రమక్రమముగా ప్రభాపమ్రగాభివృద్ధిని బడసి, యంతనుండి క్రమక్రమముగా ప్రభాహ్రాసము బడయుచున్నట్లే మానవుని సర్వేంద్రియ బలము గూడ కొంతకాలము వరకు సమగ్రవృద్ధి నొంది తరువాత క్రమక్రమముగా సన్నగిలుచుంట ప్రకృతిసిద్ధ మగుట సత్యము' అనిరి.

(ప్రకాశక విజ్ఞప్తి బందరు శతావధానము)

మానవుని యుచ్ఛ్రయస్థితి బొందిన జ్ఞాపక శక్తి ముప్పదేండ్ల ప్రాయము నుండియే క్రమముగా తగ్గుముఖము పట్టునని **F. R C CASSON** గారు వ్రాసిరి

**(Introduction to Psychology, by F. R. C. Casson M B B S ,D P M , published by George Newness Ltd.., London W.C. 2)**

తగ్గుటకు కారణము మెదడులోని కణాలు తగ్గుటయే 35 సం. వయసు దాటినవారి మెదడులోని సూక్ష్మకణాలు రోజుకు దాదాపు ఒక వెయ్యి నశించిపోవుచుండునట. అట్లు నశించిపోయిన సెల్సుయొక్క బాధ్యతను మిగిలిన సెల్సు వహించుచుండునట- ఒక గుమాస్తా సెలవు పెట్టినచో అతని పని తక్కినవారు పంచుకొన్నట్లు ఎక్కువమంది సెలవు పెట్టినచో సరదుకొనిపోవుట జరుగనట్లే ఎక్కువ సెల్సు దెబ్బ తిన్నపుడు కార్యము స్తంభించిపోవును

(శాస్త్రీయ విజ్ఞానము.)

ఆస్థానకవి పద మలంకరించినవేళ, తొంబది దాటిన వృద్ధుడు శ్రీ కృష్ణాచార్యుల వారు తమ తత్కాలస్థితి నిట్లు వివరించిరి: 'గంట క్రిందట నా యెదుట నిల్చి కొంతసేపు ప్రసంగించిపోయిన యా వ్యక్తిగాని' తత్ప్రసంగ సందర్భము గాని స్మృతికి రాకుండుటయే యాశ్చర్యమూలము.'

జర ముదిరిన కొలది ధారణాశక్తి దిగజారిపోవుచుండును. నలుబదేండ్ల ప్రాయమొక హద్దు నలుబది దాటిన పిదప శతావధాన శకటము లాగుట కష్టము. అందుచేతనే కిర్లంపూడిలో తిరుపతి వేంకటేశ్వరులు-

తే గీ వయసు ముదిరిన మీద మాదయిన బుద్ధి
నిల్చునో నిల్వదో కాన, నేడె మా శ
తావధానము చూడుడో యనఘులార! - అన్నారు.
(నానారాజ సందర్శనము)

చత్వారింశదబ్దము దనుక గనిపింపదు పిదప విస్మృతిచ్ఛాయ కనబడీకన బడక పొడసూపదొడగును. గుంటూరి శతావధాన సభలో శ్రీ తిరుపతిశాస్త్రిగారు- తమలోని మార్పును పసిగట్టి యిట్లనిరి:

చం. తల నరయందొడంగె గవితావనితామణియున్ బతివ్రతా
తిలకము నీడుజోడయునదే యగుటన్ భయభక్తియుక్త కా
గల దిక ధారణాతరుణి కారుణికత్వపు ప్రేమ జూపగా
దలచునొ లేదొ యంచు మది దత్తర మిత్తరి క్రొత్తగొల్పెడిన్.
(శతావధాన సారము. ఉత్తరార్థము.)

నిరంతరాభ్యాసవశమున నవధానము మంచినీళ్ల ప్రాయముగా జేసికొని పోవుచుండువారికి నయిత మీవయః ప్రయుక్తదోషము తప్పదు. కాని, అరుదుగా నెపుడో యేఁడాదికో రెండేండ్లకో యొక్కసారి అవధానము నిర్వహించువారిని కొట్ట వచ్చినట్లు బరువు తోచును. ముప్పదియైదవయేట చాలించి, దాని జోలికి బోకుండ నుండి, నలుబదియైదవయేట నిర్వహింప దొరకొనువారికి 'బండి సాగునా సాగదా?' అనునంత భారము గోచరించును.

'చత్వారి' ధారణాబంధుత్వమునకు సూచిక

—:o:—

# మేధావులు : మతిమఱుపు

వ్రాసిన యుత్తరము పోష్టు చేయ మఱచుటలో మేధావులదే పైచేయి వారు పనిచేయుచుందురు. మాటాడుచుందురు. నిద్రపోవుచుందురు. ఏమి చేయుచున్నను అన్ని యంతరములందు వారి మనస్సు, వారేవిషయము గుఱించి యోజించుచుందురో దానియందే వ్యగ్రమై యుండును పనిచేయుచుండును. దాని కితరవృత్తులానుషంగికములు

తే గీ. మంచి తేనియ గొనుటకై మధుకరంబు
వేయి త్రోవల వనులెల్ల వెదకి తిరుగు
ఎంత తిరిగిన నేపొదలందు జనిన
మానుచే మదిలో పొంగు మధురగీతి.

(శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిగారి చాటుధార.)

**Professor Issac NEWTON** జగత్ప్రసిద్ధ మేధాశాలి. ఆయన భానువాసరమున నొక మిత్రుని భోజనమున కాహ్వానించెను. ఆ మిత్రు డానాడు సరిగా భోజనవేళకు వచ్చెను. న్యూటన్ మహాశయుడు ప్రయోగశాలలో పనిమీద నుండెను. వచ్చిన మిత్రు డతనిపనికి నంతరాయము కలిగించుట కిష్టపడక, భోజనశాలలో ప్రవేశించెను. బల్లమీద నొక పళ్ళెము పదార్థము నుండెను. ఇంకేమి కావలెను ? కూర్చుండి సుష్ఠుగా భుజించి, కృతజ్ఞతాసూచకముగా నొక కాగితము వ్రాసిపెట్టి వెడలిపోయెను న్యూటన్ కుతపకాలమునకు పని తీరిక యొదవి, ఆకలిగా నుండుటచే భోజనశాలకు వచ్చెను. వచ్చి రిక్తపాత్రలు చూచి, 'నేనెంత మందమతినైతిని ! భుజించి వెళ్ళి మళ్ళి భోజనమునకు వచ్చితి' నని తెల్లబోయి, తిరిగి పనిమీది కేగెనట.

మఱొక ప్రొఫెసరు ఇంటినుండి బయలుదేరుచు, తలుపుద్రోసి (మూసి) భార్యను ముద్దాడుటకు బదులు, భార్యను ద్రోసి తలుపును ముద్దాడెనట.

(MEMORY - Dr. S. Kalyana Raman)

రాధాకృష్ణుల మతిమఱపుదనము లీలాశుకు డిట్లు వర్ణించెను:

శ్లో. రాధాపునాతు జగ దచ్యుతద త్తచిత్తా
మంథాన మాకలయతీ దధిరిక్తపాత్రే
తస్యాః స్తనస్తబక చంచల లోలదృష్టి
ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్
(శ్రీకృష్ణ కర్ణామృతము. 2-25)

రాధ, పెరుగు పోయకయే, వట్టి కుండలో కవ్వము పెట్టుచున్నది కృష్ణుడు పాలు పిదుకవలెనని యెద్దుకు ఉఱు దాళ్ళు గట్టుచున్నాడు. కుండలో పెరుగున్నది లేనిది పట్టపగలే ఆమెకు గనిపించలేదు అది ఆవో యెద్దో ఆయనకు గనిపించలేదు. కారణము - రాధ కృష్ణదత్తచిత్త కృష్ణుడు రాధావత్తచిత్తుడు. వారు మూఢులు కారు. జడులు కారు వారి మనసు లోకానొక యనిర్వచనీయమైన మహాపదార్థము నందు రమించుచున్నవి

కొందరు గొడుగులు, చెప్పులు మఱచిపోవుచుందురు రైళ్ళలో, బస్సులలో పుస్తకాలు, వస్తువులు మఱచిపోవువా రెందరో యుందురు. ఒక చోటికి బోదలచి బయల్దేరి మఱొకచోటికి బోయి, నాలుక కొఱికికొని వెనుకకు దిరుగువారున్నారు. వీరందరు మేధావులే యనలేము. ఇతరులు, పామరులు ఎందరో యుందురు. కొందరు బస్సులో గూర్చుండుటయే తడవు, కునుకపాట్లు పడుచుందురు. కొందరు తాము దిగవలసిన యూరు దాటిపోయిన తరువాత మేల్కొని, మా యూరు వచ్చినదా ? అని ప్రక్క వ్యక్తి నడుగుదురు. అంత రభిజ్ఞ కల కొందరు తమ యూరు రాగానే హఠాత్తుగా మేల్కొందురు మేధావులు నిదురపోరు. కాని, ఊరు దాటి పోవుట గుర్తింపజాలని స్థితి తఱచుగా వారి యందు తటస్థించుచుండును. వారి స్థూలశరీర మీలోకమున సంచరించుచున్నను సూక్ష్మశరీరము భావ ప్రపంచమున దేలుచుండును.

బహిర్విక్షేపములకు లోనుకాని అవికల్ప సమాధి స్థితి యది

—: ౦ :—

# జంటకవులు

పంచమ వేదము నాంధ్రీకరించు పట్టున 'పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నారాయణునట్లు' తానును భూసురవంశవిభూషణుండు నారాయణభట్టు వాఙ్మయ ధురంధరుడు తన శిష్యుడు సహాధ్యాయుడు నైనవా డభిమతంబుగ తోడయి నిర్వహించెనని నన్నయభట్టు రచించెను.

(శ్రీమదాంధ్ర మహాభారతము. ఆదిపర్వము 1-25)

నారాయణభట్టు 'అష్టాదశావధారణ చక్రవర్తి' కనుక మహాగహన ప్రాయమైన మహాభారతమున కథలు, ధర్మములు, ప్రవచనములు విభజించి త్రోవలు దిద్దుకొనుటకు నన్నయభట్టునకు చేదోడువాదోడుగ నుండియుండును. పద్యరచన యందు భాగస్వామి కాడు

ఉత్తర రామాయణ పీఠికలో కంకంటి పాపరాజు తన సహశ్రోతయైన పుష్పగిరి తిమ్మకవిని ప్రస్తావించి, 'కిరీటికి శౌరి తోడైన యట్టు లమ్మహాకవి సాహాయ్య మాచరింప గృతి నొనర్పగ బూని' నట్లు వ్రాసెను.

(శ్రీ మదుత్తర రామాయణ పీఠిక. 26)

శౌరి బండి నడిపినవాడే కాని, కత్తి బట్టినవాడు కాడు పై యుపమానము బట్టి తోడ్పడినవారు గంటము బట్టినవారు కారని స్పష్టము

కావ్య ప్రపంచమున ఉమ్మడిగా గంటము బట్టిన జంటకవులు వరాహ పురాణ కర్తలు- నంది మల్లయ గంట సింగయలు వీరిని గుఱించి సభలో నరస రాయలు పలికిన పలుకులు-

కం. మీ రిరువురు నెప్పుడును శ
రీర ప్రాణముల క్రియ జరింతురు మిగులన్
గూరిమి గృతి ప్రతిపద్యము
జారుఫణితి జెప్పగలరు చాటువుగాగన్. (వరాహ పురాణము. 1-13)

అట్టి కవుల పద్య గ్రంథము లభిన్నరీతితో నుండుట చూచితిమి ఇద్దరు కలిసి యొక పని చేయుట పొసగునా? యని ప్రశ్నింప నక్కఱ లేదు. కృతి ప్రతిపద్యము చాటువుగా నుండవలెనని వీరి మతము. ఏ పద్యము జూచినను అదొక బొమ్మ. కృతి బొమ్మల కొలువు మూలపదార్థ మున్నది-వరాహపురాణము దాని నందుకొని మంచి బొమ్మలు చేసిరి.

ఈ జంటకవి సంప్రదాయము నవఖాండ క్షేత్రమున జగదాశ్చర్యకరముగా నిలిపినవారు తిరుపతి వేంకటేశ్వరులు

తిరుపతిశాస్త్రిగారు వయసా కొంత చిన్న వేంకటశాస్త్రిగారు కొంత పెద్ద. వృద్ధానుపూర్వముగా పేళ్లు కలిపినచో వేంకట తిరుపతులగును. అది బాగుండదు. కనుక తిరుపతి వేంకటేశ్వరులని పేరు పెట్టుకొని కాసులార్జించి పూజలందిరి

ఈ జంటకవుల రచనావిధాన మెట్టిది ?

'ఇరువురు గూడియే రచన యెప్పుడు జేయుదు రొక్కవేళ నొ
క్క రొకటి యొక్క రింకొకటి కై కొని చేయుదు రందు హెచ్చు త
గ్గొరులకు గానరాక, యది యొక్కరు చేసిన భంగి నుండు, నొ
క్కరు రచియించిరేనియును గాదగు దిర్పతి వేంకటీయమై.

(జాతకచర్య పూర్వార్ధము. 240వ పద్యము )

కావ్య రచన సరే, అవధాన రచన యెట్లనిన -

'ఒక చరణం బతండు మఱియొక్కటి నేను మఱొక్క డాతడున్
సకల కవీంద్ర సంతతులు సమ్మతిచే దలలూచి మెచ్చగా
ప్రకటత రావధాన దనరన్ రచియింపగ నేర్తుమయ్య....'

(నానారాజ సందర్శనము. పూ భా. 44. ప.)

ఇది సమాధానము :

అవధానా సరస్వతి రెండు గుఱ్ఱాలమీద స్వారి చేయుట యెంత ముచ్చటగా సాగునని శంకింపబనిలేదు అవధాన పద్యములు ముక్తకములు విషయమా? ఇద్దరు విన్నదే. ఒక కవి యొక చరణము నుకివి పరిక్రమించినచో రెండవ చరణ

మైత్రికొనుట తోడి కవికి కష్టము కాదు ఈ పద్యము నరయుడు వర్ణ్యము వసంత ర్తువు.

1. కూయంజొచ్చెను కోకిల ప్రతతి కూకూరావ మొప్పన్ జగద్
2. గేయంబై తగు పల్లవ ప్రతతిచే దీప్తమ్ములయ్యెన్ దరుల్.

1. మేయంజొచ్చె జకోర దంపతులు మేల్మిన్ వెన్నెలల్ మారుడున్
2 డాయంజొచ్చెను బాంథ భామినుల నాడంబమ్ముతో నావనిన్

(శతావధాన సారము )

ఏ చరణమున కాచరణము తెగిపోవుచున్నది ప్రథముడు చెప్పినదానికి ద్వితీయుడు చెప్పినదానికి పొత్తు కలదు ఏ చరణమున కాచరణము తెగక పోయినచో నెట్లు? సందర్భమునుబట్టి తరువాతి పదమో పదాన్వయమో తెలియుచునే యుండును అంత యయోమయముగా నున్నచో 'నీ యాంతర్య మే'మని ద్వితీయుడు ప్రథము నడుగవచ్చును. లేదా, యతడే యిది యిట్లని చెప్పవచ్చును. వర్ణన పద్య విషయముననే కాదు, సమస్యా పూరణముననుꠌ మఱికొన్ని విశేషాంశముల నిర్ధరించి చెప్పుట యందు సంప్రతించి చేయవలసిన యవసరము తటస్థింపవచ్చు. శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారిట్లు వ్రాసిరి: 'ఇద్దరు అవధానం చేసేటప్పుడు పరస్పర ప్రసక్తి కలుగుతూ వుంటుంది గుణాన్నిబట్టి ఒకరి సవరణ యింకొకరికి అవసరమవుతుంది. సహృదయులు దాని నాదరిస్తారు. అందువల్ల ఇద్దరు చేసే అవధాన సభల్లో వాఙ్నియమం మేమెప్పుడూ పాటించ లేదు.' (ప్రజామిత్ర. 4-2-1940 )

ఒకపద్య మిద్దరి చేతులలో నలిగి సరియైన రూపు దిద్దుకొనగలదా? అనిన, అవధాన పద్య విషయమున అటువంటి శంక అక్కఱ లేదు లక్ష్మీనరసాపురావధానమున వేంకటశాస్త్రిగారు 'జ్వరపడియున్న హేతువున సాయము నీ కొనరింప జాల నోతిరుపతిశాస్త్రి' అని చెప్పి, 'పూనుము కార్యభారమును బూన సుదర్శనమన్న దేవకీసూతు కథావిధానమును జూపఁటు లాత్మల సంస్మరింప నే మౌనము బూని నీ శుభ సమగ్రతకై జపియించుచుందు నని కూర్చుండిరి. కాని, వారి తొలి పాదము, మామూలు ప్రకారము చెప్పక తప్పలేదు. మలిపాదము తిరుపతిశాస్త్రి

గారు చెప్పిరి. మూడవపాదము వేంకటశాస్త్రిగారి వంతు. జ్వరపడి నీరసపడి యుండిన వ్యక్తి. 'బెల్లము వండిన దీప్రో'య్యాసి లేచి చేవ దెచ్చికొని, ప్రథమ పాదము చెప్పునప్పటికే డిల్లవోయిరి. తృతీయ పాద మెట్లు చెప్పగలరు? అందు చేత వారికి విశ్రాంతి కల్పించి, వారి స్థానమున శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిని నిల్పి తృతీయ పాదము జెప్పించిరి. తుదిచరణము తిరుపతిశాస్త్రిగారు చెప్పిరి.
(తిరుపతికవి జీవిత సంగ్రహము. పుట 42)

కాగా, ఒక పద్యము మూడుచేతుల మీదుగా మూర్తి కట్టినది. అలనాటి యవధానమునందలి 'శరచ్చంద్రికావర్ణన' పద్య మిట్లున్నది:

'ఆరయ బిండి భూమిపయి నాఱగ బోసిన యట్టులున్ దధిన్
బోరగిలంగ బోసినటు పుష్పచయంబుల నొక్కకుప్పగా
జేరిచినట్లు సున్నమును జిల్కిన యట్లుగ గానిపించె నా
శారదరాత్రులందు వికసన్నవసౌరభ చంద్రచంద్రికల్'
(శతావధాన సారము.)

త్రికర్తృకమైనను అతుకులు లేక యేక కర్తృకమైన పద్యము చందమున గుత్తముగా నున్నది.

ఒంటి కవి చేయునప్పటికంటె జంటకవులు చేయునప్పుడే యవధానము రమ్యతరముగ నుండును. సమాన పాండిత్య కవిత్వ వాగ్మిత్వములు కల కవు లిద్దరు, సవయస్కులు, పొత్తున నొక కార్యము చేయుట దుర్ఘటము. రెండు కత్తు లొక యొఱలో నిముడుట వంటిది. ఎవరైన కవు లిద్దరుకలిసి యొండురెండు సభలలో రాణించి పేరుగాంచిరా? వారి నెటులయిన చీలదీయుటకు యత్నించువారు తయారగుదురు ఎవరి ముందర వారి మాట మాటాడి, యిరువురకు గంగవెఱ్ఱు లెత్తింతురు. తిరుపతి వేంకటేశ్వరుల పొత్తు విషయమున నెవరి జిత్తులు నెత్తులు పాఱినవి కావు. కారణమేమన, వేంకటశాస్త్రిగారు మహాలౌకికప్రజ్ఞాధురంధరుడు. తిరుపతిశాస్త్రిగారు ఏదియు గాబట్టని సముద్రము. కర్ణేజపజాతి మంత్రతంత్రము లకు పట్టు చిక్కదు.

సూక్ష్మముగా బరిశీలించి చూచినచో లోకమున నేయిద్దరియందును సమాన గుణములుండవు. కవబిడ్డలయందు రూప భేదము గోచరింపకపోయినను గుణ భేదము గోచరించును. తిరుపతి వేంకటేశ్వరులలో గ్రహణధారణశక్తు లిద్దరి యందు సమానములు కావు గ్రహణశక్తిలో తిరుపతి శాస్త్రిగారు హెచ్చు: ధారణ శక్తిలో వేంకటశాస్త్రిగారు హెచ్చు (దివాకరాస్తమయము : వేంకటశాస్త్రి కృతి ) లౌకిక ప్రజ్ఞయందు, కవితాశయ్యయందు, భావగాంభీర్యమునందు గణించినచో నుభయులయందు తారతమ్య మెంతో కలదు సభాకవిత్వము వేంకటశాస్త్రిగారి సొత్తు కావ్యకవిత్వము తిరుపతి శాస్త్రిగారి సొత్తు ఈ యిరువురి కలయికచేత సభకొక విలక్షణమైన శోభ కలిసివచ్చెను తిరుపతి శాస్త్రిగారికి వేంకటశాస్త్రిగారి పట్ల భక్తి, వేంకట శాస్త్రిగారికి తిరుపతిశాస్త్రిగారి పట్ల భయము నుండెను.

మ వితతాత్మీయ శతావధానకవితా విద్యాపయోరాశి సం
భృత శిష్యాంబుద వాఙ్మయామృత రసప్రీతాఖిలాంధ్రక్షమా
దృత విద్వద్రసికావతంస కృత వందిస్తోత్రమాలా విభూ
షితు మా వేంకటశాస్త్రి నే బొగడెదన్ శిష్యస్వరూపంబునన్.

అని యొక రనగా-

చం తిరుపతి సింగమున్ సరిగ ద్రిప్పి ప్రశాంత మొనర్పు వేంకటే
శ్వరునకు దక్క నీ యనుగు బావకు గీవకు గూడ గాదు నీ
గురుడగు చర్లచంద్రునకు గూడ వశం బెటులయ్యెడిన్, దురు
ద్ధరమది నేనె దాని బలుధాటికి నొక్కొకవేళ జంకెదన్.

అని యొకరనిరి.

ఒకరి తత్త్వ మొకరికి దెలిసియుండెను ఆంతరమైన కవితా వ్యాపారము నందు, బాహిరమైన జీవితవ్యాపారమునందు పొరపొచ్చెములు లేకుండ నడిచికొనిరి.

ప్రభావతీప్రద్యుమ్న నాటకమున శుచిముఖి మీదబెట్టి తమ కథ జెప్పికొనిరి.

ఈ నాటకము ప్రథమాంకము మాత్రమే వ్రాసి తిరుపతిశాస్త్రిగారు దివంగతులైరి. తక్కినది వేంకటశాస్త్రిగారు పూరించిరి.

తే. గీ. శతవధానంపు శకటమ్ము నతిరయమున
మీర లిర్వురు నడపు నా ధోరణి విని
యిచటి సత్కవి తల్లజు లెలమి దలలు
వంచిరి నమస్కరించి నుతించి రెలమి.

తే. గీ. ఒండొరుల యాత్మలంగల యూహ లొండొ
రులు శ్రమమ్ము వినాగనె తెలిసికొనుచు
పద్య సంపూర్తి యొనరించు భాగ్య మరసి
యిపుడు నినుమాత్రమే చూచు టెంత వింత!

(ప్రభావతీప్రద్యుమ్న నాటకము.)

ఒకరి మనసులోని యూహ నొకరు శ్రమము లేకుండ తెలిసికొందురను మాట ముఖ్యమైనది

జంటకవు లవధానము చేయుచుండగా జూచి యానందించిన సభ్యులు ఒంటి కవి యవధానము చేయుచుండగా జూచి, యంత యానందింపలేరనుట వేంకట శాస్త్రిగారి పద్యము వలన తెలియవచ్చెడి రహస్యము

అవధానమున దోడికవి యూహ తెలిసికొనుచు, నెవరి వంతు వచ్చినపుడు వారొక చరణము చెప్పినంతటితో పద్యము పూర్తికావలె. ప్రతి పద్యము నాలుగు పాదములును ఇద్దరును జ్ఞప్తియందుంచుకొనవలెను. సభాంతమున సభ్యులేవ్యక్తిని వరింతురో ఆ వ్యక్తియే మొత్తము పద్యములన్ని యప్పజెప్పవలసియుండును.

ఇక్కడొక్క చిక్కున్నది. వారు చెప్పిన పద్యము వారి మనసున కోతి పిల్లవలె నంటికొనియుండును, దుసికిలిపోదు. ఇతరులు చెప్పిన పద్యము నున్నని సున్నపు పూతగల గోడమీద గొట్టిన పచ్చిపిడకవలె నంటికొనియుండదు, దుసికిలి పోవును. కాని, జంటకవుల కీబెడద యుండదు. సొంతపద్యమును బలె, సహచరుని పద్యమును గూడ మనసున స్థిరముగ నిలిపికొనగలరు. వారిద్దరి యొద్దిక యంత సిద్ధమైయుండును. ఆతని పలుకుబడి యితనికి, నితని పలుకుబడి యతనికి సుపరిచితమైయుండి, యేకవార శ్రవణమాత్రమున మనసున హత్తికొని స్వాయత్త మగును.

ఆకాశపురాణము జంటకవులు చెప్పినపుడే రమ్యముగనుండును.

ఒకడొక పద్యము పురాణధోరణిలో రాగయుక్తముగా జెప్పి యాగును. వెంటనే రెండవవాడు వ్యాఖ్యానింపగడగును. ఈ సందున మొదటివాడు తరువాతి పద్యము తయారు చేసికొని, గొంతు సవరించుకొనును. ఆ సంకేతము గ్రహించి రెండవనాడు వ్యాఖ్యానము నాపును పురాణవక్త పద్యమింకను పూర్తిచేసి కొనలే దనుకొందము. అపుడు వ్యాఖ్యానము పొడిగించును. ఈ వైఖరి — ఒకరు పుస్తకమును జూచి చదివినట్లు ఆశువుగా పద్యమల్లి చదువుట, మఱొకరు దాని నందికొని వ్యాఖ్యానించుట — అవధానులకే కాదు, సభ్యులకును సుఖప్రదమే.

అవధానక్షేత్రమున జంటకవుల జాడ దీర్చినవారు దేవులపల్లి సుబ్బారాయశాస్త్రి తమ్మన్నశాస్త్రి మహాశయులు. తిరుపతి వేంకటకవులు వారి తరువాత రంగ మెక్కిన వారే. అయినను కృషిబాహుళ్యమునుబట్టి ప్రాథమ్యము తిరుపతి వేంకటేశ్వరుల పట్ల రూఢి గాంచెను తరువాత కొప్పరపు సోదరకవులు, శేషాద్రి రమణకవులు, వేంకట రామకృష్ణకవులు, రాజశేఖర వేంకటశేషకవులు పేర్కొనదగినవారు మఱియు నెందరో జంటలు జంటలుగా రంగమెక్కిరి కాని, రాణించిన వారు తక్కువ.

—: ౦ :—

# కూనరాగము

కూనరాగము భావనావిహంగమకూజితము ఛందోగతికి ప్రతిస్పందము.
రఘునాథరాయల యాస్థానమున మధురవాణి-
'వీణాగాన కళావినోద సమయే ధృత్వా సమస్యా శ్శతం
సద్యస్సంసది సాధు పూరయతి యా దత్తాః కవీంద్రోత్తమైః'

గానకళావినోద సమయమున సమస్యలు గొని పూరించుట, తలమీద కుండల దొంతి పెట్టుకొని, కుండలు తూలి క్రిందబడకుండ వాసిపై దృష్టి పెట్టుకొని నృత్యము కావించుట వంటి ఘనకార్యము కాదు తలమీది కుండల దొంతి దింపి ప్రక్కన బెట్టినచో ఆ నర్తకి మఱియు విజృంభితముగా నృత్యము గావింపగలదు. మధురవాణి వీణె ప్రక్కన బెట్టి సమస్యలు పూరింపగలదా ? మఱియు విజృంభితముగా బూరింపగలదా ?

చాకలి పాట పాడుచు రేవున బట్ట లుతుకుచుండును పాట, ఆ రచనలోని సొగసు, వ్యంగ్యచమత్కారము భావించి భావించి దాని యందు చాకలి చొక్కుట జరుగదు. ఒకొక్కమాఱు పాటయొక్క ద్రుతగతియందలి యూపు, పెదవినొక్కి జాడించి యుతుకునట్లు చేయవచ్చు. కాగా రెండు లాభములు కలిసి వచ్చును. ఒకటి శ్రమ యగుపింపకపోవుట, రెండు పని శీఘ్రముగ నగుట.

కడప జిల్లా కల్లూరులో సంజీవరాయ డనెడు గణకమణి గలడు. అంధుడు. ఫిడేలు తంత్రులమీద నేదోయొక రాగము గీయుచు, ఎంతలేసి గణితములనైన క్షణ మాత్రమున లెక్కించి చెప్పగలడు ఫిడేలు తోడు లేకున్నచో అతనికి దోచదు మధురవాణి వీణాభ్యాస మేతాదృశవిన్యాసమే.

ఛందోలక్షణ మొకొక్కవృత్తమున కొకొక్క అచ్చుపోత.
మత్తేభవిక్రీడితవృత్త మెత్తికొన్న -
'ననానా నానన నాననా నవన నానానా ననానా ననా' అని నడచును.

మత్తకోకిల -

'నానవానన నానవానన నానవానన నానవా' అని నడచును.

పంచచామరము -

'ననాన నాన నాన నాన నాన నాన నాన నా' అని నడచును.

తోటకము -

'ననవా ననవా ననవా ననవా' అని నడచును.

భుజంగప్రయాతము -

'ననానా ననానా ననానా ననానా' అని నడచును.

ఈ యచ్చు జాడలలో రసానుగుణముగా పదజాలము పొదుకొని పద్య స్వరూపము మలచికొనును.

'కుడుములు వండలేని యమ్మ, కూనరాగము అనలేని యయ్యా యుండరు' కదా! ఏదోయొక రాగపు మూలుగు పెలుగు వెలుగువడి పద్యమునకు బురుడు వోయును.

అవధానమున ముందటి పద్య చరణములను జ్ఞప్తికి దెచ్చికొనుట కీకూన రాగము తోడ్పడును. పూర్వచరణము తటాలున జ్ఞప్తికి రానపు డీరాగముయొక్క త్రొక్కులాట మిక్కుటమగును. దీనివలన యోజించికొనెడివారికి సంగీతధోరణి సహకారిణి యగుచున్నదని తెలియుచున్నది.

—: o :—

# వేదావధాని : కవితావధాని

శ్రీకృష్ణదేవరాయల తండ్రియగు నరసరాయల యాస్థానకవులు తెనిగించిన 'ప్రబోధ చంద్రోదయము' నందు-

'అర్థంబు తెలియక యఱచెద రవధాను లూరక వేదాలు నోటికొలది'
(ప్రబోధ చంద్రోదయము. 2-7)

యని యున్నది మూలగ్రంథమున 'నవధాని' శబ్దము లేదు.

'ఏతే తావ దర్థావధారణ విధురాః స్వాధ్యాయాధ్యయన మాత్రనిరతా వేద విప్లావకా ఏవ' (ప్రబోధ చంద్రోదయమ్ ద్వితీయాంకః)

అని మాత్రమున్నది. మన కవులు స్వాధ్యాయపరులను 'అవధాను' లన్నారు.

మూలకర్త కృష్ణమిశ్రుడు క్రీ.శ. 1100 ప్రాంతస్థుడు ఔత్తరాహుడు. స్వాధ్యాయపరుల నవధానులనుట ఆ కాలమున లేదో! ఆ దేశముననే వాడుక లేదో!

తెనుగుదేశమున బదునేడవ శతాబ్ది చతుర్థపాదమున అవధాని పద ప్రసిద్ధి పలుచబడి శ్రోత్రియకుటుంబముల సాధారణ సంకేతమై చెల్లుబడి గడించెను.

తంజాపుర విజయరాఘవ భూపాలకృత ప్రహ్లాద చరిత్ర యక్షగానమున ఎఱ్ఱావధాని యనునతడు సర్వావధాని యనువతని నధిక్షేపించును:

'ఓరి వ్రజఘంత! వయసు చెల్లితేనే నీవొక పెద్దవరా? నాపలె వేద శాస్త్రిలు పరీక్ష నిచ్చేవో?' అని. పరీక్ష యిచ్చినవాడెఱ్ఱావధాని. యీయనివాడు సర్వావధాని. పేరున కిద్దరు నవధానులే.

పదునెనిమిదవ శతాబ్ది పూర్వపాదకవి వాంఛానాథుడు తన 'మహిషశతక' మున వేదావధాని ప్రసక్తి తెచ్చెను. ఎగతాళి చేయలేదు. వేదావధాని పరిశ్రమ బేర్కొనెను.

'బ్రూతే త్వం వివిధస్స్వరాన్ బహువిధాన్ కాండాశ్చ ధత్తే ముఖే
ప్రాప్త శ్చాధ్యయనం పద క్రమవిధిం కించోచ్చరన్ గచ్ఛసి
అంగేషు క్రమ మాదధాసి బహుధా వృత్తిం కరోష్యన్వహం
తత్సర్వం మహిషాధిరాజ! సతతం వేదావధానీవ నః '

ఈ కవి శ్లేష మహిమచే దున్నపోతునే, అభేదాధ్యవసాయమున వేదావధానిగ జమత్కరించెను

హెచ్చరికతో వ్యవహరించువాడు వేదావధాని. అతని హెచ్చరికయొక్క నైశిత్య మెట్టిదో యీ శిక్షాశాసనము వలన గొంత తెలిసికొనవచ్చును:

'మంత్రహీన స్స్వరతో వర్ణతో వా
మిథ్యాప్రయుక్తో నతదర్థ మాహ
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్రశత్రు స్స్వరతోఽపరాధాత్ '

దేవశిల్పియగు త్వష్ట యింద్రుని జంపగల కొడుకును గనదలచి యజించెను. స్వరాపరాధము వలన ఫలము తలక్రిందై యింద్రునిచే జంపబడు కొడుకును గనెను. ఈ దెబ్బతో, స్వరవర్ణోచ్చారణ సమయమున యత్కించి ద్వ్యత్యయ మొదవినను అది వజ్రపాతమై హాని నొదవించునను భయ మధ్యేతల కుగ్గుతో బెట్టిన దయ్యెను. ప్రాణ మఱచేత బెట్టికొని హెచ్చరికతో బరింపజొచ్చిరి

మహామనీషులగు ఋషులు అధ్యయన దృఢీకరణమునకై అష్టవిధవికృతులు కల్పించిరి. అవి—

'జటా మాలా శిఖా రేఖా ధ్వజో దండో రథో ఘనః
అష్టౌ వికృతయః ప్రోక్తాః క్రమపూర్వా మనీషిభిః.'

వేద వాక్యము నందలి పదములు, వాని క్రమమును, సంధులు విడబఱచినను స్వరవర్ణలోపము రాకుండ నుచ్చరించుటకై పదము క్రమము అను పాఠమున సుశిక్ష నొంది, ఆమీద జటాది వికృతులందు అనులోమ విలోమ పదోచ్చారణము

అత్యంత మవధాన ముంచి వర్లించుట వలన జటాదివికృతులు నేర్చినవారిని 'అవధాని' యని గౌరవించుచు వచ్చిరి ఈ వేదావధానుల అష్టవిధావధానముల జూచియే కవితావధాను లష్టావధానము కల్పించి యుందురని కొంద రూహించిరి.

భట్టుమూర్తిని గురించి జనశ్రుతిలో రెండు కథలు ప్రచారమున నున్నవి.

1. బ్రాహ్మణాగ్రహారవీధి వెంబడి భట్టుమూర్తి పోవుచుండగా బ్రాహ్మణు లధ్యయనము మాని, మౌనము వహించెడివారని యొక కథ.

2. భట్టుమూర్తి శూద్రుడగుటచే వేదాధికారము లేనివాడై, పంచమ వేదము పట్టుకొని, అష్టావధానము సాధించెనని యొక కథ.

మొదటి కథ భట్టుమూర్తి పురోభాగిత్వము పురోహితముఖ విధానము చేయించెనని చెప్పును. రెండవ కథ భట్టుమూర్తి విశ్వామిత్ర సృష్టి చేసెనని చెప్పును. సూక్ష్మముగా విచారించినచో రెండు కథలందు పరస్పర విరోధము కలదు. జనశ్రుతి విషయములు పరమ ప్రమాణములు కావు కదా!

వేదావధానులకు కవితావధానులకు అష్టవికృతులు సామాన్యము లగుటచే సంబంధము కలదని యూహించుట సహజము. పై కథ లీయూహకు కొంత యూపిరి పోయును గూడ. అపౌరుషేయమన వన్నె కెక్కిన వేద మలౌకికము. కవిత్వము లౌకికము. వేదాభ్యాస కాలమున అధ్యేత పాటించు అష్ట వికృతులకు, కవిత్వ ప్రయోగ కాలమున కవి పాటించు అష్ట వికృతులకు సామ్యము కలదా?

శ్రీ చిలుకూరి వీరభద్రశాస్త్రిగారి 'భావ తరంగములు' కొంత యుపపత్తి జూపుచున్నవి.

1. ఈ యవధానమున కాధార మేమనగా వేదములు. ఎట్లనగా, వేదములోని సంహిత 'అగ్ని మీళే పురోహితమ్' అని వాక్యము. దానిని దెలుపుటకై ఘన జటలను జెప్పుదురు. అట్లే యొక పాదమును వ్యస్తావ్యస్తముగా నుడివి దాని సమర్థనముకై మూడు పాదముల గల్పించి సమస్య పూర్తిగా జెప్పుదురు.

2. దత్తపది: అగ్నిమ్ ఈశే పురః, హితమ్ - అని పదముల విడదీసి, ఘనజటలలో వీటి నిటు చెప్పి శ్రోత కర్థమగునట్లు చెప్పుదురు. అట్లే నాలుగు సమప్రాసలు గల పదముల దీసి కోరిన వృత్త భావముల నా పదములో నుపయోగించి పద్యము జెప్పిన నిదే దత్తపది యగును

3. నిషిద్ధాక్షరి. 'మమాగ్నే వర్చో౽ విహావేష్వస్తు' అను మంత్రమున్నది మమాగ్నే (వ నిషిద్ధము) అగ్నే మమ అర్చః - వి - హవేషు అస్తు. ఇందులో గొన్నిచోట్ల గొన్ని యక్షరములు లోపించిన నర్థము వచ్చునట్లు చదువుదురు. అట్లే పృచ్ఛకుడు వలదన్న యక్షరము విడిచి యీ భాగము సార్థకముగా జరుగును.

4 వ్యస్తాక్షరి: మమాగ్నే వర్చో౽ విహావేష్వస్తు. (ఘనలో 1 మ. 2 మా. 3 గ్నే 4 వి 5 హ 6 వే ) ఒకే యక్షరము పలుమార్లు వెనుకకు ముందునకు జరిపి పలుకఁబడును అట్లే వికి యక్షరములు అస్తవ్యస్తముగా నుడివి మొత్తముచు గలుపును ఇది ఘన ననుసరించి సృష్టించబడినది.

5. పుష్పగణనము: వ్రేళ్లతో జందెము నటునిటు త్రిప్పుచు లెక్కించుట వేదాధ్యయన సమయములో పరిపాటి.

6 పురాణము. భిన్నవృత్తాలు గల వేద మంత్రములు సంగీతములో సామములలో గానము చేయబడును. ఇదే పురాణ కథనము

7. చతురంగము: వేదపాఠ సమయములో హస్తశిరశ్చలనాదు లవసరము ననుసరించి జరుగునట్లే యీ చతురంగ బలము జరుగును.

8. అనవసర ప్రసంగము: ధారణ తప్పుటకై వేద పఠన కాలమున, అష్టావధాన కాలమున గూడ నుండును. (భావ తరంగములు. ద్వితీయ భాగము )

**ఈనాడు మనము చూచుచున్న యష్టావధానపు బోకడబట్టి శాస్త్రిగారి భావ తరంగములు తురంగలించినవి.**

అనాటి యష్టావధాన స్వరూపము వేఢా. భట్టుమూర్తియే యష్టావధాన స్వరూపము తీర్చి దిద్దినవాడని యంగీకరించినచో మఱియు బొసగదు భట్టుమూర్తి 'సకల భాషావిశేష నిరుపమావధాన శారదామూర్తి.'

**అష్టా**వధానము నందలి యష్ట వికృతులకు ఆకృతి ప్రదాత వేద పురుషుడే యనుట 'దేవుడే నా తండ్రి' యన్నటు లుండును సకల వాఙ్మయ ప్రపంచమునకు **మూ**లము వేదమే. సకల సృష్టికి మూలము దేవుడే ఆ దేవుడు చతుర్ముఖుని గనెను. అతనికి ప్రజాపతులు పుట్టిరి. వారికి ఋషులు, వారికి వారువారు. వారిలో నొక వ్యక్తికి నీవు జన్మించితివి నీ తండ్రి యనగా ఈ వ్యక్తి. ఈ వ్యక్తి పేరు చెప్పవలెను గదా! అవధాన విద్యామూల జనయితృ వ్యక్తిని చతుష్షష్టి కళాకలాపముననే మనము స్పష్టముగా జూడవచ్చును.

వే దా వ ధా న వి ధా న ము.

ఎష్టావధాని సర్వావధాని నధిక్షేపించెను గదా, వేద శాస్త్రములలో పరీక్ష యిచ్చినవాడు కాడని ఆ పరీక్ష యిచ్చుట యెట్టిదో శ్రీ యీయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యులుగారు 1933వ సంవత్సరమున కాకినాడలో దాము ప్రత్యక్షముగా జూచిన దానినిట్లు వ్రాసిరి:

'బ్ర॥ శ్రీ॥ వే॥ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చరణులు (కోనసీమకు జెందిన వారు) ఘనాపాఠి బిరుదాంకితులు అద్భుత వేదావధానమును, తమ యంతేవాసితో గలిసి నేత్రావధానము నొనరించి సభ్యుల నాశ్చర్యచకితుల జేసిరి. వీరు కృష్ణ యజుర్వేదము నంతయు క్షుణ్ణముగా మధించి, విస్మయజనకములగు ననేక వినోదముల బ్రదర్శించిరి ఈ యజుర్వేదపు ముద్రిత సంపుటములను బరిశీలించుచు మే మడుగు ప్రశ్నములకు వారు గ్రంథావలోకన మొనరింపకయే యొకటి రెండు నిముసములలో సరియగు నుత్తరము నొసంగుచుండిరి. ఒండు రెం డుదాహరణ ములు:

1. చేతికి వచ్చిన సంపుటమును గైకొని అందేదో యొక భాగమున అను లోమ విలోమక్రమమున అక్షరములను గాని, పదములను గాని చెప్పుమనుట. అనగా మొదటినుండి 272 వ యక్షరము గాని, పదము గాని యేమి? అడుగుననుండి 431 వ యక్కర మేమి?

2. ఈ భాగమున 'న' ఎన్నిసార్లు వచ్చును? లేక, యిందేదేని పదము (ఉదా. 'అమృత') ఎన్ని తడవలు వచ్చినది?

3 ఈ భాగమున అక్షరముల మొత్తము సంఖ్య యెంత?'

ఇదిగాక, 1947 అక్టోబరు 30 వ తేది పూనా యందలి భండార్కర్ ఓరియంటల్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్‌లో బ్రహ్మశ్రీ యదూర్కరశాస్త్రి చరణుల ఋగ్వేదావధానము గూడ నుదాహరించిరి. వారి వివరణ మిది-

'అడుగుటయే తడవుగ వీరేభాగమునైనను గ్రంథనిరపేక్షముగా సంహితా పాఠము, పదపాఠము, క్రమపాఠము జటాపాఠము, ఘనపాఠము నను నేపద్ధతి నడిగినను తొణకు బెణకులేక సస్వరముగ బఠించి'రట. ఇంకను వారి ప్రజ్ఞాపాటవ మెట్టి దనిన-

1 అనులోమవిధానముననే (1,2,3,4,5) కాక, ఋక్కులను విలోమ పద్ధతిని గూడ బఠింపగలరు (అనగా 5,4,3,2,1 ఇత్యాదిగా.)

2. అనులోమ విలోమక్రమమున - 1,3,5 7,9 ; 9,7,5,3,1 ఋక్కులను ఏకాంతరితములుగా, ఒకదానిని వదలి యొకదానిని బఠింపగలరు.

3. పంచమ మండలమున, తృతీయ సూక్తమున, చతుర్థ ఋక్కును (5-3-4) పఠింపుడనిన వెంటనే పఠింప దక్షులు.

4 ఏ ఋక్కునైనను జదివి- అది యెక్కడిదో తెల్పుడన, నది యీ మండలమున, ఈ సూక్తమున, ఇన్నవ ఋక్కని సరిగా స్థలనిర్దేశము చేయుటయే కాక, ఒకవేళ నా ఋక్కు మూడు నాలుగు సూక్తములలో బునరుక్తమగుచో అట్టి స్థలనిర్దేశము ను గూడ జేయుదురు.

5 విశిష్టపదములు, మాఋమూలపదముల గల ఋక్కులను గూడ నవ లీలగా బఠింతురు.'

వారణాసి ధర్మసూరి తన సాహిత్య రత్నాకరమున (1-20, 21 శ్లోకములు.) తమ పెదతండ్రి నారాయణసూరి, రామావధానియను పండితు నోడించి,

'అవధానీశ్వర శరభ గండభేరుండ' బిరుదములు ఛత్రచామరశిబికాది సత్కారములు పొందెనని వ్రాసెను. ఇవి పదునేనవ శతాబ్ది యారంభ కాలము నాటి ముచ్చట. దీనినిబట్టి వేదావధానుల తీరు తెన్నులు, అవధానుల పోటీ పరీక్షలు, రాజసత్కారములు తెలిసికొననగును.

## వేదావధాని : కవితావధాని

వేదావధానికి జిహ్వాగ్రస్థమైన వేదము (ఋగ్వేదము గాని యజుర్వేదము గాని) స్వగృహము వంటిది. ఏ వస్తు వేగదిలో ఏ మూల ఎంత యెత్తున నున్నది అడిగినదే తడవుగా జెప్పగలుగుట, కనుకట్టు గాని కట్టి దొడ్డివాకిటి కడ వదలిన తలవాకిలి కడకు, తలవాకిలి కడ వదలిన దొడ్డివాకిలి కడకు రాగలుగుట, నడికి రేయి, చిమ్మచీకటిలో స్వకుటుంబ వ్యక్తి నడిచినచో అడుగుల సవ్వడి బట్టి ఆ వ్యక్తిని గుర్తుపట్ట గలుగుట నిరంతర పరిచయసంతుకు సుఖసాధ్య విషయములు. వేదావధానము ఏకగ్రంథగతవస్తు నిత్యపరిచయ సాంతత్యఫలము.

కవితావధానికి అష్టావధానము మయసభ వంటిది. పృచ్ఛక ముఖములు క్రొత్త. ప్రశ్నములు క్రొత్త. వ్యవహారము క్రొత్త. అంతా క్రొత్త. వస్తువు, భాష, ఛందస్సు ఆకళించికొని, అన్వయించికొని, అమరించికొనవలసి యుండును. ఒడ లెల్లకనులుగా మెలగినగాని పని కాదు. కవితావధానము సద్యః పద్యరచనాధారణా వైశారద్య ఫలము.

—: o :—

# అవధాన భేదములు

వేదావధానము, అష్టావధానము, శతావధానము, అష్టభాషావ్యస్తాక్షర్య వధానము, సంగీతాష్టావధానము, శతకలశావధానము, గణితావధానము, అక్షర ముష్టికావధానము, పుష్పావధానము, నేత్రావధానము, పంచసహస్ర (పత్ర) అవ ధానము, ధ్వన్యనుకరణావధానము, నాట్యావధానము- ఈ రీతిగా నవధాన భేదము లనేకములు కలవు. ప్రతిభావంతులు స్వానుకూల విషయావధాన ప్రదర్శన పరాయణులై సంభారంగ మెక్కుచున్నారు వీనిలో కవితారచనాధారణాసంబంధ్య వధానములు ముఖ్యముగా రెండే అష్టావధానము, శతావధానము.

అష్టావధాన శతావధానముల గురించి వివరింపబడినది మిగిలిన పదింటి గురించి రేఖామాత్రముగా వివరింతును.

## 1. అష్టభాషా వ్యస్తాక్షర్యావధానము

ఈ ప్రక్రియ సాధించినవారు శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారే. ఎని మిది భాషలలో నెనిమిది వాక్యగుచ్ఛముల నెన్నికొని, యెనమండ్రుడు పృచ్ఛకు లవధానికి జవివి వినిపించుట, అవధాని వానిని క్రమముగా నవధరించి, తిరిగి వారికి యథాక్రమముగా నప్పగించుట – అష్టభాషావ్యస్తాక్షర్యవధానము. ఆ యష్ట భాషలు అవధానికి దెలిసినవియే కానక్కఱలేదు ఇంగ్లీషు కావచ్చు. గ్రీక్ కావచ్చు లాటిన్ కావచ్చు. అరబ్బీ కావచ్చు అఱవము కావచ్చు ఏదైన సరే. శబ్దము.

శబ్దము, శబ్దమునకు అర్థము, అర్థము, అర్థమునకు అన్వయము, అన్వ యమునకు వాక్యము, వాక్యమునకు ఛందము, ఛందమునకు గణయతిప్రాసలు, యమకాద్యలంకారములు ఒకదాని కొకటుతోడై, వృక్షము నేలనూది నిలుచుటకు ప్రాకిన వేళ్ల వలె ధారణాస్థితికి తోడ్పడును ఇచటను అర్థములేని, అర్థము కాని, అన్యభాషాపదబంధ సందర్భమున కేవలశబ్దమునే పట్టుకొని, గుర్తుపెట్టుకొనవలసి యుండును అర్థాన్వయాదుల తోడ్పాటుండదు.

**ఉదాహరణము :**

ఇంగ్లీషు :— లౌ ఇజ్ దీ యానక్ సేపన్ ఆఫ్ మైండ్ సో సుపీరియర్ బైలాన్ వర్ కన్ఫర్మ్డ్.

**హిందూస్తానీ** :- ఆశాకా బాబూ నిరాశాకా హాయి హుయేతోబాగా **బహిన్** నై హుయేతో యార్ జాగేతో ఖాపెగ సోవేప ఖావేగ

అఱవము :— పిల్పరి పిరివన్ కంచనం మల్లుంవేళ ముంహ హనుంపేళ చిత్రవంతనై

ఇట్లే సంస్కృతాంధ్ర ప్రాకృతాదిభాషలందు, అర్థాన్వయసంధిబంధములు విడగొట్టి వికృతములు చేయబడిన విచిత్రవాక్యసముచ్చయములు గూడ నుండవచ్చు.

## 2 సంగీతాష్టావధానము

శ్రీ దుడ్డు సీతారామయ్యశాస్త్రిగారు నిర్వహించిన సంగీతాష్టావధానక్రమము.

1. గీతము. (బాలురకు పాఠము చెప్పుట.)
2. స్వరజతి.
3. తానవర్ణము.
4. కీర్తన (కృతి)
5. పల్లవి. ముగ్గురు మూడుతాళములు వెఱువేఱుగా వేయుచుండ, తుదకు అన్నిటికి కలిపి ముక్తాయింపు వచ్చునట్లు అన్ని ఆవృత్తులు పాడి సరిపుచ్చుట. (చాలసేపు పట్టును)
6. సంఖ్యాకథనము లక్షల స్థానము దాటకుండ వరుసగా నాలుగు సంఖ్యలను నాలుగుసార్లు వినిపింపగా, అవి యన్నియు గూడి మొత్త మింత యని లెక్క వక్కాణించుట.
7. అప్రస్తుతప్రసంగము (అష్టావధానమునందు వలెనే యుండును)
8. వ్యస్తాక్షరి ఏ భాషలోనైన అక్షరములు విడివిడిగా వ్రాసి యీయగా గ్రహించి, వాని గలిపి చెప్పుట ఇదియు అష్టావధానాంగమే.

సంగీతాష్టావధానమున కవితాశక్తి ప్రదర్శించుట యుండదు.

(ఇది విద్వత్కవిశేఖరులు శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు ప్రత్యక్షముగ జూచినది.)

## 3 శతకలశావధానము

చీట్లు అరికించి, క్రమసంఖ్య వేసి నూఱు కాంస్యకలశము లొకచోట తెర మఱుగుననుంచి, వరుసగా నొకొక్క కలశము మీద కఱ్ఱతో తాడించుచు, ఆ చెంబు నెంబరు చెప్పుచుండగా నవధాని వినుచుండును. ప్రథమ కలశము చిన్నది. శతతమ కలశము పెద్దది. తక్కిన కలశముల ప్రమాణము తత్తత్సంఖ్యానురూపవృద్ధి గలిగియుండును. అందుచేత వాని మ్రోతయందు సామ్యముండదు.

నూఱు చెంబు లొకేప్రమాణము గలిగియుండిన, వానిలో క్రమవృద్ధిగా నీళ్ళు నింపుదురు లోహకలశగతజలప్రమాణభేదముచేత ధ్వనిభేద మేర్పడును.

ఆదికలశధ్వని అంత్యకలశధ్వని పరస్పరము స్ఫుటముగా భేదించును. కాని, తొలిచెంబు సవ్వడికి మలిచెంబు సవ్వడికిని కించిద్భేదము మాత్రమే యుండుటచే స్థూలదృష్టికి సమానముగనే కనిపించును. కనుక శ్రోత్రేంద్రియనైశిత్యమవసరము. ఏకపర్యాయశ్రవణమాత్రమున కలశసంఖ్యయు ధ్వనిప్రయాణమును గుర్తుపెట్టుకొనియుండి తదనంతరము పరీక్షకుడు తెరమఱుగునుండి ఏ చెంబు మీద దెబ్బ గొట్టిన ఆ చెంబు నెంబరు చెప్పవలెను ఇది శతకలశావధానము

ఇందు ధారణాశక్తితోబాటు, సూక్ష్మ సూక్ష్మతర సూక్ష్మతమ ధ్వని భేదము గుర్తింపగల సంగీతపు జెవియు నుండవలయును.

సంగీతశాస్త్ర పారంగతుడైన మాడభూషి వేంకటాచార్యులవారీ యద్భుత విద్య ప్రదర్శించిరి (భారతి. జనవరి 1950)

## 4. గణితావధానము

'ఈనాడు' (7-5-1978) దినపత్రికలో వెలువడిన యీ వార్త గణితావధాన స్వరూప మెఱుగుట కుపకరించును.

'అమెరికాలోని అత్యంత ఆధునికమైన కంప్యూటర్ 201 అంకెలుగల ఓ సంఖ్యయొక్క 23 వ స్క్వేర్ రూట్ కనుక్కోడానికి ఒక నిమిషం పైనే పట్టింది. కాని అదే లెక్కని 35 సంవత్సరాలు గల ఒక మహిళ 50 క్షణాలలో (సెకండ్లలో) మనసులో చేసి సమాధానం చెప్పటంతో ఆ విషయం అమెరికాలోని వార్తాపత్రికలన్నీ ప్రముఖంగా ప్రచురించాయి.'

ఈమె చిన్నతనమునుండి ప్రతిభ వెలార్చిన గణకురాలు.

'శకుంతలాదేవి బెంగ్లూరులో జన్మించినారు. ఎన్నడూ స్కూలులోగాని కాలేజీలో గాని విద్య నభ్యసించలేదు భగవంతు డిచ్చిన వరప్రసాదంతో భారత దేశ మంతటా దిగ్విజయంగా ప్రదర్శనలిచ్చారు. 1952లో అమెరికా వెళ్ళినపుడు టైమ్సు పత్రిక ఇలా వ్రాసింది: (అపుడామె వయస్సు పదేండ్లలోపు)'వాషింగ్టన్‌లో జరిగిన శకుంతలాదేవి ప్రదర్శనకు అనేకమంది రిపోర్టర్లు, గణితశాస్త్ర పండితులు హాజరయ్యారు. దండచేతి పొడుగు అంకెలన్నీ బాగా పరిచయం. ఏ మాత్రం ఆలోచించే పనిలేకుండానే ఆమె పది అంకెలుగల సంఖ్యల 4,5,6 ఘాతాంకాలను చెప్పివేయగలదు.' (సంస్కృతి సంచిక. విజయపురి 1985 )

శ్రీ కల్లూరి సంజీవరాయుడు గారు కన్నులు లేనివారయ్యు ఇట్టి లెక్క లవలీలగా చేయగల సమర్థుడు (ప్రొద్దుటూరు వద్ద.)

## 5. అక్షర ముష్టికావధానము

ఇది 'అక్షరముద్ర' అనియు 'భూతముద్ర' అనియు నిరుదెఱగుల గలదు. మొదటిది అక్షరసంబంధి : రెండవది తదనుకృతి.

వ్రేళ్ళు కణుపులు ముద్రలు. వీనిచే అక్షర స్వరూపము సూచింపబడును. దానినిబట్టి శ్లోకమో పద్యమో యెత్తివ్రాసికొనుట జరుగును.

'ముష్టిః కిసలయం చైవచ్చటా చారీ పతాకికా
పతాకాంకుశ ముద్రాశ్చ ముద్రావర్గేషు సప్తసు
ఆంగుళ్య శ్చాక్షరా జ్యేష్ఠాం స్వరా శ్చాంగుళిపర్వసు
సంయోగా దక్షరం యుక్తం భూతముద్రా ప్రకీర్తితా.'

(జయమంగళ టీక.)

## 6 పుష్పావధానము

'ఆకాశ మానసి' యని యశోధరుడు వివరించిన విషయమే పుష్పావధాన మనవచ్చు.

పద్మములు, ఉత్పలములు మున్నగు పుష్పములు బొమ్మల గీచి చూపగా వాని తీరును బట్టి అక్షరము లూహించి, ఛందస్సు గ్రహించి, శ్లోకము నుద్ధరించి, చదువుట 'మానసి.'

పద్మోత్పలాది చిత్రములు వ్రాసి చూపక, వాని స్వరూపము వివరింపగా విని, పై విధముగ శ్లోకము చదువుట పుష్పావధానము.

దీనిని బట్టియే నేత్రావధానము రూపొందిన దనవచ్చు.

## 7. నేత్రావధానము

కనీనిక కదలికను బట్టి అక్షరసంకేతము గ్రహించి, శ్లోకము వ్రాసి చూపుట నేత్రావధానము.

'నేత్రావధానంబు నెఱవేఱిచితి నేని చక్షుశ్శ్రవుండైన జంకవలయు' నని పిఠాపురనృపసదమున పిడుపాటి చిదంబరశాస్త్రిగారు పలికిరి.

శ్రీపాద సుబ్రహ్మణ్య ఘనపాఠిగారు, శ్రీ చిఱ్ఱావూరి యనంతపద్మనాభ శాస్త్రిగారు, శ్రీ చిలుకూరి రామభద్రశాస్త్రిగారు నేత్రావధానవిద్య నేర్చినవారు.

నేత్రావధాని మన మిచ్చిన పద్యమునో, శ్లోకమునో తీసికొని, దానిని నేత్రసంజ్ఞతో తన యంతేవాసికి దెలియబఱచును. అతడు దాని నెత్తి వ్రాసి మనకు జూపును.

## 8. పంచసహస్ర (పత్ర) అవధానము.

అయిదువేల దళసరి పత్రము లుండును. వాని కొకవైపున క్రమసంఖ్య వేయబడియుండును. మఱియొక వైపున ఒకొక్కదాని కొకొక్కరకమైన బొమ్మయో విశేషమో వ్రాయబడియుండును. ఈ పంచ సహస్ర పత్ర సంపుటి యాయనయొక్క స్థిరాస్తి ఏ సంఖ్యగల పత్రమున నేబొమ్మ యున్నదో, యే విశేషమున్నదో, నిత్యదర్శనముచేత, నిత్యమననముచేత నతనికి సమస్తము కరత

లామకంముగా నుండును. సభలో మూట విప్పి, ఆ కట్ట బయట బెట్టుదు. అయిదు వేల ఆట్టలుండును. సభ్యు లెందరుందురు? ఉన్నవారిలోను కొంచరే ముందుకు వత్తురు. వచ్చినవారు తలకొక పత్రము తీసికొనిపోయి, తమ తావున తాము కూర్చుండవలెను తమ చేత నున్న పత్రసంఖ్య చెప్పినచో, దానిమీద బొమ్మను గాని విషయమును గాని గుర్తించి యవధాని చెప్పగలడు. పద్యరూపమున జెప్ప గోరినచో కందమో గీతమో చెప్పును. పద్యములను పృచ్ఛకుడు వ్రాసికొనుట గాని, అవధాని తిరిగి అప్పజెప్పుట గాని యుండదు.

(ఈ విషయము, 'నవ్యాంధ్ర సాహిత్య వీథులు' ప్రథమభాగము నుండి గ్రహింపబడినది)

సభ్యులిద్దరు, అవధాని యొకడు వెరసి ముప్వురే యున్నారు. వేదికమీద పంచసహస్రపత్ర సంపుటి యున్నది. ఒక డొకపత్రము, మఱియొక డొకపత్రము తీసి రనుకొందము - చిలుకజోస్యుని చిలుక ముక్కుతో పత్రములు తీసినట్లు. ఆ యిద్దరి పత్రముల సంఖ్య 14, 738. ఆ నెంబరులుగల పత్రముల వెనుకనున్న విషయము గణపతి బొమ్మ, తాడిచెట్టుబొమ్మ. ఈ సంగతి యవధాని వెల్లడించును. ముచ్చటపడి కోరినచో పద్యము చదువును. ఇద్దరే పృచ్ఛకు లున్నను, పద్యము చదువకున్నను అది పంచసహస్రావధానము క్రిందనే లెక్క.

పృచ్ఛకు లైదువేలమంది చేరి యేక కంఠ్యముగా 'మేమే క్రమసంఖ్య వేసి, మేమే బొమ్మలు వగైరా చిత్రించి యిత్తుము. సభలో అప్పుడే చూచి, అప్పుడే పత్రములను మాకిచ్చివేసి, చెప్పుడు' అని కోరినచో అది దుర్ఘటము.

పంచసహస్రజనము బంతులుదీరి కూర్చుండి, క్రమముగా లేచి, పృచ్ఛించు చుండగా, ఒకొక్కరి కొకొక్కచరణము చొప్పున పద్యములు చెప్పి, తదుపరి మూడు తడవలకు పూర్తిచేసి, మొత్తము పంచసహస్రపద్యములను యథాక్రమముగా నప్పజెప్పుట జరుగునని చాలమంది భ్రాంతిపడుదురు.

తాదృశమహాకార్యము ఏ శ్రీహర్షుడో, ఏ జగన్నాథపండితుడో - అసాధారణమేధాధురీణులు చేయగలరేమో!

## 9 ధ్వన్యనుకరణావధానము.

పశు పక్షుల ధ్వనుల ననుకరించి పలుకువా రనేకులున్నారు  కోయిల వలె గూయుట, కుక్కవలె మొఱుగుట పసిపిల్ల లందరును జేయు నవధానమే యైనను వానిలో తారతమ్యము లుండును. చిలుక, గోరువంక, కాకి, గ్రద్ద నాలుగును పక్షులే యయినను నాలుగింటి ధ్వనిరీతులు వేఱు. ఈ నాలుగు పక్షులు నేక కాలమున గూసినను ఒకదాని ధ్వనితో మఱొకదాని ధ్వని సంపదింపదు. కాని, నాలుగు చిలుక లొకేసారి కూసినచో, తత్కీర చతుష్టయ కంఠధ్వని భేదము గుర్తించుట కష్టము. మనుష్యులు నలుగు రొకచోట జేరి మాటాడినచో తన్మనుష్య చతుష్టయ కంఠధ్వనిభేదము గుర్తించుట సుకరము. కారణము స్పష్టమే ఒకనిది కీచుగొంతు. ఒకనిది బొంగురుగొంతు. ఒకనిది స్నిగ్ధ గంభీరనిర్ఘోషము. ఒకనిది హీనస్వరము. ఇవిగాక, ఒక నటుడు, ఒక దేశనాయకుడు, ఒక కవి, ఒక గాయని, ఒక రాణి-మాటాడెడి వైఖరులు విభిన్నములుగా నుండును. ఒక కాగితముమీద పది పంక్తులు వ్రాసి యిచ్చి, ఆ మాటలను ఈ నటుని వలె జదువు మనియో, ఆ రాణివలె జదువుమనియో, లేదా, నలువురి పేరులిచ్చి, ఆ మాటలనే యీ నలువురు మాటాడు తీరుల ననుకరించి చదువుమనియో సభ్యులు కోరినచో, నాట్యముతో తత్తద్రీతులు ప్రదర్శించుట ధ్వన్యనుకరణావధానము. (వాక్యార్థము నభినయించు నాట్యము.)

పశు పక్ష్యాదుల ధ్వను లనుకరించుట, ఘోటక శకట విమాన ప్రయాణ ఢ ను లనుకరించుట, పౌరాణికాధునిక నాటక పాత్రముల ననుకరించుట-యిట్లెన్నో వింత వింత చెయిదము లున్నవి

పౌరాణిక నాటక పాత్రానుకరణమునకు ఒక యుదాహరణము.

పట్టపగలు  కీచకుడు పది మంది చూచుచుండగా ద్రౌపదిని తఱిమి ట్టుకొ చున్నాడు. అదృశ్యాకారుడై సూర్యునిచే బంపబడిన రక్కసుడు కీచకుని డొల్ల సెను నేల గఱచికొని కీచకు డేమనును? — ఇది ప్రశ్న.

అవధాని యా సన్నివేశము నూహించికొని, తాదాత్మ్యము బొంది, 'ఔరా! యిప యెక్కడి యాడుది! దీని కింతటి బిగువెక్కడి నుండి వచ్చినది? (పరికించి) తెప్పపాటున తీవ్రవన గాలివలె దూసికొని పోవుచున్నదే. నా యవస్థ చూచి నలుగురు నవ్వక మునుపే దేగవలె దీని నొడిసి పట్టెద.' (అని లేచి పరుగిడును.)

అత డీ మాటలే కీచకుని వేషము కట్టికొని యాడిన నెంత బాగుండును! అచ్చముగా కీచకుడే మాటాడుచున్నాడనిపించును.

## 10. నాట్యావధానము

ధ్వన్యనుకరణావధానము చేయు వ్యక్తియే పాత్రోచిత వేషము ధరించి నటించుట నాట్యావధానము.

నాట్యావధాని సందర్భోచిత వచన మల్లుకొని ప్రదర్శించును. పాటలు, పద్యములు ఆశువుగా అల్లి పాడుట యుండదు.

'సహాయ నిరాకరణోద్యమ సందర్భమున గాంధి మహాత్ముని యుద్బోధ ప్రకటింపు' మని ధ్వన్యనుకరణావధాని నడిగినచో నతడు ప్రదర్శించును. కాని, మహాత్ముని గళధ్వని పరమనిశితముగా పట్టుకొనినగాని అతడు కృతకృత్యుడు కాలేడు. నాట్యావధాని తేలికగా కృతకృత్యుడగును. ఎట్లన-అతడు కట్టిన మోకాలి మీది దోవతి, పట్టిన ఊతకోల, పెట్టిన కనుల జోడు, బోడిగుండు, పిలక జుట్టు, రంగావతరణము చేసి చేయక మునుపే గాంధిమహాత్ముడని అందరికి తెలిసిపోవును. ఆ పైన నత దేస్వరముతో మాటాడినను అంత పట్టింపుండదు.

పురాణ పురుషుల ననుకరించు సందర్భమున నాట్యావధాని ప్రకరణోచిత పద్యగీతాదు లాశువుగా రచించి సంగీత మధురముగా నాలపింపగల ప్రవీణుడైనచో సామాజికులను రసపరబ్రహ్మమునకు సమీపముగా దీసికొనిపోగలడు. గంధర్వాంశ యందు జన్మించిన మహానుభావులకే అట్టి విద్య హస్తగతమగును అందరికి రాదు

ఈ రీతిగా వివిధావధాన విశేషములు పరిగణించుచు బోయినచో శతములు, సహస్రము లగును చిల్లర యంగడి బేహారి పలువురికి పలువస్తువు లిచ్చి, డబ్బుతీసుకొనుచుండును అది వణిగవధానము. ఒక పాచకు డొక పెండ్లిలో నూఱు రకముల వంటకములు చేయును. అతడు పాకశాసనావధాని. 'వంటల శతావధానికి జే' యని గుంటూరులో 1911 సంవత్సరమున నొక బ్రాహ్మణు నూరేగించిరట.

(గుంటూరు సీమ పూర్వరంగము. పుట 8)

ఒక యుద్యోగి తన కార్యదర్శులు తొమ్మండ్రకు తొమ్మిది భాషలలో వారికి సంబంధించిన విషయాలు వరుసగా డిక్టేట్ చేసెడివాడట. ఇది పందొమ్మిదవ శతాబ్ది ప్రథమ కాలము నాటి మాట ఇది వాఙ్మయ వ్యాపారమే కనుక దీనికి 'నవావధాన మని పేరు పెట్టి యిటీవలి వార్తాపత్రికలు చమత్కరించినవి

**JULIUS CAESAR** అష్టావధాని యని బ్రౌన్‌దొరగారు తమ నిఘంటువున బేర్కొనిరి **One who can attend to eight things atonce** అని వారి అభిప్రాయము.

శ్రీకృష్ణున కెనమండ్రు మహిషులు, పదునారువేల మందికి పైగా భార్యలు కదా! అందరితో సరస సల్లాపకేళి జరుపుట కృష్ణుని లీల కదా! ఇదంతా వాఙ్మయ విలాసమే. కనుక శ్రీకృష్ణు డష్టోత్తర షోడశ సహస్రావధాని యెందుకు కాడు?

యజ్ఞకర్మ యున్నది. అధ్వర్యువు మొదలు పదునారుగురు ఋత్విజులు నిర్వహింతురు. దాని సామగ్రి, దాని మంత్రములు దాని ప్రయోగములు, దాని కున్నవి. మన మేదోయొక సభ నేర్పాటు చేసికొని, పలానా దొరగారి యాధ్వర్యవమున జరుపబడునని ప్రకటించి, నలుగురు నాలుగు మాట లుపన్యసించి, తేనీరు సేవించి, ఒక యజ్ఞము పూర్తి చేసితిమని యే దృష్టితో జెప్పుచున్నామో, అల్పాల్పములైన వివిధ వ్యాపారములను ఆ దృష్టితోనే అవధానమని చెప్పుచున్నాము.

అవధానము లనిన అష్టావధానము, శతావధానము రెండే అవధానములు.

శతావధానము-సంపూర్ణ శతావధానము, అర్ధ శతావదానము, పాదశతావధానము సమయానుకూలముగా జరిపింపబడును. పాద శతావధానమున నిరువదియైదు పద్యములు చెప్పబడును. పంచవింశతి పద్య నిర్మితిమాత్రశక్తికల వ్యక్తి శతావధానికాడు. శతపద్య నిర్మాణశక్తి కలవాడు శతావధాని. సభ్యులో సభాధ్యక్షుడో పాదాంత శతావధానము చాలునందురు. అపుడు శతావధాని పాదశతావధానమే చేయును.

శ్రీపరవస్తు రంగాచార్యులుగారు మూడు వందల పద్యములు చెప్పగల్గిరి. శ్రీ వేలూరివారు రెండువందల పద్యములు చెప్పగల్గిరి. వీరికి త్రిశతావధానియని, ద్విశతావధానియని పేరు రాలేదు. శతావధాను లనియే ప్రసిద్ధి.

—: o :—

# అష్టావధాన శతావధానములలో ఏది కష్టము?

తొలుదొలుత తిరుపతి వేంకటేశ్వరులు కాకినాడలో అష్టావధానము చేసి యభినందితులైరి. అపుడు నూనూగుమీసల యీ జంటకవులను బిలిచి యొక ప్రాజ్ఞు డిట్లనెను:

కం. అష్టావధాన మది యొక
కష్టముగా దెందరేని గావింత్రు కవుల్
కష్టము శతావధానం
బిష్టమ్మది నాకు జూడ నెన్నొవిధములన్.
అది సేయగలరె? మీరు....'

(జాతకచర్య పూర్వార్థము. 253, 254 ప్ర)

అష్టావధానము చేయగల కవు లెందరున్నారో లెక్కింపలేము. అందరున్నారు. శతావధానము చేయగల కవులు లేరు. ఎక్కడో యొక్కరుందురు. దీనినిబట్టి, అష్టావధాన మందరికి సాధ్యపడును. శతావధాన మందరికి సాధ్యపడదని వృద్ధాభిప్రాయము.

తిరుపతి వేంకటేశ్వరులు 'అష్టావధాన కష్టావలంబన మన్న నంబికొండయ దండనంబు మాకు' అనిరి. అష్టావధానము కష్టావలంబన మట అనుప్రాస రమణీయత కొఱకికష్ట శబ్దము గూర్చిరా? లేక వారి మనసులో శతావధానము కంటె అష్టావధానమే కష్టమను నభిప్రాయము కలదా? అని చూడగా, వేంకట శాస్త్రిగారు చెప్పిన రెండు పద్యములు, అష్టావధానమునకే అగ్రతాంబూలమిచ్చి చెప్పినవి, కనబడుచున్నవి.

చం. కలదొ, వధానపుంగరిమ కాకది చెట్టునె యెక్కెనో యటం
చలమురునాకు మీకతన నిష్టవధానములోని ధారణా
బలమది మున్నుబోలె తగుపాటిగ నున్న దటంచు దేలె నో
యలఘులు ! నర్సరాజ్పురవరాంకులు ! మిమ్ము నుతింప జెల్లదే.

చం. అలరు శతావధానమున నత్యధికంబగు కష్టమంచు బ్రా
జ్ఞులె వచియింతుగాని యది సూనృతమంచనుకోను నేను సొం
పలరగ నెవ్వరేనియును నష్టవధాన మొనర్ప మెత్తు నో
యలఘులు! సభ్యు లయ్యదియు నాత్మకు మీకును వచ్చియుండెనే ?
(శతావధాన సారము.)

శాస్త్రిగారి యభిప్రాయమున శతావధానములోని ధారణ వేఱు. అష్టావధానములోని ధారణ వేఱు మఱియు అష్టావధానము కంటె శతావధానము కష్టమని ప్రాజ్ఞులనుట నిజమని తాము తలపరట. అందుచేత నెవ్వరయిన నష్టావధాన మొనర్చినచో మెత్తురట శతావధాన మొనర్చినచో గొప్పగా నెంచరట. తమ కావించిన శతవధానాష్టావధానముల రెంటిని దర్శించిన సభ్యులకు వాని తారతమ్యము గోచరించి యుండునని విశ్వాసము ప్రకటించిరి.

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు అష్టావధాన శతావధాన తారతమ్యము నిట్లు వింగడించి, గురు సన్నిధియందే పలికిరి.

శా. శ్రీ రమ్యాష్ట శతావధానములలో జెన్నొందు నష్టావధా
నారంభంబది శ్రోతకున్ గడు వినోదార్హంబు నీషన్మనో
భారంబౌను శతావధానమున జెప్పన్ శక్యమే కష్ట వి
స్తారంబుల్ తగి దీని జేయు కవి యేతన్మాత్రుడే చూడగన్.
(అవధాన భారతి.)

అష్టావధానము శ్రోతకు వినోదకరముగా నుండును. శతావధానము కొంచెము బరువుగా నుండును. శతావధానము కష్టవిస్తారము. దీనిని చక్కగా నిర్వహింపగల కవి సామాన్యుడు కాడు- మహామనీషి.

అష్టావధానము నిర్వహించి కైవారము వడసిన బాల తిరుపతి వేంకటేశ్వరులు 'శతావధానము నిర్వహింపగలరా?' యని ప్రాజ్ఞులు ప్రశ్నించి నపుడు, 'ఓ నిర్వహింపగల'మని అప్పుడే చెప్పలేదు. వ్యవధి గైకొని చని, నారికేళవనమున పరీక్షించికొని వచ్చి నిర్వహింపగలమని చెప్పిరి. నిర్వహించిరి. ఇక్కడ వారికొక సందేహముండెను. పృచ్ఛకులు నూఱుగురుందురు. నూఱు విషయము లడుగుదురు ఏర్డి విషయము ధారణయందు నిలువవలెను. నిలుచునా? నిలువదా? అనునదే సందేహము. ఈ సందేహము పందొమ్మిదవ యేట బొడమినది. తిరిగి ముప్పది తొమ్మిదవ యేట బొడమినది.

'ధారణ నిల్చునా? నిలువదా? యను సందియ మొండుదక్క....'

(1910 సం. సంపూర్ణ శతావధాన సభ.)

ఊరక పద్యములు చెప్పి వేయుట యైనచో వేవురకైన జెప్పి వేయవచ్చు. శతావధానికి కుంటుపడని ధార, సడలని ధారణ యుండవలెను అష్టావధానమున కంత వడిగల ధార యక్కఱలేదు. ధారణలో గూడ భేదమున్నది.

ఒక పల్లెటూరిలో ఎనమండుగురు పరిచితులున్నారు. వారి యిండ్లొక వాడలో లేవు ఒక క్రమమున లేవు. ఒకని యిల్లు మేడ. ఒకని యిల్లు పూరి కొట్టము. ఒకని యిల్లు పెంకుటిల్లు. ఒకని యిల్లు మంటిమిద్దె ఒకని యిల్లు తాటి యాకుల గుడిసె. ఒకని యిల్లు సత్రములో తడక అడ్డము కట్టిరి. ఒకని యిల్లు దేవాలయ ప్రాంగణములోని పూజారి పంచ. ఒకని యిల్లు పూర్వమొక పెద్ద భవనము. శిథిలమై మొండి గోడలతో నొక్కగది మాత్రము వాస యోగ్యముగా నున్నది. ఈ యెనిమిదిండ్లలో నింత వైవిధ్యమున్నది. కనుక ఈ దృశ్యములు స్మృతి పథమున గుర్తముగ హత్తికొనును. తొలగవు. అష్టావధానసంబంధ్యష్ట విషయము లట్టివి.

ఒక మహానగరమున నొకచో నూఱు సౌధము లొకేతీరున నిర్మింపబడి యున్నవి. వాని యాకారమునందుగాని, ప్రమాణమునందుగాని భేదము లేదు. ఇంటి మొగమున వ్రాయబడిన సంఖ్యను బట్టి మాత్రమే వానిని గుర్తింపగలము. శతావధాన సంబంధి శతపద్యము లిట్టివి. ఇవి ధారణయందు నిల్చుట కష్టము.

అష్టావధానమున నిషేధాక్షరపద్యము దేవతాస్తుత్యాత్మకము. దత్తపది - గోలకొండ, కొత్తకుండ, పూలదండ, మాలముండ. సమస్య - 'సంధ్యావందన మాచరింపవలదా? చౌశీతిబంధమ్ములన్ ' వర్ణనము-దేవదానవ యుద్ధము.అప్రస్తుత ప్రసంగము, చదరంగము, ఘంటలు, వ్యస్తాక్షరి, పురాణము-దేని కది విలక్షణమై కొట్టవచ్చినట్లె ధారణయందు తగుల్కొని నిల్చును.

శతావధానమున నట్లు కాదు. రైలు పట్టాల వలె చూడ్కి పాఱిన మేర నొకేరకమైన పద్యపాదచ్ఛాయలు నిలువున చెలువారుచుండును. ఒక శతావధాన మున నొక రామాయణకథాసంబంధివృత్తములు పదియుండునో పంద్రెండుండునో. ఎన్నైన నుండవచ్చును. శ్రీరామజననము, కల్యాణము, అరణ్యవాసము, సుగ్రీవ మైత్రి,రామరావణ సంగ్రామము, పట్టాభిషేకము-ఇట్టివే కాదు. శివధనుర్భంగము, శివధనుస్సు ఫెళ్ళు మనగా సీతమనస్సు జల్లు మనుట, భగ్నధనుర్ధ్వని త్రిలో కస్థుల కెట్టు విన్పించినది? తత్కాలసభాస్థిత నానాదేశాగత రాజసుత ముఖసరో జాతము లెట్లులుండెను? జనకుడు, శతానందుడు, విశ్వామిత్రుడు, లక్ష్మణుడు - వీరి మనోభావము లెట్టుండెను? శ్రీరామ పాణిగ్రహణవేళ సీతాముఖాబ్జలజ్జామాధు ర్యము. ఈరీతిగా కించిత్కించిద్భేదములతో జనకరాజ సభాసన్నివేశ విశేషము లడుగవచ్చును. ధారాళముగా పద్యములు కట్టుచు, త్వరితగతి జను శతావధాని యిట్టి సూక్ష్మాంశము లతిజాగరూకతతో మనసున నిలిపికొని, 'ఒకడు కోరిన వృత్త మొకడు కోరిన వర్ణ్య మన్యోన్య సాంకర్య మందకుండ' నిర్వహింపవలసి యుండును వృత్తములలో లయగ్రాహి, మంగళ మహాశ్రీ వృత్తములు రెండును ప్రసక్తించినచో, రెంటి ప్రాస వర్ణములు సవర్ణము లయినచో, కర్మము చాలక వర్ణ్యవిషయము కూడ కొంచె మించుమించు నొకటే యయినచో, నిక జెప్పవలసిన పనిలేదు త్రిలోచన మొకింత తెప్ప కొట్టెనా, అన్యోన్యసాంకర్య మేర్పడి దురవస్థ ఘటిల్లును ఇట్టి గండము లుత్తరించుటకే శతావధానమున సమస్యలు, దత్తపదులు, మున్నగువ వంగీకరింతురు వీనితో పద్యవైవిధ్య మేర్పడి, ధారణకు పట్టు చిక్కును ఈ రహస్య మెఱుగని సభ్యులు 'ఓహూ! అష్టావధానగర్భిత శతావ ధానమిది. అవలీలగా సేయుచున్నారు. మేలు బళీ!' యని జేజేలు పలుకుదురు.

ఆదికాలపు అష్టావధానపద్ధతి కవిత్వ మనుపేర అష్ట పద్యములు చెప్పుట, తత్పద్య రచనావ్యాపారమ నర్థగించుచు, మఱి పెద్దత్రోవ బట్టించెడి లోకాభిరామాయణ చతురంగక్రీడా ఘంటాధ్వనిగణనాద్యష్ట విక్షేప విషయము లంగీకరించుటయై యుండెను. అనగా ప్రధానాంగము లెనిమిది, విక్షేపసంబంధ్యుపాంగము లెనిమిది వెరసి పదునాఱు. క్రమముగా ఆ పద్ధతి సన్నగిల్లి, లోకాభిరామాయణ చతురంగక్రీడా పురాణ వ్యాఖ్యాన ఘంటాధ్వని గణనాదులు పోగా, తక్కువ పడిన సంఖ్యకే రెండో మూడో పద్యములు వేసికొని, మొత్తము అష్టావధాన మనుట యయ్యెను. అనగా నాలుగు ప్రధానాంగములు, నాలుగు ఉపాంగములు కలిసి యెనిమిది యయ్యెను.

ఇట్టి యష్టావధానములు- ప్రాక్తనములు గాని, యద్యతనములు గాని శతావధానముతో తుల తూగగలవా?

'అష్టావధానారంభంబది శ్రోతకుం గడు వినోదార్హంబు'-నిజమే.

అప్రస్తుత ప్రసంగాకాశ పురాణాదులు వినోద జనకములే. ఎప్పుడు? కవి చమత్కారియైనప్పుడు. ఆ రెండో మూడో పద్యములు కూర్చికొనుటకే గింజుకొనుచుండు కవి అప్రస్తుత ప్రసంగాదులు జనరంజకముగా జరుపజాలడు. ఒక ప్రశ్న కేదో అసంగతపు సమాధానము చెప్పి, మొగము త్రిప్పికొని, మఱొక ప్రశ్నకు బిక్కమొగముపెట్టి. ఎట్లో ఛందోలక్షణము సరిపుచ్చి పద్యము చెప్పి, అష్టావధానము పూర్తియైన దనిపించువా రెందరో యున్నారు. కొందరంత కంటె మెఱుగుగ జేయవచ్చు. అంతమాత్రమున దానికి శతావధాన సమాన ప్రతిపత్తి రాదు.

చెళ్ళపిళ్ళవారు 'అలరు శతావధానమున నత్యధికంబగు కష్టమంచు ప్రాజ్ఞులె వచియింత్రు' అని వాకొని, 'కాని, అది సూనృతమంచనుకోను నేను' అనిరి సరే అది వారి వైయక్తికమైన అభిప్రాయమని త్రోసిపుచ్చుటకు వీలు లేకుండ. 'ఓ సభ్యులూ! ఆయ్యదియు నాత్మకు మీకును - నాకు వలెనే - వచ్చి యుండునే?' అని క్రుచ్చి యడిగిరి ఈ సభ్యులెవరు? వారి యష్టావధాన శతావధానముల రెంటిని ప్రత్యక్షముగ జూచిన సహృదయులు. శాస్త్రిగారి మాట యథార్థమని యొప్పుకొనక తగదు కదా!

శతావధానికంటె అష్టావధాని అధికుడని శాస్త్రిగారి సిద్ధాంతమైనచో వారేల 'చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి శతావధాని'యని సంతకము చేయుచుండిరి? 'అష్టావధాని' యని ప్రకటించికొనరేడే!

అష్టావధానులందరు శతావధానము చేయలేరు. శతావధాని యని పేరు పెట్టుకొన్నవాడెవడైనను అష్టావధానము చేయగలడు. 'శతావధాన మేనుగు పాదము.'

అష్టావధానమునకొక లక్షణమేర్పఱచికొని యుండినను, దానికెన్నియోరెట్లు కష్టము నంగీకరించి, వింతగా అష్టావధానములు ప్రదర్శించిన ప్రౌఢులు తిరుపతి వేంకటేశ్వరులు. ఆ ప్రౌఢి అందరికీ రాదు. అది తత్త్వాద్భుతము. వారి కాలమున నెందరో చిన్నలు, పెద్దలు శతావధానములు చేయుచుండిరి శతావధాన రచన యంతా రోకటిపాట వలె సాగుచుండెడిది. తిరుపతి వేంకటేశ్వరులు 1891 సం॥ లో కాకినాడలో కావించిన సంపూర్ణ శతావధానమున ఒక్క సమస్య కూడ లేదు. నూటికి నూఱు సాధారణ వర్ణన పద్యములే. ఆ గ్రంథము 1892 సం॥ లో ముద్రింపబడినది అష్టావధాన నిర్వహణమునకు కేవల మట్టి పద్యరచనా దక్షత చాలదు. పై హంగులెన్నో యుండవలెను. చెళ్ళపిళ్ళవారు పండితులలో పండితులు. లౌకికులలో లౌకికులు. భోగులలో భోగులు. కొంటెలలో కొంటెలు. సభావేదిక యెక్కినచో సామెతలు, చాటువులు, పాటలు, కథలు, గాథలు, వాక్చిత్రములు, శబ్దచిత్రములు కొల్లలుగా త్రవ్విపోయుదురు. అది యేమి విద్య! అఱచేతిలో వైకుంఠము చూపుదురు. అది పేరునకు అష్టావధానమే కాని, వాస్తవమునకు పది యష్టావధానముల సమాహార శిల్పవిశేషము. కనుక వారు కావించెడి ఆ యష్టావధానము శతావధానమునకు పైచేయి కావచ్చు. శాస్త్రిగారు తామొక శతావధానము చేసి, పదపడి యచ్చోటనే యొక యష్టావధానము చేసిచూపి 'ఇదిగో! ఈరీతిగా అష్టావధానము చేయగలవారెవరో రండు. వారిని మెత్తు' ననిరి. వారి మెప్పునకు నోచుకున్న యష్టావధాను లగుపడలేదు.

మ. సముదంచన్మతిపద్ధతిం జను సుధీశార్దూల మష్టావధా
నము నక్లిష్టగతిన్ రచించునతడైనన్ బ్రౌఢధారా తరః
క్రముడై పూని శతావధానము నొనర్పంజాల డెందుం జిత
శ్రము డొక్కండు శతావధానియగు జాగ్రద్ధారణా సంగతిన్
(శతావధాన ప్రబంధము. ప్ర ఖం )

శతావధానికి అఖండధారణాశక్తి యుండును. అష్టావధాన కార్యము శతావధాని కొకలెక్కలోనిది కాదు. ధారణ గురించి యతనికి విచారముండదు అప్రస్తుత ప్రసంగి యొకమాట మాటాడినచో పది మాటలు బదులాడి పల్లటీలు కొట్టించును. నడుమ నడుమ నెవరైన సమస్య లిచ్చినను ఆశువుగా పద్యములు చెప్పుమని యడిగినను అంవోక పూరించుచు సారించుచు వినోదమున ముంచెత్తును.

కేవలాష్టావధాని ధారణ పట్ల అప్రమత్తుడై యుండుటకే ప్రయత్నించు చుండును. కవిత్వేతరవిషయముల యందనాదరుడై యుండును. డబ్బు గలవాడు జేబుదొంగలకు జంకి, తిరునాళ్ళగుంపులో ఎన్ని వింతలున్నను చూచీచూడక, నవ్వీనవ్వక, పలికీపలుకక, స్వస్వరక్షణైకదృష్టియై యెట్లు వర్తిల్లునో, కేవలాష్టావధానియు సభలో నట్లు వర్తిల్లును అందుచేత శతావధానియొక్క అష్టావధానము వలె అష్టావధానియొక్క అష్టావధానము రక్తి కట్టదు.

ఒక్కమాటలో జెప్పినచో- అష్టావధానము కమలములు, భ్రమరములు, హంసములు గల చెఱువులో ఈత శతావధానము దరులు మోసి నిండుగా బాఱు నేటిలో ఈత. చెఱువులో ఈదగలవాడు ఏటిలో నీదలేడు. ఏటిలో నీదగలవాడు చెఱువులో నీదగలడు.

—: ο :—

# అవధానకవిత

ఆశుకవితాధార పందెపుగుఱ్ఱము ఆగక పరుగెత్తుటయే దానిపని అవధాన కవితాధార యుద్ధాశ్వము. అభ్యమిత్రీణుడైన అవధాని చేతిలో చిత్రచిత్రగతిభేదముల కగ్గమై విజృంభించుచుండును.

పరుగెత్తుట, నడుమ నడుమ ఆగుట, పొంచి గుఱిచూచి దూకుట, కదియ బడుట వంటి కుతూహలము పెంచు బహుగతివిశేషములు యుద్ధాశ్వమునందు కాన నగును. కనుక ఈ పద్ధతి రమ్యతర మనుట నిర్వివాద విషయము.

ఆగక సాగిపోయెడి ఆశుధారకు, ఆగియాగి వంపులు సొంపులు మలచికొనుచు సాగిపోయెడి అవధాన ధారకు చాల భేదము కలదు.

ధార ఆగుచున్న దనగా అవధాని యోజించుకొనుచున్నాడని యర్థము. అప్పకవి 'ఎంత యోజించినను బద్యమంత సారవంతమగు' ననెను. ఆశు కవిత కంటె అవధాన కవిత సారవంతముగ నుండుట కిదియొక కారణము.

ఎంత యోజించిన నంత సారవంతముగ నుండునని యవధాని సభలో బ్రహ్మలోక పర్యంతము యోజించుచు గూర్చుండినచో సభ్యులు లేచిపోవుదురు. ఇక్కడ నాగి యోజించుట యొండు రెండు ఱెప్పపాటుల కాలము మాత్రమే. ఆ యింతలోనే సవరించికొనవలెను.

భావము స్ఫురించుట పద్యము రూపుదిద్దుకొనుట యౌగపద్యముగ జరుగుచుండును. అవధాని యోగి, ధార నందుకొనుట భావస్ఫూర్తికొఱకే. శబ్దములు పులిమి పులిమి మార్చి మార్చి ధార తీర్చికొనుట కెప్పుడును అవధాని యత్నింపడు. భావానుకూలముగా నభ్యాసవశమున నూరెడి ధార స్థిరపఱచికొనును. దానిలో చెయి పెట్టడు. అనగా ఆ పదము తీసి యీ పదము, ఈ కొమ్మును తీసి ఆ గుడి-యిట్టి మార్పులు చేర్పులు గావించుటకు బాల్పడడు. ఏల యన తొల్త వెల్వడిన ధార మనఃఫలకమున హత్తికొనియుండును. దానిని జెఱిపి గజిబిజిచేసి

దిద్ది తీర్చుమేని అది యొకపట్టున నిలువదు. చెదరును. ధారణాప్రధానమైన యవధానమున వెలువడు కవిత యచ్ఛమాక్షికము వలె నకృత్రిమరస విలక్షణము.

శివధనుర్భంగ సమయమున జనకమహారాజ సభా భవన మెట్లుండెనో చంపకమాలికా వృత్తమున వర్ణింపు మని పృచ్ఛకుడు కోరుచుండగనే యవధాని భావ ప్రపంచమున ఆ సభను సాక్షాత్కరింపజేసికొనును. కౌశిక మహర్షి వెంట వచ్చిన రామలక్ష్మణులు, జనకమహారాజు కొలువుకూటము, అవరోధ జనమధ్యమున సీత, శివధనుర్భంగము పొడకట్టినంతనే యతని వాణి- 'ననన ననన నాననాననన నానన నానన నాననాననా' అని చంపకమాలికావృత్తచ్ఛందోరథ్యయందు పరుగిడ గడగును అది వర్ణక్రమబద్ధమగుట కెంతోసేపు పట్టదు. లిప్తలమీద జరిగిపోవును. దాని భావము గుఱించి కాని, శబ్దము గుఱించి కాని, శయ్యను గుఱించి కానిపునరాలోచన చేయుట, దిద్దుట యుండదు. దొరలించి వేయుటయే యవధాని కార్యము. అందుచేత ఆశూక్తములైన అవధాన పద్యములు నూటికి నూరు చక్కగ నుండు నని చెప్పలేము

'ఇతర కవుల్ ప్రయాసపడి యెంచి రచించిన నూటికెన్ని పె
ద్దతనము గాంచి చిత్తమును దన్పునొ, మే మవధాన సంగత
స్థితిగని యాశుగా రచన చేసిన పద్యము లందు జూచినన్
శతమున కన్నిపద్యములు చక్కగనుండు నసంశయమ్ముగన్.'

అని శ్రీ చెళ్లపిళ్లవా రనినారు. పెద్దతనము - సర్వదోషత్వ గౌరవము. చిత్తము దన్పుట-సద్యః పరనిర్వృతిదాయకము లగుట.

ఇంట గూర్చుండి యదేపనిగా యోజించి యోజించి దిద్ది సున్నమై వ్రాయు కవుల పద్యములు నూటికి నూఱు చక్కగనుండుట సంశయ విషయము. తిరుపతి వేంకటకవుల యవధాన పద్యములు నూటికి నూఱు చక్కగనుండు ననగా అవధానిక నిర్బంధములు వారి ప్రతిభకు అడ్డు తగులజాల వన్నమాట. ఈ దర్పము

చేతనే వేంకటగిరిలో - 'అష్టశతావధానాది సత్క్రియ మంచినీళ్ళ ప్రాయము కళానిపుణ! మాకు' అన్నారు.

నేలమీద మనమెంత చక్కగా నడుపగలమో త్రాటిమీద అంత చక్కగా నడుపగలవారిని జూచి మన మాశ్చర్యపడుదుము త్రాటిమీద నడక యభ్యసించిన వారెంత సహజముగా నడచుచున్నట్లగుపించినను వారి ప్రాణమంతయు క్రిందబడకుండ నిలుపద్రొక్కికొను ప్రయత్నముతోనే సతమత మగుచుండును. ఇది దాగని సత్యము. అత డెంత సమర్థుడైనను నడుము, చేతులు, మెడ, తన సౌస్థిత్యమునకు భంగము కలుగని తెఱగున నాడించుచుండక తప్పదు అట్టిచో నతని నిలుకడ యెటులుండును? అవధాని స్థితియు నంతియ.

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు శతావధానము (50 మందికి) చేయుచుండగా నొక పండితుడు 'మదిరాక్షీ' శబ్దమున కర్థము వివరింపుమని పట్టు పట్టెను. అప్పు డాచార్యులవారి కది సాధ్యపడినది కాదు. 'అది మనఃస్వాస్థ్యములేని సమయ మగుటం జేసి అపుడు నాకు బ్రత్యుత్తరము జెప్ప వీలు గాకుంట, అయ్యా! ఈ మాఱు టరన్‌లో తమకు సమాధానము చెప్పెద' ననిరట

(అవధాన యాత్ర. పుట 116)

అర్ధ శతావధానముననే యిట్లున్న సంపూర్ణ శతావధానమున నెట్లుండును ? అదియు నాచార్యులవారే విస్తరించిరి.

'కానన్ బెబ్బులి యొక్కచోట మఱి సింగం బొక్కచోటన్ మహా
ధ్వానంబుల్ పచరించు క్రూరమృగ సంతానంబు లింకొక్కచో
నానారీతుల భీతిగొల్ప వనిలోనంజిక్కు మేషంబునా
బూనంజాలదు కాల్ వధానిమది సంపూర్ణావధానమ్మునన్.'

(బందరు శతావధానము.)

'నిలుకడ వలయు కృతికి': స్వాస్థ్యము ప్రధానము. అదిలేనిచో సారస్యము లేదనియే చెప్పవలెను. అవధానమున స్వాస్థ్యము దుర్లభము. కనుక అవధాన

కవిత్వము పెద్దతనము గాంచి చిత్తమును దన్పుట యెట్లు సంభవము? పెద్దతనము గాంచి, చిత్తమును దనుపుట- లక్షణసమ్మతమై ఆ కూర్పు అవధాని లోకమునకు పరమాచార్యకముగా వెలసి, సూక్ష్మములో మోక్ష మన్నట్లు, అడిగిన ప్రశ్నమునకు దగిన సమాధానము సిద్ధించుటచే పృచ్ఛకుని చిత్తమున కొదవెడి మెప్పుదలతోడి తృప్తియని భావింపవలెను. అవధాన పద్యముల బ్రతుకింతకంటె నుజ్జ్వలముగ నుండునని తిరుపతి వేంకట కవు లనుకొనియుండలేదు.

నానా రాజ సందర్శన సందర్భమున అవధాన ప్రదర్శనానంతరము-

'దాని (అవధానమును) నటుండనిచ్చి, కవితారసముం జవిచూచు పొంటె అన్యూనములైన మా కృతులకున్ వినగోరెద' మనియు-

'దొమ్మరిసాని యెంతయును దుడ్కుమెయిన్ గడనెక్కి యాడు పో
ల్కి మ్మతిజల్మి కల్మి గడు లేమిడిచే నవధానమున్ బొన
ర్చు మ్మనుజుండు, దాని నొకచోద్యముగా గణియింపబోక స
త్సమ్మతిగా నెసంగు కవితారసమున్ జవి చూడు భూవరా!'

అనియు, రసమునకు అవధాన కవిత్వమునకు జాలదూరమను నభిప్రాయమునే బాహాటముగా బ్రకటించిరి. ఇంత యెందుకు? శతావధాన సారోపోద్ఘాతము నందేమి వ్రాసిరో చూడుడు:

'ఈ పుస్తకము ప్రకటించుటకు ముఖ్యకారణము అవధాన మన నెట్టిదో, అందలి కవిత్వ మెంత రసము తక్కువ కలిగియుండునో, అందుగోరెడి కోర్కులెంత విషమములుగా నుండునో యను విషయ మెల్లరికి తేటతెల్లంబగుటకేకాని, దీనివలన మీ మనస్సులను రంజింపజేయుటకు గాదు.'

'కాశీసహస్ర' ప్రారంభ స్తబకమున శ్రీ తిరుపతిశాస్త్రిగారు తమ వాణీ అవధానాకులోద్ధరమున విచిత్ర కావలసివచ్చెనని నిర్వేదము వెల్లడించిరి.

'తత్తాదృక్ష శతావధాన సమయే విత్తే నిమిత్తే కృతై
స్తత్తాతూన్య పదార్థవర్ణనపరైర్వాక్యైర్విచిత్రీకృతా
వాణీయం భవదీయ సుందర కథాసందోహబందీకృతా
మాత ! ర్నిష్కలుషత్వ మృచ్ఛతు శరత్కాలేన నద్యో యథా.'

వాస్తవమున కవధాన సభలో కవితాసారస్య వివేచనము చేయువారు తక్కువ. పృచ్ఛకుడు- సీతా రావణ సంవాదము సీసమున జెప్పగోరెను. అవధాని చెప్పినది సీసమే కదా! సీత మాటలు, రావణుని మాటలు ఉన్నవి కదా! అన్నిటి కంటె ముఖ్యము సభాంతమున పద్యము యథాతథముగ నప్పజెప్పినాడు కదా! ఇదే దృష్టి ఇంతకుమించి పద్యనిర్మాణశిల్పముగాని, రసమునుగాని విచారించు వారెవరు? కనుకనే వాగ్గంధ మెఱుగని దేవానాంప్రియులును అవధాన తంత్రము యథాశాస్త్ర ముగా వెలిగింపగలుగుచున్నారు.

అవధానమున దాము చెప్పిన పద్యము లిన్నియుతిప్పి పద్యములని తిరుపతి వేంకటేశ్వరు లొప్పుకొని యెవరైన నధిక్షేపించినచో నూరకుందురా ?

ఆత్మకూరి తేని కోరికి పాటించి, శ్రీనివాస విలాస కావ్యమును తెనిగించి, సమర్పించి, బహుమానస్వీకార సమయమున నొక పద్యము నొడివిరి:

చం పనిగొని విన్మ కంఠమున ప్రాణము గల్గిన యింతలోన నో
జనవర ! యింతకన్న సరసమ్ముగ దీని దెనుంగుజేసినన్
వినయమునన్ నమస్కృతులు వేయొనరించి భవద్వితీర్ణమౌ
ధన మఖిలంబు నాతనికి దానము చేసి తరింపకుందుమే ?

(నానారాజ సందర్శనము.)

పద్యము తిరుపతిశాస్త్రిగారి రచనము. శ్రీనివాసవిలాసకావ్య మంత గడ్డుది. దానినంతకంటె సరసముగ నాంధ్రీకరించుట దుస్సాధము ఇదే సమాధాన మవ ధాన విషయముననను జెప్పుదురు. అవధానము ఎంత సరసముగ జెప్పుటకు వీలు కలదో అంత సరసముగ జెప్పుదురు.

గద్వాల యేలిక యవధాన సభలో 'స్త్రీలకు శృంగార రసోపయుక్తములైన యవయవాలన్నీ యెదటిభాగంలోనే ఉన్నాయి కదా! జడ కూడ అట్టి అవయవాల లోదే. అది వెనక ఉండడానికి కారణమేమో చెప్పవలసినది?' అని తిరుపతి వేంకట కవుల నడగి రట. వారపుడీపద్యము పలికిరి.

సీ పురుషాయిత మొనర్చు పూబోడి కటిమీద
నాట్యంబు సలుపు పుణ్యంబు కొఱకొ
ఘననితంబస్థలంబను పెన్నిధానంబు
బహుభద్రముగను గాపాడు కొఱకొ
తా నాశ్రయించు కాంతకు వెన్కభాగమ్ము
నను గూడ సౌందర్యమునుచు కొఱకొ
పదిమంది దృష్టులు పడిన కంటక మంచు
నూహించి కనబడకుండు కొఱకొ

వేణి కాంతల వెన్నంటి వ్రేలుచుండె
లేక యుండిన నిధువన లీల కుపచ
రించు నంగమ్ము లెదుటనే సంచునించ
దాని కట్టుండ నే యుపద్రవము వచ్చె ?

ఈ సీసమున ప్రథమ తృతీయ పాదములు వెంకటశాస్త్రి గారివి. ద్వితీయ చతుర్థ పాదములు తిరుపతిశాస్త్రిగారివి. వెంకటశాస్త్రిగారు కామశాస్త్రము, తిరుపతిశాస్త్రిగారు మంత్రశాస్త్రము జోడించిరి. పదిమంది దృష్టులు పడిన కంటక మను పలుకుబడి పరమరమణీయము. పద్యశయ్యయం దెచ్చటను శైథిలి కను పట్టదు. ఉత్ప్రేక్షకు కొదువ లేదు. ప్రబంధ పద్యము చాదృన నున్నది. దొరవారు సంతోషించి, 'దాని కట్టుండ నేయుపద్రవము వచ్చె' ననుమాట పట్టుకొని 'ఉపద్ర వమే వచ్చినట్లు చెప్పగలరా?' అని పృచ్ఛించిరట ఆ మాటపై మఱియొక పద్యము జెప్పిరి.

మ. ఎదుటన్ వర్తిలునట్టి యంగముల కెంతేనిన్ నఖాది క్షతా
పద పల్కాలును గల్గుసంగతిని దా ప్రత్యక్షముంజూచి నె
మ్మదిలో భీతిలి చాటుచోటనుచు సంభావించి వెన్నంటుచున్
బొదలన్ బోలును వేణి, లేకునికి దా ముందుండ కట్టుండునే?
(కథలు-గాథలు. మూడవ సంపుటము.)

సద్యమ యింత కల్పన చేసి పద్యము నిట్లు తీర్చి రసజ్ఞుల చిత్తము దన్పుట యథావకాశముగా సాధింపబడినది.

అవధానవాణి నీరసపడుచుండెనని నిర్వేదించిన తిరుపతిశాస్త్రిగారే లక్ష్మీ నరసాపురావధానమున, ప్రకృతావధానుల ప్రకృతావస్థ వర్ణింపగోరి నపుడు—

చం. పరువము దప్పుచుండినను బాయక నన్నిది వేచుచున్న దీ
వరుసగ నెన్నియేండ్లు గడపన్వలెనో యిక సన్న్యసింత మం
చురుతరబుద్ధి పుట్టు నటు లుండియు రాజులు పిల్చినప్పుడో
మఱల జనించు దానిపయి మానని తీపి, శతావధానికిన్.

అని సత్యము పలికిరి. అవధానికి సభల పట్ల గల తీపికి కారణము-లోక మున కవధాన పద్యముల పట్లగల తీపి. ఎంత లేదనినను, అవధానకవితలో, అవ ధాని సమర్థుడైనపుడు, జిగియు బిగియు నుండి తీఱును.

—: o :—

# అవధానశక్తిని గుఱించి ఆక్షేపణ

'లోకమందలి పలు వస్తువుల్గొని యథావిధిగాగ సమస్త వృత్తముల్ కలయ రచించి యుంచి, తమకమ్మున నిప్పుడు గోరువారి కగ్గలముగ జెప్పు చుండుదురు గాని, నవీనముగా రచించువారలు' కారని కొందరు పండితు లాక్షేపింపగా తిరుపతి వేంకట కవులు - 'ఇల గల ప్రాణికోటులకు నెల్ల నొకానొక పద్య మల్లినన్ గలుగును గోట్ల సంఖ్యకు నగణ్యము గాగను వృత్తముల్ జగంబులు పదునాలుగున్ దనదు పొట్టను బెట్టిన దేవుడైన దా నిలుపగ నేర్చునే? అటుల నిల్పెడు వాడును గల్గెనేని నిస్తులు డతడౌ నటంచు మది దోచదు పాప మదేమొ కాని' అని సమాధానము చెప్పిరి. (నానారాజ సందర్శనము)

సభలో నెవ్వ రేమడుగుదురో, యే వృత్త మడుగుదురో ముందుగ తెలియదు కనుక, సకల విషయములకు సకల వృత్తములందు పద్యములు కట్టికొని గట్టి చేసికొని పెట్టికొని యుండవలెను. నల్లి ముక్కును గుఱించి చక్కని పద్యము చెప్పుమని యడుగవచ్చు ననుకొందము కందమా? ఆట వెలదియా? తేట గీతియా? సీసమా? చంపకమా? ఉత్పలమా? మత్తకోకిలయా? మహాస్రగ్ధరయా? మఱియెన్నో ప్రహతవృత్తములున్నవి కదా! రకమున కొకపద్య మల్లి పెట్టికొన వలెను సరే ఇంతయు సిద్ధపఱచికొని యుంతగా, ఎవరో నల్లి కాళ్లను గుఱించి లయగ్రాహి పద్య మడుగుదురు అపుడేమి గతి? 'అయ్యా! మా చిల్లర దుకాణమున మత్కుణ ఘోణ పద్యమున్నది కాని మత్కుణచరణ పద్యము లే' దనవలెనా? కష్టించి సకల విషయములును సకల వృత్తములలో తయారు చేసికొని నిత్యోప స్థితముగా నుంచికొను మహానుభావు డుండునా? ఉండినచో కుక్షి నిక్షిప్త చతుర్దశ భువనుడగు శ్రీమన్నారాయణుని కంటె ఘనుడనవలెను.

అవధాన పద్యములు సద్యోనిర్మితములు కావను సందేహము తొలుత సంస్కృత విద్వాంసులకే కలిగినది. సంస్కృతమున వాదీంద్రకవి వ్రాసిన 'కవి

కర్పటిక' అను చిత్ర కావ్యమున్నది. అది సభలలో శ్లోకము లాశువుగా జెప్ప నుత్సహించువారి యుపయోగార్థము రచింపబడినది. దాని మహిమ యిట్లు చెప్పబడినది:

'యత్నా దిమాం కంఠగతాం విధాయ
శ్రుతోపదేశా ద్విదితోపదేశః
అజ్ఞాత శబ్దార్థ వినిశ్చయోఽపి
శ్లోకం కరోత్యేవ సభాసు శీఘ్రమ్.' (కవి కర్పటిక )

కవి కర్పటికను కంఠస్థము చేసి, ఓనమాలురాని చవట కూడ సభలో ఆశువుగా శ్లోకాలు వచింపగలుగునట. రాజసభకు బనికి వచ్చునేమో కాని, ఆ 'కర్పటిక' అవధానసభకు బనికిరాదు.

తెలుగున మన కట్టి గ్రంథము గూడ లేదు.

వివాహాశీస్సులు, అష్టాదశకావ్యవర్ణనలు, ప్రశంసాభిశంసాత్మక పద్యములు వేలవేలు గల గ్రంథము శ్రీ కొప్పరపు సోదరకవులు తయారు చేసియుండి, సమయోచితముగా నుపయోగించుచుండిరని ప్రతీతి కలదు. కాని, వా రాగ్రంథము ప్రకటింప లేదు. ప్రకటించియుండినను అది కేవలాశుకవితాప్రదర్శన సభలకు పనికి వచ్చునేమో కాని, అవధాన సభలకు పనికిరాదు.

అవధాని యప్పటి కప్పుడే ప్రశ్నానురూపముగా క్రొత్త పద్యము కట్టి యుగ్గడించును. ఈ కార్యము దుర్ఘట మని తలచువారి అక్షేపణ ఆక్షేపణ కాదు. అభినుతియే.

శ్రీ వేంకటరామకృష్ణకవులు తమ కవితాధార చూచి, 'ఇది ఆశుప్రోక్తము కాదు. ప్రాత పద్యములు కంఠస్థము చేసి చదువుచున్నారు' అని సభ్యులు సందేహించవలెనని చెప్పిరి.

'పిసర వోఁకుండగ గవిత్వము జెప్పితి మేని, 'యిట్లనా
యాసముగా రచింపగలరా? యెవరేనియు, నింటియొద్ద మున్
వ్రాసిన పద్యముల్ చదువ వచ్చు' నటంచును దోచగావలెన్.

(రాజానురంజనము. పుట. 4)

ఆంధ్ర వాల్మీకి శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు కొప్పరపువారి యవధానవిధానము నభినుతించుచు బలికిన పద్యము తదభిప్రాయము బలపఱచు చున్నది

కం. తడయరు ప్రశ్నం బడిగిన
దడవరు పల్కులకు గాగ దడబడ రెపుడున్
నొడవుల మిడుకరు తోపక
వడివడి వచియింత్రు మున్ను వల్లించి నటుల్.

(కొప్పరపుకవుల యశోడిండిమము)

—: o :—

# అవధానమునకు కొన్ని గుర్తు లుండునా?

ఉపాసనాబలము వలన అవధానము చేయనగునని భావించువా రెందరు న్నారో, వారికి నాలుగు రెట్లమంది కొన్ని గుర్తుల వలన అవధానము చేయనగు నని భావించు వారున్నారు.

శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారు అవధానులకు గుర్తు లుండునని యభిప్రాయపడిరి ఆటనట ప్రకటించిరి.

శ్రీ నందగిరి శేషగిరిరావుగా రవధానవిద్యకు అవసరమగు గుర్తులు కొన్నింటిని గల్పించి తద్విద్యార్థుల కుపకరింపవలెనని యొక గ్రంథము వ్రాసిరి. 1913 సంవత్సరమున, 'ఆంధ్రవాణీ రత్నమాల' సుమారు 160 పుటల క్రౌన్ సైజు గ్రంథమును బ్రకటించెను. దానిపేరు 'అవధాన దర్పణము'. ఆ గ్రంథ మును జూచి శ్రీ శేషాద్రి రమణకవులు 'శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారి వంటి విద్వాంసులు 'గుర్తులుండు' నని వ్రాయుట గణనీయము కాదు కాని, నందగిరి శేషగిరిరావుగారి వంటి యవధానులు వ్రాయుట చింత్య' మనిరి.

(అవధాన మంజరి. తొలిపలుకులు.)

శ్రీ శేషగిరిరావుగారి వాద మిది:

'ఒకసారి విన్నతోడనే నూఱుసంగతులు జ్ఞప్తియందుంచుకొనగల శక్తి కేవల చిత్తైకాగ్ర్యము వలనం గలుగ నేర్చునా? కలుగుననుట కల్ల. దానితోబాటు మనుష్యమాత్రుడు ఏ యాధారము లేకయే నూఱువిషయములు వరుస దప్పకుండ బుద్ధి యందిముడ్చుకొనుటయు కల్లయే' (అవధాన దర్పణము పుట 8)

శేషగిరిరావుగారు శతావధాన మొనర్పదలచి, నూఱు గుఱుతుల జంత్రి నొకదానిని తయారు చేసికొనిరట. ఆ జంత్రి కంఠస్థము చేసికొనిరట దాని సాయముతోనే కృతకృత్యులైరట.

రావుగారి గుఱుతుల జంత్రి స్వరూప మిట్టిందును:

100 నామములు వ్రాసికొని, ప్రతి నామమునకు తత్సంబంధినామములు కొన్నిటి గూర్చికొని, మొదటిది స్థిరనామమని, తత్సంబంధులు శాఖానామములని గుర్తించి కంఠపాఠము చేయవలెనట.

**ఉదాహరణము :-**

1. రాముడు. ఇది స్థిరనామమట.

శ్రీరాముడు, బలరాముడు, పరశురాముడు, రామారావు, రామయ్య, రాఘవరావు అనుపేళ్లుగల యిప్పటి మనుష్యులు శాఖానామములట.

88. నక్షత్రములు. స్థిరనామమట.

చుక్కలు (అశ్విన్యాది) ఆభరణ విశేషములు, బృహస్పతి మొదలగు గ్రహములు శాఖానామములట.

64 పాము. స్థిర నామమట.

సర్పజాతులన్నియు (పెంజేరు, నల్లత్రాచు మొదలగునవి) ఆదిశేషుడు, శేషయ్య, అనంతం మొదలగు నరులు- శాఖానామము లట

85. చింతపండు. స్థిరనామమట

చింతపండు, చారు, పులుసు - శాఖానామములట.

99. రోలు స్థిరనామమట.

రోలు, దీనిలో నూరునట్టివి శాఖానామములట.

100 రోకలి. స్థిరనామమట.

దీనితో దంచునవి శాఖానామము లట.

ఒకటి నుండి నూఱు వరకు తాను కూర్చిన స్థిరనామ శాఖానామముల జంత్రి కంఠస్థముగా నున్నచో, శతావధాన మవలీలగా చేయవచ్చునట.

నూఱు పేరులున్నవి కదా, నూటిలో మొదటిది రాముడు. రామునకు శాఖానామములు కొన్ని కల్పింపబడినవి. ఆ శాఖల కుపమానములు కొన్ని సందర్భోచితముగా నవధానియే కల్పించికొనవలెను.

శతావధానమున ప్రథమసంఖ్య రాముడు. శతతమ సంఖ్య రోకలి- ముసలము. తొలి పృచ్ఛకుడుగాని. తుది పృచ్ఛకుడు గాని యే విషయ మడిగినను వారి ప్రశ్నములను అటు రామునకో యిటు రోకలికో యన్వయించి కథ యల్లి పెట్టుకొనవలెను.

ప్రథమ పృచ్ఛకుడు సంజయగాంధి వైభవము వర్ణింపగోరె ననుకొందము. అపుడీ రామ శబ్దపు గుంజకు సంజయగాంధి ప్రశ్నము కట్టివేయుటెట్లని తెల్ల మొగము వేయగూడదు. తుపాకిగుండు తగిలి 'రామరామ' యనుచు ప్రాణములు వదిలిన గాంధి మహాత్ముని మనుమడు అని సంధించికొనవలెను. ఇది ప్రశ్న సంబంధి కథ. ఇదేవిధముగా పృచ్ఛకు దేవృత్తమును గోరెనో ఆ వృత్తము పేరు ముద్రాలంకార న్యాయమున వచ్చునట్లొక కథ, పద్యమున మనమే ప్రాసాక్షరము నిక్షేపింతుమో దాని నెఱుగుటకొక కథ, అప్పటి కప్పుడల్లికొని ఆ గుంజకే కట్టి పెట్టవలెను ఈ విట్టిపొట్టి కథలు చమత్కార ప్రధానములుగా నుండవలెను. చమత్కారము కొఱవడినచో చప్పున జ్ఞప్తికి రావట.

శతావధాన పృచ్ఛక పంక్తిలో చతురశీతితమ పృచ్ఛకుడు 'కైకేయి శ్రీరాము నడవికి బంపించుట న్యాయమా? కంద పద్యమున జెప్పు'డని కోరెనను కొందము.

జంత్రి ప్రకారము 84వ సంఖ్య చింతపండు. దానిశాఖలు చారు, పులుసు. కైకకు శ్రీరామునకు చింతపండుతో ప్రసక్తి కలుగదు. అడవికి చింతపండు నకు కొంచెము చుట్టరికమున్నది. ఏమి చేయవలెను? ఏదోఒకటి చేయక తప్పదు.

సద్యస్కల్పనతో కథ అల్లుకొనవలెను అదెట్లన-'చింతపండు' నుండి 'చి' చిన్న భార్య కైకేయి, 'ం' పట్టాభిషేకోత్సవమునకు సున్న చుట్టించి, 'త' తన

తనయునకు పట్టము గట్టింప నెంచి, 'పంతు' వంటి వృద్ధుడగు దశరథునకు ప్రాణ సంకట స్థితి కల్పించి, కందకు లేని దురద చేమ కెందుకని మిన్నకుండక, భరతు నభీష్టమునకు నిజాభీష్ట మను ప్రాసమని సాధించి, అడవికి సీతారామలక్ష్మణులను బంపించెను. స్వార్థపరులకు తమ పోకడ న్యాయమని తోచును గదా!

ఇట్లు చింతపండు నందు 84 వ సంఖ్య, అయోధ్యాకాండ కథ, కందచేమ సామెతవలన కందపద్యము, మకారప్రాసము-ఇన్నిటిని బిసికి స్మృతి పథమున బెట్టికొనవలెను ఇదె దర్పణకారుని మతము తన్మతానుసారముగా మీది విషయము కల్పింపబడినది.

నవతితమ ప్రశ్నమునకు మన కల్పన వలదు, దర్పణకారుడే సూచించిన కల్పన చూతము. విషయము విస్పష్టమగును.

99. జోలు. దానిలో నూఱబడునవి దాని శాఖలు

ప్రశ్నము-'ఆధునిక బ్రాహ్మణులు దేశమున జేయవలసిన మేలు.'

"కథ - జోటిలో బోసి మినప పప్పును రుబ్బుచున్న గిరయ్యయను బ్రాహ్మణుడు నన్ను జూచి, చూచితిరా? పంతులుగారూ! నా తెలివి నేడు జూడండి. గారె లెట్లు వండెదనో. మైదాపిండితో బొబ్బట్లుటుల జేసెదనో యని పలుక, ఇప్పటి బ్రాహ్మణులు జేసెడి మహత్కార్య మింతవరకు వచ్చినది. దీనికి నీవే కాని మేము సంతోషింపము అని నేను మాఱుపల్కితిని"

(ఇందులో జోటికి, మైదాపిండికి, ఇప్పటి బ్రాహ్మణులకు క్రీగీతలు పెట్టిరి.)

జోలు 99 నెంబరు చెప్పును. మైదా మత్తేభమును జెప్పును. ఇప్పటి బ్రాహ్మణులు వ్యర్థవిషయమును జెప్పును. 'మహత్కార్యము' మవర్ణ ప్రాసము జెప్పునట.

కోటికడ గూర్చుండి పిండి రుబ్బు వైదిక బ్రాహ్మణుడు భోగియగు నియోగి బ్రాహ్మణుడు, వారి వాలకములు, ఉక్తిప్రత్యుక్తులు, మనఃఫలకమున కెక్కించికొని భద్రపఱచికొనవలెను. ఈ కథాంతిక కదిపినవో అసలు డొంక తోచునట

పృచ్ఛకు దేసంఖ్యవాడో, ఆ సంఖ్య కోడిని జెప్పునో పేడిని జెప్పునో, వాని యక్కరములు బట్టికొని ప్రశ్నానుకూల చమత్కారకథ కల్పించుకొనవలెను కల్పిత కథలో ప్రథమచ్ఛేదము ప్రశ్నస్వరూపమును, ద్వితీయచ్ఛేదము వృత్త స్వరూపమును, తృతీయచ్ఛేదము ప్రాస స్వరూపమును చేటలో వెలగపండ్లను బలె స్ఫుటముగా జూపగల త్రిధావిభక్త కథాసురక్త వాగ్బంధము నవధాని నిమిషార్ధ కాలమున మనఃకమలమున గల్పించుకొనవలెను. తత్కల్పనము సుస్థిరముగ జ్ఞప్తియందుంచికొనవలెను.

గుర్తు లనగా నివియేనట.

ఇట్టి గుర్తుల బలముతోనే యెల్లరు నవధానములు చేయగలుగుచున్నారట. ఇది నందగిరి శేషగిరిరావుగారి సిద్ధాంతము.

వాస్తవమున కిట్టి గుర్తుల పద్ధతి కనిపెట్టి ప్రచారము చేసినవారు విదేశీయులే.

**ROBERT H. NUTT** అను విద్వాంసు డొకగ్రంథము వ్రాసి ప్రకటించెను. దాని పేరు **"How to Develop a Good a Memory"** అతడును, శతావధాన ప్రయోజన ముద్దేశించి కాదు కాని, నూఱుపేరుల పట్టిక నొకదానిని తయారు చేసెను వాని నతడు **key words** అన్నాడు

1. **Alarm Clock**, 2. **Trousers**, 3. **Chair**, 4. **Table**, 5. **News Paper**, 6. **Automobile**, 7. **Policeman**, 8. **Revolving door**, 9. **Mail Box**, 10. **General-Delivery Window**, 11. **Side walk**, 12. **Elevator**, 13. **Floor**, 14. **Doctor**, 15. **Bed** ... ....... 29. **Pigs** .... ... 81. **Hotel** .. ... 100. **Sailfish**.

ఈ పట్టిక కంఠస్థము చేసికొన్నచో, తత్సహాకారమున నేదియైన జ్ఞప్తియందుంచికొనవచ్చునట ఉదాహరణము.

1. London, 2. New York, 3. Tokyo, 4. Berlin, 5. Moscow- ఇవి పంచ మహా నగరములు వీనిని వరుసగా జంత్రిలోని

1. Alarm Clock, 2. Trousers, 3 Chair, 4. Table, 5. News Paper అను నామములకు జోడించికొనవలెను.

అయిదవది Moscow. దీనిని అయిదవ Key word అగు Newspaper తో సంధించు పెట్టన-"Your news paper, the Five Star Final, is covered with moss and a cow is lying on top of it, chewing at the moss and eating up the paper. This is a moss-cow. The head line on the news paper reads Five-Year Plan for Moscow-News-paper".

ఇది పద్ధతి. News paper ను పట్టుకొని Moscow పట్టణము జుట్టిపెట్టికొని సాధించుట.

ఈ మహాశయు డిట్లే పెద్ద పెద్ద సంఖ్యలు గుర్తుపెట్టుకొనుటకు గూడ సూత్రమును గూర్చెను.

7189 ఇదియొక టెలిఫోను నెంబరు. అతని జంత్రిలో ఈ సంఖ్యలకు క్రమముగా 7. Policeman 1. Alarm Clodk 8 Revolving door 9. Mail Box ఉన్నవి ఈ నాలుగింటికి పరస్పర సంబంధము లేదు. సంబంధము కలుగులాగున చమత్కార కల్పన యొకటి చేసికొనివలెను ఆ కల్పనచే సిద్ధించు దృశ్యము మనఃఫలకమున నచ్చొత్తినట్లు చెదరని ముద్రయై భాసిల్లవలెను. అపుడది స్థిరపడును. ఆంగ్లేయ గ్రంథకర్తకర్తృక కల్పనాచమత్కారము చూడుడు.

"Close your eyes and see a policaman throwing an Alarm clock through a revolving door and hitting a mail box Visualize every bit of the scene clearly-the policeman's brass buttons dazzlingly bright, the shattered glass as the alarm clock crashes through the revolving door and the broken mail box surrounded by spilled letters. If the image is vivid enough you will never forget the number 7189."

కల్పన చేసికొనుటకు 30 సెకనుల కాలము చాలునట.

ఇతడును మన శేషగిరిరావుగారును, గ్రంథగత విషయములను బట్టి సగోత్రు లనుటకు సందియము లేదు.

**(How to Develop a good Memory-By ROBERT H NUTT)**

ఈ గుర్తులు మనసులో నిల్చునా ?

ఒకడు మహా నగరమున నొకచో బస చేసెను. బసనుండి బయటకు వెళ్లి తిరిగి వచ్చుట కష్టమని యొక యుపాయ మవలంబించెను. చేతిసంచినిండుగ చిల్లర నాణెములు సంగ్రహించికొని, దారి పొడవున మలుపుల కడ చల్లుకొనుచుబోయెను. తిరిగి వచ్చునపుడు జనసమ్మర్దవీథులలో తాను బోసిన కాసులే తన వచ్చిన త్రోవ జూపగలవని యతని విశ్వాసము. పోసిన కాసులు కాశిలో గూడ నుండవు గదా. ఆ గుర్తుల నమ్ముకొని శతావధాన మొనరింపగడగు కవి, ఈ కాసులు నమ్ముకొని మహానగరవీధులలో గమ్యము జేరదలచు ప్రవాసి యేకరాశివారు.

సముద్రగర్భమున శతసహస్రయోజనములు ప్రయాణించి, పరస్థలమున గొంతకాలము నివసించి, తిరిగి సరిగా స్వస్థలమునకేగు మత్స్యజాతులున్నవి. ఆకాశమునందు నిరంతర ప్రయాణము చేయుచు, ఖండాంతరములకేగి, అక్కడ గొంతకాలముండి తిరిగి స్వస్థలమునకు సూటిగాబోవు పక్షిజాతులున్నవి. చేపలు దారి పొడవున జలములలో నొకరకమైన ద్రవపదార్థము విసర్జించుచు వచ్చునని, తిరిగి పోవునపుడు ఆ ద్రవ పదార్థ గంధమునుబట్టి చక్కగా బోగలుగునని పరిశో

ధకు లూహించుచున్నారు. పక్షులును అదేపని చేయునని యూహ. జలములలో, గాలిలో ఎంత సంక్షోభము చెలరేగుచుండును! చేపలు, పిట్టలు విసర్జించిన తానవ గంధరేఖ అక్షతముగానిల్చి వానికి షణ్మాసానంతరము ద్రిక్పదర్శకముకాగలుగునా? అవును. ఆ గుఱుతులు జలతరంగవాయుతరంగ ప్రహతములై జర్జరితములు కావు. రూపఱిపోవు. అవధాని యేర్పఱచికొనెడి విచిత్రపు గుర్తులు గూడ ఏతాదృక్స్థితి మంతములందురా ?

'వాడు జ్వరముతో చావలేదు. యంత్రాలు మోయలేక చచ్చినా' డని యొక నానుడి కలదు. ఈ విధాన మనుసరించు నవధానులు పృచ్ఛకుల చేతిలో చావరు: తాము త్రవ్వికొన్న విపరీతపు గథల గుర్తుల గర్తమునబడి గిలగిల తన్నికొని చత్తురు.

శతావధాన ప్రశ్నము లెక్కడ! పృచ్ఛక జనసంఖ్యను బట్టి పట్టికనుండి కైకొను స్థిరనామ మెక్కడ! దాని శాఖానామములతో కథ లింపుగా నల్లికొను టెక్కడ! కథలో వర్ణ్యవిషయ వృత్తనామ ప్రాసపద్య విశేషములు పొదిగించు టెక్కడ! నిమేషార్ధ కాలకల్పితమైన యేతత్సర్వ కథాబంధము లన్యోన్యసాంకర్య మంటి అస్తవ్యస్తములు గాక, ఆలానబద్ధ స్తంభేరమ క్రమమున, బాదుకొని మనోఽంబరమున గట్టిగా నిలుచు టెక్కడ! పలుకక్క.

EUSTACE MILES అను పాశ్చాత్య పండితు డిట్లు హెచ్చరించెను:

"Do not apply any system if you can do without it. Do not apply any system if it does not suit you as individual." (MEMORY SYSTEMS)

'నీవు స్వయముగా నిర్వహింపగలిగినపుడు ఇతర పద్ధతి నెత్తిన బెట్టికొన వలదు వైయక్తికముగా నీకది యనువుగానపుడు దాని జోలికి బోవలదు.'

—:o:—

# అవధాని పరంపర

అద్యతనావధానవిధానమునకు శ్రీకారము చుట్టిన మహామనీషి శ్రీ మాడభూషి వేంకటాచార్యులవారు.

ఆచార్యులవారు ఆదికవి వాల్మీకి వంటివారు. కవికులగురుడు కాళిదాసుడు 'మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః' అన్నాడు. (రఘువంశము 1-4) త్రోవ యేర్పఱచినవాడు గురుడు : ఆ త్రోవ వెంబడి నడిచినవాడు శిష్యుడు.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరు లాచార్యులవారి త్రోవ ననుసరించిరి.

వీరి మాటలే పద్యములు. పద్యములే మాటలు. వీ రెక్కడ బస చేసిన అక్కడ గుంపులు గుంపులు. దర్శన మబ్బిన చాలు ననుకొనువారెందరో యుండిరి. ఆ తిరుపతి వేంకటేశ్వరుల కెందరు భక్తులున్నారో, యీ తిరుపతి వేంకటేశ్వరుల కందరు శిష్యు లున్నారు శిష్యులలో నూటికి తొంబది తొమ్మిది మంది యేకలవ్యశిష్యులు. అందరిలో శిరోమణి శ్రీ శివరామశాస్త్రిగారు. వృద్ధులైన గురువు లాయనపై నవధానకవితాసామ్రాజ్యభారము నిలిపిరి.

శ్రీ శివరామశాస్త్రిగారును వృద్ధులై, తాళ్ళపూడి శతావధానసభారంభమున-

చం. తిరుపతి వేంకటేశ్వరులు దేశము లెల్లను ద్రిప్పి త్రిప్పి య<br>
బ్బురముగ నాదువీపునను మోపిన మోసితి, దాన జేసి దు<br>
ర్భరమగు నుబ్బసంబు తన భారము మోపిన మోయుచుంటి నీ<br>
బరువిక పీడ నెంచెద నెవండు కనంబడ డోవధానమా! (అవధాన భారతి.)

అని నిర్వేదము వెలిబుచ్చిరి.

ఊరూర నుల్లిగడ్డ కొకడుగా నవతరించి, అహంబ్రహ్మీభవించి, ఆశుకవిత గుప్పుచు, నవధానచక్రము ద్రిప్పుచు నట్టహాసము చేయు నుద్దండులు తండోప తండములుగా నుండినను వారెవరును 'ధురంధరులు' కారని శాస్త్రిగారి తలంపు

బెజవాడ శతావధాన సభలో వారు నుడివిన సీసము జదివిన నొదలు జలదరించును.

సీ. శతవధాన విధా విశారదుండౌచు భా
రతము రచించు 'ధర్మన్న' వలన
వసుచరిత్రాఖ్యప్రబంధమ్ము వ్రాసి, వి
స్ఫూర్తిమై దగు 'భట్టుమూర్తి' వలన
అతులితమైన మా యాస్థాని కెక్కిన
సరసుండు 'వేంకటాచార్యు' వలన
రావు గంగాధర రామభూపాలు వి
ద్వరులు 'దేవులపల్లివారి' వలన

సరస తిరుపతి వేంకటేశ్వరుల వలన
జాలు వాఱిన యవధాన జాహ్నవీ ప్ర
వాహ మింతింతయై పాఱి, వఱలి యిపుడు
కాకవుల పాలబడి 'సైదు కాల్వ' యయ్యె. (అవధాన భారతి)

ఈ పద్యమున బేర్కొనబడిన యవధానులలో 'సరసుండు వేంకటాచార్యుడు.' 'సరస తిరుపతి వేంకటేశ్వరులు' విశిష్టులు. సరస శబ్దము కేవలము యత్యర్థము నిలుపబడినది కాదు. అవధాన గంగను రాజాస్థాన రంగమున దింపిన మాడభూషి భగీరథుడు భాగీరథిని మ్రింగి, లోకమున వెలయించిన చెళ్లపిళ్ల జహ్నువు. ఆ జాహ్నవి చిక్కి కృశించి, నేడు 'సైదు కాల్వ' యైనదట.

మాడభూషి వారి వెనుక, వారి శిష్యులమని పేరు చెప్పికొని ముందుకు వచ్చిన యవధాను లెవ్వరును లేరు.

దేవులపల్లి సోదరుల పేరు నిలుపుటకు రంగ మెక్కిన ఛాత్రులును గనరారు.

కాగా, తిరుపతి వేంకటేశ్వరుల కాలమున వారితో పోటీపడిన వారున్నారు, వారిలో ముఖ్యులు - శ్రీ కొప్పరపువారు, శ్రీ వేంకట రామకృష్ణ కవులు. కొప్పరపు సోదరకవులు 'ఆశుకవి చక్రవర్తులు' అనెడి బిరుదముతో పైకి వచ్చిన వారు. అవధానవిద్యయం దతిరథులు కారు. వారికి చట్టులే లేనట్టులున్నది. వేంకట రామకృష్ణుల యంతేవాసుల యడయు బొడయు నగుపడదు.

## అ వ ధా ను లె వ రు ?

ఎక్కడనో యేదోయొక కళాశాలలో, ఒక్కసారి పర్యవేక్షకపండితసమక్షమున బి.ఏ. పరీక్ష వ్రాసి, డిగ్రీ సర్టిఫికెటు సంపాదించుకొన్న వ్యక్తి, యావజ్జీవము బి.ఏ.గా చెలామణియైనట్లు, ఏకైకావధానప్రదర్శనమాత్రమున 'అవధాని' బిరుదము దగిలించికొని యలరారు నకుతోభయమహాశయు లున్నారు. (శయము- చెయ్యి. మహాశయులు = పొడుగుచేతులవారు.) అట్టివారిలో గొందరు గట్టివారును ఉండవచ్చు. అందరి పేర్ల పట్టిక తయారుచేసి ప్రకటించుట దుర్ఘటము.

'అయ్యా! నేను అవధానుల నామధేయముల పట్టిక కూర్చుచున్నాను. అవధానులగువారు తమ అడ్రసు తెలుపవలె. నని దినపత్రికాముఖమున నభ్యర్థించినచో కొల్లలుగా నుత్తరములు వచ్చును. ఉత్తర మేయూరినుండి వచ్చెనో ఆ యూరికి బోయి విచారించినచో, 'ఆ వ్యక్తి యవధానియని మాకు తెలియదు. అవధాన మెక్కడ చేసెనో మేము చూడలే' దందురు నూటికి నూఱు తేలిపోవునని కాదు. ముప్పాతికకు పైగా తేలిపోవును. కనుక పట్టిక గూర్చుట పొసగదు.

ఒక్క యవధానప్రదర్శనముతో నొక యవధాని యియత్తె ల్లము కాదు. పది యవధానముల పద్యముల సంపుటి వెలువడవలెను. అప్పుడు సరకు బయట బడును ఈ యవధాని చేతిలో శబ్దార్థసంపద యెంతయున్నది? ఇతని శయ్య

యెట్టిది? రీతి యెట్టిది? కల్పనాశక్తి, శాస్త్రపరిచితి, వాక్చమత్కృతి - యేది యెంత మాత్రమన్న విషయము నతని పద్యములే వెల్లడించును.

అవధానపద్యగ్రంథసంపుటములను బట్టి అవధానుల నామధేయములు నిర్ణయించికొనవలెను. తమకు తామే 'అష్టావధా'ని యని 'శతావధాని' యని పేరు పెట్టికొన్నవారుందురు. అట్టివారి పేరు పట్టిక కెక్కించుట తగదు.

శిష్యభుజస్కంధమున బరువు మోపి, అశ్వాసము బొందు నదృష్టము శివరామశాస్త్రిగారికి గలుగలేదు. తరువాత వారు సన్న్యసించిరి.

అవధానులు పుట్టుచుందురు. ఛందోవాణి నృత్యము చేయుచుండును. ఎవడో యొకడు వ్యుత్పన్నుడై పైకి వచ్చుచుండును. ఈ రీతిగా నవధాని పరంపర అవిచ్ఛిన్నముగా సాగుచుండును. ఆగదు.

— o :—

# ఉ ప సం హా ర ము

క్రీడార్థమో వాదార్థమో విద్వాంసులు తమ చేతిలోని విద్యల ప్రదర్శించుట ప్రామినుకులు వెలుగునకు వచ్చిన నాటనుండి కలదు.

వాత్స్యాయనుడు పేర్కొనిన చతుష్షష్టి కళలు గఱచుట పురుషార్థపరమ ప్రయోజనమని ప్రాచీనుల మతము.

చతుష్షష్టి కళానిష్ణాతయై శీల రూప గుణాన్వితయగు వేశ్య గణికాప్రశస్తి బొంది, మహాసభయం దుచితాసనగౌరవము బొందునని వాత్స్యాయనర్షి వచనము. కళాకుశలయు, శీల రూప గుణాన్వితయునగు మధురవాణి మహాజనసభయందు, మహారాజహృదయమునందు పీఠము సంపాదించుకొనెను. (శీలమ్—సుస్వభావః)

చతుష్షష్టి కళావృక్షమునుండి వాఙ్మయశాఖ వేఱుపడి, చతుర్విధ కవితా వృక్ష రూఢిగాంచెను. చతుర్విధకవితావృక్షమునుండి ఆశుకవితాశాఖ విడివడి, అవధాన విద్యావృక్షము వెలసెను.

అవధాన విద్యావృక్షము ధారాశాఖము, ధారణామూలము, ధైర్య ప్రకాశము.

అభినవ పండితరాయ విఖ్యాతుడు శ్రీ మాడభూషి వేంకటాచార్య విద్వచ్ఛ్రేష్ఠుడు మేధిష్ఠుడు. తదుపజ్ఞయే అవధాన విద్యామూలబలము పుంజికొనజేసెను.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు ఏత దవధానవిద్య తెలుగునేల నాలుగు చెఱగుల బహుశాఖాపంచానపంతుకితమైన నైయగ్రోధ మహావృక్షముగా విస్తరిల్లజేసిన కారణజన్ములు.

ఆ కింకవీంద్ర ఘటాపంచాననులు తీర్చిన మార్గమే సకలోపాధేయమై సన్నుతి పాత్రమైనది.

అవధాని గడియకు నూఱుపద్యములు ధారాళముగా జెప్పగలడు. దినమునకు ఒక ప్రబంధము నక్రమముగా రచింపగలడు.

అష్టావధానము కంటె శతావధానము ప్రకృష్టవిద్య. అష్టావధానులలో నూటికొకడు శతావధాని యుండును.

అష్టావధాని కావించు అష్టావధానము కంటె శతావధాని కావించు అష్టావధానము రమ్యతరముగనుండును

అవధానపద్యములు చప్పగా నుండుననుట అర్థములేని మాట. తత్కాలమున కవికి తోచెడి కల్పన, కల్పనకు జీవమువోయు నుక్తివైచిత్రి అచ్చముగా వైయక్తికములు. తత్కవి సంస్కారముబట్టి యుండును ఒక కవియొక్కకూర్పు నిసర్గమధురముగ నుండును : ఒక కవియొక్క కూర్పు పుల్ల విఱిచినట్లుండును. పద్యము చప్పబడుటకు నిలుకడ లేమి కారణ మనుకొనుట పొరపాటు. నిలుకడ సాధించినవాడే కదా అవధాని! సత్కవి కృతావధానమునందు 'శతమున కన్ని పద్యములు చక్కగనుండు నసంశయమ్ముగన్.'

అవధానవిద్య సకలవిద్యలకు శేఖరీభూతమైనవిద్య.

ఈ గ్రంథమున అష్టావధాన శతావధాన విధానములు, తన్నిర్వహణ సంబంధి సాధకబాధకవిషయములు మూలముట్టుగా పరిశీలింపబడినవి.

తిరుపతి వేంకటకవుల అష్టావధాన విధాన 'మిద మిత్థ'మని సోపపత్తికముగా నిరూపింపబడినది.

ధారణమాతృకా విషయవిశేషములు అనేక గ్రంథములనుండి గ్రహింపబడి చర్చింపబడినవి.

అవధాన విద్యారంగమున నా గడించిన పాతికయేండ్ల అనుభవపరమార్థము కనువెలుగుగా, అవధానిక వాఙ్మయము యథాశక్తి శోధించి, నా బుద్ధికి అందిన మట్టుకు గ్రహించి యీ సిద్ధాంతగ్రంథము నిర్మించితిని.

ఇది మత్కృషిఫలము. సదసద్వ్యక్తి హేతువులు సహృదయవిద్వన్మణులు గుణదోషములకు ప్రమాణము,

స్వస్తి

—: ૦ :—

# ప్రసక్త గ్రంథ సూచిక

అప్పకవీయము.

అభిజ్ఞాన శాకుంతలము.

అమరకోశము. లింగాభట్టీయ గురుబాలప్రబోధికా సహితము.

అర్క ప్రకాశము. రావణకృతము.

అవధాన దర్పణము. నందగిరి శేషగిరిరావు.

అవధానాదర్శః. పిశుపాటి చిదంబరశాస్త్రి.

అవధాన భారతి. వేలూరి శివరామశాస్త్రి.

అవధాన మంజరి. ప్రతాప వేంకటేశ్వరకవి.

అవధాన యాత్ర. కాశీ కృష్ణాచార్యులు.

అవధానవాణి. పులివర్తి శరభాచార్యులు.

అవధాన సారము. రాజశేఖర వేంకటశేషకవులు.
(దుర్భాక రాజశేఖర శతావధాని. గడియారము వేంకటశేషశాస్త్రి.)

అష్టదిగ్గజములు. అష్టదిగ్గజ వర్ధంత్యుత్సవ సమితి.

అష్టావధానము. మంత్రిప్రెగడ భుజంగరావు

ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచిక.

ఆంధ్ర శబ్దచింతామణి· నన్నయ·

ఆంధ్ర సంస్థానములు సాహిత్యపోషణము. ఆచార్య తూమాటి దొణప్ప.

ఆముక్త మాల్యద. శ్రీకృష్ణదేవరాయలు.

ఆముక్తమాల్యదా సంజీవనీ వ్యాఖ్య. వేదము వేంకట రాయశాస్త్రి

ఆశు కవితలు, అవధానములు, చాటువులు డా. కె రామకోటిశాస్త్రి·

ఈనాడు. దినపత్రిక.

ఉత్తర రామచరిత నాటకము. భవభూతి.

ఉదాహరణ వాఙ్మయ చరిత్ర· నిడుదవోలు వేంకటరావు·

ఉద్భటారాధ్య చరిత్ర. తెనాలి రామలింగకవి.

ఉషాపరిణయము. రంగాజమ్మ.

ఏకావళి. విద్యానాథుడు.

ఏకాక్షరీకోశము.

ఔచిత్య విచార చర్చ. క్షేమేంద్రుడు.

కథలు - గాథలు. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి.

కర్ణాటకాంధ్ర సాహిత్య చరిత్ర. రత్నాకర శంకరనారాయణరాజు.

కళాపూర్ణోదయము. పింగళి సూరన్న.

కవిసింహ గర్జితములు. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

కాశిసహస్రము. తిరుపతి వేంకటీయము.

కావ్యాదర్శము. దండి.

కావ్యమీమాంస. రాజశేఖరుడు.

కావ్యాలంకార సంగ్రహము. సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి వివరణము

కావ్యాలంకార సూత్రవృత్తి. వామనుడు.

కాశీ కృష్ణాచార్య సంస్కృత సామ్రాజ్యము.

కాశీ ఖండము. శ్రీనాథుడు.

కిరాతార్జునీయము. భారవి.

కుమార సంభవము. కాళిదాసు.

కొప్పరపు సోదరకవుల అవధానములు. 1. భాగము, 2. భాగము.

గుంటూరు సీమ పూర్వభాగము, ఉత్తర భాగము. తిరుపతివేంకటీయము.

గృహలక్ష్మి. సంచిక.

ఘటికాచల మాహాత్మ్యము. తెనాలి రామకృష్ణకవి

చంద్రాలోకము.

చమత్కార కవిత్వము. గాడేపల్లి వీరరాఘవశాస్త్రి.

చాటుపద్య మణిమంజరి. వేటూరి ప్రభాకరశాస్త్రి సంకలితము.

చాటుపద్య రత్నాకరము. దీపాల పిచ్చయ్యశాస్త్రి.

జయంతి సంచిక.

జయమంగళ టీక. యశోధరుడు.

జాతకచర్య. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

జైమిని భారతము. పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి.

జ్యోతిషవిద్యాప్రకాశిక. ఆకెళ్ల వెంకటశాస్త్రి.

జ్యోతిర్విదాభరణము.

తారాశశాంకము. శేషము వేంకటపతి.

తిక్కన సోమయాజి విజయము వేదము వేంకటరాయశాస్త్రి.

తిరుపతికవి జీవిత సంగ్రహము కవిపుత్రుడు దివాకర్ల వేంకటావధాని.

తెలుగు సమస్యలు. వావిళ్ల.

దశరథరాజనందన చరిత్ర. మఱింగంటి సింగరాచార్యులు.

దశరూపకము ధనంజయుడు.

దక్షిణామూర్తి ధ్యానము. కణ్ణా వేంకట సుబ్రహ్మణ్య వ్యాఖ్య.

దివాకరాస్తమయము. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

నరసారావుపేట అష్టావధాన లఘుగ్రంథము. తిరుపతి వేంకటీయము.

నవ్యాంధ్ర సాహిత్యవీథులు కురుగంటి సీతారామభట్టాచార్యులు.

నాట్యశాస్త్రము. భరతముని.

నానార్థ రత్నమాల ఇరుగప దండనాథుడు.

నానారాజ సందర్శనము తిరుపతి వేంకటీయము.

నా వాఙ్మయమిత్రులు. జేమమళ్ళ కామేశ్వరరావు.

నేనూ మా తిరుపతి. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి.

పండితారాధ్య చరిత్ర పాల్కురికి సోమనాథుడు.

పాండురంగ మాహాత్మ్యము. తెనాలి రామకృష్ణకవి.

పారిజాతాపహరణము. ముక్కు తిమ్మన.

పిసుపాటి చిదంబరశాస్త్రి జీవితచరిత్ర, అవధాన సాహిత్యము.

పెద్ద బాలశిక్ష వావిళ్ళ

ప్రతాపరుద్రీయము. విద్యానాథుడు.
ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము. గణపవరపు వేంకటపతి.
ప్రబోధ చంద్రోదయము. కృష్ణమిశ్రుడు
ప్రబోధ చంద్రోదయ ప్రబంధము నంది మల్లయ, ఘంట సింగయ.
ప్రభావతీ ప్రద్యుమ్న నాటకము తిరుపతిశాస్త్రి, వేంకటశాస్త్రి
ప్రశ్నోపనిషత్తు
బంగారు పద్యములు కొక్కొండ వేంకటరత్నము పంతులు.
బందరు శతావధానము. కాశీ కృష్ణాచార్యులు.
బృహజ్జాతకము. వరాహమిహిరుడు.
బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటువు.
భగవద్గీత.
భరతాభ్యుదయము మాడభూషి వేంకటాచార్యులు.
భారతి. సంచిక.
భావతరంగములు. చిలుకూరి రామభద్రశాస్త్రి.
భీమేశ్వర పురాణము. శ్రీనాథుడు.
భూషణ కిరణావళి రామరాజభూషణ సాహిత్య పరిషత్తు.
భోజరాజ చరిత్రము.
మల్లినాథసూరి జీవితము, రచనలు.
మహిష శతకము. వాంఛేశ్వరుడు
మీగడ తరకలు వేటూరి ప్రభాకరశాస్త్రి
మృచ్ఛకటికము. శూద్రకుడు.
మేఘసందేశము. కాళిదాసు
మేదిని నిఘంటువు.
యయాతి చరిత్ర పొన్నిగంటి తెలగన్న
యాదవ రాఘవ పాండవీయము. నెల్లూరి రాఘవకవి.
యూనాని వైద్య దార్ఢ్యవృద్ధి బోధిని.

రఘునాథాభ్యుదయము గడియారము వేంకటశేషశాస్త్రి.

రఘువంశము. కాళిదాసు.

రామేశ్వర మాహాత్మ్యము. ఏనుగు లక్ష్మణకవి.

లక్షణ దీపిక. వార్తాక రాఘవకవి.

లక్ష్మణరాయ వ్యాసావళి. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు పంతులు.

వరాహపురాణము. నంది మల్లయ, ఘంట సింగయ.

వరాహపురాణము. హరిభట్టు.

వసుచరిత్ర. రామరాజభూషణుడు.

వసుచరిత్ర విమర్శనము. వఝ్ఝల చినసీతారామస్వామి.

వస్తుగుణ దీపిక.

వాత్స్యాయన కామసూత్రములు.

వానమామలాష్టావధాన లఘుగ్రంథము. తిరుపతి వేంకటీయము.

వాల్మీకి చరిత్రము. రఘునాథరాయలు.

విక్రమ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

విక్రమార్క చరిత్రము. జక్కన.

విక్రమసింహపుర మండల సర్వస్వము.

విజ్ఞాన సర్వస్వము. తెలుగు భాషాసమితి.

వేంకట రామకృష్ణ గ్రంథమాల.

వేదాంత పంచదశి. విద్యారణ్యస్వామి

వేమన పద్యాలు.

వేయి పడగలు. విశ్వనాథ సత్యనారాయణ.

వైజయంతి. యాదవప్రకాశుడు.

శంకర విజయము. మాధవాచార్యుడు.

శాంకర బ్రహ్మసూత్ర భాష్యము.

శతావధాన ప్రబంధము. ప్రథమఖండము. సి. వి. సుబ్బన్న శతావధాని.

శతావధాన ప్రబంధము. ద్వితీయఖండము. సి. వి. సుబ్బన్న శతావధాని.

శతావధాన సారము. తిరుపతి వేంకటీయము.
శబ్దభేద ప్రకాశః. పురుషోత్తమదేవుడు.
శబ్ద రత్నాకరము. బహుజనపల్లి సీతారామాచార్యులు.
శబ్దార్థ కల్పతరువు. మామిడి వేంకయ్య.
శారదాధ్వజము. శ్రీవాత్సవ.
శివరాత్రి మాహాత్మ్యము. శ్రీనాథుడు.
శివానంద లహరి. ఆదిశంకరులు.
శ్రీకృష్ణ కర్ణామృతము.
శ్రీకాళహస్తి మాహాత్మ్యము.
శ్రీనాథ కవితాసమీక్ష. చిలుకూరి పాపయ్యశాస్త్రి.
శ్రీనాథ మహాకవి. బండారు తమ్మయ్య.
శ్రీనివాస విలాసము. తిరుపతి వేంకటీయము.
శ్రీమదాంధ్రమహాభారతము. కవిత్రయప్రణీతము.
శ్రీమదుత్తర రామాయణము. కంకంటి పాపరాజు.
శ్రీరామాయణసార కావ్యము. మధురవాణి.
షోడశకుమార చరిత్ర. వెన్నెలకంటి అన్నయ్య.
సంగీత రత్నాకరము.
సంస్కృతి. విజయపురి.
సంస్కృతవాఙ్మయచరిత్ర. మల్లాది సూర్యనారాయణశాస్త్రి.
సకలనీతి సమ్మతము. మడికి సింగన.
సాహిత్య దర్పణము. విశ్వనాథ కవిరాజు.
సాహిత్యోపన్యాసములు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి.
సారస్వత వ్యాసములు.
సుభాషిత రత్నభాండాగారము. నిర్ణయసాగర ముద్రాశాల.
సువృత్త తిలకము. క్షేమేంద్రుడు.
సుశ్రుత శారీరస్థానము.

స్వప్నప్రకాశిక.
స్వారోచిష మనుసంభవము. అల్లసాని పెద్దన.
స్వీయచరిత్రము. కందుకూరి వీరేశలింగము పంతులు.
స్వర్గానికి నిచ్చెనలు. విశ్వనాథ సత్యనారాయణ.
సౌందరనంద కృతిసమర్పణ పద్యములు. కాటూరి వేంకటేశ్వరరావు.
హంస వింశతి. అయ్యలరాజు నారాయణామాత్యుడు.
హర్షచరితము బాణభట్టు.
హరివంశము. ఎఱ్ఱాప్రెగడ.
హరిశ్చంద్రనలోపాఖ్యానము. భట్టుమూర్తి.
హారావళి. పురుషోత్తమదేవుడు.

HISTORY OF REDDY KINGDOMS. BY MALLAMPALLI SOMASEKHARA SARMA. HOW TO DEVELOP A GOOD MEMORY. BY ROBERT H. NUTT. MEMORY-EFFICIENCY AND HOW TO OBTAIN IT. BY J. LOUIS ORTON. REMEMBERING AND FORGETTING. (INTRODUCTION TO PSYCHOLOGY) BY F. R. C. CASSON.

THE HINDU - Daily.

—: o :—

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 14 | రత్నానిపై | రత్నానివై |
| 5 | 21 | ఎఱ్ఱిన్ననే | ఎఱ్ఱిన్నచే |
| 7 | 9 | రాజులలు | రాజులు |
| 9 | 6 | పసంతే | వసంతే |
| 10 | 3 | నేర్చుటలో | నేర్చుటతో |
| 16 | 25 | గాసెక్క | గోసెక్క |
| 17 | 12 | ఉదులు | ఉదుటు |
| 18 | 2 | పోత్ర | ప్రోత |
| 18 | 7 | రన | రస |
| 19 | 7 | నాయ్యక | నాయ్యన |
| 20 | 4 | నుంచి | నుండి |
| 20 | 20 | దిట్టపై | దిట్టవై |
| 22 | 14 | సిగ్గుల | నిగ్గుల |
| 22 | 24 | దుర్భమై | దుర్భరమై |
| 25 | 7 | వెళ్ళపిళ్ళ | చెళ్ళపిళ్ళ |
| 28 | 7 | ద్రాష్మా | ద్రాక్షా |
| 29 | 4 | ఇది | ఇతి |
| 33 | 24 | దానపద్య | ధానవద్య |
| 40 | 26 | గుంటక | గంటక |
| 41 | 8 | నీవు | పీవు |
| 44 | 25 | నుండి | నుడి |
| 51 | 15 | సన్నికర్గా | సన్నికర్షా |
| 52 | 10 | మేద | మేధ |
| 58 | 22 | విద్యుత్తులో | విద్యుత్తుతో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 55 | 13 | ద్వితీయా | ద్వితయ |
| 55 | 14 | లోపమునే | లోపముచే |
| 56 | 8 | రాజర్షిపై | రాజర్షి వై |
| — | 13 | పద్యమున | పద్యమును |
| — | 20 | నుడిగెప | నుడిగింప |
| — | 21 | స్వప | స్వప్ర |
| — | 23 | సర్ప్రయోగ | సర్ప్రయాగ |
| 58 | 26 | భావించు | భాసించు |
| 72 | 5 | ప్రయోగమునే | ప్రయోగముచే |
| 80 | 10 | షఢము | షండము |
| 88 | 11 | తోఽభూత | తోఽనుభూత |
| 85 | 19 | యదృష్టం | యద్దృష్టం |
| — | 24 | వినుడ | వినుట |
| 86 | 4 | తతణితి | తత్ప్రణితి |
| — | 10 | రూకతతతో | రూకతతో |
| 87 | 23 | పెడనవ్వు | వెడనవ్వు |
| 89 | 7 | సలధా | సంధా |
| 90 | 2 | Mackiin | Macklin |
| 92 | 19 | గురి | గుఱి |
| 95 | 18 | కాలదాసు | కాళిదాసు |
| 96 | 14 | ప్రళయాస్తో | ప్రళయాన్తో |
| — | 22 | ఇతం | ఇదం |
| 100 | 7 | Genious | Genius |
| | | Cannot | Can |
| 108 | 12 | సదృశ్యత | సద్యశ్కృత |
| 112 | 23 | యింకా | యింత |
| 113 | 8 | క్లుష్టి | క్లృప్తి |
| 116 | 8 | కాలమునకు | కాలమున |

| పుట | పం_క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 119 | 15 | చేతులు | చేతుల |
| 129 | 10 | సభవతు | నభవతు |
| 137 | 20 | పథముగా | పథమున |
| 138 | 4 | కుందురా | కొందురా |
| 139 | 2 | క్లుప్తి | క్లప్తి |
| 143 | 3 | పయ | పయు |
| 145 | 7 | బిగి | జిగి |
| 146 | 10 | ఘ్లాథ్ర | ఘ్లాథ్ర |
| — | 19 | ఘ్లాథ | ఘ్లాథ |
| 151 | 18 | పడనచో | పడనిచో |
| 154 | 5 | భటాగ్రాజు | భగ్రటాజు |
| 157 | 6 | సమస్య | సమస్య సౌమనస్య |
| 165 | 14 | రౌద్ర | రౌద్రరేఖ |
| 166 | 22 | డిక్కడి | డిక్కడ |
| 170 | 22 | జరగుట్టి | జరగునట్టి |
| 172 | 4 | దిజ్మయమ | దిజ్నియమ |
| 174 | 5 | దుర్వ్యయంబు | దుర్వ్యయంబగు |
| — | 13 | తొచె | తోచె |
| 174 | 24 | శతావధానము | శతావధానసారము |
| 190 | 18 | రామాండక | రామాండ |
| 195 | 16 | దనుజపురం | దనుజపురంబు |
| 198 | 7 | ఆక్లిశము | ఆక్లేశము |
| 201 | 13 | భద్రయ | భద్రాయ |
| 202 | 18 | కత | తల |
| 205 | 6 | కుండె | కుండ |
| — | 14 | దిగర్భముగా | దిగ్భరముగా |
| 206 | 11 | పాలుకులారా | పాలుకులార |
| — | 24 | నితాస్య | సితాస్య |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 207 | 8 | దృతి | ధృతి |
| — | 23 | పీధి | కర్ణపీథి |
| 209 | 13 | పులాక | ూపులాక |
| 211 | 9 | ధ్వన్యు | ధ్వన్య |
| — | 10 | అగస్తర్షి | అగస్త్యర్షి |
| — | 12 | నడ | నజ |
| 212 | 23 | యథావకాశమున | యథావకాశముగ |
| 214 | 13 | నితళ్ళ | సితళ్ళ |
| 215 | 12 | అవధానము | అవధానమున |
| 216 | 19 | వాడికి | వానికి |
| 217 | 4 | కౌరవేశ్వని | కౌరవేశ్వరుని |
| 219 | 18 | కశ్యపాయాదగా | కశ్యపాయాదదా |
| 220 | 2 | పుత్రిక నొసగెన | పుత్రిక నొసగెద |
| 221 | 13 | తత్తఉఋపన్ | తత్తఅపఋపన్ |
| — | 20 | బలరామ:లో | బలరాములలో |
| 222 | 18 | భాషాంతరీరణ | భాషాంతరీకరణ |
| 229 | 25 | నింటి | వింటి |
| — | 26 | భూభృచ్ఛరు | భూభృచ్ఛయ |
| 231 | 17 | పెంచగన్ | వెంచగన్ |
| 234 | 23 | దుపెసలు | దుంపెసలు |
| — | 4 | తొడలలో | తొడలతో |
| 235 | 5 | సరోజంబః | సరోజంభః |
| 237 | 23 | లాఘవము | లంఘించెడి లాఘవము |
| 238 | 12 | చరము | చరణము |
| 247 | 3 | ద్రోపది | ద్రోవది |
| 249 | 3 | హతామి | హరామి |
| 250 | 15 | Ideals | Ideas |
| — | 20 | నాశమి | నాశము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 253 | 2 | కవితామతల్లికి | కవితామతల్లికా |
| — | 7 | దలచు | దలతు |
| 255 | 22 | సలుపరే | సలుపలే |
| — | 24 | గతిపై | గతివై |
| 256 | 8 | వామహస్తము | వామనహస్తము |
| 259 | 18 | ్రవే పెలందులె | ్రవే వెలందులె |
| 261 | 22 | రవి | రపి |
| 262 | 4 | నెడద్రొబ్బ | చెడద్రొబ్బ |
| — | 11 | నాదొనర | వాదొనర |
| 264 | 3 | జనావళికి | జనాళికి |
| — | 5 | తీర్పగ | తీర్పగ |
| — | 24 | ష్మాక | ష్మాక |
| 266 | 13 | సితాంత | నితాంత |
| 267 | 10 | మనేకజీవనలీ | మనేకులుందురు జీవులీ |
| 277 | 5 | బైస్కిలుకున్ం | బైస్కిలునకున్ |
| 279 | 24 | యెఱుంగ | యెఱుగ |
| 280 | 3 | సాచను | సాచచు |
| — | 5 | రీతిగా | రీతిని |
| — | 9 | మనుష్యుల | మనుష్యులు |
| 291 | 2 | న్నధీత్యై | న్యధీత్యై |
| 292 | 4 | పట్టుకుని | పట్టుకొని |
| 295 | 11 | ఆకాశము | ఆకాశమున |
| 296 | 8 | లాలసలో | లాలసతో |
| 302 | 16 | ప్రథమారాకాది | ప్రథమాంకాది |
| 303 | 5 | దాదృశ్యై | దాదృశ |
| 304 | 20 | చెప్పినా | చెప్పెనా |
| 305 | 27 | కరుణా | కరణా |
| 309 | 9 | క్రిందించుచు | క్రందించుచు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 310 | 6 | కొనుచునుండ | కొనుచుండ |
| — | 10 | అది బిబ్బి | అది విని బిబ్బి |
| 316 | 2 | అష్టావదశ | అష్టాదశ |
| — | 4 | దుర మొనరన్ | దుర మొనరన్ బఠింపగ |
| 317 | 12 | పర్వ్వతముల | పర్వ్వముల |
| 334 | 21 | శిత | శితి |
| 345 | 7 | చెప్పినదే | చెప్పనిదే |
| 346 | 27 | దా విప్రుడు | నా విప్రుడు |
| 351 | 14 | సభావర్ణమునకు | సభావర్ణనమునకు |
| 360 | 15 | కొని | కొని కాని |
| 361 | 2 | గృహము | గ్రహము |
| 363 | 18 | దిక్కృదర్శన | దిక్కృదర్శన |
| 370 | 2 | అనుభూతి | అనుభూత |
| 371 | 23 | నిట్లిట్లు | నట్లిట్లు |
| 375 | 7 | సభాంతరమున | సభాంతమున |
| 376 | 17 | పరమెద్ది | వరమెద్ది |
| 377 | 12 | చేసైన | చేనైన |
| 384 | 11 | వింగళించుచు | పింగళించును |
| 386 | 19 | ఇక్కడి | ఇక్కడ |
| 388 | 2 | జోరుకోడెలు | జోడుకోడెలు |
| — | 8 | నంపించు | నంపింతు |
| 390 | 6 | ద్వితీయా | ద్వితయ |
| 393 | 16 | వారిని | వారికి |
| 395 | 18 | కునుకపాట్లు | కునుకుపాట్లు |
| 397 | 8 | కృతి | కృత |
| 398 | 25 | సూతు | సూను |
| 399 | 15 | త్రికర్తుక | త్రికర్తృక |
| 408 | 11 | ప్రియుక్తో | ప్రయుక్తో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 409 | 10 | విధానము | పిధానము |
| 411 | 2 | వేధా | వేఱు |
| 414 | 7 | సంభారంగ | సభారంగ |
| 419 | 2 | లామకంముగా | లామలకముగా |
| —— | 5 | మీద | మీది |
| 420 | 17 | నభినయించు | నభినయించుట |
| 426 | 3 | నిష్టవధాన | నష్టవధాన |
| 429 | 26 | యుండునే | యుండెనే |
| —— | 28 | తగదు | తప్పదు |
| 434 | 4 | నడపగమో | నడువగలమో |
| —— | 10 | నటని నిలుకడ | నతనికి నిలుకడ |
| 436 | 13 | తిప్పి పద్యము | పిప్పి పద్యము |
| 440 | 14 | వేలవేలు | వేనవేలు |
| 444 | 18 | చతురశీలితమ | చతురశీతితమ |
| 445 | 13 | దేశమున | దేశమునకు |
| —— | 16 | బొబ్బట్లుటల | బొబ్బట్లెటుల |
| 447 | 19 | CLODK | CLOCK |
| 448 | 2 | POLICA | POLICE |
| —— | 21 | సహప్ర | సహస్ర |
| 449 | 16 | స్తంభేరమ | స్తంబేరమ |
| 454 | 19 | సకలోపాధేయమై | సకలోపాదేయమై |

ఈ గ్రంథమున ఫుల్‌స్టాపులు సరిగా అంటలేదు. కనుక వాక్యావసానము నందలి స్థలమును బట్టి, చదువరులే ఫుల్‌స్టాపులను గ్రహింప ప్రార్థనము.